# తెలుగు భాషా స్వరూపం

(పద సంబంధ కోశంతో సహా)

డా॥ బూదరాజు రాధాకృష్ణ

**2001**



పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం

హైదరాబాద్

# తెలుగు భాషా స్వరూపం

(పద సంబంధ కోశంతో సహా)

రచన
కోశ నిర్మాణం
డా॥ బూదరాజు రాధాకృష్ణ

**2001**



పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం
హైదరాబాద్

తెలుగు భాషా స్వరూపం – Telugu Bhasha Swarupam (Pada Sambandha Kosam)
(పద సంబంధ కోశం)
పద పట్టికతో

*రచన, కోశనిర్మాణం*
డా॥ బూదరాజు రాధాకృష్ణ - DR. BUDRAJU RADHAKRISHNA



ప్రచురణల సంఖ్య - 337
ధర : రూ. 60/-
ప్రతుల సంఖ్య - 1000
ముద్రణ : జూన్ 2001

*ప్రతులకు :*
డైరెక్టర్
ప్రచురణల విభాగం
పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం
లలిత కళాక్షేత్రం, పబ్లిక్ గార్డెన్స్
హైదరాబాద్ - 500 004.

*ముద్రణ :*
సాయి ప్రాసెస్,
నారాయణగూడ, హైదరాబాద్ - 20

ISBN No. 81-86073-83-3

# పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం
## హైదరాబాద్

**ఆచార్య ఎస్. గోపి**
*వైస్-ఛాన్సలర్*

## ముందుమాట

తెలుగు భాషాసాహిత్యాలు, సంస్కృతి, చరిత్ర, లలిత కళలు, జానపద గిరిజన విజ్ఞానం వంటి బహుముఖీన అంశాల వికాసం కోసం ఏర్పడిన సమున్నత విద్యాసంస్థ పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం. ఈ లక్ష్యాన్ని సాధించటానికి ప్రధానంగా బోధన, పరిశోధన, గ్రంథ ప్రచురణ, విస్తరణ సేవ వంటి చతుర్ముఖీన మార్గాలను అనుసరిస్తున్నది. విస్తరణ సేవ, అంతర్జాతీయ తెలుగు సంస్థల తరపున ప్రవాసాంధ్రులకు సాంస్కృతిక సేవ వంటి ఉదాత్త కార్యక్రమాలతో పురోగమిస్తున్నది. గ్రంథ ప్రచురణ క్రింద విశ్వవిద్యాలయం కావ్యాలు, విజ్ఞాన సర్వస్వ సంపుటాలు, నిఘంటువులు, మాండలిక వృత్తిపదకోశాలు, భాషా సాహిత్యం, సంగీతం, నాట్యం, నాటకం, లలిత కళలు, జానపద గిరిజన విజ్ఞానం, చరిత్ర, సంస్కృతులకు సంబంధించిన ప్రచురణలు, అనువాదాలు వెలువరిస్తున్నది. పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయ ప్రచురణలు అశేష పాఠకాదరణ పొందుతున్నాయి.

ఈ ప్రచురణ కార్యక్రమానికి అనుగుణంగా విశ్వవిద్యాలయం ఇప్పటికే ఎన్నో ప్రముఖ గ్రంథాలను ప్రచురించింది. వ్యాఖ్యాస్రవంతి శీర్షికన సుప్రసిద్ధ పండితులచే ప్రాచీన కావ్య, ప్రబంధాలకు వ్యాఖ్యానాలు వ్రాయించి ప్రచురించే ప్రణాళికను చేపట్టింది. ఇప్పటివరకు ఈ ప్రణాళికలో కుమారసంభవం, కాశీఖండం, శివరాత్రి మహాత్మ్యం వంటి గ్రంథాలను వ్యాఖ్యాసహితంగా ముద్రించింది.

తెలుగులో ప్రసిద్ధి పొందిన ప్రాచీన, ఆధునిక గ్రంథాలను ఇంగ్లీషు, హిందీ భాషలలోనికి అనువాదం చేయించి ప్రచురించింది. తెలుగు కథ అనే పేరుతో ప్రతి సంవత్సరం వెలువడిన ఉత్తమ కథలను ఎంపిక చేసి ముద్రించే కార్యక్రమాన్ని చేపట్టింది. తెలుగుకథ-1995 రెండు భాషల్లో వెలువరించడం జరిగింది. అలాగే 1996, 1997, 1998, 1999 కథా సంపుటాలు అందుబాటులో ఉన్నాయి.

తెలుగు విజ్ఞాన సర్వస్వ సంపుటాలను తయారు చేయించే కార్యక్రమంలో విశ్వసాహితి, భారత భారతిలను, హిస్టరీ అండ్ కల్చర్ ఆఫ్ ది ఆంధ్రాస్ అనే పేరుతో ఆంగ్లంలో ఒక సంపుటాన్ని ప్రచురించింది. భాషాభివృద్ధి కృషిలో భాగంగా తెలుగు భాషా చరిత్ర, ద్రావిడ భాషలు అనే గ్రంథాలను పునర్ముద్రించింది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సాంఘిక సంక్షేమ శాఖ వారి సహకారంతో డా॥ బి. ఆర్. అంబేద్కర్ రచనలు - ప్రసంగాలు పది సంపుటాలుగా ప్రచురించింది. తెలుగు వారికి మంచి పరిశోధనా పత్రికలేని కొరతను వాఙ్మయి తీరుస్తున్నది. అలాగే విశ్వవిద్యాలయం ఇటీవల చేపట్టిన "పందగ్రంథాలు-సౌజన్య ప్రచురణలు" అనే పథకానికి దాతల నుండి మంచి స్పందన లభిస్తున్నది.

ప్రస్తుత గ్రంథం **తెలుగు భాషా స్వరూపం** (పదసంబంధ కోశం) పద పట్టికతో సహా తయారు చేసిన వారు డా॥ బూదరాజు రాధాకృష్ణ. వీరు అగ్రశ్రేణి పరిశోధకులు, పండితులు, నిఘంటు నిర్మాణకర్త.

రచనానుభవం లేని విద్యార్థులు ముఖ్యంగా పత్రికారంగంలో చేరేవారికీ, చేరిన వారికీ ఉపయుక్తంగా వుండే విధంగా రచించిన గ్రంథం ఇది. దీనిని ఆధునిక కాలంలో శబ్దస్వరూపాన్ని సాధికారికంగా తెలియజేసే రచనలలో మేటిగా చెప్పుకోవచ్చు. అపసవ్య ప్రయోగాలు చేసే వారికి ఈ గ్రంథం తప్పుల్ని సరిదిద్దుకోవడానికి ఉపకరించే కరదీపిక. ఆ రకంగా రచయితలకు సైతం ఈ గ్రంథం నిత్యోపయోగి అవుతుంది. నిజానికి దీన్ని కంప్యూటర్‌లోకెక్కించి తప్పొప్పులు (Spell checks) సరిచేసుకునే విధంగా ప్రోగ్రాం ఏర్పాటు చేస్తే మరింత ఉపయుక్తంగా ఉంటుంది.

పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం లోగడ ప్రచురించిన డా॥ బూదరాజు రాధాకృష్ణ గారి మాండలిక పదకోశాల తయారీలో భాగంగా లలితకళా పదకోశం, 12వ శతాబ్దం తెలుగు శాసనపదకోశం, 13వ శతాబ్దం తెలుగు శాసన పదకోశంలు ఎంతో ప్రాచుర్యాన్ని పొందాయి.

ఈ గ్రంథం కూడా పాఠకుల ఆదరాభిమానాలను పొందుతుందని ఆశిస్తున్నాను.

హైదరాబాద్
తేది . 7.6.2001

(ఎన్. గోపి) 7/6

## నా మాట

తెలుగు అకాడమిలో నేను పనిచేస్తున్న రోజుల్లోనే 1974లో నాకు 'ఈనాడు' దినపత్రికతో అనుకోకుండా కొంత సంబంధ మేర్పడింది. ఆ పత్రికను చదువుతున్నప్పుడు భాషాదోషాలు అనేకం కనిపించాయి. ఆ సంగతి చెప్పగానే ఆ లోపాలను సవరించే మార్గ మన్వేషించమని రామోజీరావుగారు కోరారు. కొన్ని వందల పేజీలు చదివి వాటిలో కనిపించే ప్రధానదోషాలను గుర్తించి అప్పటి లెటర్‌ప్రెస్సుకు అన్వయించే, పత్రికారచనకు సంబంధించే విషయాలను 'ఈనాడు భాషా స్వరూప'మని 1981లో ప్రచురించాను. అకాడమిలో భిన్నశాస్త్రగ్రంథాల ప్రచురణ జరుగుతుండేది తెలుగులో. కొన్ని సాధారణ నియమాలను రచయితలకు ఉద్యోగవిధిలో భాగంగా, అకాడమి పాలకమండలి నిర్దేశించిన విధానాలుగా చెప్పవలసి వచ్చింది. ఆ సందర్భంలో తీవ్ర చర్చలు జరుగుతుండేవి. కాలక్రమాన రచయితల సంఖ్య బాగా పెరిగింది. రచయిత లందరినీ ప్రత్యక్షంగా కలిసి చర్చించటంకన్నా భాషకూ శైలికీ సంబంధించి తెలుగు అకాడమి నిర్ణయించిన నియమావళిని ప్రచురించా లనుకున్నారు. ఫలితంగా 1985లో 'తెలుగు అకాడమి భాషాశైలి నియమావళి' ప్రచురించాం.

మారుతున్న ముద్రణపద్ధతులవల్ల, జిల్లావారీ ఎడిషన్లు వెలువడటం మొదలయిన తరవాత విలేఖరుల సంఖ్య పెరిగి మజ్జిగ పలచబడిందని గమనించినందువల్ల పాత్రికేయులకు శబ్దస్వరూపం తెలియబరచటం అవసరమనిపించింది. ప్రపంచవ్యాప్తంగా పత్రికారచయితలు విశేష్య విశేషణాలను సరిగా గుర్తించక అపప్రయోగాలు చేస్తుంటున్నారు. ఈ పరిస్థితిని గూడా గుర్తించి క్రియాపదం, దానికి నేటి అర్థం, దానికి సంబంధించిన విశేష్యవిశేషణ తద్ధితరూపాదులను పట్టికా బద్ధం చేయాలనే నిర్ణయం అమలుపరచదలిచాం. ఇప్పటిరాతల్లో క్రియాపదాలవాడుక -ముఖ్యంగా తెలుగుమాటల ప్రయోగం -తగ్గిపోతున్నదని గుర్తించాం. మచ్చుకు ఉదాహరించా రనటానికి బదులు ఉదాహరణ చెప్పారనిగాని, ఉదహరించటం జరిగిందనిగాని రాసే వాళ్ళసంఖ్య పెరిగింది. భాషకూ శైలికీ సంబంధించి పూర్వోదాహృత

గ్రంథాలను పునర్విమర్శించాలని కూడా భావించాం. ఫలితం ఈ రూపంలో తెలుగుభాషాస్వరూపాన్ని పదసంబంధకోశమనే పేరిట్టి పదపట్టికలతో ఒకే పుస్తకంగా ఇప్పుడు ప్రచురించటం. ఈ రచన విద్వజ్జనం కోసం కాదు. తెలుగును అభిమానవిద్యగా నేర్చినవారికోసమూకాదు. తెలుగు మాతృభాషే అయినా రచనానుభవంలేని విద్యార్థులు - ముఖ్యంగా పత్రికారంగంలో పనిచేస్తున్న, పని చేయదలచిన యువతీయువకులు - ఉపయోగించటానికి పనికివస్తుందనే అభిప్రాయంతో సిద్ధపరిచినది.

పూర్వరూపాల్లో ఈ రచనలోని వ్యాకరణభాగాన్ని మొదట ప్రచురించిన ఉషోదయాపబ్లికేషన్స్ వారికీ తెలుగు అకాడమివారికీ నా కృతజ్ఞతలు. ఈ గ్రంథప్రచురణకు తోడ్పడుతున్న శ్రీపొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయంవారికీ తదుపాధ్యక్షులు డాక్టర్ గోపీగారికి, ప్రచురణకార్యక్రమాన్ని నిర్విఘ్నంగా నిర్వహించిన ప్రచురణశాఖాధిపతి ఆచార్య జయధీర్ తిరుమలరావుకు, ముద్రణమొదలయ్యేసరికి నేను మంచంపట్టగా తానుగా సాయపడతానని ధైర్యంచెప్పి తోడ్పడ్డ చిరంజీవి చిరుమామిళ్ళ రామచంద్రరావుకు, ముచ్చటగా ముద్రించిన శ్రీశాయి ప్రెస్‌వారికి, తదధిపతి శ్రీ రాజశేఖర రెడ్డికి నా కృతజ్ఞతలు.

ఈ నారచననూ పదసంకలనాన్నీ జర్నలిజం విద్యార్థులకు అంకితం చేస్తున్నాను. పాఠకులు దీన్ని సమాదరిస్తారని ఆశిస్తున్నాను.

- బూదరాజు రాధాకృష్ణ

హైదరాబాద్
తేది: 8-5-2001

# విషయసూచిక

## మొదటిభాగం



## రెండోభాగం

# తెలుగు భాషా స్వరూపం

## 1. లక్ష్యం

రమారమి 150 సంవత్సరాలుగా తెలుగు పత్రికలు వస్తున్నాయి.అప్పటప్పటి అవసరాలకు తగినట్లు అప్పటికి తోచిన పద్ధతిలో వార్తలు ప్రచురించటమే గాని వార్తాపత్రికను ఒక నియతరీతిలో ప్రచురించే ప్రయత్నాలు జరగలేదు. పత్రికా భాషను నిర్ణీతశైలిలో ప్రయోగించే పద్ధతి తెలుగులోనే కాక ఏ దేశభాషలోనూ ఏర్పడలేదు.

ఒక్కొక్క వ్యక్తికి ఒక ప్రత్యేకశైలి ఉండేమాట నిజం. అయితే పత్రికాప్రచురణ ఎవరో ఒక వ్యక్తి చేయగలిగింది కాదు. అందులోనూ దినపత్రికల విషయంలో అసలు సాధ్యంకాదు. రకరకాల అనుభవాలూ, విద్యా సంస్కారాలూ ఉన్న వ్యక్తులు పత్రికల్లో పనిచేస్తుంటారు. వారంతా ఒక ప్రాంతంవారుగాని, ఒక కులంవారుగాని,ఒక మతంవారుగాని కారు. విద్య, కులం, మతం, వృత్తి, ప్రాంతం వంటివన్నీ భాషలో భేదాలు తెచ్చి పెట్టేవే. భాషలో ఉన్న ఒక ప్రత్యేకత వైవిధ్యంలో ఏకత్వం.బిన్నవ్యక్తులు రాసేభాషలో ఏకత్వం సాధించటం అంటే బిన్నవిధమాండలి కాలనుంచి ఒక సాధారణ భాషాలక్షణాన్ని ఏర్పరుచుకోవటమే. ఒకేపత్రిక భిన్న ప్రాంతాలనుంచి ఏక కాలంలో వెలువడేటప్పుడు ఆ పత్రికా భాషలో సాధ్యమయినంత ఏకరూపత లేకపోతే అది 'ఒకే' పత్రిక అనిపించదు. అందువల్ల అందరూ పాటించవలసిన కొన్ని నియమాలు ఏర్పరుచుకోవాలి. ప్రపంచభాషాపత్రికలన్నింటికీ భాషావిషయంగా కూడా కొన్ని నియమనిబంధన లున్నాయి.

నియమం చేసినంతసులభంగా పాటించడం సాధ్యపడదు. అందుకు ప్రయత్నం, సాధన అవసరం. నియమంలో గొప్ప ప్రయోజనాలున్నాయి. మొదటి ప్రయోజనం సంయమనం.రెండోది ఏకరూపత. మూడోది 'నాది' అనే భావంనుంచి 'మనది' అనే అభిప్రాయానికి మారటం. నాలుగోది బహుజనసమ్మతి. ఇలా అనేకం.

సంఖ్యాదృష్టిలో భారతీయభాషల్లో తెలుగుది రెండోస్థానం.అయితే తెలుగు వారిలో చదువుకున్నవాళ్ళ సంఖ్య తక్కువ. నూటికి ఇరవై అయిదుమందికన్నా అక్షరాస్యులు లేరు. వాళ్ళందరూ ఒకే కోవకు చెందినవాళ్ళు కారు. సాధారణ పరిజ్ఞానమున్న సామాన్యులకు వార్తలందించే పత్రిక ఎక్కువమందికి అందుబాటులో ఉన్న సులభ సరళ భాషలో ఉండాలి. పత్రికలు స్వయంగా చదవలేక చదివించుకునే వాళ్ళు లక్షల సంఖ్యలో

ఉన్నారు. వాళ్ళందరికీ అర్థమయ్యే భాష సులభంగా ఉంటే చాలదు. మాండలిక భేదాలు వీలయినంత తక్కువగా ఉన్నది కావాలి. అధిక సంఖ్యాకులకు విపరీతార్థాలు రాకుండా చూసుకోవాలి. లేదా పత్రికకు రాదగినంత ప్రచారం రాదు. బాగా చదువుకున్న వాళ్ల మెచ్చుకొనే చక్కని భాష కూడా ఉండాలి. అంటే నియమబద్ధత తప్పదు.

వార్తాసేకరణ, ప్రచురణలకు కొన్ని పద్ధతులూ, సంప్రదాయాలూ ప్రపంచ వ్యాప్తంగా ఉన్నాయి. ఆ మూలసూత్రాలకు అనుగుణంగా ఉండే భాషాశైలి నిర్ణయించుకోవటం అవసరం. వాడుక భాషలో కూడా అనేక భేదాలున్నాయి. ప్రయోజనం మీద ఆధారపడి పదజాలం, ప్రయోగం మారుతుంటాయి. పత్రికా ప్రయోజనం దృష్టిలో పెట్టుకొని అందుకు తగిన భాషారూపాలు ఎన్నుకోవాలి. పదిమంది చేసే పని కాబట్టి పదిరకాలుగా ఉంటే ప్రయోజనం కూడా పలచబారుతుంది.

పత్రికాభాషకు ప్రయోజనాత్మకమైన పద్ధతులు నిర్దేశించే ప్రాథమిక ప్రయత్నమే ఇది. అనుభవం పురస్కరించుకొని ఈ ప్రణాళికను అప్పుడప్పుడు పునర్విమర్శించుకోవలసి ఉంటుంది.

# 2. అవసరం

వార్తాసేకరణ ప్రచురణలు ఒకే సంస్థ చేయటం అరుదు. ప్రపంచంలోని భిన్న ప్రాంతాలనుంచి వ్యక్తుల, స్థలాల పేర్లు వగైరా వార్తల్లో వస్తాయి. ఆయ దేశాల, జాతుల ఆచార వ్యవహార సంస్కృతులను అనుసరించి వేష భాషల్లో మార్పులుంటాయి . అనేక రంగాల్లో వచ్చిన, వస్తున్న మార్పులకు, పరిశోధనలకు వార్తల్లో స్థానముంది. అందువల్ల ఆయా వ్యక్తి స్థలాదుల పేర్లను నియతపద్ధతిలో ప్రచురించటం అవసరం. కొద్దిపాటి మార్పుతో ఒక వ్యక్తి మరోవ్యక్తి అనిపించవచ్చు. ఒక భాష మరొకటిగా భాసించవచ్చు. ఈ పొరపాటు తప్పించుకోవాలంటే ఏక రూపత (uniformity), నియతి (consistency) పాటించాలి. వీటిని నిరూపించే పట్టికలు పత్రికలకు అవసరం.

అక్షర క్రమం (spelling), సంక్షేపణాలు (abbreviations), బిరుదులు, తేదీలు, విరామచిహ్నాదులు(punctuation), నిర్దిష్ట పత్రికాభాషకు స్థానిక సంప్రదాయానుసారం సిద్ధపరుచుకోవాలి.

ప్రపంచంలో అనేక పత్రికలు, పత్రికా భాషలూ ఉన్నా ప్రపంచ భాషగా ఉన్న ఇంగ్లీష్ నుంచి "రాష్ట్ర భాష"గా ఉన్న హిందీ/ఉర్దూ నుంచి తెలుగు పత్రికలకు వార్తలందుతుంటాయి ఎక్కువగా. శతాబ్దాలుగా నవీన నాగరకతకు, శాస్త్ర విజ్ఞానానికి, వార్తా ప్రచురణకు మనం ఎక్కువగా ఇంగ్లీష్ మీదనే ఆధారపడ్డాం. అనేక సందర్భాల్లో ఇంగ్లీష్ భాషా సంప్రదాయాలకూ, తెలుగు భాషా సంప్రదాయాలకూ భేదాలున్నాయి. టెలిప్రింటర్ మీద ఇంగ్లీష్‌లో వచ్చిన వార్తలను యాంత్రికంగా అనువదించుకొని ప్రచురించే దురభ్యాసంవల్ల దేశభాషా పత్రికలు రాసే భాషలో సహజత్వం సన్నగిల్లుతున్నది. ఈ అనువాదం కూడా కాలవ్యవధిలేక చేస్తున్నందువల్ల మక్కికి మక్కి అనువాదాలు దొర్లి పత్రికాభాషలోని అనేక వికృతరూపాలు పత్రికలను ప్రజలకు దూరం చేస్తున్నాయి. ఈ ప్రమాదం తప్పించుకోడానికి పత్రికా భాషకు కొన్ని నియమాలు ఏర్పరచుకోవటం అవసరం.

ఒక వాక్యంలో విడమర్చి చెప్పగల ఒక శాస్త్ర విషయాన్ని ఒకే పదంతో గుదిగుచ్చి చెప్పటం కాల ధర్మాన్ని బట్టి అవసరం. పారిభాషికపదాల ప్రయోజనం ఈ సంక్షేపణమే. పత్రికలో ఎంతక్లుప్తంగా వార్త లందించగలిగితే అంతస్థలం కలిసి వస్తుంది. కాలం కూడా కలిసివస్తుంది. అందువల్ల మరికొన్ని విశేషవార్త లందించటం గాని, ప్రకటనలకు చోటు సంపాదించటం గాని సాధ్యపడుతుంది. అంటే పత్రికల వాడుకలో అనేక రంగాల పరిభాషకు స్థానమిచ్చి, క్లుప్తంగా వార్తలందించటానికి అత్యంత ప్రాధాన్యముంది. పరిభాష నియతంగా ఉండకపోతే ఉద్దేశించిన అర్థమొకటై వాడిన పదం మరొకటై పాఠకులకు విరుద్ధంగా అర్థమవుతుంది. కాబట్టి సర్వసాధారణంగా పత్రికలు వాడే పారిభాషికపదాల పట్టిక ఒకటి సిద్ధం చేసుకోవడం అవసరం.

## 3. ప్రాథమిక సూత్రాలు

ప్రపంచవ్యాప్తంగా పత్రికా రచన (journalism) కొన్ని సిద్ధాంతాలకు కట్టుబడివుంది. మరికొన్ని అనుభవాలు సంపాదించుకొంది. దేశవిదేశాలవారి అనుభవాలు ఆకళించుకొని, మన అవసరాలకు అన్వయించుకోవటంలోనే అభివృద్ధి ఉంది. ఏ సిద్ధాంతమూ, ఏ అనుభవమూ శాశ్వతం కావు. పదే పదే వాటిని సంస్కరించుకోవలసి ఉంటుంది. అయితే కొన్ని మూల సూత్రాలు దేశకాలాతీతంగా ఉంటాయి. అవి గమనించాలి. ఆయా సూత్రాలను ప్రాధాన్య క్రమంలో నిర్దేశిద్దాం. అవి విధి నిషేధాలు రెండూ చెప్తాయి.

1. వార్తా సేకరణలో ఆరు ప్రధాన విషయాలను గుర్తించాలి: ఎవరు (who), ఏమిటి (what), ఎప్పుడు (when), ఎక్కడ (where), ఎందుకు (why), ఎలా (how). అన్ని సందర్భాల్లోనూ ఇవన్నీ దొరక్కపోవచ్చు. కానీ ఇవన్నీ ఉన్నది పూర్తి సేకరణ. అలాగే వార్తా ప్రచురణలో మూడు ప్రాథమిక పద్ధతులు అవలంబించాలి: పరిశీలన (checking), విశదీకరణ (clarifying), సంక్షేపణ (condensing). వచ్చిన వార్తాల్లోని సత్యాసత్యాలను మొదట పరిశీలించాలి. తరువాత నలుగురికి అర్థమయ్యే విధంగా రాయాలి. ఆ మీదట రాసిన వాక్యాలను కుదించాలి. ఈ క్రమం ప్రధానం.

2. పత్రికాభివృద్ధికి ప్రధానమైనది స్థలాన్ని, కాలాన్ని సద్వినియోగం చేయటం, అంటే వార్తలను క్లుప్తంగా చెప్పి రకారకాల వార్తలను అందించగలటంలో, వీలైనంత త్వరలో వార్తలందించగలటంలో పత్రిక సమర్థత, ప్రచారం ఆధారపడతాయి. కాబట్టి తొందరగా కుదించి వార్తలివ్వాలి. ఒక సుప్రసిద్ధ పత్రికా రచయిత కుదింపును గురించి పద్య రూపంలో ఇలా చెప్పారు:

" ... Cut out all the extra trimmings
Boil it down
Skim it well, then skim the skimmings
Boil it down
When you're sure 't would be a sin to
Cut another sentence into
Send it down and we'll begin to
Boil it down."

3. వార్తాకథనం (News story)లో అనవసర విషయాలకు తావు ఉండకూడదు. చెప్పదలచిన విషయాన్ని ముక్కుకు సూటిగా, ఆకర్షణ కరంగా చెప్పాలి. సరైన మాటలతో చిన్న చిన్న వాక్యాలతో స్పష్టంగా చెప్పవలసినంతవరకే చెప్పాలి. ఒక అమెరికన్ పత్రికా రచయిత్రి ఈ విషయాన్ని మనోహరంగా చెప్పింది:

" A press release should be the length of a woman's skirt, short enough to attract attention and long enough to cover the subject."

4. పూర్తి వార్తను శీర్షికల్లో సూచించవద్దు. పాఠకులు శీర్షికలు మాత్రమే చదివి విషయం గ్రహిస్తే, వారికి మొత్తం పత్రిక చదవాలనే ఉత్కంఠ ఉండదు. పత్రిక చదివించేటట్టు ఉండాలంటే శీర్షికల్లో పూర్తి వార్త తెలియకూడదు.

5. శీర్షికల్లో చెప్పిన విషయాలు ఉపశీర్షికల్లో (sub-heads) పునరుక్తం కాగూడదు.

6. శీర్షిక క్రియాశీలంగా ఉండాలి. స్పష్టత కోసం, మనసుకు హత్తుకొనేలా ఉండటం కోసం శీర్షికలో క్రియా పదం ఉండాలనే పాతసూత్రాన్ని పాటించడం ముఖ్యం. ఎవరో ఏదో చేసినట్లు, ఎక్కడో ఏదో జరిగినట్లు చెప్పటం చాలా మంచిది.

7. శీర్షిక సులభంగా తొందరగా చదవటానికి వీలుగా ఉండాలి. వార్తంతా చదివించేటట్లుండాలి.

8. శీర్షికలో సాధ్యమయినంత చిన్న మాటలు వాడాలి. శీర్షిక వీలయినంత క్లుప్తంగా కొద్ది మాటల్లో ఉండాలి.

9. వీలైతే శీర్షికలో సంక్షేపణలు (abbreviations) వాడవద్దు.

10. శీర్షికలో సందిగ్ధ వాక్యంగాని, పదంగాని పనికిరాదు.

11. శీర్షికలో అవసరమైతే పెద్దల అభిప్రాయాలు కొటేషన్లలో ఇవ్వాలి. ఇందువల్ల పత్రికాభిప్రాయం బయటపడదు. బాధ్యత తగ్గుతుంది. ప్రమాదం తప్పుతుంది.

12. శీర్షికలో ఆశ్చర్యార్థకాలు వాడవద్దు - విధిలేకపోతే తప్ప. ఆశ్చర్యార్థకం అసమర్థతకు చిహ్నం.

13. ఉపశీర్షికలో ముఖ్యాంశం మాత్రమే ఉండాలి. చిన్నదిగా ఉండాలి.

14. వివరణ (intro/lead) క్లుప్తంగా ఉండాలి. చిన్న చిన్న వాక్యాల్లో ఉండాలి. మహత్తర, బృహత్తర వంటి విశేషణాలు వాడవద్దు. మీకు మహత్తరమయింది పాఠకులకు సామాన్య మనిపించవచ్చు.

15. వాస్తవిక సంఖ్యలు, అంకెలు మాత్రమే ఇవ్వండి. వాటికి విశేషణాలు చేర్చవద్దు. వ్యక్తిని బట్టి మారే విలువలకు విశేషణాలు చేరిస్తే వార్తా కథనం అస్తవ్యస్తంగా వుంటుంది.

16. సారాంశం గాని (summary lead), విషయం గాని (body) క్లుప్తంగా చిన్న చిన్న వాక్యాల్లోనే ఉండాలి.

17. పేరాగ్రాఫులు పది పంక్తులకు తక్కువ కాకుండా, పదిహేను పంక్తులకు మించకుండా ఉండాలి.

18. వార్తా కథనం కూడా సంక్షిప్తంగా ఉండాలి. ప్రధానాంశాలన్నీ అందులో ఉండాలి. అందువల్ల అనేక రకాల వార్తలందించడం సాధ్యం అవుతుంది.

19. జరుగువంటి (ఇంగ్లీష్‌లో get వంటి ) క్రియలను పదేపదే వాడవద్దు. తెలుగులో చిన్న చిన్న క్రియాపదాలు అనేకం ఉన్నాయి. మార్చి మార్చి వాడాలే గాని ఒకే క్రియ వాడకూడదు.

20. కర్మణి ప్రయోగం సాధ్యమయినంతవరకు పరిహరించాలి. ఒక పనిజరిగినట్లు చెప్పటం మంచిది గాని (active voice లో), కర్మను కర్తగా చెప్పటం (passive voice లో లాగా) మంచిది కాదు.తెలుగులో ఇంగ్లీష్‌లో లాగా active, passive voices లేవు. మనది middle voice. అందువల్ల ఇంగ్లీష్‌ను అనుకరించి 'బడు' చేర్చిన రూపాలు వాడటం భాషాస్వభావానికి విరుద్ధం.

21. యత్తదర్థక ప్రయోగాలు(relative constructions) పరిహరించాలి ('ఎవడైతే...వాడు' వంటివి). ఇంగ్లీష్, హిందీ భాషల్లోలాగా తెలుగులో ఇవి సహజం కావు.

22. పెద్ద పెద్ద మాటలు, మారుమూల పదాలు, 'పాతబడ్డమాటలు' వాడకూడదు. నెలకొను, కైకొను, (విద్య) గరపు, పలువురు మొదలైనవి ఈనాటి వ్యవహారంలో లేని పాతమాటలు.

23. సుదీర్ఘసమాసాలు, కవితాభాష విధి లేనప్పుడుతప్ప వాడవద్దు.

24. బొమ్మలకిచ్చే వివరణ(caption/legend) సంగ్రహంగా చిన్నమాటల్లో ఉండాలి.

25. సుదీర్ఘసమాసం చదవటానికి పట్టేకాలంలో నాలుగైదు చిన్నమాటలు చదివి అర్థం చేసుకోవటం సాధ్యం. అందువల్ల చిన్నమాటల్లో చెప్పటమే మేలు.

**26.** గౌరవ వాచకాలు వాడవద్దు. క్రియాపదం బహువచనంలో ఉంటే సరిపోతుంది. బిరుదులు, శ్రీ, శ్రీమతి, కుమారి వంటి ఉపపదాలు వాడవద్దు. అందరి విషయంలోనూ ఈవివరాలు తెలియవు. తెలుగులో క్రియాపదంద్వారా కావలసినంత గౌరవం చూపవచ్చు.

**27.** సమాసాలను ఒక్కమాటగానే భావించి ఎడం లేకుండా ముద్రించాలి. 'భారత దేశం' అని ముద్రించవద్దు.మొత్తం మీద ఎన్నో పంక్తుల స్థలం వృథా అవుతుంది. చదివితే ఎక్కడెక్కడకు ఆపుతామో అంతవరకూ ఒక్కమాటగా భావించి ముద్రించాలి. ఒకచోట చెప్పిన వార్తనే మరోచోట చెప్పవద్దు. ఒకే రోజు రెండు మూడుసార్లు భిన్న ప్రాంతాలనుంచిగాని, వ్యక్తులనుంచి గాని ఒకే వార్త కొద్దిపాటి మార్పులతో గాని, సవరణలతోగాని వచ్చినా సరే - అంతా ఒకేచోట ప్రచురించాలే గాని భిన్నశీర్షికలతో రెండుమూడు చోట్ల ఒకే వార్త ప్రచురించకూడదు.

**28** సంపాదకుల / పత్రికాధిపతుల ఆమోదం / అంగీకారం లేకుండా సొంత అభిప్రాయాలను, దృక్పథాలను ప్రచురించవద్దు. అది నేరం. ప్రమాదం ఉద్యోగికే కాదు, పత్రికకు కూడా.

# 4. అనువాద పద్ధతి

అనువదించటం ప్రధానంగా రెండు విధాలు. ఇతర భాషల నుంచి (source languages) తెలుగులోకి (target language) అనువదించటం సర్వసాధారణమైన మొదటి పద్ధతి. ఇందులో మొదటి భాషను రెండోది అనుసరిస్తుంది. ఒకే భాషలోని జటిలమైన భాషను సులభభాషగా మార్చటం కూడా అనువాదమే. అయితే ఇది మొదటి పద్ధతికన్నా కష్టమేగాని దోషరహితం. మొదటి పద్ధతి పరిశీలిద్దాం.

అనువాదం చేసే వ్యక్తికి రెండు భాషల్లోనూ సమానమైన పరిజ్ఞానం ఉంటే తప్ప అది సరళంగా సాఫీగా జరగదు. సమానత అనేది ఆదర్శమేగాని సాధ్యం కాదు. రెండు భాషలూ ఒకే భాషాకుటుంబానికి చెందినా-ఆయాభాషల వ్యవహర్తల సామాజికసంస్కృతీ, విద్యాబుద్ధులూ సమానమైనా - కనీసం సన్నిహితంగా ఉన్నా - అనువాదం సమగ్రంగా సాధ్యం కాదు. అనువాదకుడు మానవుడు కాబట్టి అతని ఆలోచనలు, అనుభవాలు, అభిరుచులూ మూలరచయిత లక్షణాలకన్నా విభిన్నంగా ఉండకతప్పదు.అందువల్ల అనువాదంలో ఆత్మా శ్రయత(subjectivity), కొంత కృత్రిమత్వం తప్పవు. అంటే సిద్ధాంతరీత్యా ఏ మానవుడూ నిర్దుష్టంగా అనువదించలేడు.

భిన్న భాషల్లోని ధ్వనులూ, వర్ణక్రమం, పదజాలం, పదబంధాలు, పదనిర్మాణం, సంధిపద్ధతి, పదక్రమం, వాక్యరచనా అన్నిటా ఒకటిగా ఉండవు.భిన్నభాషావ్యవహర్తల ఆర్థిక, సామాజిక, రాజకీయ, సాంఘిక పరిస్థితుల్లో ఎన్నో విభేదాలుంటాయి.అందువల్ల అనువాదం ఎప్పుడూ అతుకుల బొంతగానే ఉంటుంది. భిన్నభాషల పదజాలం మధ్యగాని, పదసంఘటనలోగాని పూర్తి పోలిక ఉండదు. అందువల్ల ఏ వ్యక్తి చేసిన అనువాదమైనా మూలానికి దగ్గరగా ఉంటుందేమోగాని అన్నివిధాలా సమానంగా ఉండదు.

ఆధునికసిద్ధాంతాల ప్రకారం అనువాదం యంత్రసాధ్యమేగాని వ్యక్తి సాధ్యంకాదు. " No man ever translates; he always transcreates" అనేది సిద్ధాంతం. సిద్ధాంతరీత్యా అనువాదం యంత్రసాధ్యమైనా ఈనాటికి లభ్యమైన ఏ అనువాదయంత్రమూ (translating machine) ఆచరణలో నిర్దుష్టం కాలేదు. ఇటువంటి అనేక కారణాలవల్ల ఒక భాషనుంచి మరో భాషకు ఎవరు ఎంత బాగా అనువాదం చేశారనుకున్నా సహజత్వం అసాధ్యంగానే ఉంది.

అన్యభాషలో వచ్చిన వార్తలను కావలసినంత సమయం తీసుకుని చేసే అనువాదాల విషయంలోనే పైన చెప్పిన అసాధ్యత, కృత్రిమత్వం కొట్టవచ్చినట్లు కనిపిస్తుంటే పరుగులమీద చేసే పాత్రికేయుల అనువాదం సంగతి చెప్పనక్కరలేదు - వారెంత మహనీయులైనా. అంటే అనువాదేతరమైన మరోమార్గం అన్వేషించకతప్పదు.

నాగరకభాషలని, ప్రపంచభాషలని, వైజ్ఞానిక భాషలని పేరు మోసిన అంతర్జాతీయ భాషల్లో దేంట్లోనయినా చెప్పగల  భావాలను ఆటవిక భాషలని, అనాగరక భాషలని, అలిఖిత భాషలని, చెప్పే ఏ సామాన్య భాషలోనైనా చెప్పగలమని భాషాశాస్త్రజ్ఞులు నిరూపించారు. ఏ కొత్త భావాన్నయినా, ఎంత జటిలమైన సమస్యనయినా ఒక వ్యక్తి తన మాతృభాషలో పరమసమర్థంగా వ్యక్తీకరించగలడు. అందుకొక్కటే అతనికి కావలసిన లక్షణం; అది తన మాతృభాష తనకు రావటం మాత్రమే. పది పన్నెండేళ్ళ వయసొచ్చిన ప్రతిసాధారణవ్యక్తికీ తన మాతృభాషలో విస్పష్టంగా, నిరుష్టంగా మాట్లాడగల శక్తిసామర్థ్యాలుంటాయి. వయసు,అనుభవం పెరిగే కొద్దీ నేర్చుకొనేవి కొత్త మాటలు, చేసేవి కొత్త ఆలోచనలూ.

ఒక వ్యక్తి తాను మాతృభాషలో మాట్లాడేటప్పుడు తప్పులు చేయడు. రాసేటప్పుడు చేయవచ్చు. అందువల్ల రాసినదాన్ని సరిచూసుకోవటం ఎంతో అవసరం. స్వతంత్ర రచన చేసిన మహాకవులు కూడా (ఉదాహరణ గోల్డ్‌స్మిత్, గెథే, గురజాడలు) తమ రచనలకు ఎన్నోసార్లు మెరుగులు దిద్దుకొన్నట్లు మనకు తెలుసు. పునారచన సిగ్గుచేటు పనికాదు; గర్వకారణం.

సిద్ధాంతం వదిలిపెట్టి, ఇతర భాషల్లో వచ్చిన వార్తలు స్వతంత్ర రచనలనిపించేటట్లు రాసే పద్ధతులు, వాటి ఆచరణయోగ్యత పరిశీలిద్దాం. కింద సూచించిన క్రమం పాటిస్తే అనువాదక్లేశం తగ్గి స్వతంత్రరచనలాగా పత్రికాభాష భాసిస్తుంది.

1. టెలిప్రింటర్ మీద వచ్చిన అన్యభాషా వార్త చదువుతూ మొదట అందులోని ముఖ్యాంశాలు రాసుకోవాలి.
2. రెండోసారి చదివి అందులో ఏమైనా పారిభాషిక పదాలుంటే గుర్తు రాసుకోవాలి.
3. ఇతరభాషలోని  ముఖ్యాంశాలను, పరిభాషను మాత్రం అనువదించుకోవాలి.
4. వార్తలోని సారాంశం ఇప్పుడు తెలుసు కాబట్టి, దాన్ని తామే చెపుతున్నట్లు తెలుగులో రాయాలి. ఇందువల్ల మూలంలోని ప్రతిపదానికీ, పదబంధానికి అనువాదం వెతుక్కోవటం, మూలభాషావాక్యాల్లోని పదక్రమాన్ని (word order) మాతృభాషాపదక్రమంలోకి మార్చుకోవటం అనే బాధలు పోయి తెలుగు వాక్యరీతి సహజంగా ఉంటుంది. ఒక్క పారిభాషిక పదాలకు మాత్రమే అనువాదం ఉంటుంది. రోజువారీ వాడుకలో వచ్చే పారిభాషిక పదాల పట్టిక సిద్ధం చేసుకొనివుంటే మూలపదాల స్థానంలో తెలుగు మాటలు ప్రయోగించటం తేలిక అవుతుంది.

5. మూలభాషలోని పారిభాషిక సాంకేతికపదాల తర్జుమా కోసం కాలం వృథా చేయవద్దు. మనపట్టికలో ఉన్న మాటలను వాటి స్థానంలో తరవాత ఉంచవచ్చు. లేనివాటిని తెలుగు లిపిలో రాయవచ్చు.

6. ఒకసారి అనువదించిన  తరవాత మూలంలోని ప్రధానాంశాలు వచ్చాయో లేదో సరిచూసుకోవాలి. అంతేగాని మూలంలోని ప్రత్యక్షరం, ప్రతిపదం, పదబంధం తెలుగులోకి వచ్చాయో లేదో పరిశీలించటం, రాకపోతే మక్కికి మక్కిగా వాటిని తేవాలని ప్రయత్నించటం వృథాశ్రమే కాక అర్థరహిత చర్యకూడా. ఆతరవాత మూలాన్ని తిరిగి చూడకూడదు.

7. తెలుగులో ఈవిధంగా స్వతంత్రంగా రాసిన వాక్యాలను మరోసారి చదివి భిన్న వాక్యాలుగా మార్చడం, సరైన మాటలు సమకూర్చటం, విషయాన్ని వీలయినంత సంక్షిప్తంగా, సంగ్రహంగా చిన్న మాటల్లో చెప్పటం తరవాతి చర్య. ఈ పని చేసేటప్పుడు మరోభాషలో వచ్చిన వార్తను పోల్చుకోడానికైనా తిరిగి చూడగూడదు.

8. వార్తను పైవిధంగా తెలుగులో తీర్చిదిద్దిన తరవాత శీర్షిక నిర్ణయించాలి. శీర్షికలో వార్తలోని ప్రధాన విషయమేగాని వివరాలు చెప్పగూడదు.శీర్షికా లక్షణాలు మూడో ఆధ్యాయంలో చూడవచ్చు.

# 5. ఉచ్చారణ: లిపిలేఖనాలు

1. మనం ఉచ్చరించే ధ్వనులన్నిటికీ తెలుగులిపిలో, లేఖన సంప్రదాయంలో సంకేతాలు లేవు. అక్షరమాలలోని సంకేతాలన్నీ ఆధునికావసరాలకు అక్కరలేదు. ఒకే ధ్వనిని భిన్న సంకేతాలతో, భిన్న ధ్వనులను ఒకే సంకేతంతో సూచించటం జరుగుతున్నది. ఏక రూపత కోసం కింద పేర్కొన్న లేఖన సంప్రదాయాలను పాటించవలసి వుంటుంది.

2. ఇ,ఈ,ఉ,ఊ,ఎ,ఏ,ఒ,ఓ, లకు బదులుగా పదాదిని యి,యీ,వు,వూ,యె,యే,వొ,వో లను రాయవద్దు.నిఘంటువుల్లో ఆయాశబ్దాల అర్థాలు తెలుసుకోవటం కష్టమవుతుంది. శబ్దస్వరూపం తెలియదు. కాబట్టి పదాదిన అచ్చులే రాయండి.

3. ౠ,ఌ,ౡలను వాడనక్కరలేదు. ఋకారం సంస్కృత పదాల్లోనే కనిపిస్తుంది. ఉదా. వృక్షం. 'ధ్రువపత్రం' వంటి శబ్దాల్లో వట్రువసుడి లేదని గుర్తించాలి. 'రుజువు' వంటి మాటల్లో ఋకారం లేదు. నేటి తెలుగులోని 'కుంగు' వంటి శబ్దాలకు 'కృంగు' వంటి పూర్వరూపాలు లేవు. ఌ కారం ఉందని భావించే 'క్లుప్త' శబ్దాన్ని 'కౢప్త' మని రాయనక్కరలేదు.

4. తెలుగు మాటల్లో ఐ,ఔ లకు బదులు అయ్,అవ్ లను రాయవచ్చు.'ఐరావతం, ఔషధం' వంటి ఎరువు మాటల్లో అది పనికిరాదు.

5. ఇంగ్లీషులోని 'æ' ధ్వని ఎరువుమాటలద్వారా తెలుగులో బహుళవ్యాప్తికి వచ్చింది. దానికి సంప్రదాయ సిద్ధమైన సంకేతం లేనందువల్ల 'బాంకు, బేంకు, బైంకు, బ్యాంకు' అని నానారూపాలుగా రాస్తున్నారు. 'బేంకు' అని ఏత్వం కింద అడ్డగీత రాసి ఆ ధ్వనిని నిర్దేశించవచ్చు. అకారాది క్రమంలో ఈ ధ్వని ఏ కారం తరవాత వస్తుంది.

6. అరసున్నను వాడవద్దు. నిండుసున్నతో పంక్తిని మొదలు పెట్టవద్దు. దానితో ఏపదమూ మొదలుకాదు. పదాంతంలోని సున్నకు మ కారం విలువే ఉంటుంది. ఉదా. 'గులాం' అనే మాట ఉచ్చారణలో 'గులామ్'తో సమానం. ఇటువంటి ఎరువు మాటలకు బహువచన ప్రత్యయం చేరినప్పుడు సున్నస్థానంలో 'ము' వస్తుంది. ఉదా. క్లెయిం+లు=క్లెయిములు, బేక్టీరియం+లు=బేక్టీరియములు. లిపిలోని సున్న విలువ ఉచ్చారణలో స్థానాన్ని బట్టి మారుతుంది. ఉదా. 'వంక' 'వఙ్క'తో సమానం. కానీ అన్యదేశాల విషయంలో ఈ సూత్రం పూర్తిగా అన్వయించదు. మచ్చుకు 'చెమ్కీ' అని రాయాలేగాని 'చెంకీ' అని కాదు.

7. సంస్కృత పదాల్లో మాత్రమే విసర్గ ఉంటుంది. సంధిలో విసర్గ కొన్ని మార్లు మారుతుంది. కొన్నిసార్లు నిలుస్తుంది. కొండగుర్తుగా కింది సూచనలు గుర్తించండి.

(అ) క,ఖ,ప,ఫ-ల ముందున్న విసర్గ మారదు. ఉదా. అంతఃకరణం, దుఃఖం, అంతః పురం, వయఃఫలితం.

(ఆ) చ,ఛ,శ -ల ముందున్న విసర్గ, సంధిలో శకారంగా మారుతుంది.

ఉదా. మనః+ చాంచల్యం → మనశ్చాంచల్యం

రజః+ఛవి →రజశ్ఛవి

అంతః+శత్రువులు → అంతశ్శత్రవులు

(ఇ) ట,ఠ -ల ముందున్న విసర్గ, సంధిలో షకారంగా మారుతుంది.

ఉదా. ధనుః+టంకారం →ధనుష్టంకారం

(ఈ) త,థ,స -ల ముందున్న విసర్గ, సంధిలో సకారంతో సమానం.

ఉదా. మనః+తాపం →మనస్తాపం

అంతః+సారం → అంతస్సారం

(ఉ) సరళ స్థిరాలకు ముందున్న విసర్గ, ఓకారంగా మారుతుంది.

ఉదా.మనః+గాంభీర్యం → మనోగాంభీర్యం

వయః+వృద్ధుడు → వయోవృద్ధుడు.

(ఊ) అనునాసికాలముందున్న విసర్గ, రేఫగా మారుతుంది.

ఉదా. అంతః+నేత్రం →అంతర్నేత్రం

8. చె,జె లను రాతలో చూపవద్దు. చ,జ-లు చాలు.

9. పదాదిన ఙ,ఞ,ణ,ళ-లు రావు. సున్న రాదు. పొల్లు హల్లులు రావు.

10. నేటి భాషలో భిన్నోచ్చారణలున్న రెండు సంయుక్తాక్షరాలకు బదులు ఒక్క 'క్ష' కారాన్నే వాడవచ్చు. ఉదాహరణకు వృక్షం, పక్షి వంటి మాటల్లోని క్ష కారానికీ, 'ఎలక్షన్,రిక్షా' వంటి వాటికీ ఉచ్చారణలో భేదముంది.

11. 'జ్ఞ' అనే సంయుక్తాక్షరాన్ని భిన్న విధాలుగా ఉచ్చరిస్తున్నారు. కానీ ఆజ్ఞ, జ్ఞానం వంటి మాటలను నిఘంటువుల్లో రాసే తీరులోనే రాయండి.

12. య,వలతో మొదలయ్యే మాటలను తప్ప, నిఘంటువుల ప్రకారం అచ్చులతో

మొదలయ్యే మాటలను య,వలతో మొదలుపెట్టి రాయవద్దు. మచ్చుకు 'వచ్చు' అని రాయండి కాని 'వొచ్చు, ఒచ్చు' మొదలుగా రాయకండి.

13. బండిరాను(=ఱ ను) రాయకండి. దానికి బదులు సాధురేఫనే(=ర) రాయండి.

14. ఇంగ్లీషులోని 'f' (=ఫ఼) వంటి ధ్వని ఇప్పటి వాడుకలో అన్యదేశ్యాల ద్వారా బహుళవ్యాప్తికి వచ్చింది. కొన్ని సందర్భాల్లో ఫకారం వాడినందువల్ల అర్థభేదం స్ఫురించదు. ఉదాహరణకు ఈ మాటలు గమనించండి; కాపీ (copy): కాఫ఼ీ (coffee); రూపు (form)= రూఫ఼ు(roof), కాపర్ (copper): కాఫ఼ర్ (coffer/ kafir); పాలు(milk); ఫ఼ాలు (fall-of a sari). కొన్ని ప్రాంతాల్లో ఫకారం తోటి మాటలకు ఫ఼ కారోచ్చారణ వినిపిస్తుంది. మచ్చుకు కఫ఼ం (కఫం), ఫ఼లం(ఫలం). కానీ సంస్కృత శబ్దాల్లోని ఫకారాన్ని యథాతథంగా రాయండి. కొన్ని సమయాల్లో ఫకారం రాస్తున్నారుగాని అసలు ధ్వని ఫ఼కారమే. (ఫలానా ← ఫ఼లానా). అందువల్ల 'f' ధ్వని సూచకంగా పకారం కింద గాని, ఫకారం కిందగాని చిన్నసున్న రాసి సరైన ఉచ్చారణను సూచించటం మంచిది. అకారాది క్రమంలో ఈ ధ్వని ఫకారం తరవాత వస్తుంది.

15. ఒత్తక్షరాలను (మహాప్రాణాలను) రాయటంలో ఎంతో జాగ్రత అవసరం. చదువుకోని వారి వాడుకలో ఈ భేదం లేదు. చదువుకున్నవారు ఈ భేదం గుర్తించటం ఎంతో అవసరం. అందుకు నిఘంటువు చూసే అలవాటు చాలా తోడ్పడుతుంది. ఉచ్చారణ భేదం వల్ల అర్థభేదం వస్తేనే రాతలో భేదం చూపాలి. ఉదాహరణకు అర్థం (=భావం, డబ్బు మొ.), అర్ధం (=సగం) అనేవి వేరు వేరు మాటలు. అలాగే శోధ(= పరిశీలన, వెదకటం మొ.), శోథ, (=నొప్పి, శూల) వేరువేరు మాటలే. పలం(=3తులాలు), ఫలం (=పండు) అనేవి అర్థభేదం కల మాటలు. కరం (=చేయి, కప్పం), ఖరం (=గాడిద) ఒకటి కావు. గాతం (=గుంట), ఘాతం (=దెబ్బ, బాణం మొ.) శబ్దాల అర్థాలు వేరు.

16. శ,ష,స-ల వాడుకను నిఘంటువుల ద్వారా తెలుసుకోవాలి. 'ఏ' ధ్వని ఉచ్చారణలో వినిపించే క్రియారూపాల్లోని 'స'కారం బదులు 'శ' కారం రాయవచ్చు. ఉదా. చేసి, చేశాడు (చేసాడు-అని రాయవద్దు).

17. ఒత్తక్షరాలుగా ణ,ళ ల కింద ణ,ళ-లను రాయనక్కరలేదు. క్రమంగా న,ల-లను వాడండి. ఉదా. వాణ్ని, నీళ్లు.

18. పంక్తికి మొదట సున్నాగాని, పొల్లుహల్లుగాని రాయవద్దు.

19. అన్యభాషల నుంచి తెలుగు వాడుకలోకి ఎరువుగా వచ్చిన మాటల చివరి హల్లులను అజంతంగా రాయండి. అయితే ఈ నియమాన్ని వ్యక్తుల, వస్తువుల, స్థలాల పేర్ల విషయంలో పాటించనక్కరలేదు. ఉదా. రోడ్డు, దస్తావేజు, మొ; హైడ్రోజన్, ఆక్సిజన్; షేక్స్పియర్. గొడార్డ్ వగైరా.

20. ఇంగ్లీషు ద్వారా వాడుకలోకి వచ్చిన ఇతర భాషాపదాలను ఇంగ్లీషు ఉచ్చారణనే ప్రాతిపదికగా తీసుకొని రాయండి. ఉదా. స్టాలిన్(స్తాలిన్ -అని రాయనక్కరలేదు), డాన్ క్విగ్జోట్ (దాఁ కెహోతా-అని రాయనక్కరలేదు), డూప్లే (దూప్లే-కాదు).

21. ఇంగ్లీషు వారి ఉచ్చారణలో లేని ద్విత్వహల్లులను తెలుగులిపిలో రాసి చూపనక్కరలేదు. ఉదా. కెలీ (కెల్లీ-అని రాయవద్దు), గొడార్డ్ (గొడ్డార్డు-కాదు), ససూర్ (సస్సూర్-కాదు).

22. సాంప్రదాయికంగా అలవాటైన పద్ధతినే లేఖనంలో పాటించండి. ఎరువు మాటల్లో మూలభాషలోని ఉచ్చారణ పద్ధతిని పాటించటం నియతం కాదు. ఉదా. జడ్జి/ జజ్.

23. తెలుగు మాటల మొదట ద్విత్వహల్లురాదు. సంయుక్త హల్లులతో మొదలయ్యే 'క్రొత్త, ప్రాత, గ్రద్ద' వంటి మాటలను నేటి ఉచ్చారణకు అనుగుణంగా 'కొత్త, పాత, గద్ద' మొదలుగా రాయండి. వ్రాత శబ్దంలో మొదటి హల్లు లోపిస్తుంది కాబట్టి 'రాత' అని రాయండి.

24. మొదటి రూపంలో ద్విత్వమున్న మాటల తద్ధితరూపాలను ఒక హల్లుతోనే రాయండి. ఉదా. విరుద్ధం→వైరుధ్యం ('వైరుద్ధ్య'మని రాయనక్కరలేదు).

25. అతుకు, ఉతుకు, బతుకు వంటి మాటలను యథాతథంగా రాయండి. వాటి పూర్వరూపాలైన ఆదుకు, ఉదుకు, బదుకు వంటి వాటిని వాడకండి.

26. అన్యదేశాల్లో తప్ప తెలుగు మాటల చివర సాధారణంగా దీర్ఘంరాదు. ఉదా. క్యూ, రేడియో. స్త్రీల పేర్ల చివర సమాసంలో తప్ప దీర్ఘంరాదు. ఉదా. విడిగా 'ఇందిర'; సమాసంలో 'ఇందిరా గాంధి'.

27. వీలయినంతవరకు తెలుగుమాటలు రాసేటప్పుడు ఐ,ఔ-ల వాడకం తగ్గించండి. ఉదా. 'కైత'కు బదులుగా 'కయిత', 'ఔను' కు బదులుగా 'అవును'. అయితే 'ఐరావతం, ఔపచారికం' వంటి సంస్కృత పదాల విషయంలో ఐ,ఔ-లనే వాడండి (నిఘంటువుల్లో ఆ మాటలు ఆ రూపంలోనే ఉంటాయి కాబట్టి).

28. సంస్కృత పదాల్లో రెండు ఒత్తక్షరాలు వెంటవెంటనే రావు. ఉదా. బాధ, బీభత్సుడు-వంటి మాటల్లోని రెండో హల్లుకే ఒత్తుంటుంది. భేదం, భీకరం-వంటి చోట్ల మొదటిదే ఒత్తక్షరం. నిఘంటువులు చూసి గమనించండి.

29. 'థ,ధ' ల మధ్య ఏది సరైనదో గుర్తించటానికి సులభమార్గముంది. 'కథ' అనే మాటను చదువుకోనివాళ్లు 'కత' అంటారు. కాబట్టి మూల పదంలో 'థ' కారమే ఉందని, 'ధ' కారం లేదని గుర్తించవచ్చు.

30. వాక్యాంతంలో కూడా నిండుసున్నానే వాడండి. 'ము' వాడనక్కరలేదు. ఉదా. మేం వచ్చాం (మేము వచ్చాము - అనే రాయనక్కరలేదు).

# 6. రూప వైవిధ్యం

1. భాషలో రూపవైవిధ్యానికి అనేక కారణాలున్నాయి. ప్రాంత, కుల, మత, వృత్తి భేదాలవల్ల రూపభేదాలు రావటం ఒక తీరు. చారిత్రక కారణాల వల్ల రూపభేదాలు రావటం మరోతీరు. ఉపయోగభేదంవల్ల భిన్నరూపాలు కలగటం ఇంకోతీరు.ఉదాహరణకు 'వచ్చాడు, వచ్చిండు, వచ్చినాడు, ఒళిపొచ్చాడు' మొదలైన రూపాలు ప్రాంతీయభేదాలను సూచిస్తాయి. 'లేచాడు, లెగిశాడు' వంటివి కులభేదం సూచించేవి. 'నాకు చెప్పాడు, నాకీ చెప్పాడు', 'దారం తెగింది, దారం విరిగింది' మొదలైనవి మతభేదం సూచిస్తాయి.' బెండకాయ, మరచక్రం; నాగలి, మడక; పునాది/బునాది/గునాది మొదలైనవి భిన్నకాలాల్లో భిన్నభాషలనుంచిగాని, భిన్నానుభవాలనుంచి గాని పదాలను ఎరువు తెచ్చుకోవటం, సృష్టించుకోవటం అనే చారిత్రక కారణాలవల్ల వచ్చిన రూపభేదాలు. అలాగే చదువుకున్నవారు ఉపయోగించిన పద్ధతిని తార్కికంగాగాని, అతార్కికంగా గాని ఇతరులు పాటించినందువల్ల రూప వైవిధ్యం వస్తుంది.మచ్చుకు సంస్కృతంలోని 'చణక' శబ్దంనుంచి వచ్చిన 'చెనగ' అనే మాట ఎక్కువమంది మాట్లాడుతున్నా, 'సెనగ' అనే పండిత వ్యవహారంలో ఉంది; కాని 'చాప' అని చదువుకున్నవారంటే 'సాప' అని ఇతరులంటున్నారు.

2. ఇన్నిరకాల కారణాలవల్ల మాతృభాషలోనే రూపవైవిధ్యం కనిపిస్తుండగా అన్యభాషా ప్రభావం వల్ల మరికొన్ని రూపభేదాలు కలుస్తున్నాయి. మచ్చుకు '-దార్' అనే ప్రత్యయం పర్షియన్ నుంచి వచ్చింది. హిందీ/ఉర్దూ పదాలకే చేరుతుంది. ఇప్పుడు కొన్ని తెలుగు మాటలకు కూడా చేరుతున్నది. ఉదా: అమ్మకందారు, కొనుగోలుదారు. అలాగే -వంతం అనే సంస్కృత ప్రత్యయం నామవాచకాలను విశేషణాలుగా మార్చడానికి వాడవలసింది (గుణం- గుణవంతం). అయితే దాన్ని తప్పుగా విశేషణాలమీద కూడా కొందరు వాడుతున్నారు(సమర్థం-సమర్థవంతం). తెలుగు బహువచనప్రత్యయం -లు. కొన్ని ఇంగ్లిష్ మాటలను ఎరువు తెచ్చుకొన్నప్పుడు ఆ భాషలోని '-s' అనే ప్రత్యయాన్ని కూడా తెచ్చుకున్నాం. అయితే కొన్ని సందర్భాల్లో ఇందువల్ల అర్థభేదం వస్తుంది. ఉదా:

అ) వాడు రూళ్లు గీస్తున్నాడు- 'రూల్సు' అనకూడదు.
వాడు రూల్సు మాట్లాడుతున్నాడు-'రూళ్లు' అనకూడదు.

ఆ) రూపాయినోట్లు- 'నోట్సు' కాదు.
నోట్సు రాస్తున్నాడు-'నోట్లు' కాదు.(ఇక్కడ నోట్సు బహువచన రూపమని నిర్ధారణగా చెప్పలేం; 'నోట్' అని ఏకవచన రూపమే వాడితే అర్థం మారుతుంది)

3. పైవిగాక తెలుగులోనే ప్రాంతభేదాలవల్లకూడా కొన్ని రూపాలకు వ్యాకరణార్థ భేదం కలుగుతున్నది. ఉదా: 'చెప్పేను' అని రాస్తే కోస్తా వాడుకలో తరవాతి కాలంలో చెప్పవచ్చును అని అర్థం. అన్ని ప్రాంతాల్లో ఆ అర్థం రాదు. 'వస్తున్నది' అంటే రావటం జరుగుతున్నదనే అర్థం. కొన్నిచోట్ల 'వస్తోంది' అంటేగాని ఆ అర్థం రాదు. వాక్యాల్లో కూడా ఈ కష్టముంది. 'నాకు చెప్పాడు/నాకు అన్నాడు'. రెండోవాక్యం కొన్నిచోట్ల మొదటివాక్యం అర్థంలోనే వాడ్తారు. ఇతరప్రాంతాల్లో ఆ వాక్యం తప్పు. కొన్ని చోట్ల సహజంగా ఉండే కొన్ని మాండలిక పదాలు ఇతర ప్రాంతాల్లో అశ్లీలమనిపిస్తాయి. ఉదా: గుంట, దొబ్బు, ఎత్తు('గుడ్డ లెత్తండి'), సరుకు మొదలైనవి. వీటిని వాడకూడదు.

4. శబ్దస్వరూపం, అర్థం - ఈ రెంటికీ ఉన్న సంబంధం తెలియనందువల్ల చేసే అపప్రయోగాల వల్ల వచ్చే రూపవైవిధ్యం అపారంగా ఈనాడు పత్రికాభాషలో కనిపిస్తుంది. వ్యవహారం రెండు రకాలు : (1) శిష్టవ్యవహారం (ఇది అనేక గ్రంథాలు చదివినవారి వాడుక), (2) లోకవ్యవహారం (ఇది చదివీ చదవనివారి వాడుకేగాని ఇందులో అంతులేని అనుభవం ఉంది). లోకం, శాస్త్రం చూసిన, చదివిన వాడే పండితుడు. వ్యవహారజ్ఞానలోపం వల్ల, వచ్చీరాని సంస్కృతపదం వాడితే గంభీరంగా ఉంటుందనే దుర్భ్రమవల్ల వచ్చిపడ్డ రూపవైవిధ్యం అంతటినీ ప్రదర్శించటం సాధ్యంకాదుగాని, వందల వేలసార్లు తప్పుగా ప్రయోగిస్తున్న కొన్నిమాటలు, వాటి సరైనరూపాలు కొన్ని ఉదాహరించటం సాధ్యమే.

5. ఈ విధమైన వైవిధ్యం అనంతం. అందువల్ల ఏరూపం ప్రామాణికమనే ప్రశ్న సహజంగా వస్తుంది. 'పదుగు రాడు మాట పాటియై ధరజెల్లు' ననే పద్యం ఇందుకు సరైనసమాధానం. లోకవ్యవహారం గ్రహించి దురర్థంగాని, విపరీతార్థంగాని, ఇతరార్థంగాని రాకుండా మాటలు ప్రయోగించాలి. ఒకభాష వాడుకలో ఉండగా అనుక్షణం మారుతూ ఉంటుంది. అందువల్ల ఏవోకొన్ని సూత్రాలు రాసి భాషను నిబంధించటం సాధ్యపడదు. భాషలో ప్రస్తుతం చదువుకొన్నవారి వ్యవహారధోరణిలో ఉన్న సాధారణ లక్షణాలు సూచించటం సాధ్యం. అందుకు లోకశాస్త్ర వ్యవహారాలే ప్రమాణం.

6. ఈనాడు పత్రికల్లో సాధారణంగా వస్తున్న కొన్ని 'రూపవైవిధ్యాలు'(=శబ్దార్థదోషాలు) చూపి వాటిలో ఏది ప్రామాణికమో సూచిస్తున్నాం.(ప్రతి సందర్భంలోనూ కారణాలు వివరించటం భాషా చరిత్రను నిరూపించినంత విస్తృతం కాబట్టి ఆపని చేయటం లేదు).

| ప్రయోగం | ప్రామాణికం |
|---|---|
| అఘాతం | అఘాతం |
| అదిష్టించు | అధిష్ఠించు |
| అధికారఅశ్రద్ధ | అధికారనిర్లక్ష్యం |
| అధిష్టానవర్గం | అధిష్ఠానవర్గం |
| అభిలాషించు | అభిలషించు |
| అస్వస్తులు | అస్వస్థులు |
| ఆగ్రహావేశులు | ఆగ్రహావిష్టులు |
| ఆదేశికసూత్రాలు | ఆదేశసూత్రాలు |
| ఆధిక్యత | ఆధిక్యం/అధికత |
| ఆధునీకరణ | ఆధునికీకరణ |
| ఆర్జనాపరులు | ఆర్జనపరులు |
| ఆవశ్యకత | ఆవశ్యకం |
| ఆశక్తి | ఆసక్తి |
| ఆస్థి | ఆస్తి |
| ఇదమిద్ధం | ఇదమిత్థం |
| ఇబ్బందికరం | ఇబ్బంది |
| ఇష్టాగోష్టి | ఇష్టగోష్ఠి |
| ఉత్సవవేడుకలు | ఉత్సవాలు/వేడుకలు |
| ఉదహరించు | ఉదాహరించు |
| ఉదాశీనం | ఉదాసీనం |
| ఉద్దేశ్యం | ఉద్దేశం |
| ఉధృతచర్య | ఉద్ధత/తీవ్ర చర్య |
| ఉధృతం | ఉద్ధృతం/ఉద్ధతం/ఉద్ధతి |
| ఋజువు(proof) | రుజువు |
| ఎలక్షన్ | ఎలక్షన్ |
| ఏకఛత్రాధిపత్యం | ఏకచ్ఛత్రాధిపత్యం |
| ఐక్యత | ఐక్యం/ఏకత/ఏకత్వం |

| | |
|---|---|
| కన్నతీపి | కడుపుతీపి |
| కష్టనిష్టూరాలు | కష్టనిష్ఠురాలు |
| కించుత్తు | కించిత్తు |
| కుటుంబీకులు | కుటుంబికులు/కుటుంబస్థులు |
| కౄరంగా | క్రూరంగా |
| కైవశం | కైవసం |
| క్రమశిక్షణాచర్య | క్రమశిక్షణచర్య |
| గర్భిణితో | గర్భంతో |
| గర్భిణీస్త్రీ | గర్భిణి/గర్భవతి |
| ఘటన | సంఘటన, దుర్ఘటన |
| చారిత్రాత్మకం | చరిత్రాత్మకం/చారిత్రకం |
| జనాభావిస్ఫోటకం | జనవిస్ఫోటనం |
| జలదిగ్బంధం | జలమయం |
| జాతీయ కరణ/జాతీయం | జాతీయాకరణ |
| జ్యోతిష్కుడు | జ్యోతిషుడు/జోస్యుడు |
| తదనంతరం | అనంతరం |
| తారాస్థాయి | తారస్థాయి |
| తెలివిమంతుడు | తెలివిగలవాడు/ధీశాలి |
| దినవేడుకలు | దినోత్సవాలు |
| ధృవతార | ధ్రువతార |
| ధృవపరచు | ధ్రువపరచు /ధ్రువీకరించు |
| నావికాదళం | నౌకాదళం |
| నిరక్షతానిర్మూలన | నిరక్షరాస్యతానిర్మూలన |
| నిర్ధారించు | నిర్ధరించు |
| నిర్దిష్టం | నిర్దిష్టం |
| నివేదన | నివేదిక |
| నూతనపోకడలు | కొత్తపోకడలు |
| నూతన మెళకువలు | కొత్తమెళకువలు |

| | |
|---|---|
| నైపుణ్యత | నైపుణ్యం/నిపుణత/నిపుణత్వం |
| పటిష్టత | పటిష్ఠత |
| పటిష్ఠవంతం | పటిష్ఠం |
| పదకం | పథకం |
| పరస్పరమార్పు | పరస్పర వినిమయం /మార్పిడి |
| పరాకాష్ట | పరాకాష్ఠ |
| పరిశోధనాకేంద్రం | పరిశోధనకేంద్రం |
| పర్యాటకశాఖ | పర్యటకశాఖ |
| పారద్రోలు | పారదోలు |
| పునర్విలీనం | పునరేకీకరణ |
| ప్రతిష్టాపన | ప్రతిష్ఠాపన |
| ప్రతిష్ఠంభన | ప్రతిష్టంభన |
| ప్రయాణీకులు | ప్రయాణికులు |
| ప్రశ్నాపత్రాలు | ప్రశ్నపత్రాలు |
| ప్రాతికూల్యవైఖరి | ప్రతికూలవైఖరి/ప్రాతికూల్యం |
| బహుపార్శ్వకవాణిజ్యం | బహుముఖవాణిజ్యం |
| భద్రతారక్షకదళం | భద్రతాదళం / రక్షకదళం |
| బీభత్సం | బీభత్సం |
| భూ ఆక్రమణ | భూమ్యాక్రమణ |
| మంజూరీ | మంజూరు |
| మనోక్లేశం | మనఃక్లేశం |
| మరమ్మత్తు | మరమ్మతు |
| ముమ్మరసహాయం | అధిక/సత్వర సహాయం |
| మృత్యుకౌగిలి | చావుకౌగిలి/మృత్యుపరిష్వంగం |
| మేధస్సు | మేదస్సు, మెదడు; మేధ=తెలివి |
| మోసపూరితం | మోసం(గా) |
| మోహమాటం | మొగమాటం (మొగమోటమి) |
| యజమాన్యం | యాజమాన్యం |

| | |
|---|---|
| యధాతథం | యథాతథం |
| యధార్ధం | యథార్థం |
| యధావిధి | యథావిధి |
| యాత్రీకులు | యాత్రికులు |
| రాష్ట్రవ్యాపితం | రాష్ట్రవ్యాప్తం |
| వయోపరిమితి | వయఃపరిమితి |
| వర్గకీచులాటలు | వర్గవైమనస్యాలు |
| వాయిద్యం | వాద్యం |
| విచక్షణారహితం | విచక్షణరహితం |
| విదురుడు | విధురుడు(=భార్యలేనివాడు) |
| విద్యుత్కొరత | కరెంటుకొరత/విద్యుత్తుకొరత |
| విద్యుత్తీగలు | కరెంటుతీగలు |
| విద్యుద్ఘాతం | కరెంటుదెబ్బ/విద్యుదాఘాతం |
| విల్లంబులు | విల్లమ్ములు |
| వివక్ష(త) | వివక్ష |
| వ్రాతపూర్వకం | లిఖితపూర్వకం |
| వ్యవహారికం | వ్యావహారికం |
| శక్తివంతం | శక్తిమంతం |
| శిక్షణాకేంద్రం | శిక్షణకేంద్రం |
| శీతాకాలం | శీతకాలం/చలికాలం |
| శెలవు/శలవు | సెలవు |
| శోభన(పు)కార్యం | శోభనం/కార్యం |
| సంచయికపథకం | సంచాయక/సంచయన పథకం |
| సపరివారసమేతం | సపరివారం/పరివారసమేతం |
| సభాకమిటీ | సభాసంఘం |
| సమర్థవంతం | సమర్థం |
| సాంఘికవ్యతిరేకం | సంఘవ్యతిరేకం |
| సామాగ్రి | సామగ్రి |

| | |
|---|---|
| సాంప్రదాయం | సంప్రదాయం |
| సుష్టు | సుష్ఠు |
| సెక్షన్ | సెక్షన్ |
| సైద్ధాంతికపరంగా | సిద్ధాంతపరంగా/సైద్ధాంతికంగా |
| సౌష్టవం | సౌష్ఠవం |
| స్థంభం | స్తంభం |
| స్థంభన | స్తంభన |
| స్థంభించు | స్తంభించు |
| స్థాపతులు | స్థపతులు |
| స్వతంత్రదినం | స్వాతంత్ర్యదినం |
| స్వతంత్రం | స్వాతంత్ర్యం/స్వతంత్రత |
| స్వయంపరిశ్రమలు | సొంతపరిశ్రమల |

# 7. నామవాచకాలు-లింగ,వచన,విభక్తులు

1. తెలుగులోని లింగభేదం అర్థాలమీద ఆధారపడ్డదే గాని వ్యాకరణ సిద్ధం కాదు. పురుషులను గురించి చెప్పేమాటలు 'మహత్తులు'. కేవలం స్త్రీలను సూచించేవి 'మహతీవాచకాలు'. కొన్ని మాటలు బహువచనంలో స్త్రీ పురుష వాచకాలు(ఉదా. గారు). వాటిని 'మహన్మహతీవాచకా'లని పిలుస్తారు. స్త్రీలను, పశుపక్ష్యాదులను, అప్రాణివాచకాలను సూచించే మాటలు 'అమహత్తులు'. స్త్రీలింగం, పుంలింగం, నపుంసలింగం అనే త్రివిధలింగాలు తెలుగులో లేవు. ఇంగ్లీషులో 'moon, ship' వంటి మాటలు స్త్రీలింగ శబ్దాలు. తెలుగులో అవి అమహత్తులు. 'భార్య,దార,కళత్రం' అనేవి సంస్కృతంలో క్రమంగా - స్త్రీ, పుం, నపుంసలింగ శబ్దాలు. తెలుగులో అవి మూడూ అమహత్తులే.

2. తెలుగులో కర్తగా ఉన్నమాట ఏలింగంలో ఉందో దాని కనుగుణంగా క్రియారూపం మారుతుంది. కొన్ని సందర్భాల్లో తెలుగు మాటలను లింగం మార్చి ప్రయోగించవచ్చు. ఉదా. ప్రభుత్వం నిర్ణయించింది. (ఇక్కడి 'ప్రభుత్వం' అమహత్తు కాబట్టి క్రియాపదం కూడా అమహద్రూపంతోనే ఉంటుంది). ఈ వాక్యాన్నే మార్చి 'ప్రభుత్వంవారు నిర్ణయించారు' అని రాయవచ్చు. 'ప్రభుత్వంవారు' అనేది మనుష్యవాచకం కాబట్టి క్రియారూపం మారింది.

3. కొన్ని మాటలకు వాడుకబలంవల్ల ఉభయలింగబోధకతకూడా వచ్చింది. ఉదా. టీచర్ (=పంతులమ్మ,స్త్రీ). కానీ "టీచర్ వచ్చింది/వచ్చాడు" అనవచ్చు.

4. కర్త ఏకవచనంలో ఉన్నా, స్త్రీవాచకమైనా క్రియను బహువచనంలో రాసి గౌరవం సూచించవచ్చు. ఉదా. రామయ్య వచ్చారు; సీతమ్మ పొయ్యారు. క్రియాపదంలోని బహువచనం లింగభేదం సూచించటం లేదని గుర్తించండి.

5. సంస్కృతంవంటి అన్యభాషలనుంచి వచ్చిన పదాలకు మహద్వాచకంలో 'డు,వు' ప్రత్యయాలు చేర్తాయి. ఉదా. రాముడు, విష్ణువు. కానీ 'అమ్మడు' వంటివి అమహత్తులేనని గుర్తించాలి. 'అమ్మ' వంటి అమహత్ ప్రత్యయాలు చేరిన మహత్తులు లేకపోలేదు. ఉదా. కృష్ణమ్మ. కొన్ని కులాలకు చెందిన స్త్రీల పేర్లకు చివర గౌరవసూచకంగా 'రావు' వంటి పురుషవాచకాలు చేరుస్తుంటారు. ఉదా. చిన్నయ్యమ్మారావు.

6. మహత్తులైన అనేక దేశ్యపదాల చివర ఏప్రత్యయమూ చేరదు. ఉదా. అయ్య, అన్న, తండ్రి, తాత.

7. హిందీ/ఉర్దూ నుంచి ఎరువుగా వచ్చిన మాటల చివర లింగబోధక ప్రత్యయాలు చేర్చనక్కరలేదు. ఉదా. జమీందారు (జమీందారుడు, జమీందారిణి-అననక్కరలేదు).

8. ప్రధాని, మంత్రి వంటి శబ్దాలిప్పుడు మహన్మహతీవాచకాలు. 'ప్రధాన మంత్రిణి' వంటి ప్రయోగాలు చేయవద్దు.

9. వీలయినచోట్ల 'ఆలు' ప్రత్యయం చేర్చకుండానే స్త్రీవాచకాలను వాడండి. ఉదా. దాసి(దాసురాలు-అననక్కరలేదు).

10. నామవాచకం, దాని విశేషణం ఒకే లింగంలో, వచనంలో, విభక్తిలో ఉండాలనే నియమం తెలుగుభాషకు పూర్తిగా వర్తించదు. ఉదా. లక్ష్మి శృంగారి (శృంగారిణి అని రాయనక్కరలేదు); విద్య ఉత్తమం (విద్య ఉత్తమురాలని రాయవద్దు-అది ఆమె పేరైతే తప్ప).

11. బహువచనంలో పురుషవాచక పదాలకు ఉభయలింగ బోధకత ఉంటుంది.లింగభేదం సూచించటానికి స్త్రీవాచకాలను కూడా చెప్పనక్కరలేదు. ఉదా. విద్యార్థినీ విద్యార్థులు, సోదర సోదరీమణులు-అననక్కరలేదు. విద్యార్థులు, సోదరులు-చాలు.

12. కొన్ని మాటలు ఏకవచనంలో ఉన్నా వాటికి సమూహార్థమే ఉంటుంది. ఉదా. వంద విస్తరి, లక్ష ఇటుక. కొన్ని మాటలు బహువచన రూపంలో మాత్రమే నామవాచకాలుగా ఉండి, ఏకవచనంలో విశేషణాలవుతాయి. ఉదా. కందులు ( నామవాచకం); కందిగింజ (విశేషణం).

13. బహువచనంలో 'లు, రు'లే గాక ఇంగ్లీషు మాటలతోబాటు 'స్,సు' లు కూడా ప్రత్యయాలుగా వాడుకలోకి వచ్చాయి. ఉదా. నోట్సు, టికెట్స్ వగైరా.

14. కొన్ని సమయాల్లో బహువచన ప్రత్యయం చేరినప్పుడు అర్థం మారిపోతుంది. ఉదా. రూళ్ళు గీస్తున్నాడు; రూల్సు మాట్లాడుతున్నాడు.రెంటికీ ఏకవచన రూపం రూలు(rule). నోట్సు రాసుకుంటున్నాడు; నోట్లు రాస్తున్నాడు; నోట్ రాశాడు (మొదటి మాటకు 'వివరణ' అని అర్థం; రెండోదానికి 'ప్రామిశరీ నోట్ ' అనే అర్థం. మూడోదానికి 'నివేదిక' అని అర్థం). 'రూపాయినోటు' కు బహువచనరూపం 'నోట్లు' -'నోట్సు' కాదు. వ్యవహారాన్ని బట్టి ఈ భేదం గుర్తించాలి.

15. బహువచన ప్రత్యయం చేరినప్పుడు 'అ,ఉ,ఎ'లు చివర వచ్చే తెలుగు మాటలకూ, ఇతర భాషలనుంచి ఎరువు తెచ్చుకున్న దీర్ఘాంత పదాలకూ మార్పురాదు. ఉదా. అన్న- లు → ; గొడుగు-లు → గొడుగులు; కోడె-లు → కోడెలు;

బాబా-లు →బాబాలు; లంగా-లు →లంగాలు; రేడియో-లు →రేడియోలు. ఇతర సందర్భాల్లో వచ్చే మార్పులు రకరకాలుగా కింది విధంగా ఉంటాయి.

i. ఏకవచనంలో 'ఇ'తో అంతమయ్యే స్త్రీవాచకాలు 'ఈ' అనే దీర్ఘరూపం పొందుతాయి. ఉదా. దాసి-లు →దాసీలు.

ii. కొన్ని మహత్తులు కూడా దీర్ఘాంతాలవుతాయి గాని, వాటి ఏకవచన రూపం హ్రస్వాంతం కావచ్చు, దీర్ఘాంతమూ కావచ్చు. ఉదా. మేస్త్రి/మేస్త్రీ-లు →మేస్త్రీలు; చప్రాసి/చప్రాసీ-లు →చప్రాసీలు. సంస్కృత పదాల్లో శబ్దసిద్ధమైన పదాంత దీర్ఘాచ్చులు బహువచనంలో అలానే ఉంటాయి గాని ఏకవచనంలో హ్రస్వాలవుతాయి. ఉదా. దాసీలు(బహు.), దాసి (ఏక.).

iii. సున్నతో అంతమయ్యే అమహత్తులకు బహువచన ప్రత్యయం చేరినప్పుడు, సున్నకు ముందున్న ఇవర్ణేతరాచ్చులు దీర్ఘమవుతాయి.ఉదా. దేశం-లు →దేశాలు; కళ్లెం-లు →కళ్లేలు

iv. ఎరువుమాట చివర సున్నకు ముందు 'ఇ' ఉంటే, బహువచనంలో సున్న స్థానంలో 'ము' వస్తుంది. ఉదా. క్లెయిం-లు →క్లెయిములు; ముస్లిం-లు →ముస్లిములు.

v. -యి చివర ఉన్న తెలుగు మాటలకు బహువచనంలో మార్పురాదుగాని, అన్యదేశ్యాల విషయంలో 'యి'కారం 'యు'కారంగా మారుతుంది. ఉదా. అమ్మాయి-లు → అమ్మాయిలు; స్థాయి-లు →స్థాయులు.

vi. కొన్ని తెలుగు మాటలకు చివర ఏకవచనంలో 'యి/య్యి' అనే రెండు రూపాయిలుంటే, బహువచనంలో దీర్ఘాచ్చుముందున్న 'తు' అనేదొక్కటే రూపంగా ఉంటుంది. ఉదా. చెయ్యి/చేయి-లు → చేతులు; గొయ్యి/గోయి-లు → గోతులు.

vii. పొయ్యి బహువచనంలో 'పొయ్యిలు' అనే రూపం పొందుతుంది.

viii. కొన్ని తెలుగు మాటల చివరిఅక్షరం బహువచన ప్రత్యయానికి ముందు లోపిస్తుంది. ఉదా. చేను-లు →చేలు; పూవు-లు →పూలు. ఆవు మొదలైన మాటలకు అలాంటి లోపంరాదు. ఉదా. ఆవు-లు →ఆవులు.

ix. మహత్తని సూచించే మాట చివర 'డు,వు'లు బహువచనంలో లోపిస్తాయి. కాని అమహత్తుల చివరి 'వు' లోపించదు. ఉదా. రాముడు-లు → రాములు; విష్ణువు-లు →విష్ణులు; రుతువు-లు →రుతువులు.

x. కొన్ని సంస్కృత శబ్దాల చివర అమహత్తని సూచిస్తూ 'ము' చేరిన రూపం, చేరని

రూపం-రెండూ ఉంటాయి. వాడుకను బట్టి వాటిని 'ము' చేర్చో, చేర్చకుండానో వాడాలి. ఉదా. కర్మ/కర్మం, చరిత్ర/చరిత్రం; చర్మం.

xi. బహువచన ప్రత్యయం చేరినప్పుడు మాట మొదటలేని పొట్టి ఇకారం ఉకారంగా మారుతుంది. ఉదా. కాకి-లు → కాకులు; మనిషి-లు → మనుషులు; ఎనిమిది → ఎనిమిదులు.

xii. బహువచన ప్రత్యయానికి ముందున్న ద్విత్వహల్లు పదం చివరి 'ఇ,ఉ' లు లోపించి ఒంటిహల్లవుతుంది. ఉదా. చెట్టు-లు → చెట్లు; గుడ్డు-లు → గుడ్లు.

xiii బహువచన ప్రత్యయం చేరినప్పుడు 'డ,ల,ట,ర' లతో కూడిన మాట చివరి ఇకార ఉకారాలు లోపిస్తాయి. ఉదా. బండి-లు → బండ్లు; తొట్టి-లు → తొట్లు; రెండు-లు → రెండ్లు; నూలు-లు → నూళ్లు; పాటు-లు → పాట్లు; ఊరు-లు → ఊర్లు.

xiv. బహువచన ప్రత్యయానికి ముందున్న మాట చివరి 'ంరి,ల్లి'లు క్రమంగా 'ంరు,ల్లు'లుగా మారతాయి. ఉదా. మర్రి → మర్రులు; చిల్లి → చిల్లులు. కాని 'రి,లి'లు రెండురూపాలు పొందుతాయి. ఉదా. దారి → దారులు, దార్లు; గోరు → గోర్లు, గోళ్లు.

xv. 'డి,డు,లి' చివరఉన్న మాటల చివరి అచ్చు బహువచన ప్రత్యయం ముందు లోపిస్తుంది; ముందున్న హల్లు ళకారంగా మారుతుంది. ఉదా. గడి-లు → గళ్లు; గూడు-లు → గూళ్లు; మొసలి-లు → మొసళ్లు. అయితే 'డి,డు' లకు ముందు సున్నఉంటే, బహువచనంలో ళకారం వచ్చిన, రాని, రెండురకాల రూపాలుంటాయి. ఉదా. బండి-లు → బండ్లు, బళ్లు; పండు-లు → పండ్లు, పళ్లు.

xvi. 'న్ను' చివరి ఉన్న మాటల బహువచన రూపాలను వ్యవహారాన్ని బట్టి గ్రహించాలి. ఉదా. కన్ను-లు → కండ్లు, కళ్లు; పన్ను (=tax)-లు → పన్నులు; పన్ను(=tooth) -లు → పండ్లు, పళ్లు.

xvii. మూడక్షరాల ఇకారాంత పదాల మధ్యనున్న ఇకారం బహువచన ప్రత్యయం చేరినప్పుడు ఉకారంగా మారుతుంది. ఉదా. కొలికి-లు → కొలుకులు; చెలిమి-లు → చెలుములు.

xviii. కొన్ని మాటల బహువచన రూపాలను వ్యవహారంద్వారానే గ్రహించాలి. ఉదా. పెండ్లి/ పెళ్లి → పెండ్లిళ్లు; రాత్రి-లు → రాత్రులు/రాత్రిళ్లు; ఎద్దు-లు → ఎడ్లు/ఎద్దులు; రాయి-లు → రాళ్లు.

**16.** వ్యక్తినామ, స్థలనామాలకు బహువచనం చేర్చి సామాన్యనామాలుగా వాడవచ్చు. ఉదా. ఎన్ని ఢిల్లీలున్నా ఈ దేశం పల్లెపట్టే; ఎందరు గాంధీలు పుట్టినా మానవజాతి హింస మానేట్లు లేదు.

**17.** అర్థభేదం లేకుండానే అన్యదేశ్య శబ్దాలకు బహువచన ప్రత్యయంగా 'లు' ను గాని, 'స్/సు' ను గాని వాడవచ్చు. ఉదా. స్టూడెంట్/స్టూడెంట్సు; జమీందార్లు/ జమీందార్సు; 'సమన్స్' మొదలైన పదాల విషయంలో ఏకవచన రూపం చివరి సకారం బహువచనంలో లోపిస్తుంది. ఉదా. సమన్లు(< సమన్స్), బాడీలు(< బాడిస్).

**18.** కొన్ని అన్యదేశ్యాలను మూలభాషలోని బహువచన రూపంలోనే తెలుగులో వాడవచ్చు. ఉదా. సేల్స్‌మెన్ సమావేశమైనారు (సేల్స్‌మన్లు-కాదు). అలాగే బహువచనరూపంలో ఉన్న కొన్ని అన్యదేశ్యాలను తెలుగులో ఏకవచనరూపాలుగా వాడవచ్చు. ఉదా. డేటా(=దత్తాంశం).

**19.** భాషలో నామ, సర్వనామాలను క్రియలతో అన్వయించే ప్రత్యయాలను విభక్తులంటారు. కొన్ని తెలుగు మాటలకు ప్రథమా విభక్తి బహువచన రూపంనుంచి సప్తమీ బహువచనం దాకా మరికొన్ని ప్రత్యయాలు చేరుతుంటాయి. వాటిని 'ఉపవిభక్తు' లంటారు. అవి చేరిన మాటలు 'ఔపవిభక్తికాలు'. ఉపవిభక్తులు చేరిన, చేరని రూపాలను వ్యవహారాన్నిబట్టి గుర్తించవలసి ఉంటుంది. ఔపవిభక్తికాల ప్రధాన లక్షణా లివి:

i. మాట చివరి అచ్చును తొలగించి దాని స్థానంలో -'ఇ' చేరినవి కొన్ని. ఉదా. ఊరు-ఇ→ఊరి, తరవాత-ఇ→తరవాతి; ఎక్కడ→ఎక్కడి; కింద→కింది.

ii. మాట చివరి అక్షరానికి బదులు 'టి' చేరినవి కొన్ని. ఉదా. తాడు→తాటి; ఏరు→ఏటి; రోలు→రోటి. కొన్ని మాటల చివరి అక్షరానికి బదులు 'టి' చేరిన, చేరని రూపాలు రెండూ వాడుకలో ఉన్నాయి. ఉదా. రోకలి(బండ)/రోకటి (పోటు), నాగలి(కఱ్ఱు)/నాగటి(చాలు).

iii. కొన్ని మాటల చివర 'టి' పెచ్చుగా వచ్చి చేరుతుంది. అప్పుడు మాట చివరి ఉకారం అకారంగా మారుతుంది. ఉదా. రేపు→రేపటి; ముందు→ముందటి. మునుపు→మునపటి వంటి చోట్ల 'టి' కి ముందున్న ఉకారమేగాక దానికి ముందున్న ఉకారం కూడా అకారంగా మారుతుంది.

iv. కొన్ని మాటల చివరి హల్లు(ల) స్థానంలో 'ంటి' చేరుతుంది. ఉదా. కన్ను →కంటి; పన్ను (=tooth) →పంటి; విల్లు →వింటి; ఇల్లు →ఇంటి.

v. కొన్నిమాటలకు 'టి','ంటి' చేరిన రూపాలు రెండూ ఉంటాయి. ఉదా. రెండు →రెంటి/రెండింటి; ఏడు →ఏడిటి/ఏడింటి.

vi. కొన్ని మాటల చివరి అక్షరం స్థానంలో 'టి' చేరిగాని, పెచ్చుగా 'ంటి' చేరిగాని రెండురూపాలు ఉంటాయి. ఉదా. నూరు → నూటి/నూరింటి; అన్ని →అన్నిటి, అన్నింటి.

vii. కొన్ని మాటల చివరి - 'యి/-య్యి'కి బదులు 'తి' చేరుతుంది. ఉదా. చేయి / చెయ్యి →చేతి; నేయి /నెయ్యి →నేతి.

20. సున్నతో / మకారంతో అంతమయ్యే మాటల చివరిమకారం లోపించి, దానికి ముందున్న 'ఆ,ఎ' లకు ద్వితీయా విభక్తి ప్రత్యయం ముందు దీర్ఘంవస్తుంది. ద్వితీయాప్రత్యయం ద్విరుక్తమవుతుంది. ఉదా. దేశం-ని → దేశాన్ని; పందెం-ని →పం-దేన్ని.

21. 'లు' ప్రత్యయం చివరి ఉకారం అకారంగా మారిన తరవాతనే ద్వితీయాది ప్రత్యయాలు చేర్తాయి. ఉదా. పుస్తకాలు-ను/ని →పుస్తకాలను / పుస్తకాలని. ఈ మార్పు మాటచివరి 'లు' బహువచన ప్రత్యయం కానప్పుడు కూడా రావచ్చు. ఉదా. పాలు-ను →పాలను.

22. 'కు/కి' ప్రత్యయానికి ముందున్న మాట చివరి మకారం/సున్న కూడా లోపిస్తుంది. దానికి ముందున్న అచ్చుకూడా దీర్ఘమవుతుంది. అప్పుడు 'కు/కి'ల ముందు 'ని' పెచ్చుగా వచ్చి చేరుతుంది. ఉదా. దేశం-కి/కు →దేశానికి, ఈ మార్పు ఇతర ప్రత్యయాల ముందు జరగదు. ఉదా. దేశం-లో →దేశంలో; గుర్రం-మీద →గుర్రం మీద.

23. ద్వితీయాదిప్రత్యయాలు చేరేటప్పుడు మాటల చివరి 'డు,ను,రు,లు'ల లోని ఉకారం మనుష్య వాచకాల్లో నిత్యంగా, ఇతర శబ్దాల్లో వైకల్పికంగా ఇకారంగా మారుతుంది. ఉదా. తమ్ముడు-కి →తమ్ముడికి; వారు-కి →వారికి; చెల్లెలు-ని →చెల్లిలిని; చేను-కి/కు →చేనికి/చేనుకు. కాని చేను-లో →చేలో (చేనిలో-కాదు).

24. ఇకారాంతపదాల తర్వాత ద్వితీయా ప్రత్యయం 'ని'గా ఉంటుంది. ఇతరత్ర ఆది 'ని/ను'ల్లో ఏదైనా కావచ్చు. ఉదా. హరి-ని →హరిని; కర్మ-ని/ను →కర్మని/కర్మను;

గొడ్డు-ని/ను → గొడ్డుని/గొడ్డును. ఇదే సూత్రం 'కి/కు' లకు గూడా అనువర్తిస్తుంది. ఉదా. లక్ష్మికి; అన్నకి/అన్నకు; చేనుకి/చేనుకు.

25. హలంతాలైన అన్యదేశ్యాల తరువాత 'ని,కి' మాత్రమే వస్తాయి; 'ను,కు'లు రావు ఉదా. దేశాయ్-ని/కి → దేశాయిని, దేశాయికి. ఇలాంటప్పుడు హలంతశబ్దం అజంతంగా మారుతుందని గుర్తించాలి.

26. వాక్యంలో కర్మగా ఉన్నపదం ప్రాణి వాచకమైతే నిత్యంగాను, జడవాచకమైతే వైకల్పికంగాను, ద్వితీయాప్రత్యయం చేరుతుంది. ఉదా. వాడు ప్రజలను పీడిస్తున్నాడు; వాడు పూలు కోశాడు/ పూలను కోశాడు.

27. ఒక వాక్యంలో ఒకటికన్నా ఎక్కువ కర్మపదాలున్నప్పుడు గాని, కర్మపదం క్రియాపదానికి దూరంగా ఉన్నప్పుడుగాని, జడవాచకాల విషయంలో ద్వితీయా ప్రత్యయాన్ని వాడవచ్చు. లేదా మానవచ్చు. ఉదా. గుర్రాల్నీ, గాడిదలనూ ఒకేగాట కట్టవద్దు: గుర్రాలూ గాడిదలూ ఒకే గాట కట్టవద్దు; ఈ రోజుల్లో మాటమంచినీ మనసు మంచినీ గుర్తించటం లేదు: ఈ రోజుల్లో మాటనుంచీ మనసునుంచీ గుర్తించటం లేదు.

28. 'నా,నీ,మా,మీ' అనే సర్వనామరూపాల తరవాత 'ను' వస్తుంది; 'ని' రాదు. సర్వనామాల చివరి దీర్ఘం హ్రస్వమవుతుంది; ప్రత్యయం ద్విరుక్త మవుతుంది. ఉదా. నా-ను → నన్ను; నీ-ను → నిన్ను, 'మా,మీ'ల తరువాత 'ను' వర్ణం 'మ' వర్ణంగా మారుతుంది. ఉదా. మా-ను → మమ్ము; మీ-ను → మిమ్ము. 'మమ్మల్ని, మిమ్మల్ని' వంటిరూపాలు కూడా వాడుకలో ఉన్నాయి.

29. 'మమ్ము'కు 'మమ్మల్ని', 'మిమ్ము'కు 'మిమ్మల్ని', 'మన'కు, 'మనని/మనల్ని' అనే రూపాలు కూడా ఉన్నాయి.

30. 'చే(త),తో' తృతీయావిభక్తి ప్రత్యయాలు. 'చేత' స్వతంత్ర శబ్దంగా కూడా వాడుకలో ఉంది. ఉదా. చేత వెన్నముద్ద..... కర్తగా ఉన్న పదానికి 'చేత' చేరి కర్మణివాక్యాల్లో ప్రయుక్త మవుతుంది. అసాధారణ స్థితిలో తప్ప కర్మణి వాక్యాలు (passive constructions) రాయవద్దు. అవి తెలుగుభాషకు అంత సహజం కావు. ఉదా. వాడాపని చేశాడు (సహజవాక్యం): వాడిచేత ఆ పని చేయబడింది/వాడు ఆ పని చేయటం జరిగింది (అసహజవాక్యాలు).

31. 'తో' అనే తృతీయా ప్రత్యయం వాడకుండా సమాసాలు చేస్తే కొన్ని సందర్భాల్లో సహజంగా ఉంటుంది. ఈ ప్రత్యయాన్ని అనేకార్థాల్లో వాడుతుంటాం.

ఉదా.

(అ) ఒకపని చేయుటానికి సాయపడిన, ఉపయోగపడిన వస్తువులను సూచించేటప్పుడు: కర్రతో చేసిన కుర్చీ/కర్ర కుర్చీ; పిండితో చేసిన రొట్టె/పిండిరొట్టె (వీటిలో రెండోవే మేలు).

(ఆ) 'వెంట' అనే అర్థంలో: వాడితో వీడు; రాముడితో సీత అడవికి వెళ్లింది.

(ఇ) 'సాధనాలు' చెప్పటంలో: నోటితో మాట్లాడుతూ, నొసటితో వెక్కిరించాడు.

(ఈ) (శారీరక మానసిక స్థితుల్లో) 'ఉనికి'ని సూచిస్తూ: శ్రద్ధతో పని చేస్తాడు (శ్రద్ధగా-అని కూడా రాయవచ్చు); జ్వరంతో బాధ పడుతున్నాడు.

(ఉ) 'చెప్పు' మొదలైన అర్థాలున్న క్రియలకు అముఖ్య కర్మగా: ఆమెతో మాట్లాడేను; వాడితో చెప్పేను. (వాడికి-నయం).

(ఊ) 'కర్త' లక్షణాలు చెప్తూ: ఆమె సిగ్గుతో తలవంచుకుంది; వాడు దిగులుతో కుంగిపోయాడు; పిల్లవాడు ఆకలితో నకనకలాడుతున్నాడు.

(ఋ) క్రియాప్రతిక్రియలను సూచిస్తూ: రష్యాతో యుద్ధం వచ్చింది; ఇరుగుపొరుగులతో పోట్లాట మంచిది కాదు.

32. ఇవ్వటం(=సంప్రదానం) మొదలైన అనేకార్థాల్లో 'కి/కు' (ద్వితీయా) చతుర్థీ ప్రత్యయంగా వస్తుంది.

ఉదా.

(అ) 'గమ్యం' చెప్తూ: ఊరికి వెళ్లాడు /ఊరు వెళ్లాడు (రెండోది మేలు).

(ఆ) 'కారణం' చెప్తూ: పిల్లికి భయపడ్డాడు (పిల్లిని చూసి-అని కూడా రాయవచ్చు. మొదటిది మేలు)

(ఇ) 'కోరిక' ను సూచిస్తూ 'అని' వచ్చినప్పుడు: నాకు పోవాలని ఉంది/నేను పోవాలని ఉంది (ఏదైనా ఒకటే).

(ఈ) 'యజమానిని, జ్ఞానాన్ని' సూచిస్తూ 'ఉండు' వాడినప్పుడు: ఆయనకు లక్షలున్నాయి; ఆయనకు చదువులేదు, ఆమెకు గర్వం లేదు.

(ఉ) 'మనసు పద్ధతి, శరీరం తీరు' సూచిస్తూ: నాకు కోపంగా ఉంది/ నేను కోపంగా ఉన్నాను (కోపానికి ప్రాముఖ్యమిస్తే మొదటిది, తనకు ప్రాముఖ్య మిచ్చుకుంటే రెండోది నయం).

(ఊ) 'అమ్మటం, కొనటం, మార్పిడి' చెప్పదలిస్తే: రూపాయికి నూరుపైసలు/ నూరుపైసలు రూపాయి (రూపాయి విలువ చెప్పదలిస్తే మొదటిది; పైసల లెక్క చెప్పదలిస్తే రెండోది).

(ఋ) 'సంబంధం, చుట్టరికం' చెప్తూ: ఆయనకు నలుగురు పిల్లలు; ఆమెతో నీకేం పని?

(ౠ) 'ప్రయోజనం' చెప్పదలిస్తే: కొంతకు కొంత మేలు; చల్లకు వచ్చి ముంత దాచటం దేనికి?

(ఎ) క్రియా పదం 'దానం' సూచిస్తుంటే: వాడికి పది రూపాయలిచ్చా.

(ఏ) 'కాలపరిమితి'ని సూచిస్తూ: రేపటికి గాని ఈ పని పూర్తి కాదు- (రేపటిలోగా, రేపటి వరకు, రేపటిదాకా-వంటి ప్రయోగాలు మాండలికంగా వాడుకలో ఉన్నాయి).

(ఐ) 'సామాన్యలక్షణం' సూచిస్తూ: ఆవుకు నాలుగుకాళ్లు ('ఆవు నాలుగు కాళ్లు కలిగివుంది' వంటివి అసహజవాక్యాలు. అవి రాయవద్దు).

33. అన్ని మాండలికాల్లోనూ చతుర్థీ విభక్త్యర్థంలో అనుబంధంగా వాడుకలో ఉన్న 'కోసం' ఎదురుచూడటం, నేర్చుకోవటం, వెతుక్కోవటం మొదలైన అర్థాల్లో ప్రయుక్త మవుతుంది. 'కొరకు, కోసం, కోసరానికి, గురించి' వాడవద్దు. ఉదా. వాడికోసం పడిగాపులు పడుతున్నాడు; చదువుకోసం దేశాలుపట్టి పోవలసివచ్చింది; డబ్బు కోసం గడ్డి తినవలసివస్తున్నది.

34. వదలటం (=ఆపాదానం) మొదలైన అర్థాల్లో 'వల్ల, కన్నా, నించి/నుంచి, మీద, కింద, పక్క, పైన, బట్టి' మొదలైనవి రకరకాల ఛాయల్లో పంచమీ విభక్తిలో వాడుకలో ఉన్నాయి. 'నించి/నుంచి' కింది అర్థ విశేషాల్లో వాడ్తారు:

ఉదా.

(అ) 'కారణం' చెప్తూ: నీనుంచి కష్టాలు వచ్చాయి ( నీవల్ల-అని రాయటం మెరుగు).

(ఆ) 'మూలాధారం' సూచిస్తూ: చెట్టునుంచి పళ్లురాలేయి.

(ఇ) 'దేశకాలాలు' సూచిస్తూ: ఊరినించి వచ్చాడు; నిన్నటి నుంచి ఆడేపనిలో ఉన్నా.

(ఈ) 'కాలపరిమితి' చెప్తూ: పదేళ్లనుంచి ఆపని కాలేదు.

35. 'దృష్ట్యా, పట్ల, పై' అనే ప్రత్యయాలను పంచమ్యర్థంలో జాగ్రత్తగా వాడాలి. కర్తృపదం లేనప్పుడు 'దృష్ట్యా' వాడవద్దు. 'గురించి' అనే అర్థంలో గాని, 'కారణం' సూచిస్తూగాని 'దృష్ట్యా' వాడవచ్చు. ఉదా. పై కారణాల దృష్ట్యా, ఆర్థిక పరిస్థితుల దృష్ట్యా/వల్ల (రెండోది నయం). అదృష్ట్యా, ఎల్లయ్య దృష్ట్యా-వంటి ప్రయోగాలు చేయవద్దు. 'పట్ల' వాడకపోవటమే సహజం. దానికి బదులు (ద్వితీయా)- చతుర్థీ, పంచమీ ప్రత్యయాల వాడుక సహజం. ఉదా. 'ఆమె మీద నాకు ప్రేమ/ఆమె అంటే నాకు ఇష్టం' అనే వాక్యాలకు బదులు 'ఆమె పట్ల ప్రేమ' అని రాయవద్దు. 'ని/ను, కి/కు'లు వాడదగిన చోట్ల 'పై' వాడవద్దు. ఉదా. అతణ్ని విచారిస్తారు/అతనికి విచారణ తప్పదు (అతనిపై-అని రాయవద్దు); గోదావరికి మరో వంతెన (గోదావరిపై- అని రాయనక్కరలేదు).

36. అర్థవివరణలో తప్ప రచనాప్రయోజనం లేని 'యొక్క' ను షష్ఠీ ప్రత్యయంగా వాడవద్దు. ద్వితీయాది ప్రత్యయాలు చేరే పదరూపమే షష్ఠీవిభక్తి అర్థమిస్తుంది. అదే మరో నామవాచకానికి ముందుంటే విశేషణంగా వర్తిస్తుంది. ఉదా. నామాట, జాతిప్రయోజనం (నాయొక్క, జాతియొక్క సరికావు).

37. సప్తమీ ప్రత్యయంగా 'న/లో' వాడండి. (అందు, లోపల-పాతకాలానివి). ఉదా. దేశంలో, రాష్ట్రంలో. ఈ ప్రత్యయం కింది అర్థాల్లో వస్తుంది:

(అ) 'కాల' (పరిమితి) సూచకంగా: తెలుగు అకాడమిని **1968**లో స్థాపించారు; వాడు ఒక గంటలో వస్తాడు; రెండేళ్లలో చదువు పూర్తవుతుంది.

(ఆ) 'వాతావరణం' సూచిస్తూ: ఊటీలో చలి ఎక్కువ; సెప్టెంబరు లో తుపాను లెక్కువ.

(ఇ) 'విషయజ్ఞానం' చెప్తూ: ఆయనకు వైద్యంలో ప్రవేశముంది;

(ఈ) 'నిర్ధరించి' చెప్పేటప్పుడు: పాలలో నీళ్లు కలుస్తాయి.

(ఉ) 'వ్యాప్తి' సూచిస్తూ: సముద్రంలో చేపలున్నాయి; దేశంలో దరిద్రముంది.

(ఊ) 'అంటి పెట్టుకొని ఉండటాన్ని' సూచిస్తూ: సీసాలో మందుంది; పాకలో గొడ్లున్నాయి.

(ఋ) 'విడదీసి' చెప్పటంలో : ప్రూఫుల్లో తప్పులుంటాయి; లక్షమందిలో ఒక పండితుడుంటాడు.

# 8. సర్వనామాలు, విశేషణాలు

1. సర్వనామాలూ విశేషణాలూ రూపనిర్మాణంలో నామవాచకాల వంటివే. సర్వనామాల షష్ఠీవిభక్తి రూపాలన్నీ విశేషణాలుగానే ప్రయుక్తమవుతాయి. ఒక పేరా మొదటగాని, వాక్యం మొదటగాని నామవాచకం వాడిన తరవాత మళ్లీ దాన్నే పునరుక్తం చేయవద్దు. దాని స్థానంలో సర్వనామాలు వాడండి. సర్వనామాల రూపభేదాలివి: నేను, నా; మేము/మేం,మా; మనము/మనం, మన; నీవు/నువ్వు, నీ; మీరు, మీ; వాడు/ అది, వారు/వాళ్లు /ఆమె /వారి; ఆయన; తాను, తన; తాము, తమ.

2. అమహత్తులకు ముందున్న సంఖ్యావాచకాలకు మార్పులేదు. ఉదా. ఒక కుక్క, రెండు గుర్రాలు.

3. మహన్మహతీ పరిగణనలో 'మంది/గురు' ప్రత్యయాలు సంఖ్యావాచకాలకు చేరుతాయి. ఉదా. ఒకరు, ఇద్దరు, ముగ్గురు, నలుగురు, అయిదుగురు, ఆరుగురు, ఏడుగురు; ఎనిమిదిమంది, తొమ్మిదిమంది, పదిమంది; వందమంది/నూరుగురు; వెయ్యిమంది, లక్షమంది, కోటిమంది.

4. సంఖ్యావాచకాలకు చివర 'ఓ' చేర్చి విశేషాలు కల్పించవచ్చు (పాత వాడుకలోని 'అవ' వాడవద్దు). ఉదా. ఒకటో, రెండో, మూడో.

5. 'ఓ' చేర్చినప్పుడు 'నూరు' శబ్దమేగాని 'వంద' శబ్దం వాడరు. ఉదా. నూరోసారి.

6. ఆ, ఈ, ఏ-అనేవి ప్రాథమిక విశేషణాలు. వాటికి పునరుక్తి ఉంది గాని, మరో ప్రత్యయం చేరిన రూపాలు లేవు. ఉదా. ఆపని, ఈపని, ఏపని; ఆయా, ఈయా, ఏయే. షష్ఠీవిభక్తిలోని నామ, సర్వనామ, సంఖ్యావాచక రూపాలన్నీ విశేషణాలే. ఉదా. సీతమనసు, రాముడి పని; రెండుమాటలు, అయిదుగురు పెద్దలు. 'అగు' ధాతువు భూతకాలిక రూపం 'అయిన' చేరిన మాటలన్నీ విశేషణాలవుతాయి. ఉదా. కుదురైన ముఖం, తెలివైన మాట. తద్ధర్మార్థక ప్రత్యయం-'ఏ', శత్రర్థక ప్రత్యయం 'తున్న', అసమాపకమైన వ్యతిరేక క్రియా ప్రత్యయం 'అని' చేరిన వన్నీ విశేషణాలే. ఉదా. వచ్చేకాలం, వస్తున్న బండి, రాని చదువులు.

7. 'అటువంటి/టటువంటి' అనే అనుబంధాలను వీలయినంతవరకు విశేషణాలకు చేర్చవద్దు. ఉదా. వచ్చే (టటువంటి), వస్తున్న (టువంటి), రాని (అటువంటి).

8. మంచి, చెడ్డ, చిన్న-మొదలైనవి సహజ విశేషణాలు. ఇవి నామవాచకాలకు ముందే వస్తాయి. ఉదా. మంచిపని, చెడునడత, చిన్న బుద్ధి, పెద్దమనిషి. స్థానం మార్చిడి

వల్ల అర్థం మారవచ్చునని గ్రహించాలి. ఉదా. చెట్టు పండు; పండుచెట్టు.

9. కొన్ని మాటల చివర విశేషణ ప్రత్యయాలుగా 'ని/టి'లు చేర్తాయి ఉదా. కమ్మని గాలి, వెచ్చటి నీళ్లు, 'ని,టి'లు చేర్చకుండానే కొన్ని మాటలను విశేషణాలుగా వాడవచ్చు. మరోశబ్దం వాడి కూడా ప్రత్యయాల వాడుక తగ్గించవచ్చు. ఉదా. పుల్లని/పుల్లటి/పుల్ల/పులి-మజ్జిగ; వెచ్చని/వెచ్చటి/వేడి-నీళ్లు.

10. మరో నామవాచకానికి ముందున్న నామవాచకం చివరి 'ము'వర్ణం 'పు' వర్ణంగా మారుతుంది. ఈ వాడుకను నేటి తెలుగులో తగ్గించి, సమాస కల్పన చేయటం మంచిది. ఉదా. సరసపు వచనం, వచనపు సారస్యం: సరసవచనం , వచనసారస్యం.

11. మహత్తులైన విశేషణాలను స్త్రీ వాచకాలుగా మార్చినప్పుడు మాటచివర 'డు' వర్ణం 'రు' వర్ణంగా మారి 'ఆలు' శబ్దం కలుపుకొంటుంది. ఉదా. గుణవంతుడు- ఆలు →గుణవంతురాలు. 'ఆలు' చేర్చకుండా స్త్రీ వాచక రూపాలు వాడటం మెరుగు. ఉదా. గుణవతి.

12. అజంతశబ్దాల చివర విశేషణంగా మారేటప్పుడు 'టి' వర్ణం చేరుతుంది. ఉదా. పడకటిల్లు, దుక్కిటెద్దు, రేపటిరోజు, కిందటేడు; వాడినప్పుడు.

13. కొలతను సూచించేటప్పుడు నామవాచకాల చివరి 'ఎడు' ప్రత్యయం వల్ల అవి విశేషణాలవుతాయి. ఉదా. జానెడు పొట్ట, గంపెడు దుఃఖం.

14. భావార్థంలో క్రియాపదాల మీద 'డు' ప్రత్యయం చేరినప్పుడు అవి విశేషణాలవుతాయి. ఉదా. చూపుడు వేలు, దంపుడు బియ్యం. పెంపుడు చిలక.

15. విశేషణాల తరవాత 'వీడు, ఇది' అనే సర్వనామాలు రావు. ఉదా. మంచివాడు (*మంచివీడు, *మంచి ఇది - అనే రూపాలు రావు).

16. 'అని' చేర్చిన వాక్యాలు ప్రధాన వాక్యానికి పూరకాలు (complements) అవుతాయి. ఉదా. ముద్దు చేయలేదని పాప అలిగింది; మాట్లాడ వద్దన్నానని కోపం వచ్చింది.

17. వాక్యం చివర 'అది' చేర్చి క్రియను స్థానం మార్చి కర్తృస్థానంలోని విశేషణంగా మార్చవచ్చు. ఈ రకం పరివర్తనల్లో వచ్చే అర్థభేదం గుర్తించాలి. ఉదా. నువ్వు చేసింది నాకు తెలుసు (=(1) ఏం చేశావో తెలుసు, (2) చేశావని తెలుసు).

18. సంఖ్యావాచకాలు తరువాత 'అది' గాని 'మంది' గాని రావచ్చు; రెండూ రావు. ఉదా. వందలమంది/వందలాది (వందలాది మంది -తప్పు).

# 9. అవ్యయాదులు

1. నామవాచక, సర్వనామ, విశేషణ, క్రియాపదాలకులాగా ప్రత్యయాలు చేరని పదాలను అవ్యయా లంటారు. అప్పుడు, ఇప్పుడు, ఎందుకు మొదలైన సర్వనామాలు కొన్ని సందర్భాల్లో అవ్యయాల్లాగా ప్రవర్తిస్తాయి. ఉదా. వచ్చేటప్పుడు, చేసేందుకు. ఇవి క్రియావిశేషణాల చివర చేరినప్పుడు క్రియావిశేషణాలుగా, వాక్య విశేషణాలుగా ఉపయోగపడతాయి. ఉదా. వాడు పనిచేశాడు →వాడు చేసిన పని; ఆమె విన్నప్పుడు; నీవన్నట్లు.

2. క్రమేణ, క్రమేపి, యథా, ఏతావాతా, పదేపదే మొదలైన సంస్కృతావ్యయాలను సాధ్యమయినంతవరకు వాడవద్దు. 'వృథా' స్వతంత్ర శబ్దంగా తెలుగులో వాడుకకు వచ్చింది. ఉదా. ఆ విమర్శలన్నీ వృథా.

3. యథాతథం, యథావిధి మొదలైనవాటి చివర వాక్యమధ్యంలో 'గా' చేరుతుంది; వాక్యాంతంలో విధిగా చేరదు. ఉదా. నాటి పద్ధతులు నేటికీ యథాతథంగా ఉన్నాయి/ నాటి పద్ధతి నేటికి యథాతథం.

4. పిదప, కనుక, మరియు, దనుక-వంటి పాతకాలపు మాటలను వాడుక చేయవద్దు. మారుమూల అవ్యయీభావ సమాసాల వాడుక మంచిది కాదు. ఉదా. యథాసంభవం. అయితే 'వృథాప్రయాస, ప్రయాస వృథా' వంటివి వాడవచ్చు.

5. 'మరియు' మొదలైన అవ్యయాల స్థానంలో మాటల చివరి అచ్చులకు దీర్ఘం వాడి రెండుమాటలు కలపవచ్చు. ఉదా. వాడూ వీడూ, అదీ ఇదీ.

6. సందేహం సూచించటానికి పదం చివర 'ఓ' చేరుతుంది. ఉదా. అవునో కాదో, వాడో వీడో, మంచో చెడో. ఇలా 'ఓ' చేర్చి ప్రశ్న, విషయార్థాలను కూడా సూచించవచ్చు. భేదాన్ని వ్యవహారం ద్వారా గుర్తింవచ్చు. ఉదా. (సందేహం) వాడేం చేస్తున్నాడో ఎవరికి తెలుసు?; (విషయం) వాడెందుకు వెళ్లాడో నాకు తెలుసు; (=వాడు వెళ్లిన పనేమిటో నాకు తెలుసు); (ప్రశ్న) ఆమె ఏమంటున్నదో విను.

7. సందేహార్థంలో 'ఏమో'ను అదనంగా చేర్చవచ్చు. ఉదా. వాడేం మనిషో ఏమో! పాడుపని చేశాడు. ప్రశ్నార్థక శబ్దంలేని వాక్యాల్లో 'ఏమో' వాడి విషయం సూచించవచ్చు. ఉదా. ఆమె ఉందేమో చూడు; అది బాగుంటుందేమో నాకు తెలీదు.

8. వెంటవెంటనే రాసిన రెండు ప్రశ్నార్థవాక్యాలు సముచ్చయార్థం గాని, వికల్పార్థంగాని ఇవ్వవచ్చు. వ్యవహారం గమనించి ప్రయోగించాలి. ఉదా. (సముచ్చయార్థం) ఆమె ఎక్కడుంది? ఏం చేస్తున్నది?; (వికల్పార్థం) వాడు వస్తాడా? రాడా?

9. హిందీ ఇంగ్లీషుల్లోలాగా ప్రత్యేకశబ్దాలు (और, and - వంటి సముచ్చయార్థకాలనూ, या, or-వంటి వికల్పార్థకాలనూ) వాడకుండానే 'కానీ, కాబట్టి, అయినా, అయితే' వంటి అవ్యయాలతో రెండు వాక్యాలను కలవవచ్చు. ఉదా. ఆమె చక్కనిది, కాని గర్వంలేదు; ఆయన పెద్దమనిషి, కాబట్టి అబద్ధం చెప్పడు; వాడు దొంగ, అయినా మర్యాదస్థుడే; ఆమె పనికత్తె, అయితే ఒళ్లు దాచుకుంటుంది.

10. ప్రశ్నార్థకంగా మాట చివర 'ఆ' చేరుతుంది. లేదా చివరి అచ్చు దీర్ఘమవుతుంది. ఉదా. వచ్చాడా? /వచ్చాడూ?; చేసిందా?/ చేసిందీ?; అది గుండే? చెరువా?

11. దీర్ఘాచ్చుతో అంతమయ్యే మాటల తరవాత ప్రశ్నార్థకంగా 'ఆ' చేరినప్పుడు, రెండచ్చులమధ్య 'న' కారం పెచ్చుగా చేరుతుంది. ఉదా. వాడే-ఆ→వాడేనా? మొదటిమాట చివరి అచ్చూ, రెండోమాట మొదటి అచ్చూ, 'ఆ' అయితే 'న' కారంగాని, 'య' కారం గాని మధ్యలో చేరతాయి. ఉదా. వాటానా?/వాటాయా? ఇకారాంతాల తరవాత 'ఆ' చేరినప్పుడు ఉచ్చారణలో 'ఎ' (=æ) ధ్వని వినిపించినా రాతలో 'ఆ' వాడండి. ఉదా. అదా? ఇదా? గాలా? ధూళా?

12. సందేహం, వినికిడి-మొదలైనవి సూచించటానికి వాక్యం చివరగాని, మాట చివరగాని '(అ)ట' చేరుతుంది. దీర్ఘాచ్చుల తరవాత '(అ)ట' చేరినప్పుడు మధ్యలో నకారం పెచ్చుగా చేరుతుంది. ఉదా. చేశాడు-ఆట→చేశాడట; అంతే-ఆట→అంతేనట. '(అ)ట'కు ముందు డకార ముంటే సంధిలో రెండూ కలిసి 'ట్ట'గా మార్తాయి. ఉదా. వస్తాడు- అట→వస్తాడట/వస్తాట్ట. ఇకార, ఉకారాల తరవాత చేరిన '(అ)ట'లోని అకారం వైకల్పికంగా లోపిస్తుంది. ఉదా. వస్తుంది-ఆట→వస్తుందట/ వస్తుందిట.

13. నొక్కి చెప్పదలచిన మాట చివర 'ఏ(ను)' చేర్తుంది. మాట చివర సున్నా ఉంటే అది మకారంగా మారుతుంది. ఉదా. అది-ఏ→అదే; వాడు-ఏ→వాడే; దేశం-ఏ→దేశమే.

14. ఆక్షేపణలో క్రియాపదం చివర 'గా' చేరుతుంది. ఉదా. చేశాడుగా ఘనకార్యం!, ఉన్నాడుగా చెట్టంత మనిషి!

15. ఆక్షేపణ, సందేహం, నిర్ధారణ, ప్రశ్నలలో మాట చివర 'కదా/గదా' చేరుతుంది. 'కదూ/గదూ' కూడా చేర్చవచ్చు. ఉదా. పిల్లి గదా పాలు తాగింది?/పిల్లి కదూ పాలు తాగింది?

16. ఆశ్చర్యార్థంలో మాట చివర 'ఏ' చేరుతుంది. ఉదా. వాడే!, వచ్చావే!, విన్నానే!

17. అనిశ్చయ, నిరాదరణలు సూచిస్తూ మాటల చివర 'లే' చేరుతుంది. సందర్భాన్ని బట్టి అర్థం మారుతుందని గుర్తించాలి. ఉదా. అన్నాడులే; వస్తాలే(వీలయితే).

18. తరతమ భేదాలను సూచించే ప్రత్యేక పదాలుగాని, ప్రత్యయాలు గాని తెలుగులో సహజంగా లేవు. సంస్కృతం నుంచి ఎరువు తెచ్చుకున్న మాటలతోనే ఇది సాధ్యం. 'మేల్తరం' వంటి మాటలు కొన్ని మాత్రమే ఇటీవల వాడుకలోకి వచ్చాయి. "గురువు, గరీయం, గరిష్ఠం; గుణవంతం, గుణవత్తరం, గుణవత్తమం'' వంటి వాడుకను ప్రయత్న పూర్వకంగా అభ్యసించాలి. లేదా వాక్యరచనద్వారా ఈ తరతమ భేదాలను సూచించాలి. ఈ భేదాలను తెలుగులో 'కంటె, కన్న / కన్నా'లతో నిరూపించాలి. ఉదా. వాడికంటే వీడు నయం; చెప్పేకన్నా చేయటం మెరుగు.

# 10. సంధులూ, సమాసాలూ

1. విడివిడి మాటలు కలియటం సంధి. మొదటిమాట చివరి వర్ణం నిలిచి, తరవాతి మాట మొదటివర్ణం లోపిస్తే అది పూర్వరూపసంధి. తెలుగులో ఇది తక్కువ. మొదటి మాట చివరి వర్ణమే లోపిస్తే అది పరరూప సంధి. తెలుగులో ఇది సహజం. ప్రత్యయాలు చేరినప్పుడు స్వతంత్ర శబ్దంలో వచ్చే మార్పులను పదమధ్యసంధి అంటారు. ఇది నిత్యం. ఈ సంధి అన్ని భాషాభాగాల్లోనూ జరగవచ్చు. కొన్ని సమయాల్లో ప్రత్యయాల రూపంలో కూడా సంధివల్ల మార్పులు రావచ్చు ప్రధానమైన సంధి భేదా లివి:

i. మొదటిమాట చివరి అచ్చు 'ఉ' అయితే మరో అచ్చు ముందు అది లోపిస్తుంది; రెండోది మిగులుతుంది. ఉదా. తమ్ముడు-ఉన్నాడు →తమ్ముడున్నాడు. తక్కిన అచ్చుల విషయంలో సంధి జరగవచ్చు; జరక్కపోవచ్చు.

ii. ప్రత్యయం మొదటి అచ్చు తప్పక లోపిస్తుంది. ఉదా. మేన-అత్త→ మేనత్త (ఇక్కడ అత్తశబ్దం ప్రత్యయంతో సమానం); జాన-ఎడు →జానెడు.

iii. రెండు మాటల్లో మొదటిది తెలుగు బహువచన ప్రత్యయంతో ఉండి రెండోది సంస్కృతపదమైతే సంధి చేయవద్దు. ఉదా. ప్రజల-అభీష్టం→ ప్రజల అభీష్టం (లేదా- 'ప్రజాభీష్టం' అని సమాసం చేయండి); అన్ని-ఉద్యోగాలూ →అన్ని ఉద్యోగాలూ ('అన్నుద్యోగాలు' కాదు).

iv. సుదీర్ఘసమాసమయితేతప్ప, సంధి చేయండి. ఉదా. దేశ-ఉన్నతి →దేశోన్నతి; వయః-పరిమితి →వయఃపరిమితి; శిఖర-అగ్ర -చర్చలు→ శిఖరాగ్రచర్చలు.

v. సంధిగతమైన రూపాల్లో రెండు ఒత్తక్షరాలు వెంటవెంటనే రావు. వస్తే మొదటిదాని ఒత్తు పోతుంది. ఉదా. ఏక-ఛత్రం→ ఏకచ్ఛత్రం.(-చ్ఛ్రత్రం- అనే రూపం రాదు)

vi. మొదటిమాట చివరి దీర్ఘాచ్చుల పక్కన రెండోమాట మొదటనున్న 'ఇ,ఈ,ఎ,ఏ'-లు వస్తే మాటలమధ్య 'య' వచ్చి చేరుతుంది; 'ఉ,ఊ,ఒ,ఓ-లు వస్తే 'వ' వచ్చి చేరుతుంది. ఉదా. నా-ఇల్లు →నాయిల్లు; ఆ-ఈగ →ఆయీగ; ఈ-ఎలక్షన్ →ఈ యెలక్షన్; మా-ఊరు →మావూరు; ఏ-ఓడ →ఏవోడ. ఇలా య,వ,లు చేర్చకపోటం మంచిది.

vii. మాటచివరి దీర్ఘాచ్చు తరవాత అవ్యయం/ప్రత్యయం మొదటి హ్రస్వాచ్చు నిత్యంగా లోపిస్తుంది. ఉదా. వినే-అప్పుడు →వినేప్పుడు; పో-అక →పోక; రా-అని →రాని.

viii. సాధారణంగా తెలుగుమాటలకు రెండు రూపాలుంటాయి (అచ్చుల ముందు హలంతంగా, హల్లులముందు అజంతంగా). కొన్ని సమయాల్లో హల్లులముందుకూడా స్వరలోపం జరుగుతుంది. అప్పుడు ఒకే వర్గానికి చెందిన పరుషాలు సంధిలో ద్విత్వమవుతాయి. పరుషసరళాలు వెంటవెంటవస్తే రెండోది ద్విరుక్తమవుతుంది. ఉదా. కాపు-పిల్ల → కాప్పిల్ల; చేతి-తప్పు → చేత్తప్పు; భారత-దేశం → భారద్దేశం; పిరికి-గుండె → పిరిగ్గుండె. అయినా మాటలను విడివిడిగా రాయటం మంచిది.

ix. భిన్న వర్గాలకు చెందిన హల్లులు పక్కపక్కన వచ్చినప్పుడు సంధిలో రెండో హల్లే ద్విరుక్తమై నిలుస్తుంది. ఉదా. రాతి-చిప్ప → రాచ్చిప్ప.

x. మొదటి హల్లు 'ల,న'ల్లో ఒకటై, తరవాతి హల్లు దంత్య (త,ద-లు), తాలవ్య (చ,జ,య-లు), దంతమూలీయ (స,న,ల,ర-లు), మూర్ధన్య (ట,డ,ణ,ళ-లు) వర్ణాల్లో ఒకటయితే మొదటిమాట చివరి అచ్చు లోపించి సంధి జరుగుతుంది. ఉదా. కాలు-తో → కాల్తో; కాని-ది → కాన్ది/కాంది; మాటల-చేత → మాటల్చేత; నూలు-జుబ్బా → నూల్జుబ్బా; నూలు-సంచి → నూల్సంచి; పిల్ల-నాగు → పిల్నాగు; కాల-రాసి → కాల్రాసి; పాల-డబ్బా → పాల్డబ్బా; మాటలు-రావు → మాటల్రావు. సంధి చేయకుండా రాస్తే శబ్దస్వరూపం స్పష్టంగా ఉంటుంది.

xi. మొదటిమాట చివరిహల్లు మూర్ధన్యమై, రెండోదాని మొదటిహల్లు దంతమూలీయమైనా స్వరలోపంలో సంధి జరుగుతుంది. ఉదా. వాడి-ని → వాణ్ణి; గూడు-లు → గూళ్లు.

2. రెండుగాని, అంతకు మించిన పదాలుగాని కలిసి ఒకేమాట అయితే అది సమాసం. సమాసాల్లోని మొదటి మాట చివరి ఏకవచన ప్రత్యయాలు లోపిస్తాయి. ఉదా. రాముడి-యొక్క-బాణం → రాముడిబాణం/రామబాణం; రాముడు-లక్ష్మణుడు → రామలక్ష్మణులు.

3. సంస్కృతపదాలతో సమాసం చేసేటప్పుడు కింది సాధారణనియమాలు పాటించండి:

i. అజాది పదాలు ముందుంటాయి. ఉదా. రామలక్ష్మణులు (వర్ణక్రమంలో రేఫ తరువాతనే వస్తుంది లకారం).

ii. స్త్రీపురుషవాచకాల్లో సాధారణంగా స్త్రీ వాచకమే ముందుంటుంది. ఉదా. సీతారాములు.

iii. రెండుమాటలూ స్త్రీవాచకాలయినా, స్త్రీవాచకం పురుషవాచకం కన్నా సుదీర్ఘమైనా అల్పాక్షరశబ్దమే ముందుంటుంది. ఉదా. కృష్ణాగోదావరులు; నలదమయంతులు.

iV. రెండు మాటల లక్షణాలూ ఒకే విధంగా ఉంటే వాటిలో గౌరవాధిక్యం కలది ముందుంటుంది. ఉదా. గంగాకృష్ణలు

V. సంస్కృతంలోని పుం, నపుంసక లింగ శబ్దాల చివర సమాసంలో దీర్ఘం రాదు. ఉదా. దారపుత్రులు (దార-పుంలింగశబ్దం); శిక్షణ పథకం (శిక్షణ-నపుంసకలింగశబ్దం).

Vi.సంస్కృతంలోని స్త్రీ లింగశబ్దాల చివరి దీర్ఘం సమాసంలో హ్రస్వంకాదు. ఉదా. ఇందిరా ప్రియదర్శిని, ఈ సూత్రం మిశ్రసమాసాలకు కూడా వర్తిస్తుంది. ఉదా. కమలా టీచర్.

4. వాడుకలో నలిగింది కాకపోతే మొదట సంస్కృతపదాన్ని వాడి తెలుగు మాటలతో కలిపి సమాసం చేయవద్దు. ఉదా. గర్భగుడి, భూతద్దం. 'సార్వత్రికసమ్మె, రసాయనమార్పు' వంటివి ఈనాటివి.

5. రెండు అన్యదేశ్యాల మధ్య 'పు' గాని, క్రియావిశేషణం 'అయిన/ఐన' గాని వీలయితే చేర్చవద్దు. ఉదా. భారతదేశ విదేశాంగ మంత్రి (భారత దేశపు-కాదు); ప్రజాస్వామ్య లక్షణాలు (ప్రజాస్వామ్యపు-కాదు).

6. దేశ్యాలనూ అన్యదేశ్యాలనూ కలిపి మిశ్ర సమాసం చేసేటప్పుడు విశేషణంగా మొదట తెలుగుమాటలే వాడండి. ఉదా. కొత్త ప్రెసిడెంట్ (నూతన-అనవద్దు).

7. సమాసాల్లో తద్ధితరూపాల వాడుక తగ్గించండి. ఉదా. రసాయనచర్య (రాసాయనిక-అని రాయవద్దు); వ్యవసాయదేశం (వ్యావసాయిక-అనకండి); ప్రకృతివైపరీత్యాలు (ప్రాకృతిక-అని రాయకండి).

8. అన్యదేశ్యాలతో సమాసాలు కల్పించేటప్పుడు తత్సమ, తద్భవ భేదం గుర్తించండి. ఉదా. నౌకాదళం/నావికదళం('నావికాదళం' కాదు).

9. తెలుగు, ఇంగ్లిష్ నుడికారాలను సంస్కృతీకరించి సమాసాలు చేయవద్దు. అలాగే అన్యదేశ్య సమాసాలను మక్కికిమక్కిగా తెలుగు చేయవద్దు. ఉదా. "the cold touch of poverty"ని 'దుర్భరదారిద్ర్యం' అని అనువదించండి గాని 'దారిద్ర్యశీతలస్పర్శ' అనవద్దు. అలాగే 'చల్లని కడుపు'ను 'శీతలగర్భం' అని రాయవద్దు.

# 11. పదజాలం: కృత్తద్ధితాలు

1. భాషా విలక్షణతను నిరూపించేది వాక్యరచనాపద్ధతి. వాక్యాల్లో భిన్న భాషాభాగాలకు చెందిన పదాలుంటాయి. వాటిని దేశ్యాలని, అన్యదేశ్యాలనీ స్థూలంగా రెండుగా విభజించవచ్చు. సాధ్యమయినంతవరకు తెలుగుమాటలనే వాడితే విద్యార్థులు సులభంగా అర్థం గ్రహించగలరు. శాస్త్రగ్రంథరచనలో సుదీర్ఘసమాసాలను (ఎంత పొడుగు సమాసమైనా ఒక్క మాటకిందనే లెక్క), తెలుగువైనా మారుమూల మాటలను, వీలయినంతవరకు వాడగూడదు. ఉదా. ఈయేడు వానలు తక్కువ/ ఈ year rains తక్కువ/ ఈ సంవత్సరం వర్షాభావం-ఈ మూటిలో మొదటిదే మేలు.

2. కొన్ని మాటలు పరుషాదిగా, సరళాదిగా రెండురూపాలతో వాడుకలో ఉన్నాయి. ఏదో ఒక రూపంలో వాటిని నియతంగా వాడండి. ఉదా. బొక్క/పొక్క, కడప/ గడప, కుంట/గుంట.

3. కొన్ని జంటమాటలు వాడుకలో ఉన్నాయి. వాటిలో రెండూ దేశ్యాలే అయినా రెండో మాటకు విడిగా అర్థం తెలియదు. ఉదా. పులీపుట్రా, రవికారట్రా. రెండో మాటను విడిగా వాడవద్దు. కొన్ని తెలుగు మాటలు అన్యదేశ్యాల్తో జతకట్టి జంటమాట లవుతున్నాయి. ఉదా. సిగ్గూశరమూ, సిగ్గూబిడియం, సేమ్ అదే. రెండూ అన్యదేశ్యాలుగా కూడా జంటమాట లేర్పడ్డాయి. ఉదా. పేపర్ కాగితం. శాస్త్రరచనలో ఇటువంటి శబ్దాలను వాడవద్దు.

4. సంస్కృతం నుంచి ఎరువుగా వచ్చిన మాటల స్వరూపం గుర్తించి వాడండి. ఉదా. 'పటిష్టవంతం, నైపుణ్యత, గౌరవనీయ, సౌహార్ద్రం, చారిత్రాత్మకం' వంటివి అపశబ్దాలు. వాటిని క్రమంగా 'పటిష్ఠం, నైపుణ్యం, మాననీయ, సౌహార్దం, చరిత్రాత్మకం/చారిత్రకం' అనే రాయాలి. నిఘంటువులు చూసి సరిదిద్దుకోండి.

5. క్రియలకు ప్రత్యయాలు చేరి నామవాచకాలేర్పడితే అవి కృత్తులు. నామవాచకాలనుంచి ప్రత్యయాలు చేరి మళ్లీ నామవాచకాలు తయారైతే అవి తద్ధితాలు. ఉదా. (కృత్తులు) ఎరుగు -ఇక→ఎరిక; తెలియు-ఇడి→తెలివిడి; (తద్ధితాలు)ప్రథమం→ ప్రాథమ్యం; పరిశుద్ధం→పారిశుధ్యం. సమాసాల్లో తద్ధితరూపాల వాడుక పూర్తిగా తగ్గించండి.

6. వ్యక్తుల, స్థలాల, వస్తువుల పేర్లు మార్చవద్దు; అనువదించవద్దు. ఉదా. అలెగ్జాండర్ (అలకసుందరుడు-కాదు); జవాహర్‌లాల్ (జవహర్లాల్-కాదు); కారల్ మార్క్స్ (కారల్ మోక్షుడు-కాదు); డెమోస్కస్ (దిమిష్క నగరం-కాదు); తక్షశిల (టాక్సిలా-కాదు); స్టెతస్కోప్ (ఆల-కాదు).

7. 'నెలకొను, కైకొను, విద్యగరపు, పలువురు' వంటి పాతకాలం మాటలను వాడవద్దు.

8. కవితాభాషలోలాగా అనేక పర్యాయపదాలను ఒకే అర్థంలో వాడవద్దు. పరిభాషలాగా ఒకే అర్థంలో ఒకే మాటను నియతంగా వాడకపోతే శాస్త్ర ప్రయోజనం దెబ్బతింటుంది. 'మబ్బు, మేఘం, కాదంబిని' వగైరా అనేక పర్యాయపదాల వాడుక పనికిరాదు.

9. కలుగు, జరుగు, ఇమిడివుండు-వంటి క్రియారూపాలను మళ్లీ మళ్లీ వాడవద్దు.

10. కేవలం మాండలికంగా వాడుకలో ఉండి, ఇతర ప్రాంతాల వారికి మరో అర్థమో, అశ్లీలార్థమో వచ్చే మాటలు వాడవద్దు. ఉదా. గుంట, దొబ్బు, ఎత్తు, సరుకు మొ.

11. ధాతురూపాల చివర 'ఆటం/ఆడం' చేర్చి భావార్థకాలను నిష్పన్నం చేయవచ్చు. అవి నామవాచకాల్లాగానే వాక్యంలో కర్త/కర్మ గా వ్యవహరిస్తాయి. ఉదా. చెప్పు-ఆటం/అడం→చెప్పటం/చెప్పడం; చెప్పటానికి, చెప్పడం వల్ల మొ. ఈ రూపాలకు వ్యతిరేకరూపాలున్నాయి. ఉదా. చెప్పకపోవటం, చెప్పకపోవడంవల్ల. ఈ వ్యతిరేక రూపాలు పురుషనిర్దేశం చేయవు. ఉదా. నీవు/నేను/వాడు చెప్పటం/ చెప్పకపోవడం.

12. ధాతువులకు-'అమి' చేర్చి వ్యతిరేకభావార్థకాలను సాధించవచ్చు. ఉదా. విను-అమి→వినమి.

## కొన్ని ముఖ్యమైన కృద్రూపాలు:

1. మాటచివరి అక్షరంలోపించి 'క' చేరినవి:

ఎరుగు → ఎరుక
కడగు → కలక
కాగు →కాక
మునుగు →మునక

అపవాదం: వచ్చు → రాక

2. మాట చివర '- ఇక' చేరినవి:

అమరు → అమరిక
ఓపు → ఓపిక
కదలు → కదలిక
పొందు → పొందిక

3. మాట చివరి అక్షరం లోపించి 'పు' చేరినవి:

తలచు → తలపు
తీర్చు → తీర్పు
ముగించు → ముగింపు
వలచు → వలపు

4. మాటచివరి అక్షరంలోపించి 'త' చేరినవి:

అలము → అలత
చేయు → చేత
మోయు → మోత
రాయు → రాత
ఆవులించు → ఆవులింత
పలకరించు → పలకరింత
వెక్కిరించు → వెక్కిరింత

5. మాట చివరి అక్షరానికి బదులు 'ట' చేరినవి:

ఆడు → ఆట
ఊరు → ఊట
పండు → పంట
మండు → మంట

6. మాట చివర 'ఇమి' చేరినవి:

కలుగు → కలిమి
కూరుచు → కూరిమి

7. మాట చివర 'బడి' చేరినవి:

పెట్టు →పెట్టుబడి
సాగు →సాగుబడి

8. మాట చివర 'బాటు' చేరినవి:

గిట్టు →గిట్టుబాటు
తిరుగు →తిరుగుబాటు

9. చివర 'గడ' చేరినవి:

ఎత్తు →ఎత్తుగడ
మను →మనుగడ

10. చివర 'దల' చేరినవి:

పట్టు →పట్టుదల
పారు →పారుదల
సాగు →సాగుదల

11. చివరి అక్షరంలోపించగా మిగిలిన దానికి 'కువ' చేరినవి:

వేగు →వేకువ

12. చివర 'డు' చేరినవి:

అమ్ము →అమ్ముడు
తాగు →తాగుడు
పాకు →పాకుడు

13. చివర 'ఇక' చేరినవి:

కోరు →కోరిక
చేరు →చేరిక
పూను →పూనిక

14. చివర 'అకం' చేరినవి:

పెంచు →పెంపకం
వండు →వంటకం

15. చివర 'కోలు' చేరినవి:

చెప్పు →చెప్పుకోలు
మెచ్చు →మెచ్చుకోలు

వీడు →వీడుకోలు/వీడ్కోలు

ఇలా ఇంకా చాలా ప్రత్యయాలు చేరి తెలుగులో కృత్తులు ఏర్పడతాయి. ఇది సంగ్రహంగా కొన్నిటిని పేర్కొనటమే.సంస్కృత పదాలైన కృత్తులు ఏయే ప్రత్యయాలు చేరి ఎలా ఏర్పడతాయో వివరించాలంటే ఆభాషావ్యాకరణం చెప్పాలి. అది ప్రస్తుతం కుదరదు గనుక కొన్ని శబ్దాలను మాత్రం సూచిస్తాం-

అవన్నీ ఎక్కువ వాడుకలో ఉన్నవి మాత్రమే.

1. 'తవ్య' చివర చేరినవి:
   భవితవ్యం, కర్తవ్యం, వక్తవ్యం, శ్రోతవ్యం
2. 'అనీయ' చేరినవి:
   పఠనీయం, కరణీయం, శ్రవణీయం, దర్శనీయం, స్తవనీయం
3. 'య' ప్రత్యయం చేరినవి:
   పాఠ్యం,భావ్యం,గమ్యం,రమ్యం,దృశ్యం,వాచ్యం,శ్రావ్యం
4. 'క' ప్రత్యయం చేరినవి:
   గాయకుడు,వర్తకుడు,కథకుడు,పాఠకుడు,విమర్శకుడు
5. 'క్త' ప్రత్యయం చేరినవి:
   గతం,హతం,విత్తం,స్వాంతం,కష్టం,శాంతం.

ఇవి అనేకం.శబ్దరూపాలను గుర్తించటానికి కొన్ని మాత్రం ఉదాహరణ ప్రాయంగా ఇచ్చాం.

## తద్ధితాలు

నామవాచక శబ్దంమీదగాని విశేషణాలమీదగాని కొన్ని ప్రత్యయాలు చేరి మళ్ళీ నామవాచకా లేర్పడతాయి. వీటిని తద్ధిత నామా లనవచ్చు;క్లుప్తంగా తద్ధితా లనవచ్చు.

**తెలుగులో ఏర్పడే కొన్ని తద్ధిత రూపాలను గమనిద్దాం.**

1. 'తనం' చేరేవి:
   దొంగ→దొంగతనం
   పిరికి→పిరికితనం
2. 'రికం' చేరేవి:
   కన్నె→కన్నెరికం
   పెద్ద→పెద్దరికం
3. 'ఇమి' చేరేవి:

మేలు → మేలిమి

వేడి → వేడిమి

4. 'న' చేరేవి:

నల్ల → నల్లన

తియ్య → తియ్యన

5. 'పు' చేరేవి:

తెల్ల → తెలుపు

పచ్చ → పసుపు

6. 'ఇడి' చేరేవి:

వినికి → వినికిడి

తెలివి → తెలివిడి

7. 'దం' చేరేవి:

ఒప్పు → ఒప్పిదం

తప్పు → తప్పిదం

8. 'కారం' చేరేవి:

నుడి → నుడికారం

9. 'కాడు' చేరే మహత్తులు:

ఆట → ఆటకాడు

వేట → వేటకాడు

10. 'కత్తె' చేరే అమహత్తులు:

ఆట → ఆటకత్తె

పాట → పాటకత్తె

11. 'అరి' చేరేవి:

కమ్మరం → కమ్మరి

చదువు → చదువరి

12. 'ఇడి' చేరేవి:

ముక్కు → ముక్కిడి

సిగ్గు → సిగ్గిడి

13. 'ఎడు' చేరేవి:

మాన → మానెడు

వీసె →వీసెడు

14. 'బంటి' చేరేవి:

మెడ →మెడబంటి

రొమ్ము →రొమ్ముబంటి

15. 'ఈడు' చేరేవి:

కమ్మతం →కమ్మతీడు

బానసం →బానసీడు

ఇలా అనేకం.ఆయాప్రత్యయాలు ఆయానిర్దిష్టార్థాల్లో చేర్తాయి. లేదా నిర్దిష్టప్రత్యయం చేరినప్పుడు అర్థంలో మార్పు వస్తుంది.నిఘంటు వ్యాకరణాల ద్వారా ఆభేదాలను గుర్తించాలి.

సంస్కృతంలోని తద్ధితరూపాలన్నిటినీ వివరించటం ఇక్కడ అసాధ్యం.అనవసరం కూడా. ఆయాప్రత్యయాలు చేరినప్పుడు వచ్చే అర్థభేదాలను పైన సూచించినట్లే తెలుసుకోవాలి.

ఇక్కడ తెలుగువారి వాడుకలో ఎక్కువగా కనిపించే కొన్ని రూపాలను అర్థవివరణ లేకుండా పట్టికగా ఇస్తున్నాం.

కురు →కౌరవ

యదు →యాదవ

మను →మానవ

కళింగ →కాళింగ

పంచాల →పాంచాల

తిల →తైలం

పయస్ →పాయసం

పుర →పౌర

శివ →శైవ

నగర →నాగర

బుద్ధ →బౌద్ధ

జిన →జైన

ముని →మౌనం

యువా →యౌవనం

గురు →గౌరవం

ధను →ధానుష్క

మాస →మాసిక
వర్ష→ వార్షిక
దిన →దైనిక
నౌ →నావిక
అస్తి →ఆస్తిక
వేద →వైదిక
లోక →లౌకిక
ఇహ →ఐహిక
వృత్తి →వార్తిక
తర్క →తార్కిక
వీణా →వైణిక
పురాణ →పౌరాణిక
మనస్→ మానసిక
పక్ష →పాక్షిక
మహత్ →మహిమ
పటు →పటిమ
గురు →గరిమ
లఘు →లఘిమ
కుల →కులీన
గ్రామ →గ్రామీణ
భారత →భారతీయ
రాష్ట్ర →రాష్ట్రీయ
పర →పరకీయ
దేశ →దేశీయ
ప్రాంత →ప్రాంతీయ
స్వ →స్వీయ/స్వకీయ
రాజన్ →రాజకీయ
పురుష →పౌరుషేయ
అతిథి →ఆతిథేయ
నవ →నవీన
సాయం →సాయంతన

చిరం → చిరంతన
సమ → సమత
ప్రభు → ప్రభుత
పశ్చాత్ → పాశ్చాత్య
గురు → గురుత, గురుత్వం, గౌరవం
రసిక → రసికత్వం, రసికత,రాసిక్యం
పటు → పటుత, పటుత్వం,పాటవం
పురుష → పురుషత, పురుషత్వం, పౌరుషం
సోదర → సోదరత, సోదరత్వం, సౌదర్యం
రాజ → రాజ్యం
శూర → శౌర్యం
నిపుణ → నిపుణత, నిపుణత్వం,నైపుణ్యం
ప్రవీణ → ప్రావీణ్యం
ధీర → ధైర్యం
స్థిర → స్థైర్యం
రూప → రూపవంతుడు, రూపవతి; రూపసి
యశస్ → యశస్వంతుడు, యశోవతి; యశస్వి, యశస్విని
మధు → మధుర, మధురత, మధురత్వా, మాధుర్యం
మేధా → మేధావి
తపస్ → తపస్వి
గురు → గరిష్ఠ
పటు → పటిష్ఠ

సంస్కృతంలోని మూలపదాల విభక్తి ప్రత్యయాదులను గాని, తద్ధిత రూపాలకు ఆయా లింగవచనాదుల్లో వచ్చే రూపభేదంగాని చూపలేదని గమనించండి.

# 12. క్రియలు: క్రియావిశేషణాలు

1. తెలుగు క్రియలు అకర్మక, సకర్మక, ప్రేరణార్థకాలని ప్రధానంగా మూడు రకాలు. అకర్మక క్రియలు వాడిన వాక్యాలలో కర్మ ఉండనక్కరలేదు. సకర్మకాలు క్రియను ఆపేక్షిస్తాయి. ప్రత్యక్ష పరోక్ష కర్మలు రెండూ ఉన్నప్పుడు ప్రేరణార్థకాలు వాడాలి. కొన్ని సకర్మకాలుగానూ, అకర్మకాలుగానూ వాడదగినవి. ప్రత్యేకధాతువులతో ఈ మూడు రకాల క్రియలూ విడివిడిగా ఉన్నాయి కూడా. అకర్మకాలను సకర్మకాలుగా, ప్రేరణార్థకాలుగా మార్చే ప్రత్యయా లున్నాయి. వ్యవహారాన్నీ, నిఘంటువులనూ సంప్రతించి వీటిని గుర్తుపట్టవచ్చు. ఉదా.

| | |
|---|---|
| *(అ) అకర్మకం* | సకర్మకం |
| పెరుగు | పెంచు |
| కలియు | కలుపు |
| కాలు | కాల్చు |
| *(ఆ) సకర్మకం* | ప్రేరణార్థకం |
| అను | అనిపించు |
| కాల్చు | కాల్పించు |
| తిట్టు | తిట్టించు |

2. అకర్మకాలను కింది పద్ధతులద్వారా సకర్మకాలుగా మార్చవచ్చు. ఉదా.
   i. - 'ఇంచు' చేర్చి: దిగు-ఇంచు →దించు; బిగియు-ఇంచు →బిగించు
   ii. '-చు' చేర్చి: కాలు-చు →-కాల్చు; పడు-చు →పరుచు/పరచు
   iii. చివరి వర్ణాన్ని '-పు'గా మార్చి: కలియు →కలుపు; చూచు →చూపు
   iv. 'చేయు' అనుబంధంగా చేర్చి: తెలియు-చేయు →తెలియజేయు
   v. 'వేయు' అనుబంధంగా చేర్చి: ఆరు-వేయు →ఆరవేయు
   vi. 'కొట్టు' అనుబంధంగా చేర్చి: పగులు-కొట్టు →పగులగొట్టు/పగలగొట్టు
   vii. 'తీయు' అనుబంధంగా చేర్చి: అరుగు-తీయు →అరగదీయు
   viii. 'పెట్టు' అనుబంధంగా చేర్చి: కాగు-పెట్టు →కాగబెట్టు

పై మార్పు జరిగేటప్పుడు 'కొట్టు, తీయ, చేయు' మొదలైన పరుషాది శబ్దాలు సరళా లవుతాయి. ధాతువు చివరి ఉకారం అకారంగా మారుతుంది. ఈ మార్పుతోబాటు అర్థంలో కూడా కొద్దిపాటి భేదం రావచ్చు. వ్యవహారాన్నిబట్టి ఈ భేదం గుర్తించాలి. ఉదా.

3. 'కొను' ధాతువును ఇతర ధాతువులకు చేర్చినప్పుడు కొన్ని ప్రయోజనాలు సాధించవచ్చు. ఉదా.
i. అకర్మకాన్ని సకర్మకం చేయవచ్చు. తెలియు-కొను →తెలుసుకొను. ఇక్కడ యకారాంతాలు సకారాంతాలు కావటం గమనించాలి.
ii. వాక్యంలో ఒకటికి మించిన కర్తలుంటే 'కొను' చేరిక 'అన్యోన్యం' అనే అర్థమిస్తుంది. తిట్టుకొను, కొట్టుకొను. ఒకేకర్త ఉంటే 'తనను తాను' అనే అర్థమిస్తుంది.
iii. ఇప్పటి భాషలో 'కొను' చేరినప్పుడే కొన్ని ధాతువులు బహుళ ప్రయోగంలో ఉన్నాయని గుర్తించాలి. ఉదా. పడుకొను, ఒప్పుకొను, తేరుకొను.

4. తెలుగు క్రియలను సమాపకాలని, అసమాపకాలని కూడా రెండుగా విభజించవచ్చు. సమాపకాలకు సాధారణంగా కాలబోధక ప్రత్యయాలూ పురుషవాచక ప్రత్యయాలూ చేర్తాయి. అసమాపకాలకు కాలబోధ ఉండవచ్చు; లేకపోవచ్చు. అవి ఉపవాక్యాల చివరగాని, ప్రధాన వాక్యంలో పదబంధాల స్థానంలోగాని వస్తాయి. క్రియాపదం ద్వారా సూచించవలసిన వ్యాపారం పూర్తయితే అది సమాపకం. లేదా అసమాపకం. అసమాపక క్రియలు వాడి వాక్యాలను అనంతంగా పొడగించవచ్చు.

5. చేయు మొదలైన క్రియలను అనుబంధంగా చేర్చి నామ విశేషణాలనుంచి క్రియలను నిష్పన్నం చేయవచ్చు. ఉదా. భయం →భయపడు, భయపెట్టు; పని →పనిచేయు; ఎర్ర →ఎర్రబడు; లో →లోబడు; వెంట →వెంటబడు; పరుగు →పరిగెత్తు.

6. 'ఇంచు' చేర్చి సంస్కృతనామపదాదులను తెలుగులో క్రియాపదాలుగా మార్చవచ్చు. ఉదా. సంతోషం →సంతోషించు; జయం →జయించు; స్తుతి →స్తుతించు.

7. హిందీ-ఉర్దూ క్రియారూపాల చివరి 'అనా' స్థానంలో 'ఇంచు' చేర్చి తెలుగులో క్రియలను సృష్టించవచ్చు. ఉదా. పిలానా →పిలాయించు; బజానా →బజాయించు.

8. ఇంగ్లీష్ నామపదాదులకు 'చేయు' వగైరాలను అనుబంధించి తెలుగులో క్రియారూపాలను సాధించవచ్చుగాని 'ఇంచు' వంటి ప్రత్యయాలు చేరవు. ఉదా. కాపీ--కాపీచేయు, కాపీకొట్టు; బౌల్, బౌలింగ్ →బౌల్ చేయు, బౌలింగ్ చేయు. హిందీ/ఉర్దూ నామపదాలను కూడా ఇదే విధంగా క్రియలుగా మార్చవచ్చు. ఉదా. ఖరాబ్-చేయు, రుబాబ్-చేయు. 'చెరిష్ →చెరిషించు' వంటి ఆధునిక కవితా

రూపాలకు శాస్త్ర గ్రంథ రచనలో చోటులేదు. అటువంటి రూపాలు తెలుగుకు అసహజం.

9. తెలుగు క్రియలకు రెండేసి రూపాలు సాధ్యం: ఒకటి భావరూపం; రెండు వ్యతిరేకరూపం. వ్యతిరేకార్థం సూచించే ప్రత్యేక శబ్దాలు వాడకుండానే, ప్రత్యయాల ద్వారా కూడా వ్యతిరేక క్రియలను సాధించవచ్చు. ఉదా. చేయు-అక → చేయక; తిను-అని → తినని.

10. సమాపక క్రియల చివర పురుషబోధక ప్రత్యయాలు ఏక, బహు వచనాల్లో చేర్తాయి. ప్రథమ పురుషలో మహత్తులకు ఏకవచనంలో 'డు', బహు వచనంలో 'రు', అమహత్తులకు ఏకవచనంలో 'ది', బహువచనంలో 'వి/(అ)యి' చేర్తాయి. ఉత్తమ, మధ్యమ పురుషల్లో మహత్తులని, అమహత్తులని రూపంలో భేదం లేదు. ఏక బహువచనాల్లో మధ్యమ పురుషలో క్రమంగా 'వు,రు'లు, ఉత్తమ పురుషలో అలాగే 'ను, ము/ం'లు చేర్తాయి. ఉదా. (ప్రథమ) చేశాడు, చేశారు, చేసింది, చేశాయి/చేసినవి; (మధ్యమ) చేశావు, చేశారు; (ఉత్తమ) చేశాను, చేశాము/చేశాం.

11. కింది పట్టికలో సమాపక క్రియారూపాలను గుర్తించవచ్చు (మచ్చుకు 'చేయు' ధాతురూపాలు మాత్రం).

| కాలం/అర్థం | వివరణ | భావరూపాలు | వ్యతిరేకరూపాలు |
|---|---|---|---|
| భూతం | జరిగిపోయింది | చేశాను-చేశాం | |
| | | చేశాడు-చేశారు | |
| | | చేసింది-చేశాయి | చేయలేదు |
| | | చేశావు-చేశారు | |
| వర్తమానం | జరుగుతున్నది | చేస్తున్నా(ను)-చేస్తున్నాం | |
| | | చేస్తున్నాడు-చేస్తున్నారు | |
| | | చేస్తున్నది-చేస్తున్నవి | చేయటం లేదు |
| | | చేస్తున్నావు-చేస్తున్నారు | |
| భూతేతరం/ | జరగనున్నది | చేస్తాను-చేస్తాం | ... చేయను-చేయం |
| తద్ధర్మార్థకం | జరిగిందికానిది | చేస్తాడు- చేస్తారు | ... చేయడు-చేయరు |
| | | చేస్తుంది-చేస్తాయి | ... చేయదు-చేయవు |
| | | చేస్తావు-చేస్తారు | ...చేయవు -చేయరు |

12. అసమాపక క్రియారూపాలను కింది పట్టికలో చూడవచ్చు.

12. అసమాపక క్రియారూపాలను కింది పట్టికలో చూడవచ్చు.

| అర్థం | వివరణ | భావరూపం | వ్యతిరేకరూపం |
|---|---|---|---|
| క్వార్థం ... | పూర్తికాని భూతం ... | చేసి ... | చేయక/చేయకుండా |
| శత్రర్థం... | పూర్తికాని వర్తమానం... | చేస్తూ/చేస్తా... | చేయకుండా |
| చేదర్థం... | జరిగితే, జరిగినప్పుడు... | | చేస్తే... చేయకపోతే |
| అప్యర్థం... | జరిగినప్పటికీ... | చేసినా.. | చేయకపోయినా |
| సామర్థ్యార్థం... | శక్తిని సూచించేది... | చేయగల ... | చేయలేని |
| కర్మణ్యర్థం... | కర్మప్రధానమైనది... | చెయ్యబడు... | చెయ్యబడని |
| సమీపభావి... | త్వరలో జరగనున్నది... | చెయ్యబోవు... | చెయ్యబోని |

13. విధి, అనుమతి, నిశ్చయం సూచించే క్రియా రూపాలు, ఉభయ ప్రార్థన వాక్యాంతంలో నిలిచి దాన్ని పూర్తి చేస్తాయి. వాటి వ్యతిరేక రూపాలను బ్రాకెట్లలో సూచించటం జరిగింది. ఉదా. (విధి) చెయ్యి (చెయ్యకు)-దీనికి గౌరవార్థంలో 'అండి' చేరుతుంది-చెయ్యండి (చెయ్యకండి); (అనుమతి) చేయవచ్చు (చేయకపోవచ్చు), చెయ్యనిచ్చు (చెయ్యనివ్వని), (నిశ్చయం) చెయ్యాలి (చెయ్యనక్కరలేదు, చెయ్యనవసరం లేదు); (ఉభయప్రార్థన) చేద్దాం (చెయ్యవద్దు)

14. ప్రత్యయాలు చేరినప్పుడు ధాతురూపాల్లో కింద పేర్కొన్న మార్పులు వస్తాయి:

i. విధ్యర్థంలో ధాతువులకు వచ్చే రూపభేదాలివి కొన్ని: ఉదా. తెచ్చు→తే; ఇచ్చు→ఇవ్వు,; వచ్చు→రా; చచ్చు→చావు; అగు/అవు→కా; పోవు→పో; లేచు→లే.

ii. చేయు, కోయు వంటి వాటికి విధ్యర్థంలో చెయ్యి, కొయ్యి వంటి రూపాలు వస్తాయి.

iii. అనుబంధ క్రియలుగా చేరిన 'ఉండు, కొను'లు క్రమంగా 'ఓ,కో' లుగా మార్తాయి. ఉదా. కూర్చుండు→ కూర్చో; చేసుకొను→ చేసుకో.

iv. ధాతువుల చివరి 'చు' విధ్యర్థంలో 'వు' గాగాని, 'వు' లేకుండా పూర్వాచ్చు దీర్ఘమైగాని, రెండు రకాల మారుతుంది. ఉదా. పిలుచు→పిలువు/పిలూ. కొన్ని సమయాల్లో 'వు' లోని అచ్చు లోపిస్తుంది. ఉదా. పిలువ్.

v. విధ్యర్థకాల ఏకవచన రూపాలకు 'అండి' చేర్చి బహువచన రూపాలు సాధించ వచ్చు; దీర్ఘాచ్చుల తరువాత 'అండి' లోని ఆకారం లోపిస్తుంది. ఉదా. పిలువు-అండి→పిలవండి; రా-అండి→రాండి.

vi. 'రా,పో' వంటి ధాతువులను రెండు సార్లు వాడితే, రెండోసారి వాడిన 'రా,పో'ల దీర్ఘం హ్రస్వమవుతుంది. ఉదా. రాండి-రాండి →రారండి; పోండి-పోండి →పోపొండి.

vii. అకారంతో మొదలయ్యే ప్రత్యయం చేరినప్పుడు, ధాతువు మధ్యనున్న 'ఉ'కారం బహువచనంలో అకారమవుతుంది. ఉదా. అరుచు-అండి →అరవండి; పలుకు-అండి →పలకండి.

viii. విధ్యర్థంలోని ఏకవచన రూపాలకు 'వద్దు/ఒద్దు' చేరినప్పుడు, దానికి ముందున్న హ్రస్వాచ్చు అకారంగా మారుతుంది; దీర్ఘాచ్చు మారదు. బహువచనంలో చేరే 'అండి' ప్రత్యయం 'వద్దు/ఒద్దు' కే చేరుతుంది గాని ధాతువుకు కాదు. ఉదా. చెయ్యి-వద్దు-అండి → చెయ్యవద్దండి/ చెయ్యొద్దండి; పో-వద్దు-అండి →పోవద్దండి.

xi. 'లేదు, రాదు' వంటివి చేర్చి వ్యతిరేకక్రియలను కల్పించేటప్పుడు ధాతువు చివరి ఉకారం ఆకారంగా మారుతుంది. ఉదా. చేయు-లేదు →చేయలేదు.

x. ఉభయప్రార్థనలో ధాతువు చివరి అచ్చు లోపించి, దాని ముందున్న హల్లు ప్రత్యయంలోని దకారంతో సమీకరణం పొందుతుంది. అయితే ధాతువు చివరి అచ్చు మకారం ఉంటే లోపించదు; నకారమంటే సమీకరణ జరగదు. ఉదా. చేయు-దాం →చేద్దాం; అమ్ము-దాం →అమ్మదాం; విను-దాం →విందాం.

xi. ధాతువు చివరి డకారం భూతరూపాల్లో ద్విత్వమవుతుంది. ఉదా. పడు-ఇనా-డు →పడ్డాడు; చెడు-ఇనా-ది →చెడ్డది.

xii. 'పోవు, అవు(ఆగు) ధాతువుల చివరి వకారం భూతకాలంలో యకారంగా మారుతుంది. ఉదా. పోవు-ఏ-డు → పోయాడు/పొయ్యాడు; అవు/ ఆగు-ఏ-డు →అయ్యాడు.

xii. 'లేదు' మొదలైన వాటి ముందు 'కలియు, పిలుచు' వంటి ధాతువుల మధ్య హల్లు ఆకారంగా, చివరి హల్లు వకారంగా మార్తాయి. ఉదా. కలియు-లేదు →కలవలేదు; పిలుచు-లేదు →పిలువలేదు.

xiv. భూతేతరకాలప్రత్యయాల ముందు ధాతువుల చివరి ద్విరుక్తహల్లు అద్విరుక్త మవుతుంది. వెళ్లు-తుంది. వెళు-తుంది →వెళ్తుంది. 'నట్టు, మెట్టు, మట్టు' వంటి కొన్ని తప్ప తక్కిన ధాతువుల చివరి ద్విరుక్తటకారం అద్విరుక్త డకారంగా మారుతుంది. ఉదా. నట్టుతుంది; కొడుతుంది.

xv. తకారాది ప్రత్యయాల ముందు 'ఇచ్చు, వచ్చు' వంటి ధాతువుల చివరి ద్విరుక్తచకారం, 'ఇంచు' చివర గల ధాతువుల బిందు పూర్వక చకారం నకారంగా మారుతాయి. ఉదా. వచ్చు-తుంది →వస్తుంది; చేయించు-తుంది →చేయిస్తుంది. ధాతువుల చివరి 'యు,చు'లకు గూడా ఈ సూత్రం వర్తిస్తుంది. ఉదా. కోయు-తున్నాడు → కోస్తున్నాడు; లేచు-తుంది →లేస్తుంది.

XVi. తకార, దకారాది ప్రత్యయాల ముందున్న 'అను, విను' మొదలైన ధాతువుల చివరి ఉకారం, 'పోయు-పోసు' వంటి ధాతువుల చివరి ఉకారం లోపిస్తాయి. ఉదా. అను-తాడు →అంటాడు; పోయు/పోసు-తాం →పోస్తాం.

XVii. తకారదకారాది ప్రత్యయాల ముందు 'పోవు' ధాతువు చివరి 'వు' లోపిస్తుంది. ఉదా. పోతుంది, పోదాం.

15. ధాతువులకు చేరే ప్రత్యయాలు కింది మార్పులు పొందుతాయి:
(అ) వ్యతిరేకార్థక ప్రత్యయాల ముందున్న 'అ' కారంగాని, ఇతర ప్రత్యయాల ముందున్న అచ్చులుగాని ధాతువు చివర దీర్ఘాచ్చుంటే లోపిస్తాయి. ఉదా. రా-అని →రాని; పో-అక →పోక; పో-ఇతే →పోతే.
(ఆ)ధాతువు చివరి 'అ(న్)' తరవాత ప్రత్యయాల మొదటి పరుషాలు సరళాలుగా మారుతాయి. ఉదా. చేయ-కల →చేయగల.
(ఇ) భూతకాల ప్రత్యయం 'ఇనా' లోని దీర్ఘం 'అను,కొను' వంటి ధాతువుల తరవాత అమహత్తుల్లో హ్రస్వమవుతుంది. ఉదా.అను-ఇనాది →అన్నది.
(ఈ) తద్ధర్మార్థక ప్రత్యయమైన 'తున్/తా'లోని తకారం 'అను,కొను' వంటి నకారాంత ధాతువుల తరవాత టకారంగా మారుతుంది. ఉదా. అను-తున్-ది →అంటుంది; విను-తా-రు →వింటారు.

16. ధాతువుకు భూతార్థంలో 'ఇన', తద్ధర్మార్థంలో 'ఏ(టి)', వర్తమానార్థంలో 'తున్న', 'వ్యతిరేకార్థంలో 'అని' చేరి క్రియావిశేషణాలు ఏర్పడతాయి. ఉదా. చేయు-ఇన →చేసిన; చేయు-ఏ(టి) →చేసే(టి), చేయు-తున్న →చేస్తున్న, చేయు-అని →చేయని.

17. 'అను, విను, పడు, చెడు' వంటి ధాతువులకు 'ఇన' చేరినప్పుడు సంధి వల్ల 'అన్న, విన్న, పడ్డ, చెడ్డ' వంటి క్రియావిశేషణాలు వికల్పంగా ఏర్పడతాయి. సంధి జరక్కపోతే ' అనిన, వినిన, పడిన, చెడిన' వంటి రూపాలుంటాయి. మొదటి రూపాలు నేటివి. వాటినే వాడండి.

18. క్రియాజన్య విశేషణాల మీద అవ్యయాలు చేరినప్పుడు వచ్చే విశేషార్థాలను వ్యవహారం నుంచి గ్రహించండి. ఉదా. చేసే-సరికి, చేసే-వరకు, చేసే-ముందు, చేసే-లాగా, చేసే-దాకా; చేసిన -తరువాత.

19. క్రియావిశేషణాల మీద చేరిన అవ్యయాల తొలి అచ్చు, దీర్ఘాచ్చు తరవాత లోపిస్తుంది. ఉదా. చేసే-అట్టు/అట్లు →చేసేట్టు-చేసేట్లు. అజాది అవ్యయాలకు ముందు పెచ్చుగా 'టు' చేరటం కూడా కద్దు. ఉదా. చేసే-అట్లు →చేసేటట్లు/చేసేట్లు.

20. క్రియాజన్య విశేషణాల మీద సర్వనామపదాలు చేర్చి సార్వనామిక విశేష్యాలను కల్పించవచ్చు. వీటితో పురుషబోధ చేయవచ్చుగాని కాల బోధ సాధ్యం కాదు. తెలుగులో ఈ పద్ధతి ప్రత్యేకం-ప్రచురం ఉదా. వచ్చే-వాడు; వచ్చిన -అది → వచ్చినది/వచ్చింది మొ. నామ, సర్వనామాలకు లాగానే ఈ పదాలకు పురుష బోధతో అన్ని విభక్తుల్లోనూ రూపాలుంటాయి. ఉదా. వాడు వచ్చేవాడు, వారు వచ్చేవాళ్లు; ఆమె / అది వచ్చేది, అవి వచ్చేవి; నీవు వచ్చేవాడివి, మీరు వచ్చేవారు; నేను వచ్చేవాడిని, మేం వచ్చేవాళ్లం, వచ్చేదాన్ని, వచ్చేవారితో, వచ్చేదానికి, మొ. ఈ మాటలను అన్ని కాలార్థాల్లోనూ ప్రయోగించవచ్చు. ఉదా. నిన్న వచ్చేది, నేడు వచ్చేది, రేపు వచ్చేది, ఎప్పుడూ వచ్చేది.

21. ఉండు' ధాతురూపాలు 'ఉన్నాడు, ఉన్నది' వంటివి భూత, వర్తమానాలు రెంటినీ సూచిస్తాయి. ఉదా. వాడు (నిన్న) ఉన్నాడు; వాడు (ఇప్పుడు)ఉన్నాడు.

22. క్రియారూపాలు తెలిసినప్పుడు నామవాచకాలమీద 'ఇచ్చు' వంటివి చేర్చి సిద్ధం చేసిన క్రియాపదాలు వాడకండి. ఉదా. రక్షించాలి (రక్షణ ఇవ్వాలి-అనవసరం); అభిలపిస్తుంది (అభిలాషపడుతుంది).

23. సంస్కృతనామాలకు 'ఇంచు' చేర్చి సిద్ధంచేసిన క్రియారూపాల విషయంలో కొన్ని సందర్భాల్లో మాత్రమే నామరూపంలోని దీర్ఘాచ్చు హ్రస్వమవుతుంది. నిఘంటువులు చూసి తెలుసుకోండి. ఉదా. ఉదాహరణ (నామరూపం) → ఉదాహరించు (ఉదహరించు-కాదు); కానీ, నిర్ధారణ → నిర్ధరించు, అభిలాష → అభిలషించు.

24. ధాతురూపాల చివర హ్రస్వాచ్చుంటే 'అ' చేర్చి, దీర్ఘాచ్చుంటే 'ను' చేర్చి ప్రార్థనాద్యర్థకాలను సాధించవచ్చు. ఉదా. (నీకొంప) కూలు - అ →కూల; (నీఇల్లు బంగారం), కా-ను →కాను; అకర్మకధాతువుల క్త్వార్థక రూపాల చివర 'పోను' చేర్చి కూడా ఈ అర్థం సాధించవచ్చు. ఉదా. (నీతెలివి) మండిపోను.

25. 'వస్తే పోతి(ని), చేస్తే(ని)' వంటి భూతకాలరూపాలు అరుదుగా వాడుకలో ఉన్నాయి. కాని వాటిని వీలయినంతవరకు వాడకండి.

26. 'ఎరుగు, చెడు, జంకు, జడియు, తగు, వచ్చు, బెదురు' వంటి ధాతువులకు విధ్యర్థంలో ప్రయోగం లేదు. వ్యవహారం బట్టి గుర్తించండి.

27. కొన్ని ధాతువుల చివర ఆత్మార్థకమైన 'కొను' అనే సహాయక క్రియను చేర్చందే విధ్యర్థంలో ప్రయోగించటం నేటి తెలుగులో సాధ్యపడదు. ఉదా.తెలియు-కొను →తెలుసుకో.

# 13. వాక్యరచన

1. తెలుగు వాక్యాలు ముఖ్యంగా రెండు రకాలు: i. క్రియారహితాలు, ii. క్రియాసహితాలు. క్రియారహితంగా వాక్యాలు రాయటం నామాఖ్యానం; సహితంగా రాయటం క్రియాఖ్యానం.ఉదా. అది చెట్టు-ఇందులో క్రియా పదం లేదు కాబట్టి నామాఖ్యానం; వాడు వచ్చాడు-క్రియా పదం ఉంది కాబట్టి ఇది క్రియాఖ్యాతం. వాక్యంలో క్రియాపదం ఉండి తీరాలనే నియమం తెలుగులో లేదని గుర్తించండి.

2. ఒకే పదార్థాన్ని బోధించే రెండు నామాలను (నిర్మాణం బట్టి సర్వనామ, విశేషణాలు కూడా నామపదాల వంటివే) ఒకే చోట చేర్చి క్రియా రహిత వాక్యాలు నిర్మించవచ్చు. వాటిలో మొదటిది ఉద్దేశ్యం; రెండోది విధేయం. మొదటిది సర్వనామం విశేషణంగా ఉన్న నామ వాచకం గాని, విశేషనామం గాని కావచ్చు. రెండోది సిద్ధనామం గాని, విశేష నామంగాని, విశేషణాదుల నుంచి నిష్పన్న మైన నామంగాని కావచ్చు.

3. విశేషణాదులకు మహద్వాచకంలో 'వాడు, వారు/వాళ్లు', అమహత్తులో 'ది,వి' చేరి ఏర్పడ్డ నామవాచకాలు నామాఖ్యానంలో వాక్యాన్ని ముగిస్తాయి. ఉదా. (వాడు) మంచివాడు; (అది) మంచిది.

4. ఉత్తమ, మధ్యమ పురుష సర్వనామాలు ఉద్దేశ్యాలుగా ఉన్నప్పుడు విధేయనామ(వాచక)ం చివర పురుషప్రత్యయాలు చేర్చి వాక్యాన్ని పూర్తి చేయవచ్చు. ఉదా. (నేను) మనిషిని; (నీవు) పెద్దవాడివి.

5. క్రియారహిత వాక్యాలను ఉప వాక్యాలుగా ప్రయోగించినప్పుడు 'ఆగు' ధాతురూపాలను కూడా అనుబంధించవచ్చు. ఉదా. వాడు పేదవాడయినా గుణంలో పెద్ద వాడే.

6. విధేయనామం చివర 'కాదు' చేర్చి అన్ని పురుషల్లోను వ్యతిరేక రూపాలు కల్పించవచ్చు. ఉదా. వాడు మంచివాడు కాదు, ఆమె చెడ్డది కాదు; నీవు దుర్మార్గుడివి కాదు, మీరు ధనవంతులు కారు; నేను పిరికి వాణ్ని కాదు, మేం భయపడే వాళ్లం కాదు.

7. విశేషణ వాక్యాల్లోని క్రియలను విశేషణాలుగా మార్చేటప్పుడు విభక్తులు కూడా లోపిస్తాయి. ఈ విధమైన రచన తెలుగు భాషకు సహజం. ఉదా. వాడు పని చేశాడు → వాడు చేసిన పని; ఆమె పూలు కొన్నది →ఆమె కొన్న పూలు.

8. క్రియా విశేషణాల మీద కొన్ని అవ్యయాలు చేరినప్పుడు కూడా క్రియా విశేషణాలే వాక్య విశేషణాలే ఏర్పడుతాయి. ఉదా. చేసే-అందుకు →చేసేందుకు/చేసేటందుకు;

ఆమె విన్న-అప్పుడు →ఆమెవిన్నప్పుడు; నీవు-అన్న-అటు →నీవన్నట్లు.

9. విశేషణాలనుంచి నామవాచకాలూ సర్వనామ రూపాలూ కల్పించి వాక్యరచనలో వాడటం తెలుగు భాషకు సహజం. ఉదా. ఆపిల్ల మంచిది (←మంచి-అది); ఈ బొమ్మ నీది (←నీ-అది).

10. వాక్యానికి 'అది' చేర్చి క్రియను విశేషణంగా మార్చవచ్చు. వాక్య రచనలో ఈ పద్ధతి తెలుగుకు సహజం. ఉదా. వారు-ఊరు వెళ్ళారు-అది →వారు వెళ్లింది ఊరు; అలాగే, చెప్పింది మాట, చేసింది పని.

11. 'ఉండు' ధాతురూపాలను వాడకుండా క్రియారహిత వాక్యాలు రాయటమే తెలుగు భాషకు సహజం. (ఇంగ్లీషులో 'be', హిందీ/ఉర్దూలో 'హై' లేకుండా చేసిన వాక్యరచన అసహజం. ఆపద్ధతి తెలుగులో నప్పదు. ఉదా. ఆమెకు సిగ్గు ఎక్కువ; ఆయనకు గర్వం తక్కువ.

12. 'లే' ధాతువు చివర క్రియా విభక్తులు చేర్చి వ్యతిరేక వాక్యాలు రాయవచ్చు. ఉదా. ఆయనకు పిల్లలు లేరు; ఆ ఊరికి సరైన దారి లేదు.

13. క్రియా సహిత వాక్యాలు రెండు రకాలు: i. కర్త ఉన్నవి, ii. కర్త లేనివి. వాటినే క్రమంగా కర్తృ సహిత, కర్తృ రహిత వాక్యాలంటారు.

14. క్రియా పదాల స్వభావాన్ని బట్టి అకర్మక, సకర్మక, ప్రేరణార్థక వాక్యాలని కర్తృ సహిత వాక్యాలు మూడు విధాలు. ఉదా. (అకర్మక వాక్యం) వాడు నిద్రపోతున్నాడు (ఇందులో కర్మలేదు); (సకర్మకవాక్యం) ఆమె అన్నం తిన్నది (ఇందులో 'అన్నం' కర్మ); (ప్రేరణార్థక వాక్యం) ఆమె పాపను నిద్రపుచ్చింది ( ఇందులో కర్తను- 'ఆమె' ను-ప్రేరేపించే నామవాచకం-'నిద్ర'-ఉంది).

15. అకర్మక క్రియ అప్రేరణంలో ఉంటే దాని కర్తృ పదానికి 'ను' (ద్వితీయా ప్రత్యయం), సకర్మక క్రియ అదే అర్థంలో ఉంటే దాని కర్తను 'చేత' (తృతీయా ప్రత్యయం) చేర్తాయి. ఉదా. ఆమె అతన్ని ఆడిస్తున్నది (ఆడు-అకర్మకం); ఆమె అతని చేత ఆటలాడిస్తున్నది (ఆటలాడించు-సకర్మకం).

16. కర్మ లేని వాక్యాల్లో 'ఉంది' అనే క్రియారూప ముంటుంది. అటు వంటి వాక్యాల్లో దేహ, మన స్థితులను బోధించే నామవాచకాలుంటాయి; 'గా' అనే అవ్యయం వాటికి చేరుతుంది. ఉదా. వాడికి ఆకలిగా ఉంది; ఆమెకు దుఃఖంగా ఉంది.

17. సాధారణంగా తెలుగు వాక్యాల్లో 'కర్త-కర్మ-క్రియలు'లు వరసగా వస్తాయి. (ఇంగ్లిషు క్రమం కర్త-క్రియ-కర్మ). తెలుగులో నామవాచకాలకు ముందే విశేషణాలుంటాయి. కర్తకు తరవాత, క్రియకు ముందు, క్రియావిశేషణాలుంటాయి. ఈ క్రమాన్ని

మార్చి ప్రాధాన్య వివక్ష చేయవచ్చు. అలాగే క్రియాపదాన్ని నామవాచకంగా మార్చి, విధేయ స్థానంలో క్రియేతరపదాన్నో పదబంధాన్నో వాడి కూడా ప్రాధాన్య వివక్ష చేయవచ్చు. ఉదా. అతడు నిన్న ఊరినుంచి వచ్చాడు. అతడు ఊరినుంచి నిన్న వచ్చాడు; నిన్న ఊరినుంచి అతడు వచ్చాడు; అతడు ఊరినించి వచ్చింది నిన్న; అతడు నిన్న వచ్చింది ఊరినించి; నిన్న ఊరినించి వచ్చింది అతడు. పై వాక్యాల్లో కిందిగీతలున్నవి ప్రాధాన్యం సంపాదించినవి.

18. కర్తకు వ్యాపారాన్ని ఆదేశించి రాసేవాక్యాలు విధివాక్యాలు. అవెప్పుడూ తద్ధర్మార్థకాలుగానే ఉంటాయి. వాక్యంలోని కర్త ఎప్పుడూ మధ్యమ పురుష కర్తృకంగానే ఉంటుంది. కర్తృపదం లేకుండా చెప్పినా అది అంతే. క్రియాపదం ఎప్పుడూ ధాతురూపంలోనే ఉంటుంది. ధాత్వంతాలు రూపభేదాలతో ఉండవచ్చు. ఉదా. (నీవు)రా, అటు (నీవు)పో. 'చేయు, కోయు' వంటి ధాతువుల చివరి 'యు' ద్విరుక్తమై ఇకారాంత మవుతుంది; దానికి ముందున్న దీర్ఘాచ్చు హ్రస్వమవుతుంది. ఉదా. చేయు →చెయ్యి; కోయు →కొయ్యి. పక్షాంతరంలో ధాతువు చివరి అచ్చు లోపిస్తుంది; దాని ముందున్న దీర్ఘాచ్చు పొట్టిదవుతుంది. ఉదా. చేయు → చెయ్, కోయు →కొయ్. 'రాయు' చివరి యకారానికి ద్విరుక్తి రాదు; తొలి దీర్ఘాచ్చు హ్రస్వం కాదు; ధాతువు చివరి ఉకారం ఇకార మవుతుంది. రాయు →రాయి.

19. విధివాక్యాల్లో మూడక్షరాల ధాతువు మధ్యనున్న ఇకారం ఉకారం గాను, చివరి 'చు,యు'-లు 'వు' గాను మార్తాయి. ఉదా. కలియు →కలువు; పిలుచు →పిలువు.

20. కొన్ని వాక్యాల్లో విధ్యర్థకరూపాలు లేకుండానే విధిబోధ సాధ్యం. ఉదా. మీరు మాయింటికి రావాలి; తమరిక (బయటికి) దయచేయవచ్చు.

21. తెలుగు వాక్యాల్లో కర్తరిప్రయోగాలే సహజం. అయినా ఇతరభాషల ప్రభావంవల్లనూ, ఒక్కోసారి కర్తృత్వాన్ని అస్పష్టంగా ఉంచదలిస్తేనూ, కర్తృపదాన్ని విధేయంలో భాగంచేసి కర్మణి ప్రయోగం చేయవలసి రావచ్చు. కర్త ప్రాధాన్యం తగ్గించి, విషయప్రాధాన్యం పెంచదలచి రావచ్చు. కర్త ప్రాధాన్యం తగ్గించి, విషయప్రాధాన్యం పెంచదలచినప్పుడు మాత్రమే కర్మణి వాక్యాలు రాయండి. అనివార్యమైతేనే ఈ తీరు రచన చేయండి. ఉదా. (కర్తరి) ఎల్లయ్య పుల్లయ్యను చంపేడు; (కర్మణి) పుల్లయ్యచేత ఎల్లయ్య చంపబడ్డాడు. 'చంపే'డని రాసినందువల్ల న్యాయసంబంధమైన చిక్కులో ప్రమాదాలో తప్పవనుకుంటేనే కర్మణి ప్రయోగం చేయండి. ఇలాంటి సందర్భాల్లో కూడా 'చంపే డంటున్నారు, చంపేడట, చంపేడేమో' వంటి రచనాపద్ధతుల ద్వారా కర్మణి ప్రయోగం మానవచ్చు. సందిగ్ధ వాక్యంవల్ల చట్టరీత్యా ప్రమాదం లేదు. 'బురెట్టులో నీళ్లు పోసి ప్రయోగం చేయండి' అనటం

కన్నా 'బురెట్టులో నీళ్లు పోయబడ్డవి. ప్రయోగం చేయబడ్డవి' అని, మక్కీకిమక్కీ ఇంగ్లీషు వాక్యపద్ధతిని అనుసరించినందువల్ల శాస్త్ర విజ్ఞానం పెరగదు; శాస్త్ర ప్రసంగం అశాస్త్రీయం కాదు.

22. 'ఏది... అది, ఎవరైతే ... వారు' లాంటి సర్వనామరూపాలు వాడి యత్తదర్థక వాక్యాలు రాయటం అన్యభాషా ప్రభావంవల్ల వచ్చిన అలవాటేగాని, తెలుగు భాషకు సహజసిద్ధం కాదు. ఇతర వాక్యరచనా పద్ధతులద్వారా సాధ్యం కానప్పుడూ, అస్పష్టతను తొలగించటానికీ, మాత్రమే యత్తదర్థక ప్రయోగం చేయవచ్చు. ఉదా. ఎవరు తవ్విన గోతిలో వారే పడతారు (ఎవరైతే గొయ్యి తవ్వారో వారే - అని రాయవద్దు).

23. అసమాపక క్రియలతో ఉపవాక్యాలు సంఘటిస్తే, సామాన్య వాక్యాలు సంశ్లిష్ట వాక్యాలవుతాయి. ఉదా. వాడు వచ్చాక వీడు పొయ్యాడు- అనేది సంశ్లిష్టవాక్యం. 'వాడు వచ్చాడు; వీడు పొయ్యాడు, అనే రెండు సామాన్య వాక్యాలతో ఇది సమానం.

24. రెండు క్రియాపదాలకు ఒకే కర్త ఉన్న వాక్యాల్లో (=సమాన కర్తృక వాక్యాల్లో) మొదటి క్రియ క్త్వార్థకమో శత్రర్థకమో కావచ్చు. ఉదా. హనుమంతుడు పిడికిలి బిగించి దెబ్బకొట్టాడు (ఇక్కడ 'బిగించి' క్త్వార్థకం); ఆమె నవ్వుతూ మాట్లాడుతుంది (ఇక్కడ 'నవ్వుతూ' శత్రర్థకం).

25. కొన్ని సమయాల్లో (వ్యతిరేక) క్త్వార్థకరూపంలో ఉన్న క్రియాపదాన్ని హేత్వర్థంలో వాడవచ్చు. ఉదా. వాడు రోగంవచ్చి పీక్కుంటున్నాడు (రోగంతో-అని అర్థం); అతగాడు లంచాలు తిని పొట్టపెంచాడు (తినడం వల్ల, తినటం ద్వారా -అని అర్థం); అలాగే వాడు 'తిండిలేక అలమటిస్తున్నాడు' అనవచ్చు (లేనందువల్ల - అని అర్థం).

26. వాక్యాల్లో క్త్వార్థకాలు వాడి కొన్ని సందర్భాల్లో కాలబోధ సాధించవచ్చు. ఉదా. వాడు వచ్చి పదిరోజులయింది; ఆమె పొద్దెక్కి నిద్ర లేస్తుంది; వానలు పడి పంటలు పండేయి.

27. క్త్వార్థకాలను పునరుక్తం చేసి భావతీవ్రతను, వ్యతిరేక క్త్వార్థకాలను పునరుక్తం చేసి కాలదీర్ఘతను వాక్యాల్లో సూచించవచ్చు. ఉదా. చెప్పి చెప్పి ప్రాణం విసిగిపోతున్నది; పడక పడక ఇప్పటికి వానలు పడ్డాయి.

28. కర్త జడవాచకమైతే, వాక్యంలో క్త్వార్థకం వాడి పరిణామం సూచించవచ్చు. ఉదా. అద్దం పడి పగిలిపోయింది; పాళీ విరిగి కలం రాయటం లేదు.

29. ఏకకర్తృక క్రియలున్న వాక్యంలో శత్రర్థక క్రియను ఉపవాక్యంలో వాడి ప్రధాన

క్రియ సూచించే వ్యాపారాన్ని నిరూపించవచ్చు. ఉదా. ఆమె ఎప్పుడూ నవ్వుతూ పలకరిస్తుంది; ఆయన తింటూ మాట్లాడతాడు.

30. విరుద్ధవ్యాపారంగల క్రియలతో రెండు సామాన్య వాక్యాలను కలిపి ఒకే సంశ్లిష్టవాక్యం రాయవచ్చు. అప్పుడు అప్యర్థక క్రియలతో ఉపవాక్యాలు రాయవలసి వుంటుంది. ఉదా. వాడు వస్తాడు. వీడుపోతాడు--వాడు వచ్చినా వీడు పోతాడు: వాడు రాడు, ఆమె వస్తుంది--వాడు రాకపోయినా ఆమె వస్తుంది.

31. ఒకదానిమీద మరోటి ఆధారపడిన రెండు వ్యాపారాలను బోధించే వాక్యంలో మొదటి క్రియ చేదర్థకంగా ఉండవచ్చు. ఉదా. నన్నడిగితే సమాధానం చెప్తా; ఊరెళ్తే ఆ పని చేసుకొస్తా.

32. ఒక వాక్యంలోని క్రియాపదాలను నామీకరించి (=నామవాచకంగా మార్చి) వాటిని మరో వాక్యంలో కర్తగానో, కర్మగానో వాడవచ్చు. దీనికి 'అనుకృతి' అని పేరు. ప్రత్యక్షం, పరోక్షం అని ఇది రెండు విధాలు. ఒక రన్నమాటలను తాను గాని, మరో వక్తగాని, తిరిగి చెప్తే అది అనుకృతి. ప్రత్యక్షానుకృతిలో మొదటి వక్త మాటలు శబ్ద ప్రధానంగా అనుకృత మవుతాయి. పరోక్షానుకృతిలో ఆ మాటల అర్థం మాత్రమే అనుకృత మవుతుంది. రెండు సందర్భాలలోనూ అనుకృతపదాల చివర 'అని' వైకల్పికంగా చేరుతుంది. ఉదా. (ప్రత్యక్షం) రామయ్య 'నామాట వినూ' (అని) అన్నాడు; (పరోక్షం) రామయ్య తన మాట వినమన్నాడు/ వినమని అన్నాడు. ఇక్కడ 'నా' అనే సర్వనామం 'తన'గా మారటం గమనించండి.

33. ప్రత్యక్షానుకృతిలోని ఉత్తమ పురుష సర్వనామాలు ప్రథమ పురుషలోకి మారినా (నా →తన), క్రియావిభక్తుల్లో మార్పు రాదు. 'అను' ధాతువుకు ముందు 'అని' ఉండవచ్చు, లేకపోవచ్చు. ప్రత్యక్షానుకృతిలో శబ్దాలు గాని, అర్థరహిత ధ్వనులుగాని, చేష్టలుగాని, అన్యభాషావాక్యాలు గాని ఉండవచ్చు. ఉదా. నేనా డబడబలు సహించలేను; రామయ్య ఆ కిచకిచలు సంగీతమే నంటున్నాడు; రామారావు 'ఐసీ' అని పొడిపొడిగా మాట్లాడేడు.

34. పరోక్షానుకృతిలో తెలగుభాషా వాక్యాలే ఉంటాయి. ఈ పద్ధతి వాక్య రచనలో విధివాక్యాదు లుండవచ్చు గాని కొన్ని మార్పులు జరుగుతాయి. ఉదా. రాముడు సీతను ఈ పని చెయ్యమన్నాడు.

35. అనుకృతవాక్యంలోని కర్త లోపించవచ్చు. ప్రధానవాక్యంలోని అముఖ్య కర్మకు 'ని/ను' వికల్పంగా చేరుతుంది. క్రియకు చివర 'అమ్' చేరుతుంది. ఉదా. ఈమాట (ను) చెప్పమని సూచించు.

36. అనుకృతి లేని వాక్యాలను కూడా 'అని' చేర్చి విషయార్థం బోధిస్తూనో, కాంక్షను సూచిస్తూనో రాయవచ్చు. ఉదా. ఆమెకు పెళ్లయిందని విన్నా; వాడుత్తసన్న్యాసని నాకు తెలుసు; ఆమెకు కొత్తచీర కొనాలని ఉంది; ఆయనకు గొడుగు కొంటే చాలనిపిస్తున్నది.

37. 'అని' చేర్చిరాసిన వాక్యాలు కొన్ని హేత్వర్థకాలుగా ఉంటాయి. ఉదా. నేను కొండ మీది కోతిని తేలేదని ఆమె అలక, సకాలంలో మందు తీసుకోలేదని రోగం తిరగబెట్టింది.

38. విషయార్థం బోధిస్తూ వాక్యం చివర 'అది' చేర్చి నామీకరించి రాయవచ్చు. కాని సందర్భాన్ని బట్టి వ్యవహారంతో సరిపోల్చుకొని భిన్నార్థాలను గ్రహించాలి. ఉదా. నువ్వేమి తిన్నదీ నాకు తెలుసు (1. తిన్నపదార్థం, 2. తినలేదనే సూచన).

39. క్రియాపదాన్ని భావార్థకంగా మార్చి ప్రాధాన్య వివక్షచేస్తూ వాక్యం రాయవచ్చు. ఉదా. నీవెప్పుడు వచ్చావ్? → నీవు వచ్చింది/రావటం ఎప్పుడు? (మొదటి దాంట్లో వ్యక్తికీ, రెండో దాంట్లో రాకకూ ప్రాధాన్యం).

40. సమాపక క్రియల స్థానంలో భావార్థకాలు వాడి వాక్యరచన చేయవచ్చు. ఉదా. ఆమె పాడుతుంది/పాడగలదు → ఆమెకు పాడటం వచ్చు.

41. క్రియను విశేషణంగా మార్చి కూడా వాక్యరచన చేయవచ్చు. ఉదా. ఆయన పూలు తెచ్చాడు. వాటితో ఆమె దండ అల్లింది →ఆయన తెచ్చిన పూలతో ఆమె దండ అల్లింది.

42. ప్రశ్నార్థక వాక్యాలను వెంటవెంటనే రాసి సముచ్చయార్థం, వికల్పార్థం సూచించవచ్చు. ఉదా. ఆమె ఎప్పుడు వచ్చింది? ఎక్కడుంది? ఏం చేస్తున్నది? మాట్లాడుతుందా? లేదా?

43. అసమాపక క్రియలతో సుదీర్ఘవాక్యాలు రాయవచ్చుగాని, రాయవద్దు. ఉదా. వాడన్నాడని, వీడుచెప్పాడని, తెలిసిందని... అన్నం తినక, నీళ్లు తాగక, నిద్రపోక....

44. మహావాక్యాలు తప్పనిసరైతే తప్ప రాయవద్దు. చిన్న చిన్న వాక్యాలు రాస్తే తొలగించటం, తిరగరాయటం, కుదించటం తేలిక. మహావాక్య రచనలో కర్త కర్మ, క్రియల పునరుక్తి, అన్వయలోపం మొదలైన తప్పులకు ఆస్కారం మెక్కువ.

# 14. విరామ చిహ్నాదులు

పత్రికల్లో వాడే సంకేతాలు, సంఖ్యలు, విరామ చిహ్నాలూ ఎన్నో ఉండవు. కింద సూచించిన జాగ్రత్తలు తీసుకుంటే చాలు:

1. ఏ వాక్యాన్నీ, పేరానూ అంకెలతో మొదలు పెట్టవద్దు.
2. అంకెలతో కొంత, అక్షరాలతో కొంత సంఖ్యా వాచకాలు చెప్పవద్దు. ఉదా: '11 వేల నలభై ఏడు' కాదు. '11,047' అనిగాని, 'పదకొండు వేల నలభై ఏడు' అనిగాని రాయాలి. 'పదకొండు వేల 47' పచ్చి తప్పు.
3. 'లక్షలు, కోట్లు' అనేవాటి వాడుక తగ్గించి మిలియన్లలో దశాంశపద్ధతిలో రాయండి. నేటి చట్టం ప్రకారం ఇంచ్-పౌండ్ పద్ధతి నిషిద్ధం. ఉదా: '11 కోట్ల 3 లక్షల 46 వేలు' అని రాయవద్దు. '111.346 మిలియన్లు' అని గాని, 'నూట పదకొండు మిలియన్లకు మించిన' అనిగాని రాయాలి.
4. మైళ్లు, ఫర్లాంగులు, గజాలు, అడుగులు, అంగుళాలు వాడటం శిక్షార్హం. (కిలో) మీటర్లలోకి, సెంటిమీటర్లలోకి పరివర్తనం చేయకతప్పదు. అవసరమైతే జంత్రీ (reckoner) వాడండి.
5. ఉష్ణోగ్రత, తూకాలు, కొంతలు-అన్నీ దశాంశమానంలోనే ఉండాలి.
6. ఇతరుల మాటలు ఎత్తి రాసేటప్పుడు -ముఖ్యంగా శీర్షికల్లో -రెండు కామాలు తలకిందులుగా రాయండి. ఒకరు చెప్పిన మాటల్లో మరొకరి మాటలు మధ్యలో కలిస్తే అలా కలిసిన వాటిని ఒక్క inverted comma తో సూచించండి.
7. శీర్షికల్లోగాని, ఇతరత్రాగాని వక్తపేరు కూడా సూచించదలిస్తే డాష్ (-) బదులు కోలన్ (:) వాడండి.
8. ఒక ఉపన్యాసం పూర్తి అయిన తరువాతగాని, భిన్న వ్యక్తుల, వస్తువుల, బిరుదుల పేర్లు వరసవరసగా వచ్చినప్పుడుగాని కామా తప్పక వాడాలి.
9. వీలయినంత వరకూ సంక్షిప్తరూపాలు (abbreviations) మొదటిసారి వాడరాదు. ముఖ్యంగా శీర్షికల్లో వాడవద్దు. మొదట పూర్తి వివరం ఇచ్చినప్పుడు బ్రాకెట్లలో సంక్షిప్తరూపం సూచించి, ఆ మీదట సంక్షిప్తరూపం ఎన్నిసార్లయినా వాడవచ్చు.
10. సుదీర్ఘ వాక్యాలు రాసేపని లేదు కాబట్టి, వాక్యం మధ్యలో (;), (:) వంటివి వాడనక్కరలేదు.
11. కులాల, మతాలపేర్ల వాడుకలో నేటి సంప్రదాయాన్ని చట్టం ప్రకారం అనుసరించండి లేదా శిక్ష తప్పకపోవచ్చు. ఉదా: 'మాలమాదిగలు' తప్పు; 'హరిజన' అన్నే రాయాలి. 'తురక' తప్పు; 'ముస్లిం' అనితీరాలి.

# 15. సాధారణ పదాలు (భిన్నభాషాభాగాల్లో)

వార్తాసంస్థల వాడుకలో మామూలుగా వచ్చే కొన్ని ఇంగ్లిష్ మాటలకు తెలుగులో క్రియారూపాలు, నామ(వాచక) రూపాలు, విశేషణరూపాలు కొన్ని కింది విధంగా ఉంటాయి:

| *ఇంగ్లిష్(క్రియ)* | *క్రియ* | *నామం* | *విశేషణం* |
|---|---|---|---|
| acquiesce | సమ్మతించు | సమ్మతి | సమ్మతం |
| act | ప్రవర్తించు | ప్రవర్తన | ప్రవర్తితం |
| add | చేర్చు, కూర్చు | చేర్పు, కూర్పు | చేర్చిన, కూర్చిన |
| address | ప్రసంగించు | ప్రసంగం | ప్రసక్తం |
| admit | ఒప్పుకొను | ఒప్పుకోలు | ఒప్పుకొన్న |
| advise | సలహా ఇచ్చు | సలహా | సలహా ఇచ్చిన |
| advocate | వాదించు | వాదన | ఉక్తం, వివదితం |
| affirm | నిర్ధరించు | నిర్ధారణ | నిర్ధారితం |
| | ధ్రువీకరించు | ధ్రువీకరణ | ధ్రువీకృతం |
| agree | అంగీకరించు | అంగీకారం | అంగీకృతం |
| allege | ఆరోపించు | ఆరోపణ | ఆరోపితం |
| announce | ప్రకటించు | ప్రకటన | ప్రకటితం |
| answer | సమాధానించు | సమాధానం | సమాధానితం |
| approve | ఆమోదించు | ఆరోపణ | ఆరోపితం |
| argue | చర్చించు | చర్చ | చర్చితం |
| | తర్కించు | తర్కం | తర్కితం |
| ask | అడుగు | అడగటం | అడిగిన |
| | ప్రశ్నించు | ప్రశ్న | ప్రశ్నించిన |
| assent | ఆమోదించు | ఆమోదం | ఆమోదితం |
| attest | ప్రమాణీకరించు | ప్రమాణీకరణ | ప్రమాణీకృతం |
| boast | ప్రగల్భించు | ప్రగల్భం | ప్రగల్భితం |
| caution | హెచ్చరించు | హెచ్చరిక | హెచ్చరించిన |
| charge | ఆరోపించు | ఆరోపణ | ఆరోపితం |
| comment | వ్యాఖ్యానించు | వ్యాఖ్యానం | వ్యాఖ్యాతం |
| complain | మొరబెట్టు | మొర | మొరబెట్టిన |
| | ఫిర్యాదుచేయు | ఫిర్యాదు | ఫిర్యాదుచేసిన |

| | | | |
|---|---|---|---|
| concede | ఒప్పుకొను | ఒప్పుకోలు | ఒప్పుకొన్న |
| | అనుకూలించు | అనుకూలం | అనుకూలితం |
| conclude | ముగించు | ముగింపు | ముగించిన |
| confide | విశ్వసించు | విశ్వాసం | విశ్వసితం |
| | నమ్ము | నమ్మికనమ్మకం | నమ్మిన |
| consent | సమ్మతించు | సమ్మతి | సమ్మతం |
| | ఆమోదించు | ఆమోదం | ఆమోదితం |
| contend | వాదించు | వాదన | వివదితం |
| | కలహించు | కలహం | కలహించిన |
| contest | పోటీచేయు | పోటీ | పోటీచేసిన |
| continue | కొనసాగు | కొనసాగింపు | కొనసాగిన |
| counter | నిరోధించు | నిరోధం | నిరోధించిన |
| | ప్రతికూలించు | ప్రతికూలం | ప్రతికూలించిన |
| cry | రోదించు | రోదన | రుదితం |
| debate | చర్చించు | చర్చ | చర్చితం |
| declare | ప్రకటించు | ప్రకటన | ప్రకటితం |
| deny | అపలాపించు | అపలాపన | అపలాపితం |
| describe | వర్ణించు | వర్ణన | వర్ణితం |
| disclose | బయటపెట్టు | (బట్ట)బయలు | బయటపెట్టిన |
| elaborate | విపులీకరించు | విపులీకరణ | విపులీకృతం |
| express | వ్యక్తీకరించు | వ్యక్తీకరణ | వ్యక్తీకృతం, వ్యక్తం |
| fear | భయపడు | భయం | భయపడ్డ |
| foretell | సూచించు | సూచన | సూచితం |
| hesitate | సంకోచించు | సంకోచం | సంకుచితం |
| infer | ఊహించు | ఊహ | ఊహ్యం |
| | అనుమానించు | అనుమానం | అనుమితం |
| inquire | విచారించు | విచారం | విచారించిన |
| jest | అపహసించు | అపహాస్యం | అపహసితం |
| lament | దుఃఖపడు | దుఃఖం | దుఃఖితం |
| laugh | హసించు | హాసం | హసితం |
| lecture | ఉపన్యసించు | ఉపన్యాసం | ఉపన్యస్తం |
| maintain | పోషించు | పోషణ | పోషితం |

| | | | |
|---|---|---|---|
| | నిర్వహించు | నిర్వహణ | నిర్వహితం |
| mention | ఉదాహరించు | ఉదాహరణ | ఉదాహృతం |
| narrate | వివరించు | వివరణ | వివరించిన |
| note | గుర్తించు | గుర్తింపు | గుర్తించిన |
| object | అధిక్షేపించు | అధిక్షేపం, అధిక్షేపణ | అధిక్షేపించిన, అధిక్షిప్తం |
| observe | పరిశీలించు | పరిశీలన | పరిశీలితం |
| point out | నిర్దేశించు | నిర్దేశం | నిర్దిష్టం |
| proclaim | ఉద్ఘోషించు | ఉద్ఘోషణ | ఉద్ఘోషితం |
| pronounce | ఉచ్చరించు | ఉచ్చారం, ఉచ్చారణ | ఉచ్చరితం |
| prove | నిరూపించు | నిరూపణ | నిరూపితం |
| quote | ఉట్టంకించు | ఉద్ధరణ | ఉట్టంకితం |
| | ఉద్ధరించు | ఉద్ధారం | ఉద్ధృతం |
| refer | ప్రస్తావించు | ప్రస్తావన | ప్రస్తుతం, ప్రస్తావితం |
| refute | ఖండించు | ఖండన | ఖండించిన, ఖండితం |
| relate | సంబంధించు | సంబంధం | సంబంధి |
| reply | సమాధానించు | సమాధానం | సమాధానితం |
| request | ప్రార్థించు | ప్రార్థన | ప్రార్థితం |
| | వేడుకొను | వేడుకోలు | వేడుకొన్న |
| respond | ప్రత్యుత్తరం చెప్పు | ప్రత్యుత్తరం | ప్రత్యుత్తరంచెప్పిన |
| resume | పునరారంభించు | పునరారంభం | పునరారబ్ధం |
| shout | గర్జించు | గర్జ(న) | గర్జితం |
| snap | తెంచివేయు | తెంచివేత | తెంచి(వేసి)న |
| threaten | బెదిరించు | బెదిరింపు | బెదిరించిన |
| warn | హెచ్చరించు | హెచ్చరిక | హెచ్చరించిన |

**ఈ సంక్షిప్త వ్యాకరణానికి అనుబంధంగా 'పద సంబంధకోశ' మనే పదపట్టికను ఇస్తున్నాం. అందులో ఇంగ్లీషు పదాలుండవుగాని క్రియారూపాలు అకారాది క్రమంలో వాటికి సంబంధించిన విశేషణరూపాలతో అర్థసహితంగా ఉంటాయి. ఉపయోగించండి.**

# తెలుగు భాషా స్వరూపం
# (పద సంబంధకోశం)

## అ

అక్కజపడు / అక్కజంపడు అక. = ఆశ్చర్యపడు; వి. అక్కజం = ఆశ్చర్యం

అక్కరపడు అక. = అవసరపడు; వి. అక్కర పాటు = అవసరం

అగడుపడు అక. = తిట్టుపడు, తొట్రుపడు, నిందపడు; వి. అగడు = నింద, తొట్రుపాటు

అగపడు అక. / అగ్గపడు = కనిపించు, లొంగు; వి. అగపాటు / అగ్గపాటు = కనిపించటం

అగు / అవు అక. = కలుగు; వి. అవటం, కావటం

అగుదెంచు అక. = అవు, అగు; వి. అవటం, కావడం, అగుదెంచటం, అవుదెంచటం

అగ్గపడు / అగపడు అక. = కనిపించు, లొంగు; వి. అగ్గపాటు / అగపాటు = కనిపించటం అగ్గం = కనిపించినది, అధీనమైనది, లొంగినది.

అగ్గలించు అక. = మించు, ఉత్సహించు, పూను, పెరుగు; వి. అగ్గలిక = ఎక్కువదనం, ఆధిక్యం, పూనిక, ఉత్సాహం, పౌరుషం; విణ. అగ్గలం / పెగ్గలం = ఎక్కువ, అధికం.

అంకురించు అక. = మొలకెత్తు, పుట్టు; వి. అంకురం / అంకూరం = మొలక; అంకు రణం = మొలకెత్తించడం; విణ. అంకురిత = మొలకెత్తిన

అంగలారుచు / అంగలార్చు అక. = ఏడ్చు, దుఃఖించు; వి. అంగలారుపు / అంగ లార్పు = దుఃఖం, ఏడ్పు

అంగీకరించు సక. = ఒప్పుకొను, సమ్మతించు; వి. అంగీకారం / అంగీకృతి = ఒప్పుదల, సమ్మతి; అంగీకరణ(ం) = ఒప్పుదల; విణ. అంగీకృతం = ఒప్పుకొన్న, సమ్మతించిన

అంటించు సక. = కుట్టు, అతుకు, అతికించు, అంటుబెట్టు (తెలం.)

అంటు సక. = తాకు, తగులు (కొను) వి. అంటు = తాకిడి, ముట్టు, మైల

అచ్చివచ్చు అక. = అయివచ్చు, లాభమిచ్చు, మేలు చేయు, కలిసి వచ్చు; వి. అచ్చిరావడం = కలిసి రావడం, లాభ సాటిగా ఉండటం

అచ్చెరుపడు / అచ్చెరువుపడు అక. = ఆశ్చర్యపడు; వి. అచ్చెరువు / అచ్చెరు (వు) పాటు = ఆశ్చర్యం

అటుమటించు అక. = చలించు, బాధపడు, సక. మోసగించు, ఉడికించు, మోసగించు;

అడకించు సక. = వెక్కిరించు, ఉడికించు, మోస గించు; వి. అడకం = లోపలిది, దాగి ఉన్నది.

అడగు / అణగు, డాగు / దాగు అక. = తగ్గు, దాగు, వంగు, లోబడు, అణిగిమణిగి ఉండు; వి. అడకువ / అణకువ = నమ్రత, వినయం

అడజడిపెట్టు / అలజడిపెట్టు సక. = దుఃఖ పెట్టు, బాధపెట్టు; వి. అలజడి / అడజడి = బాధ

అడరు అక. = పూను, త్వరపడు, పెరుగు, వ్యాపించు; వి. అడరు = ఎక్కువదనం, ఆధిక్యం

అడలు అక. = ఏడ్చు, భయపడు; వి. అడలు = ఏడ్పు, భయం

**అడిచిపడు** అక. = తొందరపడు, మండిపడు, మిడిసిపడు; వి. **అడిచిపాటు** = తొందర పాటు, మిడిసిపాటు.

**అడుగిడు** సక. = మెట్టు, కాలుమోపు, అడుగు పెట్టు; వి. **అడుగిడటం** = కాలుమోపడం, అడుగు పెట్టడం.

**అడుగు** సక. = ప్రశ్నించు, కోరు, అడుక్కొను (తెలం.); వి. **అడుగు** = పాదం, కింది భాగం, పన్నెండు అంగుళాల కొలత; **అడగటం** = ప్రశ్నించటం, కోరటం; విశే. కింది, తక్కువ.

**అడుగుకొను** సక. = ప్రార్థించు, కోరు; (తెలం.) అడుగు, ప్రశ్నించు, వి. **అడుగుకోలు** = ప్రార్థన, యాచన, కోరిక.

**అడుగుపడు** అక. = కిందగు, తక్కువగు.

**అడుచు** సక. = కొట్టు.

**అడ్డకట్టు** సక. = అడ్డగించు, ఆపు; వి. **అడ్డకట్టు** = ఆనకట్ట, అడ్డంకి, ఆపు.

**అడ్డపడు** అక. = అడ్డంవచ్చు, ఆపు; వి. **అడ్డపాటు** = అడ్డుపడటం, అడ్డంకి

**అడ్డపెట్టు / అడ్డంపెట్టు** సక. = నిరోధించు, ఆపు; వి. **అడ్డపెట్టు** = అడ్డగింత, ఆపు.

**అడ్డు** సక.= అడ్డగించు, ఆపు; వి. **అడ్డు** = అడ్డగింత, అపుదల.

**అణకించు / అడకించు** సక. = వెక్కిరించు, ఉడికించు; వి. **అణకింపు** = ఉడికింపు.

**అంటు** సక. = తాకు, పట్టుకొను, ముట్టు; వి. **అంటు** = మైల, ముట్టు.

**అండగొను** సక. = ఆశ్రయించు, అక. ఆలసించు; **అతికించు** సక. = అంటుబెట్టు, కలుపు; వి. **అతుకు** = కలయిక, **అతికింపు** = అంటు.

**అతిక్రమించు** సక. = మీరు, దాటు, మించు; వి. **అతిక్రమణ(ం), అతి క్రమం, అతిక్రాంతి** = దాటు, మీరటం, మించటం, విశే. **అతిక్రాంత** = దాటిన, మించిన, మీరిన; **అతిక్రామ్యం** = దాటదగిన, మించదగిన

**అతిశయించు / అతిశయిల్లు** అక.= మించు, మీరు, అధికమగు; వి. **అతిశయం** = ఆధిక్యం, అధికత, **అతిశయితం** = మించినది, మీరినది, ఎక్కువైనది. **అతిశాయి** విశే. = మించిన, మీరిన.

**అతిశయిల్లు / అతిశయించు** అక. = మించు; **అతిశయం** = ఎక్కువదనం, ఆధిక్యం. **అతిశయితం** = మించినది, మీరి నది, ఎక్కువైనది; విశే. **అతిశాయి.** = మించిన, మీరిన.

**అతుకు / అదుకు** అక. = అంటుకొను, అతుక్కొను; వి. **అతకడం** = అంటు బెట్టడం; **అతికించటం** = అతికేటట్లు చేయటం, **అతికింపు** = అంటు, అతుకు.

**అదరించు / అదిరించు** సక. = భయపెట్టు, బెదిరించు; వి. **అదరు / అదురు** = భయం, బెదురు; **అదరింపు** = బెదిరింపు.

**అదరు / అదురు** అక. = కదలు, చలించు; వి. **అదరు, అదురు** = కదలిక, చలనం, బెదురు.

**అదలు** అక. = బెదరి పోవు, హడిలిపోవు. **అదలుచు / అదల్చు** అక. సక. = బెదిరించు, గద్దించు; వి. **అదలిక** = బెదరు, **అదలింపు** = బెదిరింపు, గద్దింపు, **అదల్పు** = బెదురు.

**అదిరిపడు** అక. = ఉలికిపడు, ఎగిరిపడు, మిడిసిపడు; వి. **అదిరిపాటు / అద్దిరపాటు** = ఉలుకు, మిడిసిపాటు.

అదుము సక. = నొక్కు, అణము; వి. అదుముడు = నొక్కు, అదమటం = నొక్కడం.

అదురు / అదరు అక. = చలించు, కదలు; వి. అదురు = చలనం, కదలిక. అదరుగడ = అదిరి పాటు.

అద్దు సక. = రంగు వేయు; వి. అద్దకం = రంగు వేయటం / పూయటం.

అధఃకరించు / అతకరించు సక. = కిందు చేయు, తక్కువ చేయు, నీచపరచు; వి. అధః కరణం, అధఃకారం, అధఃక్రియ, అధః కృతి = తక్కువ చేయటం, కించపరచటం, విశే. అధఃకృతం = తక్కువ చేసినది, కించపడినది.

అధికరించు సక. = చదువు; వి. అధికరణం = ఆధారం; అధికృతి = చెల్లుబడి; అధికారం = పాండిత్యం, బలం, చెల్లుబాటు; అధికారి = అధికారమున్నవాడు, నేర్చినవాడు; అధికృతుడు = అధికారి, న్యాయాధికారి; అధిక్రియ = అధికారం.

అధిక్షేపించు సక. = బెదిరించు, వెక్కిరించు, దూషించు; వి. అధిక్షేపం, అధిక్షేపణ(ం) = వెక్కిరింత, బెదిరింపు, తిట్టు; విశే. అధిక్షిప్తం = బెదిరింపు / తిట్టు పొందినది.

అధిగమించు సక. = దాటు, మించు, పొందు, చదువు; వి. అధిగమం = చదువు, అధిగమనం = చదవటం, పొందటం, లాభం. విశే. అధిగతం = చదివిన, పొందిన.

అధిరోహించు సక. మా. ఆరోహించు = ఎక్కు వి. అధిరోహణ(ం) = ఎక్కటం. అధిరోహం = ఆరోహణ, ఎక్కడం; అధిరోహిణి = నిచ్చెన;

అధివసించు అక. = ఉండు, నివసించు; వి అధివాసం = ఉనికి.

అధిష్ఠించు సక. = ఉండు, ఎక్కు, ఆక్రమించు వి. అధిష్ఠానం = ఆక్రమించటం; అధిష్ఠా = ఆశ్రయించి ఉన్నవాడు. అధిష్ఠాత్రి = ఉన్న స్త్రీ.

అధ్యక్షించు సక. = ఏలు, పాలించు; వి. అధ్యక్షుడు = అధికారి; అధ్యక్షం = అధి కారం పదవి

అధ్యయనించు సక. = నేర్చు, చదువు; వి అధ్యయనం = చదువు.

అను సక. = చెప్పు; వి. అనటం = చెప్పటం.

అనుకరించు సక. = ఒకరు చేసినట్లు చేయు, వి అనుకరణ(ం) / అనుకృతి = ఒకదాని వ చేయటం, అనుకారం = పోలిక, అనుకా = పోలినది, వంటిది.

అనుకూలించు అక. = తగు, తగినట్లుండు, ఉ యోగపడు, వీలుపడు, అనువగు; వి. అను కూలనం = సరిపెట్టుకోవటం; అనుకూలిత = వీలయి నది, వాటమైనది. అనుకూలుడు = సరిపడిన వాడు, నచ్చినవాడు; విశే. అను కూలం = తగిన, వీలైన, అనువైన.

అనుకొను అక. = భావించు, తలచు; వి. అను కోవడం = తలచుకోవడం.

అనుగమించు సక. = వెంటనడుచు, వెంబడించ వి. అనుగతి / అనుగమం / అనుగమన = వెంబడింత, వెంటనడవటం. అనుగంత వెంబడించేవాడు, అనుచరుడు. విశే. అనుగ = వెంబడించే, అనుగతం = వెంబడించినది పొందినది.

**అనుగ్రహించు** సక. = దయదలచు, ఇచ్చు; వి. **అనుగ్రహం** = దయ, ఈవి; **అనుగ్రహణం** = ఇవ్వడం.

**అనుచు/అంచు** ప్రే. = పంపు, ఆజ్ఞాపించు; వి. **అనుపు** = తోడు, సహాయం, పన్ను, **అనుపరి** = సుంకరి, పన్ను వసూలు చేసే వ్యక్తి.

**అనునయించు** సక. = ఊరడించు, మందలించు (తెలం.); వి. **అనునయం** = ఊరట; **అనునీతుడు** = ఊరడిల్లినవాడు.

**అనుబంధించు** సక. = వెంటచేర్చు, అతుకు; వి. **అనుబంధం** = చేర్చినది, కట్టినది; **అనుబంధుడు** = పెద్దల ననుసరించి నడిచేవాడు; **అనుబంధనం** = చేరిక, చేర్పు.

**అనుభవించు** స. = పొందు, సుఖపడు, సంభోగించు; వి. **అనుభవం/అనుభూతి/అనుభుక్తి/అనుభోగం** = పొందినది, అదుపులో ఉన్నది. **అనుభవి** = అనుభవం కలవాడు. **అనుభావం** = ముఖ కవలిక, నిశ్చయం, ప్రభావం; విశే. **అనుభావ్యం** = అనుభవించదగిన; **అనుభుక్తం** = అనుభవించిన.

**అనుమతించు** సక. = ఒప్పుకొను, సమ్మతించు; వి. **అనుమతి** = సమ్మతి, ఒప్పుదల; విశే. **అను మతం** = సమ్మతించినది.

**అనుమానించు** అక. = ఊహించు, సందేహించు; వి. **అనుమానం/అనుమితి** = ఊహ, సందేహం; విశే. **అనుమేయం** = ఊహించదగినది.

**అనుమోదించు** అక. = సంతోషించు, సమ్మతించు, ఒప్పుకొను; వి. **అనుమోదం** = సంతోషం, ఒప్పుదల.

**అనువదించు** సక. = తర్జుమాచేయు, మార్చు; వి. **అనువాదం** = (భాష)మార్చడం, తర్జుమా. విశే. **అనూదితం** = మార్చిన, తర్జుమా చేసిన.

**అనువర్తించు** సక. = అనుసరించి నడుచు, అనుగుణంగా చేయు; వి. **అనువర్తనం** = అనుసరించినడవటం, అనుగుణంగా చేయటం.

**అనువుపడు** అక. = వీలుపడు, సరిపడు; వి. **అనువు** = వీలు.

**అనుశాసించు** సక. = ఆజ్ఞాపించు; వి. **అనుశాసనం** = ఆజ్ఞ, సూత్రం, నియమం.

**అనుష్ఠించు** సక. = నడుపు, ఆచరించు; వి. **అనుష్ఠానం** = నడత, ఆచరణ, నడవడి, ఆచారం. విశే. **అనుష్ఠేయం** = ఆచరించదగినది.

**అనుసంధించు** సక. = కూర్చు, చదువు; వి. **అనుసంధానం** = కూర్పు

**అనుసరించు** సక. = వెంటనడుచు; వి. **అనుసరణ(ం)/అనుసారం** = ఒకపద్ధతికి కట్టుబడిన నడత; విశే. **అనుసారి** = అనుసరించే.

**అంతరించు** అక. = చచ్చు, చెడు, సక. దాటు.

**అందగించు** అక. = చక్కనగు; వి. **అందం** = చక్కదనం, **అందగింపు** = చక్కన

**అందించు/అందిచ్చు** సక. = చేతికిచ్చు, అందు కొని ఇచ్చు; వి. **అందింపు** = ఇవ్వటం.

**అందుకొను** సక. = తీసుకొను, పట్టుకొను; వి. **అందుకోలు** = తీసుకోవటం.

**అన్యథాకరించు** సక. = వేరు చేయు, మరొకటిగా మార్చు; వి. **అన్యథా కరణం/అన్యథాకృతి** = మరొకటిగా మార్చటం; **అన్యథా** అవ్య. = మరో.

**అన్వయించు** సక. = సరిపెట్టు, పొందిక చూపు; వి. అన్వయం = పొందిక; కులం.

**అన్వేషించు** సక. = వెతుకు; వి. అన్వేషణ(ం) = వెతకటం; విణ. అన్విష్టం/ అన్వేషితం = వెతికినది.

**అపక్రమించు** అక. = పారిపోవు; వి. అపక్రమం = పారిపోవటం.

**అపచయించు** సక. = పూలుకోయు, చదువు; వి. అపచయం/ అపచయనం = (పూలు) కోయటం, పూజ; అపచితుడు/ అపచాయితుడు = పూజితుడు, గౌరవం పొందినవాడు.

**అపనయించు** సక. = తొలగించు; వి. అపనయ(నం) = తొలగింపు.

**అపలపించు** సక. = దాచిపెట్టు; వి. అపలాపం = దాచిన మాట; ప్రేమ.

**అపహరించు** సక. = కాజేయు, దొంగిలించు; వి. అపహరణ(ం) = దొంగిలింత; విణ. అపహర్త = దొంగలించేవాడు, దొంగ.

**అపహసించు** అక. = నవ్వు, సక. వెక్కిరించు, గేలి చేయు; వి. అపహసితం/ అపహాసం/ అప హాస్యం = వెకిలి నవ్వు.

**అపేక్షించు** సక. = కోరు; వి. అపేక్ష = కోరిక, కాంక్ష; విణ. అపేక్షితం = కోరినది; అపేక్ష్యం = కోరదగిన

**అప్పగించు** సక. = ఒప్పగించు; వి. అప్పగింత = ఒప్పగింత.

**అప్పళించు** సక. = చరుచు, మోగించు; వి. అప్పళింత = చరపు

**అబ్బురపడు** అక. = ఆశ్చర్యపడు; వి. అబ్బురపాటు = ఆశ్చర్యం.

**అభిగమించు** సక. = పొందు; వి. అభిగమనం = పొందిక, అభిగంత = పొందినవాడు; విణ. అభిగతం = పొందినది. అభిగమ్యం = పొందదగినది.

**అభిఘరించు** సక. = (నెయ్యి) చల్లు; వి. అభిఘారం = నెయ్యిచల్లటం, తిరగమోత.

**అభిచరించు** సక. = తిరుగు, వెంటతిరుగు; వి. అభిచరుడు = వెంటతిరిగేవాడు, తోడు; అభిచారం = ఒక భయంకర హోమం.

**అభిదర్శించు** సక. =చూచు; వి. అభిదర్శనం = చూడటం.

**అభినందించు** అక.= సంతోషించు, సక. పొగడు; వి. అభినందన(ం) = సంతోషం.

**అభినయించు** సక. = నటించు; వి. అభినయం = నటన.

**అభిమతించు** సక. = పొగడు, వి. అభినుతి = పొగడ్త

**అభిమంత్రించు** సక. = పిలుచు, మంత్రం పెట్టు; వి. అభిమంత్రణం = పిలుపు, మంత్రంవేయటం; విణ. అభిమంత్రితం = మంత్రం పెట్టిన, మంత్రించిన.

**అభిమానించు** సక. = ఇష్టపడు, గారవించు; వి. అభిమానం =ఇష్టం, గర్వం, అజ్ఞానం; అభిమాని = అభిమానం కలవాడు.

**అభిలషించు** సక. = కోరు, ఇష్టపడు; వి. అభిలాష/ అభిలషణం = కోరిక, ఇష్టం, వాంఛ, అభిలాషి/ అభిలాషుకుడు = కోరికగలవాడు.

**అభిశంసించు** సక. = తిట్టు, నిందించు; వి. అభిశంస/ అభిశంసనం = నింద, దూషణ, తిట్టు, అభిశస్తి = తిట్టడం, అభిశస్తుడు = తిట్లు తిన్నవాడు, నిందపడినవాడు.

**అభిషేకించు** సక. = ముంచు, తడుపు, గద్దెఎక్కించు; వి. అభిషేకం = తడపటం, గద్దెనెక్కించడం; అభిషిక్తుడు = పట్టాభిషేకం జరిగిన రాజు.

**అభ్యర్చించు** సక. = పూజించు; వి. అభ్యర్చన = పూజ. అభ్యర్చితుడు = పూజితుడు.

**అభ్యర్థించు** సక. = కోరు, వేడుకొను; వి. అభ్యర్థన(ం) = విన్నపం.

**అభ్యవహరించు** సక. = తిను; వి. అభ్యవహారం = తిండి, ఆహారం; విణ. అభ్యవహృతం = తిన్నది.

**అభ్యసించు** సక. = నేర్చు, అలవాటు చేసుకొను; వి. అభ్యాసం/అభ్యసనం = అలవాటు, అభ్యస్తం = నేర్చుకొన్నది; విణ. అభ్యసనీయం = నేర్చు కోదగ్గ.

**అభ్యుపగమించు** సక. = ఒప్పుకొను, అంగీకరించు; వి. అభ్యుపగమం = ఒప్పుదల, అంగీకారం.

**అమరు** అక. = ఒప్పు, కుదురు, పొందికగా ఉండు; వి. అమరిక = పొందిక, విధం, అందం.

**అంపు** సక. = ఆజ్ఞాపించు, పంపు; వి. అంపకం = పంపటం. అంపకాలు (బహు) = పెండ్లి కూతురును అత్తింటికి పంపే సమయంలోని వేడుకలు, అంపు = ఒక ఉత్సవం;

**అమ్ము** సక. = విక్రయించు, వెల తీసుకొని ఇచ్చు; వి. అమ్మకం/అమ్ముడు = విక్రయం.

**అమ్ముడుపోవు** అక. = విక్రయముగు.

**అరచు** అక. = కూయు, కేకపెట్టు, ఏడ్చు; వి. అరపు/అరుపు = కేక, ఏడ్పు, కూత.

**అరయు** సక. =వెతుకు, విచారించు; వి. అరయిక = విచారణ. అరయమి = తెలియమి, అజ్ఞానం.

**అరికట్టు** సక. = ఆపు, అడ్డగించు, చుట్టుకొని ఉండు

**అరుగు** అక.=పోవు, వెళ్లు; వి. అరుగుట = పోవటం,

**అరు(గు)దెంచు** అక. = వచ్చు, పోవు; వి. అరుదేరటం = రాక, పోక.

**అర్చించు** సక. = పూజించు; వి. అర్చన = పూజ, అర్చితుడు = పూజితుడు.

**అర్థించు** సక. = కోరు, వేడు; వి. అర్థి = యాచకుడు, కోరేవాడు; వాది; కోరిక, అర్థ్యం = కోరదగినది, అర్థన/అర్దన =వేడికోలు, యాచన; విణ. అర్థితం = కోరిన, వేడిన, అర్దితం = కోరిన, నొప్పించిన.

**అర్పించు** సక.=అప్పగించు, ఒప్పగించు; వి. అర్పణ(ం)=అర్పించటం, అప్పనం; విణ. అర్పితం = అర్పించిన, ఇచ్చిన.

**అలంకరించు** సక. = సింగారించు, కైసేయు; వి. అలంకారం/అలంకరణ(ం)/అలంక్రియ/అలంకృతి = సింగారం, కైసేత, అలంకరిష్ణువు/అలం కర్త = అలంకరించుకొనేవాడు. అలంకృతుడు = అలంకరించినవాడు.

**అలమటించు** సక. = దుఃఖించు, చింతించు, అలమటపడు, అలమరు; వి. అలమట = చింత, విచారం.

**అలయు** అక. = అలిసిపోవు, శ్రమపడు, విసిగిపోవు; వి. అలపు/అలయిక/అలసట = ఆయాసం, శ్రమ, విసుగు

**అలరించు** సక. = సంతోషపెట్టు, ఉబకవేయు; వి. అలరింపు = సంతోషం, ఉబ్బు, పొగడ్త

**అలరు** అక. = వికసించు, సంతోషించు; వి. అలరు = పుష్పం, సంతోషం.

**అలవడు** అక. = అలవాటగు, వాడుకపడు; వి. **అలవాటు** = అభ్యాసం, వాడుక, అలవడటం = అలవాటు కావటం.

**అలవరించు**, అలవరచు ప్రే. =నేర్పు, అలవాటు చేయు, అలంకరించు.

**అలుకు** అక. = భయపడు, ఉలుకు; వి. అలుకు = భయం, ఉలుకు.

**అలుగు** అక. = కోపించు; వి. అలుక, అలుకువ = కోపం.

**అల్లాడు** అక. = చలించు, తిరుగు; వి. అల్లాటం = తిప్పట, చలనం. అల్లార్పు = కదలింపు.

**అల్లు** అక.= పాకు, సక. అల్లికచేయు; వి. అల్లకం/ అల్లుడు (తెలం.)/అల్లిక.

**అవగాహించు** అక. = ఆకళించు, మునుగు; వి. అవగాహం, అవగాహన = ఆకళింపు, మునక.

**అవఘళించు** అక. = వ్యాపించు, సమానమగు, సక. మీరు, మించు; వి. అవఘళం = వ్యాపనం, వ్యాప్తి, అవఘళుడు=వ్యాపకుడు; విశే. అవఘళం = హెచ్చు.

**అవతరించు** అక. = దిగు, పుట్టు; వి. అవతరణ(ం) = దిగటం, పుట్టడం, దాటడం; అవతారం = మానవ జన్మ, దిగటం; రేవు, అవతారిక = పుస్తకం ముందుభాగం, విశే. అవతీర్ణం = దిగిన, దాటిన.

**అవతరిల్లు** అక. చూ. అవతరించు

**అవధరించు** అక. = హెచ్చరికపడు, సక. ధరించు; వి. అవధారణం = నిశ్చయం.

**అవధారు** వాక్యం = వినుము, వినండి; వి. అవదానం = హెచ్చరిక, జాగ్రత్త.

**అవమానించు** సక. = భంగపెట్టు, అగౌరవించు; వి. అవమానం/అవమతి = అగౌరవం, అమర్యాద, అవమానన = అగౌరవం, తెగడ్త; విశే. అవమానితం = అగౌరవం పొందిన

**అవరోధించు** అక. = అడ్డగించు, అడ్డపడు; వి. అవరోధం = చాటు, మరుగు, అడ్డగింత, అంతఃపురం; విశే. అవరుద్ధం=అడ్డగింపునకు గురి అయిన.

**అవలంబించు** సక. = ఆశ్రయించు, అనుసరించు; వి. అవలంబం/అవలంబన(ం) = ఆధారం, ఆశ్రయం; విశే. అవలంబితం = ఆశ్రయించిన, ఆధారమైన.

**అవలోకించు** సక. = చూచు; వి. అవలోకనం = చూపు; విశే. అవలోకితం = చూసినది.

**అవశేషించు** అక. = మిగులు, మిగిలిపోవు; వి. అవశేషం = మిగులు; విశే. అవశిష్టం = మిగిలిన.

**అవియు** అక. = చెడు, పగులు; విశే. అవిటి = చెడిన, (అంగ) లోపంగల.

**అసహ్యించు** అక. = అసహ్యపడు, రోతపడు; వి. అసహ్యం = రోత.

**అస్తమించు** అక. = కనబడకపోవు, వాలు, కుంగు, అణగు; వి. అస్తం = గెలలోభాగం, పడమటి కొండ, అస్తమయం = వాలటం, కనిపించక పోవటం; విశే. అస్తం = తోసివేసిన, ముగిసిన, అస్తమితం = కనిపించని.

**అహంకరించు** అక. = పొగరుబోవు, గర్వించు, అహమించు; వి. అహంకారం/అహంకృతి/ అహంక్రియ = గర్వం, పొగరు, అహంత = అహం భావం, పొగరు. అహంకారి = గర్వి, పొగరుబోతు, అహంయువు = అహంకారి, గర్వి, అహమ్మతి = అజ్ఞానం.

# ఆ

ఆకట్టు సక. = అడ్డగించు; వి. ఆక = అడ్డగింత.

ఆగు అక. = అణగు, సక. అడ్డగించు, నిషేధించు, మోయు, కాపాడు, ఆపు; వి. ఆక = అడ్డగింత, ఆపు = అడ్డగింపు.

ఆచు ప్రే. = అణగించు.

ఆకంపించు అక. = ఎక్కువగా వణకు; వి. ఆకంపనం = ఎక్కువ వణుకు; విణ. ఆకంపితం = బాగా కదిలినది.

ఆకర్ణించు సక. = విను; వి. ఆకర్ణనం = వినికి; విణ. ఆకర్ణితం = విన్నది.

ఆకర్షించు సక. = దగ్గరకు లాగుకొను; వి. ఆకర్షం/ ఆకర్షణ = దగ్గరకు లాక్కోవటం, తళుకు బెళుకు, ఆకృష్టం = ఆకర్షితమైనది. ఆకృష్టి = ఆకర్షణ; విణ. ఆకర్షితం = ఆకర్షణకు గురియైన

ఆకళించు సక. = అర్థం చేసుకొను; వి. ఆకళింపు/ ఆకళింత = అవగాహన.

ఆకాంక్షించు సక. = కోరు; వి. ఆకాంక్ష = కోరిక; విణ. ఆకాంక్షితం = కోరుకొన్న.

ఆకులపడు అక. = కలతపడు, చెదరిపోవు; వి. ఆకులపాటు = కలత; విణ. ఆకులం = చెదరిన, కలగిన.

ఆక్రందించు అక. = ఏడ్చు; వి. ఆక్రందం/ ఆక్రందన = ఏడ్పు, పిలుపు, ఆక్రందుడు = స్నేహితుడు, తోడబుట్టినవాడు; విణ. ఆక్రందితం = పిలిచిన, పిలువందుకొన్న.

ఆక్రమించు సక. = ఆవరించు, జయించు, దాడి చేయు; వి. ఆక్రాంతి/ ఆక్రమణ(ం) = దాడి.

ఆక్రోశించు సక. = ఏడ్చు, తిట్టు; వి. ఆక్రోశం/ ఆక్రోశనం = ఏడ్పు, తిట్టు.

ఆక్షేపించు సక. = తిట్టు, వెక్కిరించు, ఆకర్షించు, అడ్డగించు; వి. ఆక్షేపం/ ఆక్షేపణ(ం) = అడ్డంకి, తిట్టు, ఆకర్షణ, ఆక్షేపకుడు = నత్తివాడు, బోయ వాడు; విణ. ఆక్షేపకుడు = ఆక్షేపించేవాడు.

ఆగ్రహించు సక. = కోపించు, పట్టుదల చూపు; వి. ఆగ్రహం = కోపం, పట్టుదల, ఆసక్తి, అనుగ్రహం.

ఆఘాతించు సక. = చంపు; వి. ఆఘాతం = చంపేచోటు, వధ్యస్థలం.

ఆఘ్రాణించు సక. = వాసనచూచు; వి. ఆఘ్రాణం = వాసన చూడటం, మూచూడటం, ఆఘ్రాతం = నగల చప్పుడు; విణ. ఆఘ్రాతం = వాసనచూసిన.

ఆచమించు సక. = నీళ్లు కొద్దిగా తాగు, వార్చు; వి. ఆచమనం = వార్పు.

ఆచరించు సక. = నడుపు; వి. ఆచరణ(ం) = నడత, ప్రవర్తన; విణ. ఆచరణీయం = అనుసరించదగిన, ఆచరింపదగిన, ఆచరితం = నడిచిన, ఆచరించిన.

ఆచ్ఛాదించు సక. = కప్పు; వి. ఆచ్ఛాదం/ ఆచ్ఛాదన(ం) = కప్పు, పైమూత, గుడ్డ.

ఆజ్ఞాపించు సక. = అనతిచ్చు; వి. ఆజ్ఞాపన(ం)/ ఆజ్ఞప్తి/ ఆజ్ఞాపితం = అనతిపొందినది, ఆజ్ఞ = అన(తి), ఆజ్ఞాతుడు = అనతి పొందిన వాడు.

ఆటోపించు అక. = తొందరపడు, సంభ్రమించు; వి. ఆటోపం = వేగిరపాటు, సంభ్రమం.

**ఆడు** అక. = క్రీడించు, కదలు, మునుగు, నాటు, విహరించు, తిరుగు, నిందించు; వి. **ఆట** = విహారం, క్రీడ, నింద, **ఆటకాడు** = నర్తకుడు, **ఆటకత్తె** = నర్తకి, **ఆటతోట** = ఉద్యానవనం. **ఆటపట్టు** = నర్తనశాల, ఉండే చోటు, ఆడేచోటు. **ఆటపాక** = నర్తనశాల, **ఆడిక** = తిట్టు, నింద, **ఆడికోలు** = నింద, తిట్టు.

**ఆతురపడు** అక. = తొందరపడు, బాధపడు; వి. **ఆతురపాటు**, **ఆతురత** = తొందర, బాధ, **ఆతురుడు** = రోగి, వ్యాధిగ్రస్తుడు.

**ఆదమరచు** సక. = నిశ్చింతగా ఉండు, వి. **ఆద** = విచారం. **ఆదమరపు** = నిశ్చింత, నిర్విచారం.

**ఆదరించు** అక. = మన్నించు, గారవించు; వి. **ఆదరణ/ఆదరింత/ఆదరం** = మన్నన, పాటింపు; విశే. **ఆదరణీయం** = ఆదరింప దగిన.

**ఆదుకొను** అక. = కాపాడు, సంరక్షించు, ఆదరించు.

**ఆదేశించు** సక. = ఆజ్ఞాపించు, ఉపదేశించు; వి. **ఆదేశం** = ఆజ్ఞ, ఒకదానికి బదులు మరొకటి రావటం, **ఆదేష్ట** = ఆజ్ఞాపించేవాడు; విశే. **ఆదిష్టం** = ఆదేశం పొందిన.

**ఆనందించు** అక. = సంతోషించు; వి. **ఆనందం** = సంతోషం, **ఆనందనం** = కౌగలించుకొనటం, **ఆనందథువు** = సంతోషం; విశే. **ఆనందితం** = సంతోషంపొందినది, సంతోషపెట్టినది.

**ఆనతిచ్చు** సక. = సెలవిచ్చు, ఆజ్ఞాపించు; వి. **ఆనతి** = ఆజ్ఞ, సెలవు, మొక్కు.

**ఆను** అక. = తాగు, సక. అదుము, ధరించు, తిను; వి. **ఆనిక** = దృఢత్వం.

**ఆనుకొను** సక. = ఆసరాచేసుకొను; వి. **ఆనుడు** = ఆనుకొనే వస్తువు

**ఆందోళించు** అక. = ఊగు; వి. **ఆందోళన/ఆందోళనం** = గాభరా, ఊగులాట, **ఆందోళం/ ఆందోళిక** = అందలం, పల్లకీ; విశే. **ఆందోళితం** = ఊచినది, ఊగించినది.

**ఆపాదించు** సక. = ఆరోపించు, కలిగించు; వి. **ఆపాదన(ం)** = ఆరోపణ; విశే. **ఆపాదకం** = కలిగించే, **ఆపాదితం** = కలిగించిన.

**ఆపాదిల్లు** అక. = కలుగు; చూ. **ఆపాదించు**

**ఆపు** సక. = ఆగునట్లు చేయు; వి. **ఆపు** = నిరోధం, అడ్డంకి, అడ్డు

**ఆపోశనించు** సక. = నీరుతాగు; వి. **ఆపోశనం** = నీరుతాగటం.

**ఆమంత్రించు** సక. = పిలుచు; వి. **ఆమంత్రణ(ం)** = పిలుపు; విశే. **ఆమంత్రితం** = పిలిచిన, పిలుపు అందుకొన్న.

**ఆమతించు** సక. = పిలుచు; వి. **ఆమతింపు** = పిలుపు.

**ఆమోదించు** అక. = సంతోషించు, అంగీకరించు; వి. **ఆమోదం/ఆమోదనం** = సువాసన, సంతోషం

**ఆయత్తపడు/ఆయిత్తపడు** అక. = సిద్ధపడు; వి. **ఆయిత్తపాటు** = సిద్ధపడటం, **ఆయితపాటు** = సిద్ధం కావటం; విశే. **ఆయితం/ ఆయిత్తం** = సిద్ధం, **ఆయత్తం** = సిద్ధం, సన్నద్ధం

**ఆయాసపడు** అక. = శ్రమపడు; వి. **ఆయాసం** = శ్రమ, ఉత్సాహం.

**ఆయాసపెట్టు** సక. చూ. **ఆయాసపడు** = శ్రమపెట్టు.

ఆరగించు సక. = తిను, తాగు; వి. ఆరగింపు/ ఆరగింత = తిండి.

ఆరటుపడు/ఆరాటుపడు అక. = తొందర పడు, బాధపడు; వి. ఆరాటం/ ఆరటుపాటు = తొందర, బాధపడు.

ఆరంభించు సక. = మొదలు; వి. ఆరంభం = మొదలు; విశే. ఆరభమాణం = మొదలు పెట్టిన.

ఆరాటించు అక. చూ. ఆరటుపడు = బాధపడు, తపనపడు; వి. ఆరాటం = తపన.

ఆరాధించు సక. = గౌరవించు, పూజించు; వి. ఆరాధన(ం) = పూజ, గౌరవం, వంట.

ఆరాధకుడు = ఆరాధించేవాడు; విశే. ఆరాధనీయం/ ఆరాధ్యం = గౌరవించదగిన

ఆరు అక. = కలుగు, నిండు.

ఆరుచు/ఆర్చు అక. = కూయు, అరచు, బొబ్బరించు, సక. అడించు, విసరు.

ఆరోపించు సక. = లేనిదిమోపు; వి. ఆరోపణ(ం) = ఆరోపించటం, ఆరోపం = ఆరోపించుటం; (నిఘంటువుల్లో) అర్థాలు చూపే ప్రధానపదం; విశే. ఆరోపితం = మోసినది, ఎక్కించినది.

ఆరోహించు సక. = ఎక్కు; వి. ఆరోహణ(ం) / ఆరోహం = ఎక్కటం, నిచ్చెన, ఆరోహకుడు = ఎక్కేవాడు, ఆరోహుడు = మావటీడు, రౌతు

ఆర్జించు సక. = గడించు, సంపాదించు; వి. ఆర్జన(ం) = సంపాదన.

ఆలకించు/ఆలించు సక. = విను, ఆదరించు

ఆలక్షించు సక. = చూచు.

ఆలంబించు సక. = అవలంబించు, ఊదు; వి. ఆలంబం = ఊత, ఆధారం.

ఆలపించు/ఆలాపించు సక. = రాగం తీయు; వి. ఆలాపన/ ఆలాపం = రాగం సాగదీయడం.

ఆలసించు అక. = ఆలస్యం చేయు; వి. ఆలస్యం = జాగు, సోమరితనం; విశే. ఆలస్యం = సోమరి.

ఆలాపించు చూ. ఆలపించు

ఆలించు చూ. ఆలకించు.

ఆలోకించు సక. = చూచు; వి. ఆలోకం/ ఆలోకనం = చూపు, ఎండ, పొగడ్త; విశే. ఆలోకితం = చూసినది.

ఆలోచించు సక.= యోచించు; వి. ఆలోచన = యోచన

ఆలోడించు సక. = కలతపెట్టు; వి. ఆలోడనం = కలత; విశే. ఆలోడితం = కలగిన, కలత బారిన

ఆవరించు సక. = చుట్టుకొను, వ్యాపించు; వి. ఆవరణ(ం) = మూత, ఆచ్ఛాదన, చుట్టూ ఉన్న స్థలం.

ఆవర్తించు సక. = పాఠం వల్లించు; వి. ఆవర్త(న)ం = సుడి, వల్లెవేత, మెనుదిరగటం; విశే. ఆవర్తనీయం = వల్లింపదగిన, ఆవర్తితం = వల్లించిన, మరలిన.

ఆవహిల్లు అక. = కలుగు. ఆవహం = కలిగించే

ఆవించు సక. = ఆవిరిలో ఉడకబెట్టు; వి. ఆవి = శ్వాస, వేడి, తాపం, ఆవిరి = వేడి.

ఆవిరిల్లు అక. = చెమర్చు; వి. ఆవిరి = వేడి.

ఆవిర్భవించు అక. = పుట్టు; వి. ఆవిర్భావం = పుట్టుక; విశే. ఆవిర్భూతం = పుట్టిన.

ఆవిష్కరించు సక. = క్రొత్తగా కనిపెట్టు, వెల్లడి చేయు, ప్రకటించు; వి. ఆవిష్కరణం/ఆవిష్కారం/ఆవిష్క్రియ/ఆవిష్కృతి = కనిపెట్టడం, వెల్లడి చేయటం, ప్రకటించడటం; విణ. ఆవిష్కృతం = కనిపెట్టిన, ప్రకటించిన

ఆవులించు అక. = నోరు తెరచు; వి. ఆవులింత = నోరుతెరవటం.

ఆవేదించు సక. = తెలుపు; వి. ఆవేదన = బాధ, విచారం, ఆవేదనం = తెలపటం, ఆవేదకుడు = తెలిపేవాడు; విణ. ఆవేదితం = తెలిపినది.

ఆవేశించు అక. = ప్రవేశించు, చొచ్చు; వి. ఆవేశనం = ఒళ్లు తెలియమి, ప్రవేశం, ఆవేశం = వేగిర పాటు, ఒళ్లు తెలియమి, ఆవేశికుడు = అతిథి; విణ. ఆవిష్టం = ప్రవేశించిన, ఆవేశ పడిన.

ఆశపడు అక. = అపేక్షించు, కోరిక చూపు; వి. ఆశ = కోరిక, అపేక్ష

ఆశంసించు సక. = కోరు; వి. ఆశంసనం = కోరటం, ఆశంసిత = కోరేవాడు, ఆశంసువు = కోరేవాడు; విణ. ఆశంసితం = కోరినది.

ఆశాసించు సక. = దీవించు; వి. ఆశాసనం = దీవెన; విణ. ఆశాస్యం = దీవించదగిన, ప్రార్థించ దగిన.

ఆశించు సక. = ఆపేక్షించు, కోరు; వి. ఆశ = కోరిక, ఆపేక్ష

ఆశీర్వదించు సక. = దీవించు; వి. ఆశీస్సు/ఆశీర్వాదం/ఆశీర్వచనం = దీవెన.

ఆశ్రయించు సక. = అండగొను; వి. ఆశ్రయం = అండ, ఇల్లు, ఆశ్రయాశుడు = నిప్పు, కొంప కాల్చేవాడు, ఆశ్రితుడు = అండజేరిన వాడు; విణ. ఆశ్రితం = ఒప్పుకొన్నది, ఆశ్రయించినది.

ఆశ్లేషించు సక. = కౌగలించు; వి. ఆశ్లేష(ం) = కౌగిలి, ఒక నక్షత్రం; విణ. ఆశ్లిష్టం = కౌగలించుకొన్నది.

ఆశ్వసించు/ఆశ్వాసించు సక. = ఊరడించు, ఓదలించు; వి. ఆశ్వాసం = ఊరట, (గ్రంథంలో) భాగం; విణ. ఆశ్వసితం/ఆశ్వాసితం = ఊరట పొందిన

ఆశ్వాసించు చూ. ఆశ్వసించు

ఆశపడు అక. = కోరు, వాంఛించు; వి. ఆశ = కోరిక, వాంఛ.

ఆసాదించు సక. = పొందు; వి. ఆసాదనం = ప్రాప్తి; విణ. ఆసాదితం = పొందినది, ప్రాప్తించినది. ఆసాద్యం = పొంద దగిన.

ఆసించు చూ. ఆశించు

ఆశ్వదించు/ఆస్వాదించు సక. = రుచి చూచు, వాసన చూచు, అనుభవించు; వి. ఆస్వదనం/ఆస్వాదనం = అనుభవం, రుచి చూడటం; విణ. ఆస్వాదితం = అనుభవించినది, చవి చూపినది.

ఆహ్లాదించు అక. = సంతోషపడు; వి. ఆహ్లాదం, ఆహ్లాదనం = సంతోషం.

## ఇ

ఇగిరించు/ఇవిరించు అక. = చిగిరించు, చూ. ఎర్రవగు; వి. ఇగురు = చిగురు. ఇవురు = చిగురు.

ఇగిలించు/ఇకిలించు సక. = పండ్లు బయట పెట్టు; వి. ఇగిలింత = ఇకిలించటం.

ఇగురు /చిగురు అక. = ఇంకు, ఇంకిపోవు; వి. ఇగురు = చిగురు. ఇగురు/ఇగుర్చు అక. చూ. ఇగిలించు = ఇకిలించు, చూ. ఇగురు.

ఇగురుకొను అక. చూ. ఇగురు = చిగిరించు.

ఇగులుచు /ఇగుల్చు సక. = ఇకిలించు; చూ. ఇగిలంచు.

ఇంకు అక. = వట్టిపోవు, జారు, ఎండు; వి. ఇంకుడు = ఇంకటం; విశే. ఇంకుడు = ఎండిన.

ఇచ్చగించు/ఇచ్ఛయించు సక. = ఒప్పు, కొను, ఇష్టపడు; వి. ఇచ్ఛ = ఇష్టం, చిత్తం, ఇచ్ఛగింత = ఒప్పుకోలు, ఇష్టం, ఇచ్ఛకం = నచ్చినమాట, ఇచ్ఛకుడు/ ఇచ్ఛకాలమారి/ ఇచ్ఛగొండి = ఇచ్చకాలు చెప్పే వాడు, స్తోత్ర పాఠకుడు.

ఇచ్చు సక. = ఇడు, దానం చేయు; వి. ఇవ్వటం = ఇడటం, దానం చేయటం, ఈగి/ ఈవి = దానం, ఈగికాడు/ ఈవికాడు = దాత, ఈగి మాను/ ఈవిమాను = కల్పవృక్షం.

ఇడియు అక. = చీల్చు, విరిసిపోవు; వి. ఇడుపు = చీలిక.

ఇడు సక. = ఇచ్చు, ఉంచు.

ఇనుమడించు/ ఇమ్మడించు/ ఇన్మడించు సక. = రెట్టించు, పెంచు, రెండింతలు చేయు; వి. ఇనుమడి/ ఇమ్మడి = రెండు, రెట్టింపు, ఇనుమడింపు = రెండింతలు చేయటం, రెట్టించటం; విశే. ఇనుమడి/ ఇమ్మడి = రెండో.

ఇబ్బడించు/ ఇవ్మడించు/ ఇన్మడించు/ ఇనుమడించు సక. = రెట్టించు; వి. ఇబ్బడి = రెండింతలు, రెట్టింపు.

ఇముడు అక. = అణగు, సరిపోవు; వి. ఇమిడిక = పొందిక.

ఇయ్యకొను/ఈయకొను సక. = ఒప్పుకొను, అంగీకరించు, సమ్మతించు; వి. ఇయ్యకోలు = అంగీకారం, సమ్మతి.

ఇరుకు అక. = కొద్దితావున ఇముడు; వి. ఇరుకు = గొంది. ఇరకటం/ ఇరకాటం = ఇరుకైన స్థితి, ఇరుకుమాను = పంగల గుంజవంటి ఇరుకుదారి; విశే. ఇరుకు = సన్నని ఇబ్బందిగా ఉండే.

ఇలకరచు/ఇల్కారుచు/ ఈలకరచు సక. = బిగబట్టు, ఊపిరి బిగబట్టు.

ఇలుగు/ఈలుగు/ నీలుగు అక. = వచ్చు.

ఇవతళించు/ ఇవతాళించు సక. = చల్లనగు; వి. ఇవక = శైత్యం, జలుబు, ఇవం = శైత్యం, మంచు, ఇవతాళింపు = చల్లదనం, శైత్యం, ఇవముమేపరి/ ఇవము సూడు = సూర్యుడు.

ఇవిరించు చూ. ఇగిరించు

ఇవురు చూ. ఇగురు

ఇవురుచు చూ. ఇగురుచు

## ఈ

ఈతకొట్టు సక. = ఈదు, ఈదాడు; వి. ఈత = ఈదటం, ఈనటం. ఈతకాడు = ఈదే వాడు.

ఈదు అక. = ఈతకొట్టు, సక. దాటు; వి. ఈదు = గాలి, ఈతవెట్టు; ఈద(ర) = చలిగాలి. ఈకువ = తడి.

ఈదులాడు చూ. ఈదు

ఈచపడు అక. రూ. ఈచబోవు = వంకరపోవు; వి. ఈచ = (కాళ్లూచేతుల) వంకర.

**ఈటువోవు** అక. = వ్యర్థమగు, శూన్యమగు; విణ. ఈటు = వ్యర్థం, శూన్యం.

**ఈడఁబోవు** అక. = వెనుదీయు.

**ఈడిగిలబడు** అక. = మొండికి పడు, వేలబడు ఈడిగిల్లు అక. = వేలబడు, మొండికిపడు.

**ఈడు** అక. = సాగు, జారు, సక. పితుకు; వి. ఈడు = వయసు; విణ. ఈడు = సమానం.

**ఈడుచు/ఈడ్చు** సక. = లాగు, ఆకర్షించు; వి. ఈడుపు = ఆకర్షణ, ఆలస్యం.

**ఈడేరు** అక. = వర్ధిల్లు/పెరుగు/ నెరవేరు, సిద్ధించు; వి. ఈడు = వయస్సు.

**ఈను** సక. = (పశువులు)కను, కలిగించు; వి. ఈత = (గొడ్ల) కాన్పు.

**ఈయకొను** చూ. ఇయ్యకొను

**ఈరసించు** అక. = ఈర్ష్యపడు, కోపించు, ద్వేషించు; వి. ఈరస = ఈర్ష్య, కోపం, ద్వేషం.

**ఈరుచు /ఈర్చు** సక. = ఈర్పెనతో దువ్వు; వి. ఈరు = పేనుగుడ్డు, ఈరుపెన/ ఈర్పెన = పేలుదీసేదువ్వెన. ఈరెండ = కొద్దిపాటి ఎండ, ఈరెలుగు = హీనస్వరం. విణ. ఈరు = అల్పం, హీనం

**ఈలకరచు** చూ. ఇలకరచు

**ఈలుగు** అక. చూ. ఇలుగు. రూ. ఈల్గు, నీలుగు, నీల్గు = చచ్చు

**ఈసడించు** అక. = ఛీసీపీ మాట్లాడు, తక్కువగా చూచు, కోపించు, రోతపడు; వి. ఈసడం = నింద, తిట్టు

## ఉ

**ఉక్కుబట్టు/ఉగ్గబట్టు(సక.)** = వదలు, అక. = బిగబట్టు.

**ఉక్కడుగు** అక. చూ. ఉక్కరు = శక్తి ఉడుగు, చచ్చు; వి. ఉక్కు = శక్తి, బలం, శౌర్యం. ఉక్కడీడు = బలవంతుడు, బంటు. ఉక్కరి = శౌర్యవంతుడు. ఉక్కలుడు = బలవంతుడు. ఉక్కళం = కావరి. ఉక్కణం = కావలి, రక్షణ; విణ. ఉక్కడం = గొప్ప.

**ఉక్కు** అక. చూ. ఉక్కడగు = చచ్చు, నలిగిపోవు

**ఉగ్గడించు** అక. = మోగు, చప్పుడగు, సక. చెప్పు, పొగడు; విణ. ఉగ్గడువు = చాలా, ఎక్కువ.

**ఉగ్గబట్టు** అక. చూ. ఉక్కబట్టు = బిగబట్టు.

**ఉగ్గించు** సక. = (పడుగుపేకలు) ఒకచోట చేర్చు, కూర్చు; వి. ఉగ్గం = అల్లికసంచి.

**ఉగ్గుపడు** అక. = ముడతలు పడు, మెలికపడు; వి. ఉగ్గు = ముడత, మెలిక.

**ఉచ్చరించు** సక. = పలుకు, చెప్పు; వి. ఉచ్చారణ(ం) / ఉచ్చరణం = పలకటం, చెప్పటం; విణ. ఉచ్చరితం = పలికినది, చెప్పినది.

**ఉచ్చు** అక. = దూసుకొనిపోవు; వి. ఉచ్చు = ఉరి.

**ఉజ్జీవించు** అక. = బతుకు, జీవించు; వి. ఉజ్జీవనం = బతుకు.

**ఉజ్జాయించు** సక. = పోల్చు, ఊహించు; వి. ఉజ్జి రూ. ఉద్ది = సమానమైన. ఉజ్జాయింపు = రమారమి, దగ్గర.

**ఉటంకించు** సక. = సంగ్రహించు, క్లుప్తీకరించు; వి. ఉటంకం = సంగ్రహం, టూకీ; విణ. ఉటంకి, ఉటంకు = చొరవగల ధైర్యంగల.

**ఉట్టంకించు** (సక.) = పేర్కొను, ఎత్తిరాయు, స్థాపించు, వి. ఉట్టంకణం = స్థాపించటం, పేర్కొనడం; విణ. ఉట్టంకితం = స్థాపితమైన, పేర్కొన్న.

**ఉట్టిపడు** సక. = కలతపారు, ఎగిరిపడు, ఊడి పడు.

**ఉట్టు** అక. = కారు, స్రవించు; వి. ఉట్టు = ఉప్పు పండే నేల

**ఉడాయించు** అక. = పారిపోవు, దొంగిలించు; వి. ఉడాయింపు = పారిపోవటం, ఎత్తుక పోవటం.

**ఉడికిల్లు** అక. = ఉడికిపోవు, ఉడుకాడు; వి. ఉడుకు = తాపం, వేడి. ఉడుకు బోతు = ఈర్ష్యపడే వ్యక్తి. చూ. ఉడుకు .

**ఉడుగు/ ఉడువు** అక. = చిక్కిపోవు; వి. ఉడు కువ = ఊరట, ఆగిపోవటం.

**ఉడ్డాడు** అక. = కలతపడు, కలగిపోవు.

**ఉడ్డుగుడుచు** అక. = ఊపిరి తిప్పుకోలేకపోవు, గిజగిజలాడు.

**ఉండు** అక. = ఉండిపోవు, వసించు, వర్తించు, మిగులు. వి. ఉనికి = ఉండటం

**ఉతుకు/ఉదుకు** సక. = గుంజు, కొట్టు; వి. ఉతుకు = ఉతికిన గుడ్డ, ఉతకడం, దెబ్బ.

**ఉత్కంపించు** అక. = వణకు; వి. ఉత్కంప న(ం) = వణకు.

**ఉత్తంభించు** సక. = నిలుపు, పొడిగించు; వి. ఉత్కం భనం = నిలపటం, పొడిగించటం; విశే. ఉత్తంభితం = నిలిపినది, పొడిగించినది.

**ఉత్తరించు** సక. = నరుకు, ఖండించు; వి. ఉత్త రింపు = నరుకు, ఖండం.

**ఉత్తలపడు** అక. = తొందరపడు, బాధపడు, తల కిందులగు; వి. ఉత్తలం = తొందర, బాధ, దుఃఖం, కలత, వ్యత్యాసం. ఉత్తలపాటు = తొందరపాటు, పరితాపం, కలత, తలకిందు లవటం.

**ఉత్తలపెట్టు** సక. చూ. ఉత్తలపడు = బాధపెట్టు, కలత పెట్టు, తలకిందులుచేయు.

**ఉత్పాటించు** సక. = పెరుకు, పీకు; వి. ఉత్పాట న(ం) = పెరకటం, పీకటం; విశే. ఉత్పా టితం = పీకిన, పెరిగిన.

**ఉత్పాదిల్లు** అక. = పుట్టు, కలుగు; వి. ఉత్పా దన(ం) = పుట్టించటం, ఆపాదించటం; విశే. ఉత్పాదితం = కల్పించిన, పుట్టించిన, తయారు చేసిన. ఉత్పాదకం = పుట్టించే, కల్పించే

**ఉత్ప్రేక్షించు** సక. = పోల్చు.

**ఉత్సర్జించు** సక. = విడుచు, వదిలిపెట్టు; వి. ఉత్సం = ఊట. ఉత్సర్గ(ం) = త్యాగం, విడుపు, ఉత్సర్జన(ం) = త్యాగం, విడుపు, ఈవి; విశే. ఉత్సర్జితం = విడిచిన.

**ఉత్సహించు/ ఉత్సాహించు** అక. = ప్రయ త్నించు, మొదలుపెట్టు; వి. ఉత్సాహం = ప్రయత్నం, సంతోషం. ఉత్సు కుడు = ఇష్టమైన పని మొదలు పెట్టినవాడు.

**ఉత్సారించు** అక. = కద లించు; వి. ఉత్సారణం = కదిలింపు; విశే. ఉత్సా రితం = కదిలించిన.

**ఉత్సేకించు** అక.= పొంగు, గర్వించు, అతిశయించు సక. తడుపు, ప్రోక్షించు; వి. ఉత్సేకం = అతిశయం, గర్వం, పొంగు; ప్రోక్షణం, తడుపు; విశే. ఉత్సిక్తం = అతిశయించిన, పొంగిన, గర్విం చిన, తడిసిన.

**ఉదరిపడు** అక. = అదిరిపడు, ఉలికిపడు; వి. ఉద రిపాటు = అదిరిపాటు, ఉలుకు.

**ఉదరు** అక. = అదరు.

**ఉదాసించు** సక. = తిరస్కరించు; వి. ఉదాసం = తగులమి, ఉదాసీనత = నిర్లక్ష్యం, పట్టించు కోకపోవటం, ఉదాసీనభాష= దుర్భాష; విశే. ఉదాసీనం = పట్టించుకోని, చెడ్డ.

**ఉదాహరించు** సక. = మచ్చుకెత్తిచూపు; వి. **ఉదాహరణ(ం) / ఉదాహరం** = తెలివిడి, మచ్చు, అర్థాంతరం; విశే. **ఉదాహృతం** = మచ్చు చూపిన, ఉదాహరించిన.

**ఉదియగొను** అక. = ప్రయత్నించు; వి. **ఉదియ / ఉద్దియ** = యత్నం.

**ఉదిలకొను** అక. = తపించు, బాధపడు; వి. **ఉదిల** = పరితాపం

**ఉదుకు** చూ. **ఉతుకు**

**ఉద్గమించు** అక. = పైకిలేచు, మొలకెత్తు; వి. **ఉద్గతి / ఉద్గమం** = పుట్టుక, పైకిలేవటం. **ఉద్గనీయం** = ఉతికినధోవతి; విశే. **ఉద్గతం** = చీల్చుకొని పైకి వచ్చిన. **ఉద్గమనీయం** = పైకిలేవ దగిన.

**ఉద్గారించు** అక. = తేన్చు; వి. **ఉద్గారం** = తేపు, కక్కు.

**ఉద్ఘాటించు** అక. = చీల్చు, ఛేదించు, నొక్కిచెప్పు; వి. **ఉద్ఘాటన(ం)** = ఉగ్గడించు చూ. చీల్చు, ఏతం. **ఉద్ఘాతం** = దెబ్బ; మొదలు; తొట్రుపాటు, ఇనపగద; విశే. **ఉద్ఘాటితం** = చెప్పిన, ఛేదించిన

**ఉద్ఘోషించు** అక. = మొరపెట్టు; వి. **ఉద్ఘోష(ం)** = మొర; విశే. **ఉద్ఘుష్టం** = మోగిన, మొరపెట్టిన.

**ఉద్దండించు** అక. = పొడవగు, ఎక్కువగు; విశే. **ఉద్దండం** = ఎక్కువైన, పొడుగైన.

**ఉద్దించు** సక. = జతపరచు, పోలు; వి. **ఉద్ది** = జత, జోడి. **ఉద్దీడు / ఉద్దికాడు** = జతగాడు, స్నేహితుడు; విశే. **ఉద్ది** = సమానమైన.

**ఉద్దీపించు** సక. = ప్రకాశించు, వెలుగు; వి. **ఉద్దీపన(ం)** = వెలుగు, పెంపు; విశే. **ఉద్దీపకం** = వెలిగించే, పెంచే. **ఉద్దీపితం** = వెలిగించిన, పెంచిన, పెరిగిన.

**ఉద్దేశించు** సక. = గురించు; వి. **ఉద్దేశం** = గురి; భావం. **ఉద్దేశ్యం** = గుర్తించదగినది, భావించదగినది.

**ఉద్యోతించు** అక. = పకాశించు, వెలుగు, వి. **ఉద్యోతనం** = ప్రకాశం, వెలుగు.

**ఉద్ధరించు** సక. = పెల్లగించు, పైకెత్తు, ఎత్తి చూపు; వి. **ఉద్ధృతి** = గర్వం, పైకెత్తటం. **ఉద్ధారం** = పైకెత్తటం, అప్పు, **ఉద్ధరణ** = పెకలించటం, పైకెత్తటం, **ఉద్ధరణి** = చిన్నచెంచా. **ఉద్ధారకుడు / ఉద్ధర్త** = ఉద్ధరించేవ్యక్తి. **ఉద్ధారణం** = ఉద్ధరించటం. **ఉద్ధృతుడు** = పొలిమేర తొక్కినవాడు. విశే. **ఉద్ధృతం** = చేదిన, పైకెత్తిన, అనుభవించి విడిచిన.

**ఉద్బోధించు** సక. = తెలుపు, గుర్తుకు తెచ్చు; వి. **ఉద్బోధకుడు** = గుర్తుకు తెచ్చేవాడు, మేలుకొల్పేవాడు. **ఉద్బోధనం** = గుర్తుకు తేవటం. **ఉద్బోధం** = తలపు, గుర్తు, మేలుకొల్పు, వికాసం; విశే. **ఉద్బుద్ధం** = తలపునకు వచ్చిన, గుర్తు వచ్చిన, మేలుకొన్న, వికసించిన.

**ఉద్భవించు** అక. = పుట్టు, జన్మించు; వి. **ఉద్భవం** = పుట్టుక, జన్మ.

**ఉద్భాసించు** అక. = ప్రకాశించు, వెలుగు; వి. **ఉద్భాసితం** = వెలుగు, ప్రకాశంపొందిన.

**ఉద్యమించు** అక. = మొదలు పెట్టు, పూను, యత్నించు; వి. **ఉద్యమం / ఉద్యతి** = కడక, ప్రయత్నం, పూనిక; విశే. **ఉద్యతం** = యత్నించిన, పైకెత్తిన.

**ఉద్యోగించు** అక. = ప్రయత్నించు, మొదలు పెట్టు; వి. ఉద్యోగం = ప్రయత్నం, పూనిక, వృత్తి. ఉద్యోగి = ఉద్యోగంలో ఉన్న వ్యక్తి; విణ. ఉద్యుక్తం = మొదలు పెట్టిన.

**ఉద్యోతించు** అక. = వెలుగు, ప్రకాశించు; విణ. ఉద్యోతితం = వెలిగిన, ప్రకాశించిన.

**ఉద్రేకించు** అక. = అతిశయించు, ఉద్రేకపడు; వి. ఉద్రేకం = విజృంభణ, అతిశయం; విణ. ఉద్రిక్తం = ఉద్రేకం పొందిన

**ఉద్వహించు** సక. = ఎగబట్టు, మోయు; వి. ఉద్వహ = కూతురు. ఉద్వహనం = ఎగబట్టడం, ఉద్వహుడు = కొడుకు. ఉద్వాహం = పెండ్లి. ఉద్వాహనం = పెండ్లాడటం, ఉత్కంఠ. ఉద్వాహిని = తాడు; విణ. ఉద్వహుడు = పైకెత్తేవాడు.

**ఉద్వేగించు / ఉద్వేగిల్లు** అక. = తొందరపడు, కలకబారు, కలతపడు, భయపడు; వి. ఉద్వేగం = ఉబ్బు, కలత, కలకబాటు. ఉద్వేజనం = వెరపు, కలత; విణ. ఉద్వేజితం = భయపడిన, కలక బారిన. ఉద్విగ్నం = కలతపడిన, దారి తప్పిన.

**ఉంచు / ఉనుచు** ప్రే. = అట్టిపెట్టు; వి. ఉనికి = ఉండటం, స్థితి, స్థానం. ఉనుకువ = ఉండటం, నివాసం. ఉన్నరూపు = వాస్తవం. ఉన్నవాడు = డబ్బుగలవాడు.

**ఉంచుకొను** సక. = అట్టిపెట్టుకొను, పోషించు; వి. ఉంపడం = వేశ్యను అద్దెం తన అధీనంలో ఉంచుకోవటం. ఉంచుకోవడం = అట్టిపెట్టుకోవటం, పోషించటం. ఉంపుడుకాడు = ఉంచుకున్నవాడు. ఉంపుడుకత్తె = ఉంచుకున్న స్త్రీ.

**ఉన్మీలించు** సక. = చిత్రించు, వర్ణించు, అక. విరియు, విప్పారు, వికసించు; వి. ఉన్మీలనం = విప్పారటం, చిత్రణ; విణ. ఉన్మిషితం / ఉన్మీలితం = విరిసిన, విప్పారిన.

**ఉన్మూలించు** సక. = పెల్లగించు, పెకలించు; విణ. ఉన్మూలం = వేరు తెగిన. ఉన్మూలితం = పెకలించిన, పెల్లగించిన.

**ఉపకరించు** అక. = ఉపయోగపడు; వి. ఉపకరణం = పనిముట్టు. ఉపకృతి / ఉపకారం = మేలు. ఉపకర్త = మేలుచేసేవాడు. ఉపకారిక = మేలు చేసేస్త్రీ. ఉపకృతం = ప్రయోజనం, మేలు; విణ. ఉపకారి = మేలు చేసే. ఉపకార్యం = మేలు చేయదగిన, ఉపయోగపడే. ఉపకృతం = ఉపయోగ పడ్డ.

**ఉపక్రమించు** సక. = మొదలు పెట్టు; వి. ఉపక్రమం = ఉపాయంగా మొదలు పెట్టడం, చికిత్స, పరీక్ష, పరాక్రమం. ఉపక్రమణం = మొదలు పెట్టడం; విణ. ఉపక్రాంతం = మొదలైన, మొదలు పెట్టిన. ఉపక్రామ్యం = మొదలు పెట్టదగిన. ఉపక్రమణీయం = మొదలు పెట్టవలసిన.

**ఉపచరించు** సక. = సేవించు, సపర్యచేయు; వి. ఉపచరం = (గొడ్ల) వెద, తొలిచూలు. ఉపచారం = సపర్య, లంచం, ఊడిగం, సేవ, వాడుక. ఉపచరితుడు = సేవలు పొందినవాడు.

**ఉపజీవించు** సక. = ఒకరిపై ఆధారపడి బతుకు; వి. ఉపజీవి = ఒకరి మీద ఆధారపడి బతికేవాడు. ఉపజీవిక = జీవనమార్గం, బతుకు తెరువు.

**ఉపదేశించు** సక. = బోధించు, ఉపదేశం చేయు; వి. ఉపదిష్టం = ఉపదేశం పొందినది. ఉప

దేష్టు, ఉపదేశకుడు = ఉపదేశం చేసేవాడు, గురువు. ఉపదేశం = బోధ, మంచిమాట.

ఉపధావించు అక. = పరిగెత్తు; వి. ఉపధావనం = పరుగు.

ఉపన్యసించు సక. = ప్రసంగించు, ఉంచు; వి. ఉపన్యాసం = ఒక విషయాన్ని పెంచిచెప్పటం. ఉపన్యస్తం = ఉపన్యసించిన విషయం. ఉపన్యాసకుడు = ఉపన్యసించేవాడు, కళాశాలాధ్యాపకుడు.

ఉపభోగించు సక. = అనుభవించు; వి. ఉపభోగం = అనుభావం. ఉపభోక్త = అనుభవించిన వాడు; విశే. ఉపభుక్తం = అనుభవించిన, ఉపభోగ్యం = అనుభవించదగిన.

ఉపమించు సక. = పోల్చు; వి. ఉపమ = పోలిక, ఒక అలంకారం, ఉపాయం. ఉపమరి = ఉపాయశాలి. ఉపమానం = పోలిక, పోల్చదగినది. ఉపమితి = ఉపమానం, పోలిక. ఉపమేయం = పోల్చే విషయం; విశే. ఉపమితం/ ఉపమేయం = పోల్చినది.

ఉపయోగించు అక. = వాడు(కొను); వి. ఉపయోగం = వాడుక, ప్రయోజనం; విశే. ఉపయుక్తం = ఉపయోగించిన, వాడిన.

ఉపలాలించు సక. = బుజ్జగించు; వి. ఉపలాలనం = బుజ్జగింపు; విశే. ఉపలాలితం = బుజ్జగింపు పొందిన.

ఉపవసించు అక. = పస్తులుండు; వి. ఉపవస్తం/ ఉపవాసం = పస్తు

ఉపశమించు/ఉపశమిల్లు అక. = తగ్గు; వి. ఉపశమం/ ఉపశమనం/ ఉపశాంతి = తగ్గుదల

ఉపసంహరించు సక. = ఆపు, మరలించు, వెనక్కు తీసుకొను; వి. ఉపసంహారం = మరలింపు, ముగింపు.

ఉపసర్పించు సక. = ఆశ్రయించు, అండగొను; వి. ఉపసర్పణం = ఆశ్రయం.

ఉపస్పృశించు సక. = ఆచమించు, కొద్దిగా తాగు, స్నానమాడు ; వి. ఉపస్పర్శ(ం) = ఆచమనం, తాకటం, స్నానం.

ఉపార్జించు సక. = గడించు, సంపాదించు ; వి. ఉపార్జన(ం) = సంపాదన, గడన ; విశే. ఉపార్జితం = సంపాదించినది, గడించినది.

ఉపలాభించు సక. = దూషించు, తిట్టు, నిందించు; వి. ఉపాలంభన = నింద, తిట్టు, దూషణ; విశే. ఉపాలబ్ధం = తిట్టుపడిన, నిందకు గురైన.

ఉపాశ్రయించు సక. = ఆధారపడు, బాగా ఆశ్రయించు; వి. ఉపాశ్రయం = ప్రాపు, ఆధారం విశే. ఉపాశ్రితం = ఆధారపడిన

ఉపాసించు సక.= కొలుచు, సేవించు; వి. ఉపాస్తి = సేవ. ఉపాసన = సేవ, పేటు, విలువిద్య. ఉపాసితుడు = సేవితుడు, సేవలు పొందినవాడు. ఉపాస్యుడు = సేవించదగిన వాడు; విశే. ఉపాసితం = సేవించే

ఉపేక్షించు సక. = నిర్లక్ష్యం చేయు, అశ్రద్ధ చూపు; వి. ఉపేక్ష =అశ్రద్ధ, నిర్లక్ష్యం. ఉపేక్షకుడు = నిర్లక్ష్యం చేసేవాడు. ఉపేక్షితుడు = నిర్లక్ష్యానికి గురి అయినవాడు.

ఉప్పతించు సక. = ఓర్వలేకపోవు, ఆడిపోసుకొను; వి. ఉప్పత = ఓర్వలేనితనం.

ఉప్పతిల్లు అక. = పుట్టు

ఉప్పరించు/ఉప్పళించు సక. = వెలకిల పడవేయు; వి. ఉప్పరం = ఆకాశం, మీదు. ఉప్పరిగ = మేడ, అంతస్తు.

ఉప్పొంగు అక. = ఉబుకు, సంతోషించు, విజృంభించు; వి. ఉప్పెన = సముద్రపు పొంగు.

ఉబుకు అక. = పొంగు; వి. ఉబుకు = పొంగు, ఉబ్బు. ఉబ్బు = పొంగు, ఉబ్బరింత. ఉబ్బుకం = ఆధిక్యం, పొంగు, ఉత్సాహం. ఉబ్బరం = అతిశయం, ఉబ్బు.

ఉబ్బతిల్లు అక. = పొంగు, పెరుగు. చూ. ఉబ్బు

ఉబ్బరించు అక. = (కడుపు) ఉబ్బు, పెరుగు, అతిశయించు, మించు; వి. ఉబ్బరింత/ఉబ్బరం = ఉబ్బు, పొంగు.

ఉబ్బు అక. = ఉబ్బరించు, పొంగు, లేచు, సంతోషించు; వి. ఉబ్బు = పొంగు, సంతోషం. ఉబ్బరం = అతిశయం, కడుపుబ్బు. ఉబ్బుకం = ఆధిక్యం, ఉత్సాహం. ఉబ్బసం = శ్వాసరోగం, శ్వాసతో గుండెలుబ్బు.

ఉమియు సక. = ఉమ్మివేయు; వి. ఉమి/ఉమ్మి = నోటితుంపర.

ఉమ్మగిల్లు అక. = ఆవిరితో ఉడుకు; వి. ఉమ్మదం/ఉమ్మ = ఉబ్బ, వేడి.

ఉమ్మలించు/ఉమ్మలికించు అక. = దుఃఖించు, ఏడ్చు; వి. ఉమ్మరిక = దుఃఖం, ఏడ్పు.

ఉరడించు రూ. ఉరణించు చూ. ఉరనడించు

ఉరలఖడు అక. = దొర్లు

ఉరలు అక. = దొర్లు, రాలు.

ఉరవడించు అక. రూ. ఉరవణించు = త్వరపడు.

ఉరళించు అక. = వెలుగు, ప్రకాశించు.

ఉరియాడు అక. = ఊగులాడు, కదులు

ఉరియు అక. = కదలు, ఊగులాడు, బాధపడు, పండిపోవు.

ఉరుకు అక. = దాటు, దూకు, సక. పరిగెత్తు; వి. ఉరుకు = దాటు, దూకు, గెంతు, పరుగు.

ఉరుము అక. = గర్జించు; వి. ఉరుము = గర్జన(ం).

ఉర్రూతలూగు అక. = బాగా ఊగు; వి. ఉర్రూత = ఊగులాట.

ఉలవరించు అక. = నేల తడిసి ఉబుకు; వి. ఉలగరం/ఉలవరింత/ఉలవరం = ఉలవరింపు.

ఉలికిపడు అక. = అదిరిపడు; వి. ఉలికిపాటు = ఉలికి పడటం, అదిరిపాటు.

ఉలియు/ఉలివాడు సక. = చలించు, కదలు, మోతపెట్టు; వి. ఉలివు = మోత, కదలిక.

ఉలుకు అక. = భయపడు; వి. ఉలుకు = భయం.

ఉల్లంఘించు సక. = దాటు, దూకు, మించు, అతిక్రమించు; వి. ఉల్లంఘన(ం) = దాటుడు, అతిక్రమణ. ఉల్లంఘనీయం = దాటదగినది, అతిక్రమించదగినది; విశే. ఉల్లంఘితం = దాటిన, మీరిన. ఉల్లంఘ్యం = దాటదగిన.

ఉల్లసమాడు సక. = వెక్కిరించు, వేళాకోళం చేయు; వి. ఉల్లసం = వెక్కిరింత, వేళాకోళం.

ఉల్లసిల్లు అక. = సంతోషించు, వికసించు, ప్రకాశించు; వి. ఉల్లసనం/ఉల్లాసం = సంతోషం, ప్రకాశం.

ఉవ్విళ్లూరు /ఉవ్విళులూరు అక. = ఆసపడు, త్వరపడు.

ఉసికొల్పు సక./ప్రే. రూ. ఉసిగొల్పు = ప్రోత్సహించు, రేకెత్తించు; వి. ఉసి = ప్రోత్సాహం.

## ఊ

**ఊకించు / ఊకు**అక. = పూనుకొను; వి. **ఊకు/ఊకువగు/ఊకువ** = పూనిక. రూ. ఉంకించు

**ఊకొట్టు / ఊకొను / ఊగాడు** సక. = శ్రద్ధగావిను.

**ఊగాడు** రూ. **ఊగులాడు** చూ.

**ఊగు** అక. = ఊగులాడు, కదలు, అటూ ఇటూ కదలు; వి. ఊగు/ఊపు = కదలిక.

**ఊగులాడు/ఊగాడు** అక. = కదలాడు; వి. **ఊగులాట** = కదలిక.

**ఊచు** అక. = ఊగించు.

**ఊటాడు** అక. = చలించు, తొందరపడు

**ఊడు** అక.= రాలు, జారు, కారు, తెగు.

**ఊతకొను** సక. = ఊదు, అవలంబించు; వి. **ఊత** = ఆధారం. **ఊతకోల** = ఆనుడు కర్ర. **ఊతం** = పట్టు, ఆధారం.

**ఊదరగొట్టు** సక. = సణుగు, వసుగు, బోరు కొట్టు; వి. **ఊదర** = సణుగుడు.

**ఊదరపెట్టు** సక. = పొగవేయు, పొగపెట్టు; వి. **ఊదర** = పొగ, (చుట్టలను ఒక దాని కొకటి ఆనించి) వెలిగించటం.

**ఊదు** అక. = వాచిపోవు, సక. మోతపుట్టించు, గాలి ఎక్కించు, మంట పెంచు, పట్టుకొను, ఉంచు, అదుము, నొక్కు; వి. **ఊదు** = చేపలు పట్టే బుట్ట, వాపు. **ఊద** = వాపు, ఈర్ష్య.

**ఊను** సక. = పొందు, వహించు; వి. **ఊనిక** = దిటవు, దిట్ట తనం, ఆధారం.

**ఊరడిల్లు / ఊరడు** అక. = ఉపశమించు, ఓదార్పు పొందు; వి. **ఊరట** = ఓదార్పు, సహాయం

**ఊరు** అక. = (నీరు)పైకి ఉబుకు, నాను, తడియు, పుట్టు; వి. **ఊట** = ఊరేనీరు.

**ఊరబోవు** అక. = తగ్గిపోవు.

**ఊరార్చు** సక. = ఓదార్చు, ఊరడించు, మందలించు (తెలం.);

**ఊరీకరించు** సక. = ఒప్పుకొను; విశే. **ఊరీకృతం** = ఒప్పుకున్నది, అంగీకరించినది.

**ఊరుకొను /మూరుకొను** సక. = వాసన చూచు, సహించు, ఏమీ చేయకుండు.

**ఊరేగు** సక. = ఊరిమీద తిరుగు; వి. **ఊరేగింపు** = ఏగుపెండ్లి, ఊరిమీద తిరగటం.

**ఊసరిల్లు** అక. = చిక్కిపోవు; విశే. **ఊసరం** = చిక్కిన, కృశించిన, చవిటి, చవుడు పట్టిన.

**ఊహించు** సక. = భావించు, ఆలోచించు; వి. **ఊహ(ం)** = భావం, ఆలోచన.

## ఎ

**ఎక్కాడు** సక. = పురికొల్పు.

**ఎక్కిడు** సక. = మోపెట్టు; వి. ఎక్కు = వింటి నారి.

**ఎక్కు** అక. = ఇష్టమగు, అతిశయించు.

**ఎక్కుడించు** సక. = హెచ్చించు, పెంచు; వి. **ఎక్కుడు** = పైకిపోవటం, వాహనం. **ఎక్కాలు** (బ) = గుణకారాలు. **ఎక్కం** = గనిమ; విశే. **ఎక్కుడు** = ఎక్కువ, గొప్ప.

ఎక్కుపెట్టు సక. = మోపెట్టు.

ఎక్కులుపెట్టు సక. = పురికొల్పు.

ఎగగొట్టు /ఎగవేయు సక. = ఇచ్చిన సొమ్ము తిరిగి ఇవ్వకుండు, ఎగరగొట్టు.

ఎగజల్లు సక. = పైకి చల్లు

ఎగజేపు అక. = పైకి చేపు, పాలివ్వక పోవు.

ఎగదన్ను సక. = పైకి తన్ను.

ఎగదీయు సక. = పైకి తీయు.

ఎగదోయు సక. = పైకినెట్టు.

ఎగబాకు సక. = పైకిపాకు.

ఎగబారు అక. = పైకిపారు.

ఎగబెట్టు సక. = ఎగవేయు.

ఎగబోయు అక. = చెడు సలహాలిచ్చు, సక. సూచించు.

ఎగయు అక. = పైకి ఎగురు, పైకిలేచు; వి. ఎగబోత = పైకివ్యాపించటం. ఎగరోజు = నిట్టూర్పు. ఎగపు = గర్వం. ఎగవు = ఎగరటం.

ఎగవేయు సక. = తిరిగి చెల్లించకుండు; వి. ఎగవేత = అప్పు చెల్లించ పోవటం.

ఎగసిపడు అక. = ఎగిరిపడు, గర్వించు, మండిపడు; వి. ఎగసిపాటు = మిడిసిపాటు, గర్వం.

ఎగురు అక. = పైకి లేచు; వి. ఎగురు = గంతు.

ఎగురులాడు అక. = పైకెగురు; వి. ఎగురులాట = పైకి లేవటం, గంతు.

ఎగ్గాడు /ఎగ్గులాడు సక. = తిట్టు, నిందించు; వి. ఎగ్గు = కీడు, తప్పు, నింద, తిట్టు.

ఎగ్గించు సక. = అగౌరవించు; వి. ఎగ్గింపు = అగౌరవం, అనాదరం.

ఎచ్చరించు/ఎచరించు/ఎచ్చరికించు సక. = హెచ్చరిక చేయు; వి. ఎచ్చరిక చూ. = హెచ్చరిక. ఎచ్చరం = హెచ్చరించు.

ఎడగిల్లు అక.= తొలగు.

ఎడతీయు అక. = ఎడతెగు చూ.

ఎడతెగు అక. = ఎడమగు, దూరమగు, విడిపోవు; వి. ఎడతెరపి = వ్యవధానం.

ఎడపడు అక.= ఎడతెగు.

ఎడపెట్టు సక. = తొలగించు.

ఎడబాయు అక. = వదలిపోవు, దూరమగు; వి. ఎడ బాటు = వియోగం.

ఎడయు అక. = తొలగిపోవు; వి. ఎడయిక = ఎడబాటు, వియోగం.

ఎడరు అక. = విరిగిపోవు; వి. ఎడరు = ఆపద, సందు, ఎడారి.

ఎడలు అక.= విరిగిపోవు, తెగిపోవు, సక. వదిలిపెట్టు.

ఎండగట్టు సక. = ఆరబెట్టు.

ఎండగొట్టు సక. = ఎండునట్లు చేయు

ఎండబెట్టు సక. = ఆరబెట్టు, ఆరవేయు.

ఎండు అక. = (తడి/నీరు) ఇంకిపోవు, మాడిపోవు, ఆరిపోవు; వి. ఎండ = సూర్యుడి వేడి.

ఎత్తికొను అక. = పూను, ప్రయత్నించు, సక. దొంగిలించు, మోయు, ఉద్ధరించు; వి. ఎత్తికోలు = ప్రయత్నం.

ఎత్తిపొడుచు సక. = తప్పులు చెప్పి తిట్టు/వెక్కిరించు; వి. ఎత్తిపొడుపు = ఆక్షేపణ.

ఎత్తివేయు సక. = తీసివేయు, నిర్లక్ష్యం చేయు.

ఎత్తు అక. = పుట్టు, కలుగు, బయలుదేరు, సక. దొంగిలించు, దండెత్తు, పైకెత్తు, సంగ్రహించు,

మోయు, ప్రస్తావించు; వి. ఎత్తు = ఉపాయం, (పావుల) నడక, ఉన్నతి, తూనిక, పూలదండ. ఎత్తుగడ = ఉపాయం, యత్నం; విశే. ఎత్తు = ఉన్నతమైన.

ఎత్తుపెట్టు సక. = పురికొల్పు.

ఎత్తువచ్చు అక. = సరిపోలు.

ఎత్తువడు అక. = వెడిపోవు, లేకపోవు.

ఎత్తువేయు సక. = తూచు; వి. ఎత్తుగడ.

ఎదిరించు సక. = తిరగబడు, ఎదురు చెప్పు; వి. ఎదిరి = విరోధి. ఎదిరింపు = తిరగబాటు, మారు మాట.

ఎదుగు అక. = పెరుగు; వి. ఎదుగు = పెరుగుదల.

ఎదురాడు అక. = ఎదురు చెప్పు, మారాడు; వి. ఎదురు = ముందు భాగం, ఎదటి వ్యక్తి, విరోధి, వలపు కత్తి విటుడి కిచ్చే సొమ్ము. ఎదురు కట్టు = ఎదుటి పోటు; విశే. ఎదురు = ఇతరం.

ఎదురు సక. = ఎదిరించు, తిరగబడు; వి. ఎదురు = ఎదటివ్యక్తి; విశే. ఎదురు = ఇతర వ్యక్తి.

ఎదురుకొను రూ. ఎదుర్కొను అక. = ఎదురు పడు, సక. ఎదిరించు; వి. ఎదురుకోలు = ఆడపిల్లవారు మగపెల్లవారికి ఎదురుగా పోవటం, పెద్దలను ఆహ్వానించటానికి ఎదురు నడవటం. ఎదురుగడ = పోటీ ఒడంబడిక.

ఎదురుచు / ఎద్రుచు అక. = ప్రతికూల మగు, సక. ఎదిరించు; విశే. ఎదురుచుక్క = కాని, వ్యతిరేకమైన.

ఎదురుచూచు సక. = వేచి ఉండు, ప్రతీక్షించు; వి. ఎదురు చూపు = ప్రతీక్ష.

ఎదురుపడు / ఎదుర్పడు అక. = ఎదురుగా వచ్చు, ఎదురు తిరుగు.

ఎదురేగు అక. = ఎదురుపోవు.

ఎదురొత్తు అక. = మారొత్తు.

ఎనయు అక. = సరిపోలు, సక. పొందు, పోలు; వి. ఎనయిక = పొందిక, పోలిక. ఎనిక = లెక్క, పోలిక.

ఎనియు అక. = కలిసికొను; వి. ఎనుపుడు = కలపటం.

ఎనుచు / ఎనుపు ప్రే. = కలుపు, ఎనియ బెట్టు. చూ. ఎనియు

ఎంచు సక. = లెక్కించు, తలచు, ఆక్షేపించు, పొగడు; వి. ఎనిక / ఎన్నిక = లెక్క. ఎంపిక = లెక్కింపు.

ఎన్నికచేయు సక. = లెక్కించు, ఎంచు, గెలిపించు; వి. ఎన్నిక / ఎనిక = లెక్కింపు, గణన, ఎన్నుకోవటం, గెలుపు.

ఎన్నికపెట్టు సక. = లెక్కించు చూ. ఎన్నిక చేయు

ఎన్ను సక. = ఆక్షేపించు, లెక్కించు చూ. ఎన్నిక చేయు.

ఎయిదు / ఎయ్దు అక. = వెంబడించు, వెంట బడు, పొందు.

ఎరగు అక. = దిగు, నమస్కరించు; వి. ఎరగుడు = నమస్కారం.

ఎరగొను అక. = పరవశించు, సక. మింగు; వి. ఎర = ఆహారం, బలి, వ్యసనం.

ఎరియు అక. = కాలు, మండు, బాధపడు; వి. ఎరవలి / ఎరగలి = కార్చిచ్చు.

ఎరుగు సక. = తెలియు, తెలుసుకొను; వి. ఎరుక = తెలివి, పరిచయం, సోది, గుర్తు, జోస్యం. ఎరకువ / ఎరుకువ = తెలివి, జ్ఞానం.

ఎరుకపడు అక. = తెలియవచ్చు; వి. ఎరుక = తెలివి. ఎరుకువ = జ్ఞానం.

ఎఱ్ఱవారు అక. = ఎఱ్ఱబడు, కోపించు; వి. ఎఱ్ఱన/ ఎరుపు = ఎఱ్ఱదనం, విణ. ఎఱ్ఱన/ ఎరుపు = ఎరుపైన.

ఎలయు అక. = చేరు, సమీపించు, ప్రవేశించు, కలుగు, ఇష్టపడు, సక. పొందు; విణ. ఎలగోలు = ముందు నడిచే, మొదటి.

ఎలరుచు / ఎలర్చు అక. = మించు, వికసించు, సంతోషించు; వి. ఎలరు = అతిశయం, వికాసం. ఎలరుపు / ఎలర్పు = సంతోషం.

ఎలుగించు అక. = కూయు; వి. ఎలుగు = కంఠస్వరం.

ఎసకొను / ఎసగు అక. = పురికొను; వి. ఎస = ఆధిక్యం, ఎక్కువదనం. వి. ఎసకం = అతిశయం, విజృంభణ. అవ్య. చాలా, ఎక్కువగా

ఎసగు/ ఎసవు అక. = అతిశయించు, పెచ్చు రిల్లు; వి. ఎసకం = అతిశయం, విజృంభణ. చూ. ఎసకొను.

ఎసరు / ఏసరు అక. ఎసరేగు = మీరు; వి. ఎసరు =వంటకోసం కాచిన నీరు. చూ. ఎసలారు.

ఎసరేగు అక. చూ. ఎసరు .

ఎసలారు అక. = అతిశయించు. చూ. ఎసరు.

ఎసవెట్టు సక. = పురికొల్పు, ప్రోత్సహించు. ఎస అవ్య. = అత్యంతం, చాలా.

## ఏ

ఏకరు /ఏకారు అక. = వాచిపోవు.

ఏకతమాడు అక. = ఆలోచించు; వి. ఏకతం = ఆలోచన, ఒంటరిపాటు.

ఏకీభవించు అక. = ఒప్పుకొను, ఏకీభావం = ఒక్కటికావటం, ఏకత్వం. ఏకం సర్వ. = ఒకటి.

ఏకు సక. = (దూదిని) బాగుచేయు, తిట్టు; వి. ఏకు = దూదిచుట్ట. ఏకుడు = దూదిని ఏకడం.

ఏగు అక. = పోవు; వి. ఏగుపెండ్లి = ఊరేగింపు.

ఏగుదెంచు అక. = వచ్చు, పోవు. చూ. అరు(గు) దెంచు

ఏచు అక. = మించు, విజృంభించు, పెరుగు.

ఏటులాడు అక. = కొట్లాడు; వి. ఏటు = బాణ ప్రయోగం, దెబ్బ.

ఏడుచు /ఏడ్చు అక. = రోదించు, బావురు మను; వి. ఏడుపు/ ఏడ్పు = రోదనం.

ఏతెంచు / ఏగుదెంచు అక. = వచ్చు, పోవు.

ఏపరించు సక. = దుఃఖపెట్టు; వి. ఏపు = ఘనత, ఆధిక్యం, విజృంభణ.

ఏపారు అక. = అతిశయించు, విజృంభించు.

ఏమరచు / ఏమరించు ప్రే. = ఏమార్చు, ఏమరుపాటు కలిగించు; వి. ఏమరుపాటు = పరధ్యానం, ప్రమాదం.

ఏమరిల్లు అక. = ఏమరుపాటు, లోపడు, ప్రమాద పడు; వి. ఏమరుపాటు. చూ.

ఏమరు చూ. ఏమరిల్లు.

ఏయు సక. = బాణం ప్రయోగించు; వి. ఏటు = దెబ్బ.

ఏరు సక. = పడిన వస్తువులను ఒక్కటొకటిగా ఎత్తిపెట్టు.

ఏర్చు అక. = (తల) నొప్పిపుట్టు, సక. బాగు పరచు, చక్కబరచు, తగులబెట్టు; వి. ఏరు = తలనొప్పి. ఏర్పు = మంట.

ఏరుపడు / ఏర్పడు అక. = తేటపడు, కలుగు, వేరుపడు; వి. ఏరుపాటు / ఏర్పాటు = నిర్ణయం, వివరణ.

**ఏలు(కొను)** సక. = పాలించు, కాపాడు, తీసుకొను; వి. ఏలిక = రాజు, పాలకుడు. ఏలికసాని = రాణి. ఏలినవాడు = రాజు, పైఅధికారి. ఏలు బడి = పరిపాలన.

**ఏవగించు** అక. = రోతపడు, అసహ్యపడు, సక. నిందించు, విడుచు; వి. ఏవగింపు = రోత, అసహ్యం. ఏవ(ం) = రోత; విణ. ఏవ(ం) = రోతపుట్టే.

**ఏవపడు** అక. = అసహ్యపడు. చూ. ఏవగించు

**ఏసరు** అక. = మీరు, మించు; వి. ఏస = విజృంభణ; విణ. ఏస = వంకర.

**ఏసరేగు** చూ. ఏసరు.

## ఒ

**ఒగరుచు** అక. = ఒగరుగా ఉండు; వి. ఒగరు = పచ్చికాయల రుచి, తువరం.

**ఒగుడు కరచు** అక. = చిక్కిపోవు, ఎండిపోవు; వి. ఒగుడు = ఎండుటాకు.

**ఒగ్గు** అక. = పూను, కలుగు, సక. ఒడ్డు, వలవేయు, చాచు; విణ. ఒగ్గం = (ఏనుగులను పట్టుకోడానికి తవ్విన) గుంట.

**ఒట్టు** అక. = కలుగు, సక. ఉంచు, రగుల్చు, కాల్చు; వి. ఒట్టడం = కాల్చు, కాల్చడం.

**ఒడగూడు** అక. = అమరు, సిద్ధించు, చేరు.

**ఒడబడు/ ఒడంబడు** అక. = ఇష్టపడు, ఒప్పుకొను, అనుకూలించు, సంతోషించు; వి. ఒడబడిక/ఒడంబడిక/ఒడబాటు = సమ్మతి, అంగీకారం, సంధి.

**ఒడికట్టు** అక. = యత్నించు, సిద్ధపడు; వి. ఒడి = తొడపై భాగం, ఒడుపు, పశుయోని. ఒడికట్టు = ఒడ్డాణం. ఒడిబ్రాలు బహు. = గర్భాదాన సమయంలో ఒడిలో పోసే బియ్యం.

**ఒడియు** అక. = కొద్దిగా పైకెగురు, సక. లాగు, గుంజు; వి. ఒడుపు = దాటు, గెంతు, పూనిక, లాభం, నేర్పు.

**ఒడుచు** ప్రే. = ఓడించు.

**ఒడ్డగిల్లు** అక. = వాలు, ఒరుగు, మించు, ఉప్పొంగు; వి. ఒడ్డగెడపు = ఒకవైపు వాలి మరోవైపు లేవటం.

**ఒడ్డారించు** అక. = ద్వేషించు, ఎదురొడ్డు; వి. ఒడ్డారం = ద్వేషం, ప్రతిఘటన.

**ఒడ్డు** సక. = పందెంవేయు, వలవిసరు, చాచు, దాటు, మొనకట్టు, అడ్డగించు; వి. ఒడ్డనం = పందెం, వ్యూహం. ఒడ్డిమి = పందెం. ఒడ్డు = పందెం, తీరం, వ్యూహం, పూనిక, ఇతరుడు; విణ. ఒడ్డు = స్థూలం, ఎక్కువ.

**ఒంటు** అక. = ఇముడు, అనుకూలపడు, సక. చేరు; వి. ఒంటు = గ్రామాలగుంపు.

**ఒత్తగిల్లు / ఒత్తిలు/ ఒత్తిల్లు/ ఒత్తిగిల్లు** అక. = పక్కకు ఒరగు, వాలు, అంటుకొను.

**ఒత్తిరించు** సక. = మించు, ఆక్రమించు; వి. ఒత్తరం = మయమ్మరం. ఒత్తడి = రాపు, సమ్మర్దం, తరుచు దనం; విణ. ఒత్తడం = తరుచు. చూ. ఒత్తు

**ఒత్తు** అక. = వాలు, ఒరగు, పొడుచుకొను, ఎక్కువగు, సక. అదుము, (కాళ్లు) పిసుకు, (శంఖం) ఊదు, బలాత్కరించు, తుడుచు, తోయు, చేర్చు, తీర్చు, ఆక్రమించు, తొక్కు; వి. ఒత్తు = అదు ముడు, మెత్త, ఆక్రమణ. ఒత్తుడు = అదుముడు. ఒత్తారవు = గట్టిగా అదమటం, సంపీడనం; విణ. ఒత్తు = తరుచు, చాలాసార్లు. ఒత్తడం = తరుచు.

ఒత్తిలి అవ్య. = గట్టిగా, పట్టుగా.

ఒత్తుకొను అక. = పొడుచుకొను. చూ. ఒత్తు

ఒదరు / పొదరు అక. = విజృంభించు, తొందరపడు, సక. నిందించు, తిట్టు.

ఒదలు / పొదలు అక. = వర్ధిల్లు, పెరుగు.

ఒదవు అక. = కలుగు, తగియుండు; వి. ఒదవు బడి = ఉపయోగం; విశే. ఒదవుబడి = ఉపయుక్తం; ఒదిగిలు, ఒదిగిళ్లు బహు.= పాలుగావాలినని. చూ. ఒత్తగిల్లు.

ఒదుగు అక. = తొలగు; వి. ఒదుగువాటు = తొలగిపోవడం. ఒదుగు/ ఒదువు, పొదువు సక. = సమృద్ధమగు, వ్యాపించు. ఒదుగు/ ఒదువు / ఒదుగుబడి = సమృద్ధి; విశే. ఒదుగు/ ఒదువు = సమృద్ధమైన.

ఒదుగువడు అక. చూ. = తొలగిపోవు. చూ. ఒదుగు.

ఒదువు చూ. ఒదుగు.

ఒనగూడు అక. = సిద్ధించు. చూ. ఒడగూడు

ఒనరించు / పొనరించు ప్రే. = చేయు.

ఒనరు / పొనరు అక. = కలుగు, సరిపడు, ఇంగుడు; వి. ఒనరు = పొందిక, ఇంపు.

ఒందు అక. = కలుగు.

ఒప్పగించు / అప్పగించు అక. = ఒప్పనం, ఒప్పగింత = అర్పణం, అప్పగింత.

ఒప్పరికించు సక. = ఉపేక్షించు, నిర్లక్ష్యం చేయు; వి. ఒప్పరికం = ఉపేక్ష, అశ్రద్ధ.

ఒప్పారు చూ. ఒప్పు

ఒప్పించు సక. = అంగీకరింప చేయు. చూ. ఒప్పు

ఒప్పు అక. = బాగుండు, తగు, అంగీకరించు; వి. ఒప్పమి = కీడు, తప్పు. ఒప్పిదం = అందం, అలం కారం, విధం. ఒప్పు = తప్పుకామి, అందం, సమ్మతి. ఒప్పుకోలు = ఒప్పుకోవటం. ఒప్పులాడి = చక్కని స్త్రీ. విశే. ఒప్పిదం ౙ చక్కని.

ఒప్పుకొను సక. = అంగీకరించు, సమ్మతించు; వి. ఒప్పుకోలు = అంగీకారం, సమ్మతి.

ఒరగు అక. = వంగు, వాలు; వి. ఒరగు = వంపు; విశే. ఒరగు = వంగిన, వాలిన.

ఒరపెట్టు చూ. ఒరయు.

ఒరయు సక. = రాచు, రాపిడిపెట్టు, పరీక్షించు, విచారించు, వెతుకు; వి. ఒరయిక/ ఒరపిడి = పిడి.

ఒరలు అక. = ఏడ్చు, మోగు.

ఒరుము అక. = కలయు, కలిసిపోవు.

ఒలయు అక. = వ్యాపించు, ప్రవేశించు, కలుగు, కలియు, చేరు, సక. చుట్టుకొను, కదియు.

ఒలుకు అక. = చిందు, కారు సక. చల్లు, పోయు.

ఒలుచు ప్రే. = చర్మం తీయు, తోలుతీయు.

ఒల్లబోవు అక. = మూర్ఛపోవు, వాడిపోవు, అనాదరంచూపు; వి. ఒల్లబాటు / ఒల్లబోక = అనాదరం, అనిష్టం. ఒల్లమి = అనిష్టం.

ఒసగు సక. = ఇచ్చు; వి. ఒసగు = ఈవి, త్యాగం, బహుమానం.

## ఓ

ఓకరించు రూ. ఓకిలించు అక. = కక్కు, అసహ్యపడు; వి. ఓకర/ ఓకరింత = కక్కు, రోత.

వి. ఓకిలింత = కక్కు, వాంతి.

ఓటురు / ఓటారు అక. = శక్తిహీనమగు; వి. ఓటం/ ఓటమి = అపజయం.

ఓటిల్లు అక. = ఓడిపోవు, సంకోచించు. చూ. ఓడు

ఓటుపడు అక. = అపజయం పొందు, మోసపోవు, పోగొట్టుకొను; వి. ఓటుపాటు = ఓటమి.

ఓడిగిల్లు అక. = కారు, పరిగెత్తు, ప్రవహించు; వి. ఓడిక = (నీరు) ప్రవహించటం, (నీటి) ప్రవాహం.

ఓడు అక. = వీగిపోవు, భయపడు, పారిపోవు, సంకోచించు; వి. ఓటు(మి) = భయం, సంకోచం. ఓటం = అపజయం. ఓడు = ధార, (కుండ) తూట.

ఓంద్రపెట్టు అక. చూ. ఓంద్రించు.

ఓంద్రించు అక. = (గాడిద) కూయు; వి. ఓంద్ర, ఓంద్రింపు = గాడిద కూత.

ఓదార్చు /ఓదారుచు సక. = ఊరార్చు, ఊరడించు, మందలించు (తెలం); వి. ఓదార్పు = ఊరట.

ఓపు అక. = చాలు, సమర్థమగు; వి. ఓపు = ఓపిక. ఓపిక = శక్తి, ఓర్పు. ఓపమి = ఓర్వమి, ఓర్వలేక పోవటం.

ఓము సక. = కాపాడు; వి. ఓమటి = అన్నం, ఆహారం.

ఓరగిల్లు అక. = ఒరగు, వాలు, ఒదుగు; వి. ఓర = అంచు, పక్క. ఓరపాక, వారపాక = వాలు కప్పు గల పాక. ఓరపాటు = వాలు; విణ. ఓర = వాలిన, వంగిన, ఒరిగిన.

ఓరపోవు చూ. ఓరగిల్లు అక. = వాలిపోవు, వంగిపోవు.

ఓరసిల్లు / ఓరసిలు అక. = ఓసరిల్లు, తొలగు; వి. ఓరసింపు = ఓసరిలటం, తొలగటం.

ఓరుచు / ఓర్చు అక. = సహించు, క్షమించు; వి. ఓరుపరి / ఓర్పరి = ఓర్పుకల వ్యక్తి. ఓరుపు/ ఓర్పు/ ఓరిమి = క్షమ, సహనం.

ఓలగించు సక. = సేవించు; వి. ఓలగం = కొలువు (కూటం).

ఓలలాడు / ఓలాడు అక. = తేలు, మునుగు; వి. ఓల = జలక్రీడల్లో వాడే మాట.

ఓవు రూ. ఒవ్వు అక. = సరిపడు.

ఓసరిల్లు రూ. ఓసరు అక. = తొలగిపోవు; వి. ఓసరింత = తొలగిపోవటం.

ఓహటిల్లు రూ. ఓహటించు అక. = వెను దీయు; వి. ఓహటం = పలాయనం, వెన్ను చూపటం.

## క

కక్కసపడు అక. = బాధపడు, సంకటపడు; వి. కక్కసం = కొరడా, బాధ, ఇబ్బంది; విణ. కక్కసం = కఠినం, కష్టమైన.

కక్కసపెట్టు సక. = బాధించు, ఇబ్బందిపెట్టు.

కక్కసించు సక. = బాధించు, ఇబ్బందిపెట్టు.

కక్కు సక. = కడుపులోది బయటకు తెచ్చు; వి. కక్కు = వాంతి. కక్కుడు = కక్కటం. కక్కు దెవులు = వాంతుల రోగం.

కచ్చగట్టు అక. = కాసెకట్టు, గోచిపెట్టు; వి. కచ్చ = కాసె, గోచి. కచ్చడం = గోచిపాత.

కచ్చించు సక. = సారెలిచ్చు, అక. కాసెకట్టు, గోచిపెట్టు, కచ్చగట్టు చూ.; వి. కచ్చియ/ కచ్చె = కలహం, తగాదా, కచ్చ. కచ్చెపోతు = తగాదాల మారి.

కచ్చు సక. = సారెలిచ్చు; వి. కచ్చు = రేకు, సిగ బంతి.

కచ్చుకొను సక. = ఆశించు, కోరు.

**కటుకటుబడు** అక. = కోపించు, బాధపడు; వి. కటుకటు = పళ్లు, కొరకటం, కోపం, ఇబ్బంది.

**కటాక్షించు** సక. = దయదలచు, కడగంట చూచు; వి. కటాక్షం = కడకంటిచూపు, దయ.

**కట్టడచేయు** రూ. కట్టడిచేయు సక. = ఆజ్ఞాపించు, నియమం పెట్టు; వి. కట్టడ, కట్టడి = నియమం.

**కట్టు** అక. = (పశువులు) గర్భంధరించు, కట్టుబడు, సక. బంధించు, ఆరోపించు, కూడబెట్టు, నిర్మించు, ధరించు; వి. కట్టు = బంధం, వస్త్రధారణం, నిబంధన, నిర్బంధం, ప్రదేశం, మితి, పొల్లు. కట్టుక = గర్భస్రావం. కట్టుగడ = కుప్ప వేసినది. కట్టుపాటు/కట్టుబాటు = నిబంధన. కట్టువ = వెలుగు.

**కట్టుబడు** అక. = బద్ధపడు; వి. కట్టుబాటు = నిబంధన.

**కడుగు** అక. = యత్నించు; వి. కడక = యత్నం.

**కడగట్టు** సక. = నిర్ణయించు.

**కడగు** రూ. కఱగు అక. = యత్నించు; వి. కడక/కఱక = యత్నం.

**కడగొట్టు** సక. = చచ్చు; వి. కడగొట్టు = చివరి, ఆఖరి.

**కడచను** అక. = చచ్చు, నశించు, ముగియు, సక. దాటు.

**కడచు** అక. = చచ్చు, గతించు, నశించు, మేర మీఱు, పొచ్చు, సక. దాటు.

**కడతెగు** అక. = పూర్తి అగు, సమాప్తమగు.

**కడతేరు** అక. = చచ్చు, తీరు, సమాప్తమగు.

**కంటుగించు** రూ. కంటుగిల్లు అక. = విరోధించు, నొచ్చు; వి. కంటుకం = విరోధోక్తి, ముల్లు, పక్షి ఎముక, సూదిమొన. కంటుగింపు = విరోధం, అసహ్యం. కంటుసం = విరోధోక్తి.

**కడముట్టు** అక. = సమాప్తమగు, సిద్ధించు; వి. కడ = దిక్కు, అంతం, దూరం, పార్శ్వం, సమీపం.

**కడలుకొను** రూ. కడల్కొను అక. = అతిశయించు, ఉప్పొంగు, వ్యాపించు.

**కడలొత్తు** అక. = వ్యాపించు.

**కడవెళ్లు** అక. = సమాప్తమగు, సక. దాటు; వి. కడ = చివర. కడవాడు = అందరికన్నా చిన్నవాడు.

**కడిగొను** అక. = కబళించు, తిను; వి. కడి = ముద్ద. కడికండలు బహు. = ముక్కలు.

**కడివోవు** అక. = చెడు, చడిపోవు; వి. కడి = వాసన.

**కడుకొను** అక. = అతిశయించు, ఉత్సహించు.

**కడుగు** రూ. కడ్గు అక. = నీటితో తడుపు, ప్రక్షాళించు; వి. కడుగు = బియ్యం కడిగిన నీళ్ళు.

**కత్తరిల్లు** అక. = కదలు, చలించు; విశే. కత్తరి = రంగు రంగుల.

**కత్తిరించు** రూ. కత్రించు ప్రే. = చీల్చు, తుంచు; వి. కత్తిరింపు = చీలిక, చీల్చటం మొ॥

**కత్తిరిల్లు** అక. = భిన్నమగు, ముక్కలగు; వి. కత్తెర = కత్రించే పనిముట్టు.

**కథించు** సక. = చెప్పు; వి. కథ = గాథ. కథకుడు = కథలు చెప్పేవాడు. కథనం = చెప్పటం; విశే. కథితం = చెప్పినది.

**కదంబించు** అక. = కలసిపోవు, సక. ప్రే. కలుపు; విశే. కదంబం = మిశ్రం, కలిసిన, కలగూరగంప అయిన.

**కదలాడు** అక. = చలించు; వి. కదలిక = చలనం, యత్నం.

కదలించు ప్రే. = కదిలేట్లు చేయు,. చూ. కదుపు; వి. కదలిక = చలనం.

కదలు అక. = చలించు, ప్రయాణమగు, యత్నించు; వి. కదలిక = చలనం, యత్నం. కదలుడు = ప్రయాణం.

కదలుచు / కదల్చు చూ. కదలించు.

కదించు / కదియించు ప్రే. = కదిసేట్లు చేయు, దగ్గరకు చేర్చు; వి. కదుపు = గుంపు, మంద.

కదియు / కదియబడు అక. = దగ్గరకు సక. వచ్చు, చేరు.

కదుపు సక. ప్రే. = చూ. కదిలించు

కదుము సక. = ఆక్రమించు; వి. కదుము = వాపు, గడ్డ.

కదురు అక. = అతిశయించు, కలుగు, విజృంభించు; వి. కదురు= నూలు వడికే పనిముట్టు.

కనకనలాడు/కణకణలాడు/కణకణమను అక. = (నిప్పు) బాగా వెలుగు, మండు; వి. కణకణ/ కనకన = మంట వెలుగు.

కనలు అక. = కోప్పడు, మండు; వి. కనలు = కోపం, మంట.

కనారిలు అక. = కోపగించు.

కనికరించు అక. = దయదలచు, కరుణించు, శోకించు; వి. కనికరం/ కనికారం = దయ, దుఃఖం, కరుణ.

కనిపట్టు సక. = వెలికిపట్టు.

కనిపించు అక. = కనబడు, ప్రత్యక్షమగు; వి. కన్ను = నేత్రం, చూపు. కన్నీరు = బాష్పం, అశ్రువు.

కను సక. = చూచు, తెలియు, ప్రసవించు; వి. కను/ కన్ను = నేత్రం, చూపు, జాడ, కణుపు దగ్గరి గుంట, నెమలి పురి మీది భాగం, బండి చక్రం, వంతెన దారి, వలలోని రంధ్రం, మద్దెల మీది నల్లటి మండలం.

కనుగొను సక. = చూచు, తెలుసుకొను; వి. కనుబాటు = దృష్టి, చూపు, దృష్టి దోషం. కనుకలి = చూపు.

కనుపట్టు / కన్పట్టు అక. = చూపట్టు, కనిపించు.

కనుపుగోట్టు సక. = నరుకు, అవమానించు.

కనుపెట్టు / కనిపెట్టు అక. = ఎదురు చూచు.

కనుబ్రాము సక. = వంచించు; వి. కనుకట్టు = కంటికి మరోవిధంగా కనిపించేట్లు చేసే విద్య.

కనుమూయు సక. = మోసగించు; వి. కనుమూత = మోసం. కనుమూసి గంతలు బహు. = కళ్లుకప్పి ఆడే ఆట.

కను మొరగు సక. = మోసగించు, అదృశ్యమగు.

కందళించు అక. = మొలుచు, పుట్టు; వి. కందళం = మొలక, కపాలం.

కందు అక. = వేడెక్కు,, నల్లబడు; వి. కందు = తాపం, నలుపు, బిడ్డ. కందువు = బిడ్డ. కందెన = మసి.

కందువారు అక. = నల్లబడు, మలినమగు.

కన్నడించు సక. = ఉపేక్షించు, లక్ష్యపెట్టకుండు; వి. కన్నడ = ఉపేక్ష. కన్నడీడు = నిర్లక్ష్యం చేసేవాడు, పట్టించుకోని వాడు. కన్నళవు = ఉపేక్ష.

కన్నపెట్టు సక. = కన్నం వేయు, దొంగిలించు; వి. కన్నం = (దొంగపెట్టిన) సొరంగం, బొక్క.

కన్ను మొరగు / కనుమొరగు సక. = మోసగించు.

**కపటించు** అక. = వంచించు, మోసగించు; వి. కపటం = మోసం.

**కప్పురపడు** అక. = తొట్రుపడు; వి. కప్పురం/ కప్పుర పాటు = తొట్రుపాటు.

**కప్పు / కప్పుదెంచు** అక. = కమ్ము, వ్యాపించు, ఆవరించు, సక. ఆచ్ఛాదించు; వి. కప్పు = నలుపు, ఇంటిపై భాగం, చీకటి, ఆచ్ఛాదన, పంటి నొక్కు. కప్పుడు = ఆచ్ఛాదనం. కప్పుమల = కాటుక కొండ. కప్పురాయి = నీలమణి.

**కబళించు** సక. = మింగు; వి. కబళం = ముద్ద, కడి, గ్రాసం. కబళనం = మింగటం; విణ. కబళితం = మింగిన.

**కమరు** అక. = కాలు; వి. కమరు = కాలినకంపు.

**కమరుచు / కమర్చు** సక. ప్రే. = కాల్చు; వి. కమరు = కాలినకంపు.

**కమలు / కమరు** అక. = కందు, కాలు.

**కమియు** అక. = చూ. కవియు, నలిగిపోవు, మాగు.

**కముచు** సక. = తీసుకొను, మింగు.

**కంపించు** అక. = వణకు; వి. కంపం = వణకు. కంపనం = వణకటం, కదలటం; విణ. కంపితం = వణికిన.

**కమ్మరించు** సక. = మూయు.

**కమ్ము** అక. = కవియు, ఉబుకు, వ్యాపించు, రూ. క్రమ్ము, కమ్మెదెంచు, సక. సాగగొట్టు; విణ. కమ్ముదల = వ్యాప్తి, వ్యాపనం.

**కమ్ముకొను** అక. = ఆవరించు.

**కరగు** అక. = కరిగిపోవు, జావకారు, ద్రవించు; వి. కరగుట/ కరగటం = కరిగిపోవటం.

**కరచు** సక. = నేర్చు, కాటువేయు; వి. కరద = బుద్ధి, కరవు = దుర్బోధ, చెడుసలహా.

**కరాళించు** అక. = బొబ్బరించు, సకిలించు, సక. నిందించు; విణ. కరాళం = పొడవైన, ఎత్తయిన, భయపట్టే.

**కరిసించు** సక. = ఘర్షించు, పోరాడు.

**కరుడుగట్టు** అక. = గట్టిపడు, ముద్ద గట్టు; వి. కరుడు = గట్టిముద్ద, రోజువారీ లెక్క.

**కరుకు** సక. = రాచు, గీచు; వి. కరుకు = ఆకు మాడ్చి రాసిన పొడి.

**కరుణించు** అక. = దయదలచు, కనికరించు; వి. కరుణ/ కారుణ్యం = దయ, కనికరం. కారుణికుడు = దయగలవాడు.

**కలకబారు** అక. = కలతపడు, కలగు.

**కలగబడు** అక. = సంక్షోభించు, అల్లకల్లోలమగు; వి. కలక/ కలకువ = కలత.

**కలగుండుగొను** రూ. కలగుండుపడు అక. = కలగిపోవు, కలతబడు; వి. కలగుండు = కలక, కలత, క్షోభం.

**కలచు** ప్రే. = కలతపెట్టు.

**కలతపడు** అక. = కలకబారు; వి. కలత = క్షోభం, కలక. చూ. కలగబడు

**కలపు/ కలుపు** ప్రే. = కలబెట్టు, కలియజేయు; వి. కలపం/ కలపటం = కలియ జేయటం.

**కలయబడు** అక. = కలిసిపోవు; వి. కలయిక = సంయోగం, కలిసిపోవటం.

**కలయు / కలియు** సక. = కూడు, కలిసిపోవు; వి. కలయిక = సంయోగం. కలయంపి/ కళ్లాపి = పేడ మొ॥ కలిపిన నీళ్ళు. కలవ = కలి

యటం, కలిపిన ఇసుక, సున్నం. కలవంటుకం = చిత్రాన్నం, పులిహోర. కలుపుగోలు (తనం) = కలిసిపోయే గుణం; విశే. కలవ = కలిపిన.

**కలవరపడు** అక. = కలతపడు; వి. కలవరం/కలవర పాటు = చింత, కలత.

**కలవరపోవు** అక. చూ. కలవరపడు.

**కలవరించు** అక. = మైమరచి మాట్లాడు, కలలో మాట్లాడు; విశే. కల = స్వప్నం. కలవరింత = మైమరచినమాట.

**కలహించు** అక. = పోట్లాడు; వి. కలహం = పోట్లాట, జగడం.

**కలియబెట్టు / కలబెట్టు** సక. = కలిసేటట్లు చేయు. చూ. కలుపు

**కలియు** సక. = కలిసిపోవు, పొందు; వి. కలయిక = సంయోగం.

**కలుగు / కల్గు** అక. = అగు, ఉండు, భరించు, పుట్టు, కూడు, సక. పొందు; వి. కలిమి = కలగడం, సంపద. కలిమిచెలి = లక్ష్మి. కలిమి దండుగ = తప్పు చేయకపోయినా డబ్బున్న వారినుంచి రాజు తీసుకొనేసొమ్ము.

**కలుచపడు** అక. = కలతపడు; వి. కలుచు = తప్పు, కలత.

**కలుపు** ప్రే. = కలిసేట్లు చేయు, కలియబెట్టు; వి. కలుపుగోలుతనం = కలిసిపోయే గుణం, అభేదం. కలువం / కల్వం=మందునూరే రాయి; విశే. కల్పుగోలు / కలుపుగోలు = కలిసి పోయ్యే, భేదం లేని.

**కలుషించు** అక. = కలతబడు, కలకబారు; వి. కలుషం = పాపం, దున్నపోతు. కాలుష్యం = మలినత్వం; విశే. కలుషం = మలినమైన, కలక బారిన.

**కల్పించు** సక. = కలిగించు, సృష్టించు, రచించు; వి. కల్పన = రచన, సృష్టి, క్లుప్తి; విశే. కల్పితం = సృష్టించిన, పుట్టించిన.

**కల్లువడు** అక. = స్తంభించు, మ్రాన్పడు; వి. కల్లు = రాయి.

**కవలుకొను / కవలువోవు** అక. = ఒకటి పోగా మరొకటి చేరు; వి. కవ = జంట, జోడు. కవలు = వేదాదులు చదివేటప్పుడు ఒకటి పోగా మరొకటి చేరటం; విశే. కవ = జంటయిన, జోడు కట్టిన.

**కవించు / కవియించు** ప్రే. = ఉసిగొల్పు. కవియు చూ.

**కవియు/ కవిచేయు, కవియుదెంచు** అక. = ఎదుర్కొను, మీదకు వచ్చు.

**కవ్వు** సక. = మింగు, కాజేయు.

**కష్టపడు** అక. = బాధపడు, దుఃఖపడు; వి. కష్టం = దుఃఖం, పాపం. కష్టపాటు = కష్టపడటం, బాధ; విశే. కష్టం = పాపంగల, దుఃఖంగల, చొరరాని.

**కష్టించు** సక. = కష్టపడు, శ్రమించు.

**కసరు** అక. = కదలు, చలించు, సక. కోపించు, విసుక్కొను; వి. కసరు = కోపం, విసుగు, చికాకు, వానగాలి, లాభం. కసి = కోపం, పగ, దురద, కోరిక.

**కసిమసగు** అక. = విజృంభించు, సక. ఖండించు, చంపు; వి. కసిమసి = తొట్రుపాటు, తొందర పాటు. కసిమిరి = తీట, దురద.

కసుగందు అక. = బాగావాడిపోవు; వి. కసు గందు = పసిబిడ్డ, నలుపు.

కసుగు అక. = నలిగిపోవు, ప్రే. సక. నలుపు, పులుము, బాధించు.

కళవళపడు అక. = కలతపడు, తొట్రుపడు, చూ. కలవలించు; వి. కళవళం = కలత, తొట్రు పాటు. కళవళపాటు = తొట్రుపాటు.

కళవళించు అక. = కళవళపడు చూ. కలతపడు, తొట్రుపడు; వి. కళవళం = కలత.

కళాసించు అక. = అలసిపోవు.

కాగు అక. = తపించు, వేడెక్కు, కోపపడు; వి. కాక = తాపం, వేడి, జ్వరం, తపం, కోపం. కాగుడు = తాపం, తపన; విణ. కాక = వేడిగల.

కాంక్షించు సక. = కోరు, వాంఛించు; వి. కాంక్ష = కోరిక, ఇచ్ఛ; విణ. కాంక్షితం = కోరిన.

కాచు ప్రే. = కాగునట్లు చేయు, కాగబెట్టు, అక. (ఎండ) కాయు, (కాయ) కాచు, సక. రక్షించు, ఎదురు చూచు, సహించు; వి. కాపడం = వేడి వస్తువులతో ఒత్తడం. కాక = వేడి, తాపం. కాపు = కాపరం, సంసారం, గృహస్థు, పండించేవాడు, రక్షకుడు. కాపుడు = రక్ష(ణ). కాపాడు చూ.

కాంచు సక. = చూచు, పొందు, బిడ్డను (కను), భాగ్యం పొందు; వి. కాన్పు, కానుపు = ప్రసవం, ఈత, చూడటం.

కాటుకపట్టు అక. = నల్లబడు; వి. కాటుక = నల్లటి వస్తువు. కాటుక కొండ = నల్లటి కొండ.

కాటులాడు / కాట్లాడు అక. = పోట్లాడు; వి. కాటు = కరవటం, కరచిన గాయం, మాడి అడుగంటడం. కాట్లాట = పోరు, తగాదా.

కాటుక = నల్లని ద్రవ్యం; విణ. కాటుక = నల్లని.

కాటుపోవు అక. = మాడిపోవు, అడుగంటు.

కాడు రూ. గాడు అక. = నాటు, గుచ్చుకొను.

కాడుచేయు సక. = నాశంచేయు; వి. కాడు = శ్మశానం, వల్లకాడు, అడవి.

కాడుపడు రూ. కాడ్పడు అక. = కలతపడు, కనిపించకపోవు, నష్టపోవు.

కాండ్రించు సక. = పెద్దగా చప్పుడు చేయు, ఉమ్మే టప్పుడు చప్పుడుచేయు; వి. కాండ్రు = పులి అరవు. కాండ్రింపు/గాండ్రింపు = గర్జన, బొబ్బ, కేక.

కానబట్టు అక. = కనబడు, కనిపించు చూ. కాంచు, కానిపించు.

కానిపించు / కాన్పించు అక. = ప్రత్యక్షమగు; వి. కానుపు/ కాన్పు = చూపు. చూ.కనిపించు

కాపాడు అక. = రక్షించు; వి. కాపరి = రక్షకుడు, కావలివాడు. కావలివాడు = కాపరి, రక్షకుడు. కావలి = రక్షణ. కాపుగడ = రక్షణ. కాపు = రక్షించటం.

కాపురించు అక. = కాపరం చేయు, వసించు; వి. కాపరం/ కాపురం = సంసారం, నివాసం.

కాయు అక. = (ఎండ మొ॥) ప్రకాశించు.

కారించు సక. = బాధించు.

కారు అక. = స్రవించు, రాలు.

కారుకొను / కార్కొను అక. = నల్లబడు; వి. కారు = నలుపు.

కారుకొను అక. = సందడించు.

కారుచు/ కార్చు/ కాడించు ప్రే. = నాటించు.

కాలు అక. = తగలపడు; వి. కాలుపు/ కాల్పు = కాల్చటం.

కాలుకొను / కాల్కొను సక. = కాలూదు చూ. నిలుచు.

కాలుచు / కాల్చు సక. = కాలునట్లు చేయు; వి. కాలుపు/ కాల్పు = తగలబెట్టడం, కాల్చడం.

కాలుద్రవ్వు / కాల్ద్రవ్వు అక. = సిద్ధపడు, యత్నించు.

కాలుద్రొక్కు అక. = చూ. కదియు

కాలు మడచు / కాల్మడచు అక. = మూత్ర విసర్జన చేయు; వి. కాలుమడి/కాల్మడి = మూత్రం.

కావడించు సక. = కావడిలో మోయు; వి. కావటి/ కావడి = రెండుకొనల్లో ఉట్లు కట్టిన వెదురు బద్ద.

కావరించు అక. = మదించు, క్రొవ్వెక్కు; వి. కావరం = మదం, క్రొవ్వు. కావరుడు = పొగరుబోతు.

కావలయు అక. = అవసరమగు.

కావిగొను అక. = ఎఱ్ఱబారు; వి. కావి = కాషాయ వస్త్రం, ఎరుపు. కావితాలుపు = సన్యాసి. కావి రాయి = ఎఱ్ఱముద్దరాయి.

కావించు ప్రే. = చేయు, నెరవేర్చు చూ. అగు.

కాసించు సక. = కాసెగాకట్టు, నడుము కట్టు; వి. కాసియ/ కాసె = నడికట్టు, దట్టి. కాసీడు = రాతిపని వాడు.

కాసెవోయు అక. = గోచిపెట్టి కట్టు; వి. కాసె = దట్టీ.

కికురించు / కిక్కురించు అక. = మోసగించు, చూ. కికురువెట్టు చూ. కికురువొడుచు ; విణ. కిక్కురింత/ కిక్కురు/ కికురింత/ కికురు = మోసం.

కికురువెట్టు / కిక్కురవట్టు సక. = మోస గించు చూ. కికురించు.

కికురువొడుచు సక. = మోసగించు చూ. కికురించు

కింకిరిపడు అక. = కోప్పడు, రోతపడు; వి. కింకిరి = కోపం, రోత. కింకిరిపాటు = కోప్పడటం.

కిచకిచలాడు అక. = (పక్షులు మొ॥) కూయు, రొదచేయు; వి. కిచకిచ = పక్షులు మొ॥ కూత.

కిచకొట్టు చూ. కిచకిచలాడు.

కిటకిటలాడు అక. = రద్దీగా ఉండు, సమ్మర్దంగా ఉండు; వి. కిటకిట = రద్దీ.

కిట్టు సక. = సమీపించు, దగ్గరకు చేరు.

కిదుకు అక. = (పసిబిడ్డలు) మూలుగు, సణుగు.

కినియు అక. = కోపించు, సమీపించు; వి. కినుపు/ కిన్క/ కినుక = అలుక, కోపం. కినుక కాడు = కోపదారివాడు.

కినువడు అక. = కోపపడు, చూ. కినియు

కిరుకుపొడుచు అక. = తిరుగు; వి. కిరుకు = తిప్పు, తిప్పట.

కిలకిలలాడు అక. = కిలకిలమను; వి. కిలకిల = నవ్వు, రొద.

కిలకొట్టు అక. = మోతపుట్టునట్లు నవ్వు.

కిలారు / కిలార్చు చూ. కిలారించు.

కిలారించు అక. = పెద్దగా ఏడ్చు, గుక్కపట్టి ఏడ్చు

కివ్వు అక. = వచ్చు.

**కీచఱ్లాడు** అక. = కలహించు, జగడమాడు.

**కీచుమను** అక. = రొదపెట్టు.

**కీచులాడు** అక. = పోట్లాడు, జగడమాడు; వి. కీచులాట = పోట్లాట.

**కీడుపడు** అక. = తక్కువగు; వి. కీడుపాటు/ కీడ్పాటు = తక్కువపాటు.

**కీర్తించు** సక. = పొగడు; వి. కీర్తన/ కీర్తనం = స్తుతి, పొగడ్త. కీర్తి = పేరు; విశే. కీర్తనీయం = పొగడదగిన. కీర్తితం = పొగడ్తపొందిన.

**కీలుకొను** అక. = తగులుకొను, నాటుకొను, చూ. కీలుపడు; వి. కీలుకొలుపు = తగులం, తగిలించటం.

**కీలుపడు / కీల్పడు** చూ. కీలుకొను.

**కుంకు / క్రుంకు** అక. = మునుగు, అస్త మించు, చచ్చు; వి. క్రుంకుడు = అస్తమయం. క్రుంకుడుగట్టు = పశ్చిమాద్రి. క్రుంకుమల = అస్తపర్వతం.

**కుంగబడు / క్రుంగబడు** అక. = కుంకు, దిగబడు, కుంగిలు చూ.

**కుంగిలు / క్రుంగిలు** చూ. కుంగబడు.

**కుక్కివడు** అక. =పల్లమగు, గుంటపడు.; వి. కుక్కి = పల్లం; విశే. కుక్కి = లోతు.

**కుక్కు / క్రుక్కు** సక. = చదుము, అడచు, నొక్కు, తురుము; వి. క్రుక్కుడు = కుక్కిటం.

**కుంగు** అక. = దిగబడు, కిందికిపోవు; వి. క్రుంకుడు/ కూకటం = అస్తమయం.

**కుచ్చెతీయు** సక. = (రత్నాదులు) సానబట్టు.

**కుంచు** ప్రే. = కుంగజేయు, దిగబెట్టు.

**కుట్టు** సక. = కలిపి ఒకటిచేయు, దారంతో కలుపు; వి. కుట్టడం = కుట్టుపని. కుట్టుడు = కుట్టడం. కుట్టు = కుట్టినది. కుట్రుపువాడు = కుట్టు పనివాడు.

**కుడుచు** సక. = తిను, తాగు, అనుభవించు; వి. కుడుపు = భోజనం. కుడుపరి = తినేవాడు, భోక్త, అనుభవించేవాడు. కుడుము = ఒక రకం భక్ష్యం, మోదకం.

**కుంటు( గించు)** సక. = కుంటిగా నడచు; వి. కుంటు = కాళ్లులేని వ్యక్తి. కుంటిగాము = శని గ్రహం; విశే. కుంటు = కాళ్లులేని. కుంటు పిచ్చుక = కాళ్లులేని, పిచ్చుక కుంటు.

**కుంటుపడు** అక. = కుంటి అగు, చెడు, తగ్గు, తెగు. చూ. కుంటు( గించు)

**కుంటువారు** అక. = బలహీనపడు

**కుండమార్చు** సక. = ఒకటిచ్చి మరొకటి తీసుకొను, ఎదురు బదురుగా పెండ్లాడు; వి. కుండ మార్పు = వినిమయం, మార్పిడి.

**కుండలించు** సక. = సున్నచుట్టు; వి. కుండలి = గుండ్రగా తిరిగే నృత్యం, గొండ్లి. కుండలీకరణం = సున్నచుట్టడం, బ్రాకెట్లలో ఉంచడం.

**కుతిలపడు** అక. = బాధపడు; వి. కుతిల/ కుతిలపాటు = బాధ.

**కుతిలపెట్టు** సక. = బాధించు; వి. కుతిల = బాధ.

**కుత్సించు** అక. = రోతపడు, సక. దూషించు, తిట్టు; వి. కుత్స/ కుత్సనం = నింద, తిట్టు; విశే. కుత్సితం = నికృష్టం, నీచం.

**కుదించు / కుదియించు** ప్రే. = తగ్గించు, కుంచు; వి. కుదింపు = తగ్గింపు.

**కుదికిలబడు** అక. = గొంతు కూర్చుండు. చూ. కుదికిలు

**కుదికిలు** చూ. కుదికిలబడు.

**కుదియు** అక. = అణగు, కుంగు, తగ్గు, తిరుగు, మరలు; వి. కుదియింపు = తగ్గింపు.

**కుదిరించు** చూ. కుదురుచు.

**కుదుచు** చూ. కుదించు.

**కుదురు** అక. = అనుకూలపడు, సరిపడు, స్థిరమగు; వి. కుదురు = అమరిక, నిలకడ, నెమ్మది, కుండ మొ॥ వాటి పీఠం, పాదు. కుదిరిక = అమరిక, నిలకడ, నెమ్మది.

**కుదురుకొను** అక. = కదలకుండు. చూ. కుదురుపడు

**కుదురుచు / కుదుర్చు** సక. = అమర్చు, కుదిరించు.

**కుదురుపడు** అక. = నెలకొను, స్థిరపడు; వి. కుదురుపాటు = కుదిరిక. చూ. కుదురుకొను

**కుదువపెట్టు** సక. = తాకట్టుపెట్టు; వి. కుదువ = తాకట్టు.

**కునికిపడు** అక. = తూగిపడు; వి. కునికిపాటు, కునుకు = తూగు.

**కుందు** అక. = దుఃఖించు, కుంగు, తగ్గు; వి. కుందు = దుఃఖం, శోకం, తక్కువ.

**కుప్పతిలు** అక. = కుప్పవడు; వి. కుప్ప = రాశి. కుప్ప(న)గూర = గుట్టపడటం.

**కుప్పవడు** చూ. కుప్పతిలు.

**కుప్పించు** అక. = ఊపిరిబిగబట్టు, ఎగురు; వి. కుప్పిగంతులు బహు = ఎగుర్లు, గెంతులు.

**కుప్పిగంతుకొను** అక. = దూకు, ఎగురు; వి. కుప్పిగంతులు బహు. = గెంతులు

**కుమారిలు** అక. = కుమిలిపోవు.

**కుములు** అక. = లోలోపల బాధపడు; వి. కుమ్ము = పొట్టు నిప్పు, దాలి.

**కుమ్మరించు** సక. = దొర్లించు, ఎత్తిపోయు; వి. కుమ్మరింత = ఎత్తిపోయటం. కుమ్మరింపు = ఎత్తిపడ వేయటమనే కుస్తీపట్టు.

**కుంభించు** సక. = ఊపిరి బిగబట్టు.

**కుమ్ము** సక. = నలగ్గొట్టు, దంచు, పొడుచు; వి. కుమ్ము = పొట్టునిప్పు, కుమ్మె = పోటు, దెబ్బ.

**కుమ్మెలుపోవు** అక. = గాయమగు, దెబ్బతగులు; వి. కుమ్మె = దెబ్బ, పోటు.

**కురియు** సక. = (వాన) పడు.

**కురుచపడు** అక. = పొట్టియగు, తగ్గు; విణ. కురుచ, కురచ = పొట్టి, చిన్న. కుఱ = చిన్న.

**కులుకు** అక. = వగలుపోవు, ఒయ్యారం చూపు, సక. పూయు, పోయు, వెదజల్లు, వేయు, కుదిలించు, వణకు; విణ. కులుకు = శృంగారపు కదలిక. కులుకులాడి = కులికే స్త్రీ.

**కుసిలించు** అక. = అసంతృప్తితో ఉండు, దుఃఖించు; వి. కుసిలింత = తృప్తిలేమి, దుఃఖం; విణ. కుసిగుంపులు బహు. = బాధలు, శ్రమలు.

**కుసుమించు** అక. = పూవు పూయు; వి. కుసుమం = పువ్వు.

**కుసులు** చూ. కుసిలించు.

**కుస్తరించు** సక. = ఊరడించు, సమాధానపెట్టు, సవరించు, చరచు.

**కుళ్ళగించు/ క్రుళ్లగించు** అక. = మన సులో బాధపడు, సక. పెల్లగించు, కుదిలించు; వి. **కుళ్ళ గింత** = పెల్లగింపు. **క్రుళ్లగింత** = మనసులో బాధ.

**కుళ్ళు / క్రుళ్ళు** అక. = మనసులో బాధపడు, చెడిపోవు; **క్రుళ్లుపోతు** = ఈర్ష్యాపరుడు; విణ. **కుళ్లు** = చెడిపోయిన, తెగపండి వాసన గొట్టే.

**కూకరించు** అక. = కూకలు పెట్టు, అరచు, కేకలు వేయు; వి. **కూక** = అరుపు.

**కూకలిడు** సక. = తిట్టు, కేకలు వేయు; వి. **కూక** = అరుపు.

**కూకలుపెట్టు** చూ. కూకలిడు.

**కూడబడు** అక. = (ఒకచోటికి) చేరు, **కూడ** అవ్య. సహా; వి. **కూటువ / కూటువు** = గుంపు, గుట్ట, పోగు, రాశి. **కూడలి** = రెంటి మూటి కూడిక. **కూడిక** = చేరిక, కలయిక. **కూడుదల** = లాభం.

**కూడబెట్టు** సక. = (డబ్బు) దాచిపెట్టు, సంపాదించు, చేర్చు. చూ. కూడబడు

**కూడముట్టు** సక. = తరిమికొట్టు. చూ. ముట్టు

**కూడు** అక. = తగు, సరిపడు, సరిపోవు, సక. పొందు, కూర్చు; వి. **కూడిక** = చేరిక. **కూడుదల** = లాభం.

**కూపెట్టు** అక. = అరచు, ఏడ్చు, మొరపెట్టు, మొత్తుకొను; వి. **కూయి**= మొర, కేక, ఏడ్పు.

**కూయు** అక. = అరచు, మొరపెట్టు వి. **కూయి/ కూత** = అరుపు, మొత్తుకోలు, ఏడ్పు.

**కూరు** అక. = కలుగు, దూసుకొనిపోవు, సక. పొందు; వి. **కూరిమి / కూర్మి** = పొందిక, స్నేహం.

**కూరుకొను / కూర్కొను** అక. = దిగబడు, చొచ్చుకొని పోవు.

**కూరుచు / కూర్చు** అక. = ఇష్టపడు, నచ్చు, కూడబెట్టు; వి. **కూరిమి/ కూర్మి** = స్నేహం, ప్రియత్వం. **కూరుపరి/ కూర్పరి** = నేర్పరి, ఇష్టుడు. **కూరుపు/ కూర్పు** = కలయిక, మైత్రి; విణ. **కూర్చు/ కూరుచు** = ఇష్టమైన, నచ్చిన.

**కూర్చుండు/కూర్చొను/ కూర్చుండబడు** అక. = కూలబడు, ఆసనమగు.

**కూలబడు** అక.= కూర్చుండు, కూలిపోవు.

**కూలు** అక. = పడు, చచ్చు.

**కూలుచు / కూల్చు** సక. ప్రే. = చంపు, పడవేయు.

**కృతపడు** అక. = గడచిపోవు, విడబడు; విణ. **కృతం** = జరిగిన, చేసిన, నొప్పించిన.

**కృశించు** అక. = చిక్కిపోవు, సన్నగిల్లు, బక్కపడు; విణ. **కృశం** = బక్క, సన్న.

**కెడపు** ప్రే. = పడవేయు, నెట్టు, తోయు, చంపు; వి. **కెడ** = పక్క, పార్శ్వం. **కెడయిక** = పడటం, చావు.

**కెడయు** అక. = పడు, చచ్చు; వి. **కెడయిక** = పాటు, చావు. **కెడవు** = పాటు, పతనం.

**కెరకొట్టు** అక. = కలకలమను.

**కెరలియాడు** అక. = చెలరేగు.

**కెరలు** అక. = అతిశయించు, మించు, ఆగ్రహించు, అరుచు, విజృంభించు, సంభ్రమించు.

**కెరలువోడుచు** అక. = వర్ధిల్లు, విజృంభించు.

**కెలుకు / గెలుకు** సక. = కలబెట్టు, పెల్లగించు; వి. **కెలను, కెలకు** = దిక్కు, పక్క.

**కెలయు** అక. = విజృంభించు.

**కెల్లగించు** సక. = పెల్లగించు, రేగగొట్టు.

**కేకరించు** అక. = కేకలువేయు, సకిలించు, ఇకిలించు, సక. కటాక్షించు, దయదలచు; వి. **కేకరింత** = కేకలువేయుటం, సకిలించటం.

**కేకిసలుపెట్టు** సక. = చప్పట్లుకొట్టు, కేరింతలు కొట్టు; వి. కేకిసలు బహు. = చప్పట్లు.

**కేటాయించు** సక. = వేరు పరచు, వేరుగా చూపు; వి. కేటాయింపు = వేరుగా చూపిన పద్దు.

**కేడించు** చూ. క్రేడించు.

**కేరడించు** సక. = వక్రీకరించు; వి. కేరడం = ఉపేక్ష, తిరస్కారం, వంకర మాట.

**కేరించు** అక. = విజృంభించు; వి. కేరింతలు బహు. = చప్పట్లు.

**కేరు** అక. = ఉత్సహించు, కుతూహలపడు, విజృంభించు, సక. తిరస్కరించు, వెక్కిరించు, అవమానించు; వి. **కేరుపు** = విజృంభణ. **కేరింత** = ఉత్సాహంతో పెట్టే కేక.

**కేలుమోడ్చు** సక. = నమస్కరించు; వి. కేలు మోడ్పు = నమస్కారం.

**కైకొను / కయికొను** అక. = పూనుకొను, సక. గ్రహించు, తీసుకొను, లక్ష్యపెట్టు; వి. కయి/ కై = చేయి. కేలు = చేయి, కయికోలు/ కైకోలు = అంగీకారం, ఒప్పుదల, స్వీకారం. కైకొలుపు/ కయికొలుపు = పూనిక, గ్రహణం. కై జీతం = బత్తెం. కైచాపు = నమస్కారం.

**కైజారు / కయిజారు** అక. = ఒరిగిపోవు, వాలి పోవు.

**కైమోడ్చు / కయిమోడ్చు** సక. = నమస్కరించు; వి. కైమోడుపు/కైమోడ్పు = నమస్కారం.

**కైసేయు** సక. = అలంకరించు, పూజించు; వి. **కైసేత** = అలంకారం, పూజ.

**కైవ్రాలు / కయివ్రాలు** అక. = దిగు, జారు, ఒరిగిపోవు, పడు.

**కొక్కరించు/కొక్కిరించు** అక. = (కోతులు) వెక్కిరించు, (పక్షులు) కాళ్లతో కెలుకు; వి. **కొక్కరింత / కొక్కిరింత** = కొక్కిరించటం.

**కొంకరలుపోవు** అక. = నిగిడిపోవు, మెలి దిరుగు; వి. కొంకర = వంపు. కొంకి = వంపు సీల.

**కొంకు** అక. = భయపడు, జంకు, వెనుదీయు, సంకోచించు; వి. కొంకు = భయం, జంకు, సంకోచం, వెనుదీయటం. కొంకుపాటు = భయపడటం, సంకోచించటం.

**కొంకుపోవు** అక. = కొంకరలు, తిరుగు; వి. కొంకుపాటు.

**కొంగుమాయు** అక. = బహిష్ఠగు; వి. కొంగు = చీరచెరగు.

**కొంగోడువడు** అక. = ఒడ్డిగిలు, ఒరిగిపోవు.

**కొంచించు** అక. = సంకోచించు, జంకు.

**కొంచు** రూ. కొంజు అక. = సంకోచించు.

**కొంచెపడు** అక. = తక్కువపడు, సన్నగిల్లు; వి. కొంచెకాడు = అల్పుడు, సామాన్యుడు. కొంచె కత్తె = అల్పురాలు, సామాన్యురాలు.

కొంచెతనం = సామాన్యత. అల్పత్వం; విణ. కొంచియం, కొంచెం = తక్కువ, కొద్ది.

కొంజు రూ. కొంచు అక. = సంకోచించు.

**కొట్లాడు** అక. = బాధపడు; వి. కొట్టు = దెబ్బ, తాకు. కొట్లాట = తగాదా, దెబ్బలాట. కొట్లాడు చూ.

కొట్టు సక. = తన్ను, దెబ్బలు వేయు; వి. కొట్టు = దెబ్బ.

**కొట్టులాడు** అక. = పోట్లాడు, జగడమాడు; వి. కొట్టులాట/కొట్లాట = దెబ్బలాట.

**కొండాడు** సక. = పొగడు; వి. కొండాట = పొగడ్త. కొండాటం = సంతోషం.

**కొతుకు / కొదుకు** అక. = మాటలు మింగు; వి. కొదువ/కొదవ = కొరత. చూ. కొతుకు పడు

**కొతుకుపడు** అక. = మాటలు మింగు, సంకుచితమగు, తక్కువగు. వి. కొతుకు = మింగిన మాట, సంకోచం.

**కొదరు** అక. = పెరుగు, చెదరు, రేగు.

**కొనకొను** సక. = యత్నించు.

**కొనలిడు** అక. = వర్ధిల్లు, పెరుగు; వి. కొన = చివర, కొస. చూ. కొనలొత్తు

**కొనలొత్తు** సక. చూ. కొనలిడు.

**కొనసాగు** అక. = వర్ధిల్లు, పెరుగు, సిద్ధించు.

**కొనిపోవు** సక. = తీసుకొనిపోవు.

**కొనియాడు** సక. = పొగడు, ఆదరించు, కాపాడు, కొలుచు; వి. కొనియాట = పొగడ్త, ఆదరం, రక్షణ.

**కొనివచ్చు** సక. = తెచ్చు.

**కొను** అక. = నాటు, సరిపడు, సక. దొంగిలించు, వెలకుతీసుకొను, గ్రహించు, పట్టుకొను, లక్ష్యపెట్టు, దెబ్బవేయు; వి. కొనుబడి/కొనుగోలు = క్రయం. కొనుమొదలు = కొనటానికి చెల్లించిన ధనం.

**కొందలపడు** అక. = కలతపడు, క్షోభించు; వి. కొందలం = కలత, క్షోభ. కొందలపాటు = కలత పడటం.

**కొందలించు** అక. = కలతపడు, క్షోభించు; వి. కొందలం = కలత. చూ. కొందలపడు

**కొందు** సక. = నజ్జు నజ్జు చేయు.

**కొప్పరించు** సక. = అతిశయించు, విజృంభించు; వి. కొపురు = శిఖరం, ఉన్నతి. కొప్పరం = శిఖరం, మూపు, విజృంభణ. కొప్పరింత = పెరుగుదల, అతిశయం, విజృంభణ. కొప్రం = శిఖరం; విణ. కొప్పరం = విజృంభించిన.

**కొమరారు** అక. = మనోజ్ఞమగు, ఆకర్షణగా ఉండు; వి. కొమరు = మనోజ్ఞత. కొమరాలు = యౌవనవతి, సౌందర్యవతి. కొమరుతనం, కొమరు పాయం = యౌవనం.

కొంపోవు చూ. కొనిపోవు

**కొరకొరలాడు** అక. = మండిపడు, కోపగించు; వి. కొరకొర = కోపంవల్ల కలిగే వికారం.

**కొరపోవు** అక. = గొంతు పొలమారు.

**కొరలు** అక. = ఉండు, ప్రకాశించు, సక. పొందు.

**కొరుకు** సక. = పళ్లతో కరచు; వి. కొరుకుడు = రోగ విశేషం.

**కొలిపించు** అక. = కొనుగోలు చేయు, సక. కొలిచేట్లు చేయు; వి. కొలత = పరిమాణం, ధాన్యా

దులు కొలవటం. కొలగారం = ధాన్యం కొలిచి నందు కిచ్చే కూలి.

కొలుచు సక. = సేవించు, పూజించు, ధాన్యాదులు కొలత చేయు; వి. కొలుచు = (వరి) ధాన్యం. కొలువడి = కొలత. కొలారకం = ధాన్యం కొలవటం. కొలువు = ఆస్థానం, ఉద్యోగం, సేవ, ఉత్సవం. కొలువు(డు) కాడు = సేవకుడు, ఉద్యోగి. కొలువు కూటం = ఆస్థాన మండపం.

కొలుపు అక. = ధాన్యాదులు కొలిపించు, సమ్మతించు, సరిపడు, చెల్లు, సక. ప్రే. ప్రోత్సహించు, రెచ్చగొట్టు, పుట్టించు, కనుగీటు, సైగచేయు, వి. కొలుపు = గ్రామదేవతకు చేసే ఉత్సవం.

కొలువుగొను సక. = సేవలు చేయించుకొను.

కొల్లకొట్టు సక. = దోచుకొను, దోపిడీచేయు, అధిక లాభం సంపాదించు; వి. కొల్ల = దోపుడు. కొల్లకత్తె = దోచుకునే స్త్రీ. కొల్లకాడు = దోపిడి కాడు.

కొల్లగొను చూ. కొల్లకొట్టు.

కొల్లపెట్టు సక. = దొంగిలించు.

కొల్లలాడు / కొల్లాడు సక. చూ. కొల్లపెట్టు.

కొల్లపోవు అక. = పోగొట్టుకొను.

కొసరు అక. = విజృంభించు, సంకోచించు, సక. కోరు, ప్రార్థించు. వి. కొసరు= కోరిక, పెచ్చు, ప్రార్థన, సంకోచం.

కోగు సక. = గోరుగు.

కోచవారు అక. = భయపడు; వి. కోచ = పిరికి.

కోడు సక. = చేటలో పోసి అటూ ఇటూ తిప్పు.

కోతపడు అక. = తెగు, ఖండితమగు; వి. కోత = కోయటం, కోసినది.

కోడాడు అక. = బాధపడు.

కోపగించు వి. కోపం = కినుక. చూ. కోపించు

కోపగిల్లు అక. = కోపపడు; వి. కోపం = కినుక.

కోపించు సక. = కోపం చూపు, కోపగించు; వి. కోపం = కినుక. కోపకత్తె / కోపన = కోపం గల స్త్రీ. కోపి / కోపకాడు = కోపంగల వాడు. కోపువారు అక. = అందగించు; వి. కోపు = అందం.

కోయు సక. = గిల్లు, మంచు, తెంపు; వి. కోత = కోయటం.

కోరగించు అక. = ముకుళించు, ముడుచుకొని పోవు, మొలకెత్తు.

కోరపోవు అక. = కొంకర్లు తిరుగు.

కోరాడు సక. = (ఏనుగులు మొ॥) నేల కుళ్లగించు, దుమ్ముచల్లు.

కోరు సక. = ఇష్టపడు, అడుగు, తురుము; వి. కోరిక / కోరికి / కోర్కె / కోరెకె = ఇచ్చ, ఇష్టం, వరం.

కోలుకొను / కోల్కొను అక. = తేరుకొను, తెప్పరిల్లు, ఉత్సహించు, వర్ధిల్లు.

కోలుపడు అక. = చెడు, నశించు, అగపడు, సక. పోగొట్టుకొను; వి. కోలుపాటు / కోల్పాటు = చేటు, పోగొట్టు కోవటం.

కోలుపోవు అక. = చెడు, పోగొట్టుకొను; వి. కోలుపోక = పోగొట్టు కోవటం.

కౌగలించు సక. = కావిలించుకొను, ఆలింగనం చేయు; వి. కౌగిలి / కవుగిలి = బుజాల మధ్య గల భాగం. కవుగిలింత / కౌగిలింత = ఆలింగనం. కౌగిలింపు / కవుగిలింపు = ఆలింగనం.

క్రక్కు చూ. కక్కు.

క్రచ్చు(కొను) సక. = చుట్టుకొను; వి. క్రచ్చు = (పేనినలాడు మొులోని) వాడని భాగం.

క్రందిల్లు అక. = మోగు; వి. క్రందనం = ఏడ్పు, అర్పు, పిలుపు; క్రందితం = ఏడ్పు, పిలుపు.

క్రందు అక. = మోగు, ఏడ్చు; వి. క్రందు = మోత, సందడి, ఉపద్రవం, క్రందుకయ్యం = దొమ్మి యుద్ధం.

క్రందుకొను అక. = ఎక్కువగు, అతిశయించు; వి. క్రందుకోలు = అతిశయం.

క్రమించు సక. = అతిక్రమించు, మీరు, ఆక్రమించు; వి. క్రమణం = అడుగు వేయుటం, క్రమం = అడుగుపెట్టడం.

క్రమ్మరు / క్రమ్మరిల్లు / క్రమ్మరబడు అక. = మరలు, వెనుదిరుగు.

క్రమ్ము అక. = కలియు, ఉబుకు, వ్యాపించు; వి. క్రమ్ముదల = వ్యాపనం, కమ్మటం. చూ. కమ్ము

క్రమ్ముదెంచు అక. = పైకి ఉబుకు. చూ. కమ్ము

క్రయించు సక. = ధరయిచ్చికొను; వి. క్రయం = వెల, వెల యిచ్చి కొనటం, క్రయికుడు = కొనేవాడు, క్రయ్యం = అమ్మకానికి పెట్టిన సరుకు, క్రాయకుడు = కొనేవాడు; విణ. క్రేయం = వెల యిచ్చి కొనదగిన.

క్రయనబడు అక. = కలిసిపోవు. రూ. క్రయ్యు

క్రల్లపడు అక. = ఎండిపోవు.

క్రాగు చూ. కాగు. వి. క్రాక, కాక = వేడి (మి), క్రాగుడు / కాగుడు = తపన, వేడిమి.

క్రాచు చూ. కాచు.

క్రాయు సక. = ఉమియు, కక్కు.

క్రాలు అక. = (జెండా) అల్లలాడు; గిరగిర దిరుగు, చెదరు, కదలు, ఊడు; వి. క్రాలు గంటి / క్రాల్గంటి = తరళేక్షణ.

క్రిక్కిరియు అక. = దట్టంగా వ్యాపించు, దగ్గర దగ్గరగా ఉండు. రూ. క్రిక్కిరించు

క్రిందుపడు / క్రిందపడు/కిందపడు వి. క్రిందు / క్రిందుల = కింది భాగం.

క్రియ్యు అక. = చిక్కిపోవు, కృశించు.

క్రీడించు అక. = ఆటలాడు; వి. క్రీడ / క్రీడన = ఆట పరిహాసం, తిట్టు.

క్రుక్కు చూ. కుక్కు; వి. క్రుక్కుడు = కుక్కటం.

క్రుంకు అక. చూ. కుంకు.

క్రుంగబడు అక. చూ. కుంగబడు.

క్రుంగిలు చూ. కుంగబడు.

క్రుంకు చూ. కుంగు.

క్రుమ్మరు రూ. క్రుమ్మరిల్లు అక. = తిరుగు.

క్రుమ్ము చూ. కుమ్ము. వి. క్రుమ్ముడు = పొడుపు, పోటు.

క్రుమ్ముడువడు చూ. కుమ్ముడుపడు.

క్రుమ్ములాడు చూ. కుమ్ములాడు; వి. క్రుమ్ములాట.

క్రుయ్యు అక. = కృశించు, వెనుదీయు.

క్రుళ్ళగించు చూ. కుళ్లగించు. వి. క్రుళ్ళగింత / కుళ్లగింత / కుళ్లగింపు = దుఃఖించటం.

క్రేటుకొను అక. = గొంతుసవరించుకొను, తొట్రుపడు; వి. క్రేటు = గొంతు సవరింత, తొట్రుపాటు.

క్రీడించు / క్రేణించు / క్రేడించు అక. = తొలగు, సక. అలక్ష్యంచేయు; వి. క్రేణి = పరిహాసం; పదవి.

క్రేడిసేయు సక. = పరిహసించు; చూ. క్రేడించు క్రేణించు చూ. క్రేడించు.

క్రేణిసేయు చూ. క్రేడిసేయు.

క్రేతొట్టు అక. = గట్లూరయు.

క్రేళ్లుదాటు అక. = ఎగిరిపడు, గంతులు పెట్టు; వి. క్రేళ్లు బహు. = ఉన్నతి.

క్రేళ్లుబ్బు అక. = అతిశయించు.

క్రేళ్లురుకు అక.=ఎగిరిపడు, గంతులుపెట్టు, దూకు.

క్రేళ్లువారు అక. = గంతులు పెట్టు.

క్రొవ్వు చూ. కొవ్వు.

క్రొవ్వెక్కు రూ. కొవ్వెక్కు చూ. = మదించు, పొగరు పోవు.

క్రోడాడు = కొమ్ములతో పొడుచు, పెల్లగించు, పెల్లగించు, దుమ్ముచల్లు. రూ. కోరాడు

క్రోడీకరించు సక. = ఒకచోట చేర్చు, ఒకటి చేయు; వి. క్రోడీకరణం = కౌగిలింత, ఒక చోట చేర్చటం.

క్రోధించు అక. = కోపగిల్లు; వి. క్రోధం= కోపం, కినుక, క్రోధి = కోపం గలవాడు.

క్రోయు సక. = నాలుక (చాచు).

క్రోలు / కొరలు సక. = తాగు, తిను, అనుభవించు, గ్రహించు; వి. క్రోవి = గొట్టం.

క్రోలుచు అక. =కూయు, తాగించు. రూ. క్రోల్చు.

క్లిష్టమగు అక. = కష్టమగు, బాధాకరమగు; వి. క్లేశం = దుఃఖం, కోపం, శ్రమ; విణ. క్లిష్టం = విరుద్ధం, బాధపెట్టే.

క్లేశపడు అక. = బాధపడు, దుఃఖపడు; వి. క్లేశం = దుఃఖం, కోపం, శ్రమ, బాధ.

క్షణియించు సక. = భోజనానికి ఆహ్వానించు.

క్షమించు సక. = ఓర్చు, సరిపెట్టుకొను; వి. క్షమ = ఓర్పు, సహనం, క్షమిత / క్షమి = ఓర్పు గలవాడు, క్షముడు = శక్తుడు, హితుడు; విణ. క్షమ = చాలినంత.

క్షయించు అక. = తగ్గు, క్షీణించు; వి. క్షయ = ఒకరోగం / ఆరుదెవులు. క్షయం = తగ్గుదల; విణ. క్షయ్యం = తగ్గదగిన, నశించదగిన.

క్షీణించు అక. = తగ్గు, నశించు; వి. క్షీణం = తగ్గినది.

క్షోభించు అక. = కలతపడు, బాధపడ్డు; వి. క్షోభ (ం) = బాధ, కలత, దోపిడీ; విణ. క్షుబ్ధం / క్షుభితం = కలగినది, కలత పడ్డది. క్షోభితం = కలత పొందినది.

## ఖ

ఖచించు / ఖచియించు సక. = చెక్కు, పొదుగు; విణ. ఖచితం = చెక్కిన, పొదిగిన.

ఖండించు సక. = నరుకు, ముక్కలు చేయు; వి. ఖండం = తునక, ముక్క. ఖండనం = నరకటం. ఖండా = పెద్దకత్తి; విణ. ఖండితం = నరికినది, స్పష్టం, సూటి, కఠినం.

ఖిలీభవించు అక. = చెడిపోవు; విణ. ఖిలం = దున్నని, చెడిన.

## గ

గగురు పొడుచు అక. = వెంట్రుకలునిగుడు, గగుర్పాటు పుట్టు; వి. గగరుపు / గగుర్పు / గగురు / గగురుపాటు / గగుర్పాటు /

గగు ర్పొడు = రోమాంచం, భయాదులతో వెంట్రుకలు నిక్కపొడుచు కోవటం.

**గగ్గోలువడు** అక. = కలతపడు, క్షోభించు; వి. గగ్గోలు = కలత, క్షోభ.

**గచ్చుకొను** సక. = పట్టుకొను; వి. గచ్చు = గార, పూత, కాంతి. గచ్చువిచ్చు = వికలత్వం, విడిపోవటం.

**గచ్చు నిచ్చగు** అక. = పనిచెడిపోవు; వి. గచ్చు = మింగినమాట.

**గజిబిజించు** అక. = కలగిపోవు, కలతపడు, వి. గజిబిజి = కలత, సందడి; విశే. గజిబిజి = కలతపడిన, నలిగిన, గందరగోళమైన.

**గట్టించు** = గట్టిపరచు, దట్టించు; వి. గట్టు = బిరడా, గట్టన = దట్టింపు; విశే. గట్టి = కఠిన, దృఢ, బిగ్గర.

**గడగడలాడు** అక. = వణకిపోవు; వి. గడగడ = వణకు.

**గడించు** సక. = సంపాదించు, కల్పించు; వి. గడన = సంపాదన, ఎన్నిక, పొగడ్త. గడనకత్తె/ గడన పడతి = వేశ్య.

**గడితపడు** అక. = గట్టిపడు; వి. గడితం = తరచు, ముతక; విశే. గడితం = ముదురు, ముతక, గట్టి.

**గడితేరు** అక. = సమర్థుడగు, నేర్పు సంపాదించు, ఆరితేరు, కడముట్టు; వి. గడి = హద్దు, ఎల్ల. గడిపోతు = ఆబోతు.

**గడుసువడు** అక. = ధైర్యం పొందు; వి. గడుసు = గట్టితనం, ధైర్యం, ధైర్యం గలవాడు. గడుసరి/ గడసరి = నేర్పరి, అసాధ్యుడు, కఠినుడు, ధైర్య వంతుడు; విశే. గడుసు = ధైర్యం గల, నేర్పుగల, అసాధ్యమైన, కఠినమైన.

**గడ్డుకొను** అక. = మించు, అతిశయించు; విశే. గడ్డు = అసాధ్యమైన, కష్టమైన.

**గణించు** అక. చూ. గణుతించు = లక్ష్యపెట్టు, ఎంచు; వి. గణకుడు = లెక్కలు వేసేవాడు, జోస్యుడు, కరణం, గణన=లెక్కింపు, ఎన్నిక, లెక్క, గణితం = లెక్క, గణం = సమూహం, గుంపు, గణపతి = వినాయకుడు, గణాలకునేత గణాధిపుడు/ గణాధిపతి = వినాయకుడు, శివుడు, గణుతి = లెక్క, పొగడ్త, గణ్యుడు = లెక్కించ దగిన వ్యక్తి; విశే. గణితవ్యం = లెక్కించ దగిన. గణితం = లెక్కించినది, గణనీయం = లెక్కించదగిన, చెప్పదగిన, గణేయం = లెక్కపెట్ట దగిన.

**గణుతించు** సక. = లెక్కించు, పొగడు, లక్ష్యపెట్టు; వి. గణుతి = లెక్క, ఎన్నిక, లక్ష్యం. చూ. గణించు

**గంటు** సక. = గాయం చేయు; వి. గంటు = గాయం, గణుపు, (రూకల) ముడి, గంటి = గాయం, దెబ్బ, దుఃఖం.

**గంటువెట్టు** సక. = మొగం ముడుచు. రూ. గంటు పెట్టు చూ. గంటు

**గండడగు** అక. = శక్తిపోగొట్టుకొను, చచ్చు; వి. గండడు = వీరుడు, శూరుడు, గండపెండరం/ గండపెండారం/ గండపెండేరం = వీరులు బిరుదుగా ధరించే కాలి అందె, గండరగండడు = వీరాధి వీరుడు.

**గండరించు** అక. = పుట్టు, సక. పుట్టించు, చెక్కు; వి. గండరులు బహు. = ముక్కలు. గండరువు = అచ్చు, గండారపు బొమ్మ = దిష్టిబొమ్మ.

**గండాడు** అక. = రమించు, సంభోగించు; వి. గండు = పౌరుషం, బలం, మగతనం, గండుడు = వీరుడు; విణ. గండు = మగ.

**గండూషించు** సక. = పుక్కిలించు; వి. గండూషం = పుక్కిలింత, పుడిసిలి, తొండం చివరి భాగం.

**గంౘడించు** సక. చూ. గండరించు = నరుకు, చెక్కు; వి. గంౘడికలు బహు. = ముక్కలు. గంౘడ = ముక్క, కంౘడిక, ఖంౘడిక = (పొలంలో) భాగం.

**గతించు** అక. = గడచిపోవు, చచ్చు; వి. గతం = పోక, గతి = పోక, దారి, తెలివి, ఉపాయం, దిక్కు, విధం.

**గతుకు** సక. = (కుక్క) నాలుకతో తిను, తాగు, ఎంగిలి తిను; రూ. కతుకు/ గదుకు; వి. గతుకు = కుక్కలాగా నాలిక చాచి తినటం, ఎంగిలితినటం.

**గదమాయించు** సక. = గద్దించు; వి. గదమాయింపు/ గద్దింపు = గద్దింపు, బెదిరింపు.

**గదుకు** చూ. గతుకు.

**గదుము(కొను)** సక. = చూ. గద్దించు

**గద్దించు** అక. = కోపంతో అదిలించు; వి. గద్దింపు = గదమాయింపు. చూ. గదమాయించు

**గంతుకొను** అక. = దూకు, చచ్చు; వి. గంతు = దుముకు, దూకు.

**గమకించు** అక. = యత్నించు; వి. గమకం = యత్నం; విణ. గమకం = అధికం, చక్కని.

**గమగమించు** అక. = ఘుమ ఘుమలాడు; వి. గమగమ = సువాసన.

**గమనించు** అక. = పోవు, తలచు, సక. గుర్తించు, పరీక్షించు; వి. గమనం = పోక, ప్రయాణం, ఆలోచన, గమనిక = విధం, గుర్తింపు, జ్ఞాపిక.

**గమాయించు** రూ. ఘమాయించు చూ. గమ గమించు.

**గమికొను** అక. = పోగుపడు; వి. గమి = గుంపు, రాశి, పోగు. గమికత్తె = కావలి స్త్రీ. గమికాడు = నాయకుడు.

**గమించు** అక. = పోవు, కదలు; రూ. గమియించు వి. గమం = దారిపోక, ప్రయాణం, గమనం = పోక, ప్రయాణం, ఆలోచన, గమ్యం = లక్ష్యం, చేరవలసిన తావు; విణ. గమ్యం = పొంద దగిన, చేర దగిన.

**గంభీరించు** సక. = గంభీరంగా ప్రవర్తించు, బయట పడకుండు; వి. గంభీరత/ గంభీరిమ/ గాంభీర్యం/ గంభీరత్వం = లోతు మనసు; విణ. గంభీరం = లోతయిన.

**గయ్యాళించు** అక. = గయ్యాళిగా మాట్లాడు, లేనిపోని గోలపెట్టు, నోరు పెట్టుకొని బతుకు; రూ. గయ్యాళించు వి. గయ్యాళం = గోల, నోటి దూకుడు, గయ్యాళి = నోరుగల స్త్రీ

**గరకట్టు** అక. = గడ్డకట్టు; రూ. కరకట్టు వి. గర = గడ్డ, ముద్ద.

**గరకొను** అక. = గడ్డకట్టు, గరకట్టు చూ.

**గరగరలాడు** అక. = చప్పుడగు, పెళపెళలాడు; వి. గరగర = చప్పుడు.

**గరవడు** అక. = గడ్డకట్టు చూ. గరకట్టు.

**గరివించు** = గరువం, గర్వం. రూ. గర్వించు

**గరుపారు** అక. = గగుర్పడు; వి. గరుపాటు = గగురుపాటు.

**గర్జించు** అక. = ధ్వని చేయు, కోపించు; వి. గర్జ/ గర్జన (౦) = అరుపు, మేఘ ధ్వని, కోపం. గర్జితం = మేఘ ధ్వని, మదపుటేనుగు.

గర్వించు అక. = గర్వపడు; వి. గర్వం = అహం కారం, మదం. గర్వి = గర్వం గలవాడు. గర్వి తుడు = గర్వించినవాడు.

గర్హించు సక. = అసహ్యించుకొను, నిందించు, తిట్టు; వి. గర్హణ(ం) = నింద, తిట్టు, అసహ్యం, గర్హితం = నిందించినది, తిట్టుపడి నది, గర్హ్యుడు = అధముడు, తిట్ట దగినవాడు; విశే. గర్హ్యం = అసహ్యకరమైన, తిట్ట దగిన.

గలగలమను అక. = చప్పుడగు; వి. గలగల = నగలమోత, కదిలే చప్పుడు.

గలతరించు అక. = (ఒళ్లు) జల్లుమను.

గలబరించు అక. = కలతపడు; వి. గలబ/ గలబా/గల్బా = కలత, తారుమారు.

గల్లుమను అక. = మోగు, చప్పుడగు; వి. గల్లు = గలగల చప్పుడు

గవేషించు సక. = వెతుకు; వి. గవేషణ = వెతక టం; విశే. గవేషితం = వెతికినది.

గాండ్రించు అక. = (ముఖం) ఉబ్బరించు; వి. గాండ్రింపు = ఉబ్బరం.

గాజువారు అక. = కాంతిహీనమగు.

గారవించు సక. = ఆదరించు, గౌరవించు; వి. గారం/గారాం/గారాబం/గారవం = ఆదరం, ప్రేమ, గౌరవం, గొప్పతనం; విశే. గారాబు = ఆదరించ దగిన, ప్రేమపాత్రమైన.

గారవిల్లు సక. = గౌరవం పొందు; రూ. గారవిలు వి. గారవం = ఆదరం మొ॥.

గాలించు సక. = వెతుకు; వి. గాలింపు = వెతకటం.

గావుపట్టు సక. = చంపు, నాశనం చేయు; వి. గావు = బలి, గావుపట్టు = గట్టిపట్టు.

గాసిబడు అక. = బాధపడు; వి. గాసి = బాధ, శ్రమ.

గాసిబెట్టు సక. = బాధపడు; వి. గాసి = శ్రమ, బాధ.

గాసిచేయు సక. = నాశనం. చూ. గాసిపెట్టు

గాసియగు అక. = నాశనమగు. రూ. గాసిబడు

గాసిల్లు అక. = బాధపడు, శ్రమపడు, కోపపడు. రూ. గాసిలు చూ. గాసిబడు

గాసించు సక. ప్రే. = గాసిపెట్టు, బాధించు. చూ. గాసిలు

గింగురుమను అక. = మోగు, (చెవిలో) మోత పట్టు; వి. గింగురు = మోత.

గిచ్చు సక. = గిల్లు. రూ. గీచు

గిజగిజగొను సక. = తత్తర పడు. చూ. గిజగిజ లాడు

గిజగిజలాడు అక. = తత్తరపడు; వి. గిజగిజ = తత్తరం, కాళ్లూ చేతులూ కొట్టుకోవటం.

గింజుకొను అక. = చేతులూ, కాళ్లూ తన్నుకొను, విదిలించు, గిలగిలమను; వి. గింజాటున = విది లింపు.

గిటకబారు అక. = పొట్టియగు; విశే. గిటక, గిరక = పొట్టి(వాడు). చూ. గిడసవారు

గిటగిటమను అక. = వణికిపోవు; విశే. గిటగిట = కొద్ది (పాటి), తక్కువ.

గిట్టించు అక. = లాభపడు, గిట్టుబడియగు, సక. చంపు; వి. గిట్టింపు = గిట్టుబాటు, లాభం, చావు, గిట్టుబడి / గిట్టుబాటు = లాభం.

గిట్టు అక. = అనుకూలించు, చచ్చు, నశించు; వి. గిట్టింపు = చావు.

గిడసవారు అక. = పొట్టియగు, తగ్గిపోవు; విణ. గిడస = పొట్టి.

గినుమాడు సక. = మోసగించు; వి. గినుము = మోసం.

గిరగిరమను అక. = తిరిగిపోవు; వి. గిర/ గిర్ర/ గిరక/ గిలక = చక్రం.

గిరాటువేయు సక. = విసరివేయు, రువ్వు; వి. గిరాటు = విసరు.

గిరికొను సక. = చుట్టుకొను; వి. గిరి = గుండ్రటి గీత, గీతల మధ్య స్థలం.

గిరుపు సక. = (కళ్లు) తిప్పు, (గడ్డ) తిప్పు, కదిలించు; వి. గిర్రుగిర్రు = గుండ్రటి, గిర్రు అవ్య. = గుండ్రంగా.

గిలకరించు సక. = గిలకొట్టు, చిలుకు, చల్లు మోతపెట్టు; వి. గిలకరింపు = చిలకరించటం, చల్లటం.

గిలకొట్టు సక. = కలియబెట్టు, కుదిలించు; రూ. కిలకొట్టు వి. గిలక = గుండ్రటి తిరిగే ఆటబొమ్మ.

గిలిగించు సక. = చక్కిలిగింతలు పెట్టు; వి. గిలిగిలి/ గిలిగింత = చక్కిలిగింత.

గిలిగిలించు సక.; వి. గిలిగిలింత = చక్కిలిగింత. చూ. గిలిగించు

గిలుపు సక. = కన్నుగొట్టు. రూ. గిలుపు

గిలుబాడు సక. = దొంగిలించు; వి. గిలుబు = దొంగిలింత.

గిలుబుకొను చూ. గిలుబాడు

గిలుబుచేయు చూ. గిలుబుకొను, గిలుబాడు.

గిల్లు సక. = గోటితో నొక్కు, గిచ్చు; వి. గిల్లుడు = గిచ్చు, గోటిగీత.

గివురు సక. = గీచు, గిచ్చు. రూ. గీరు

గీకు సక. = గీరు, గీచు, గాటు పెట్టు; వి. గీకుడు = గీచటం, గీరటం, గీకటం, గీత = గీటు, రేఖ.

గీచు సక. = గీటుపెట్టు; వి. గీత = గీటు, రేఖ.

గీటడచు సక. = చంపు.

గీటడగు అక. = చచ్చు.

గీటు సక. = (పళ్లు) కొరుకు, (కన్ను) గొట్టు, చిమ్ము.

గీటునబుచ్చు సక. = అగౌరవించు, అనాదరించు.

గీటుపెట్టు అక. = ఏడ్చు, చప్పుడు చేయు, (ఏనుగు) ఘీంకరించు.

గీయు సక. = గీటుపెట్టు; వి. గీత = గీసిన రేఖ, గీటు.

గీరు సక. = గోకు, భేదించు; వి. గీరుడు = గోకుడు, భేదనం, గీరునామం = గీతల బొట్టు.

గీలు అక. = కారు, స్రవించు.

గుక్కగొను అక. = మింగు; వి. గుక్క/ గ్రుక్క/ గ్రుక్కలి = మింగటం, ఊపిరి.

గుక్కపట్టు అక. = ఊపిరి తిప్పకుండా ఏడ్చు; వి. గుక్క = ఊపిరి.

గుక్కిళ్లుమింగు అక. = అపేక్షించు, కోరు. రూ. గ్రుక్కిళ్ళుమ్రింగు

గుక్కుమిక్కను అక. = మాట్లాడబోవు. రూ. గ్రుక్కుమిక్కను / గ్రుక్కుమిక్కుమను

గుచ్చు అక. గ్రుచ్చు రూ. = నాటు(కొను), సక. నాటించు, దూర్చు.

గుజగుజలాడు అక. = తొక్కిసలాడు; వి. గుజగుజ = తొక్కిసలాట.

గుజగుజ(లు)వోవు అక. = తొక్కటపడు, ఒకరిపై మరొకరుపడు.

గుంజనుసుగు సక. = వెక్కిరించు; వి. గుంజనుసుగు = వెక్కిరింత, ఎలుగ్గొడ్డాట.

గుంజిలిపెట్టు అక. = దాచిపెట్టు.

గుంజు సక. = లాగు, ఏడ్చు, ఉతుకు, విషయించు (తెలం.); వి. గుంజు = గుజ్జు.

గుంజులాడు సక. = పెనగులాడు; వి. గుంజులాట = పెనగులాడటం.

గుటగుటలాడు అక. = చివరి దశలో ఉండు, చావుకు దగ్గరలో ఉండు; వి. గుటగుట = చివరి స్థితి, అంత్యదశ.

గుటుక్కను అక. = చచ్చు; వి. గుటుకు / గుటుక్కు = గుటక, ఒక్కసారి మింగే నీటి కొలత.

గుడికొను అక. = వ్యాపించు, సక. చుట్టుముట్టు; వి. గుడి = ఆలయం, గుండ్రటిరేఖ. గుడిక / గుళిక = గుండ్రటి మాత్ర.

గుడిదిగురు అక. = గుండ్రంగా తిరుగు; వి. గుడుసు = సూర్య చంద్రుల చుట్టూ కనిపించే కాంతి వలయం. గుడుసుకైదువ = (విష్ణు) చక్రం; విణ. గుడుసు = గుండ్రటి.

గుణపడు అక. = చక్కపడు, బాగుపడు; వి. గుణం = లక్షణం, బాగు మొ. గుణి = గుణవంతుడు.

గుణించు సక. = లెక్కించు, హెచ్చించు; వి. గుణకారం = హెచ్చవేత. గుణకం = పెంచేలెక్క. గుణిజం = హెచ్చింపగా వచ్చిన అంకె. గుణితం / గుణింతం = అచ్చులనూ హల్లులనూ కలపటం; విణ. గుణితం / గుణింతం = హెచ్చించినది, గుణ్యాం = హెచ్చించదగినది.

గుండుకొను సక. = చుట్టుకొను; వి. గుండు = గుండ్రటి రాయి, తుపాకి / ఫిరంగి మందుల ఎగిరే భాగం, కొండ, గుండీ = గుండ్రటి బొత్తాం.

గుండుగిలు అక. = చుట్టుపడు.

గుండ్రించు అక. = (కడుపు)తిప్పు; వి. గుండ్రింపు = కడుపులో తిప్పటం.

గుత్తగొను సక. = సొంతం చేసుకొను; వి. గుత్త = అనుభవంలోకి తెచ్చుకున్న సొమ్ము, టోకు. గుత్తకాడు = మొత్తం పనిచేసేవాడు, మరొకరికి భాగమివ్వనివాడు.

గుదగుదలాడు అక. = గొంతురాలుపడి ఏడ్చు; వి. గుదగుదలు బహు. = డగ్గుత్తిక, గద్గదత్వం.

గుదికూర్చు సక. = దండగట్టు, ఒకచోటకి చేర్చు; వి. గుదికూర్పు = దండకట్టు, గుది = ఆకులు మొ॥ వాటి చేరిక, గుత్తి.

గుదిగొను అక. = దట్టమగు, కూలబడు; వి. గుది = గుత్తి.

గుదివడు అక. = కట్టుబడు.

గుద్దలించు సక. = పెళ్లగించు, వెతుకు; వి. గుద్దలి = పలుగు, గునపం.

గుద్దులాడు అక. = పిడికిటితో పొడుచుకొను, కొట్లాడు; రూ. గ్రుద్దులాడు వి. గుద్దు / గ్రుద్దు = పిడికిటిపోటు. గుద్దులాట / గ్రుద్దులాట = గుద్దు లతో పోట్లాట.

గునియు అక. = ఆడు, కులుకు; వి. గునిసి పాటు = కులుకు.

గునిపాడు అక. = ఆటలాడు, కులుకులాడు; వి. గునుపు = విలాసం.

గుప్పళించు సక. = ఉతుకు, పుక్కిలించు, ఉంచు.

గుప్పించు సక. = కురిపించు, మూక ఉమ్మడిగా వేయు; వి. గుప్పిలి = పిడికిలి.

గుప్పు సక. = ఉంచు, చల్లు, పాడుచు, విసరి వేయు.

గుప్పున అవ్య. = శీఘ్రంగా, త్వరగా, చప్పున; వి. గుప్పు = వ్యాపనం.

గుప్పుమను అక. = వెల్లడియగు, బయటపడు.

గుబాళించు అక. = సువాసనలు విరజిమ్ము; వి. గుబాళింపు = సువాసన.

గుబుకు సక. = గుప్పుమను, వాసనవచ్చు; వి. రూ. గుముకు గుబులు = గుప్పమను సువాసన.

గుబులుకొను అక. = గుప్పుమను, వాసన వచ్చు; వి. గుబులు = గుప్పమను, సువాసన.

గుబ్బటిల్లు అక. = ఉప్పొంగు. రూ. గుబ్బటిలు గుబ్బుమను అక. రూ. గుబ్బురను = (గుండె) అందరు; వి. గుబ్బు = గుండె అదరు.

గుభేలుమను అక.= భయం పొందు. రూ. గుబేలు మను

గుమగుమలాడు అక. = సువానలు విరజిమ్ము, పరిమలించు; వి. గుమగుమ = సువాసన.

గుమికూడు అక.= గుంపుకట్టు, మందగట్టు; వి. గుమి = గుంపు, మంద.

గుముకు = చూ. గుబుకు

గుంపించు సక. = కుప్పవేయు, అతిక్రమించు; వి. గుంపు = గుమి, సమూహం, గుంపెన = విజృంభన.

గుంఫించు అక. =నిండు; వి. గుంఫనం = మాటల కూర్పు, గుంఫం = మాటలకూర్పు, చేతివగ; విణ. గుంఫితం = కూర్చినది.

గుమ్మ్మ సక. = పొడుచు; వి. గుమ్మ్మ = పిడికిటి పోటు, సువాసన రావటం. రూ. కుమ్ము

గురకపెట్టు సక. = నిద్రలో చప్పుడు చేయు; వి. గురక = గుఱ్ఱు, నిద్రలో చేసే చప్పుడు.

గురగురమను అక. = (పంది) కూయు, కోప గించు; వి. గురగుర = పంది కూత.

గురించు సక. = ఉద్దేశించు, నిర్ణయించు; వి. గురి = లక్ష్యం; గుర్తు, నిర్ణయం, దృష్టాంతం, పరిమితి. గురికట్టు = అంచు, పరిమితి, హద్దు, గురి కాడు = సూటిగా బాణాదులు వేయగలవాడు.

గురికొను సక. = లక్షించు; వి. గురి = లక్ష్యం.

గురుకొను అక. = ప్రయత్నించు.

గురుపొడుచు అక. = గురకపెట్టు; రూ. గుఱ్ఱు పొడుచు వి. గురు / గుఱ్ఱు = గురక.

గురుపెట్టు రూ. గుర్వెట్టు / గుఱ్ఱువెట్టు చూ. గురుపొడుచు.

గురువుదేరు అక. = చిప్పిలు, ఉబుకు; వి. గురువు = వడిగల పరుగు.

గురువులువారు అక. = వేగంగా పరుగెత్తు, మించు, మీరు; వి. గురువు = వడిగల పరుగు.

గులకరించు అక. = చక్కనగు, బాగుండు.

గుల్లపడు అక. = అవమానపడు; వి. గుల్ల = బోలు, గుల్లకాడు = దరిద్రుడు; విణ. గుల్ల = తక్కువ, కొంచెం.

గవ్వాకరిగొను సక. = చుట్టుకొను.

గువ్వకుత్తుకపడు అక. = హీనస్వరంతో ఉండు; వి. గువ్వ = అడవి పావురం, గువ్వకుత్తుక = ఆక లికి గొంతు మందగించటం, హీన స్వరం.

గువ్వకోలుకొను అక. = ముట్టుకొను. మా. గువ్వకరిగొను

గుసగుసలుపోవు అక. = రహస్యంగా/మెల్లగా మాట్లాడు; వి. గుసగుస = మెల్లని మాట, ఎవీ వినపడని మాట.

గూనుగిల్లు సక. = గూనివచ్చు; వి. గూని/గూను = నడుము మీద వంపు. గూనివాడు = గూనిగలవాడు.

గెంటించు అక. = కదులు, చలించు, సక. నెట్టించు, తొలగించు, ప్రయోగించు; వి. గెంటు = తోపు, నెట్టు.

గెంటు అక. = కదులు, చలించు, తొలగిపోవు, సక. తోయు, ప్రయోగించు; వి. గెంటు = చలనం, కదలిక, తోపు, నెట్టు.

గెంటుపడు అక. = దెబ్బలు తిను; వి. గెంటు = తోపు, నెట్టు.

గెనయు అక. = పుష్టియగు.

గెబ్బు అక. సక. = దొంగిలించు, గ్రహించు.

గెలుచు అక. = పోవు, సక. పంపు, జయించు; వి. గెలుపు = జయం, గెలుపుకాడు = గెలిచేవాడు. గెలువం = గెలుపు, జయం.

గెలుపుకొను సక. రూ. గెల్చుకొను మా. గెలుచు.

గేలికొట్టు సక. = పరిహసించు, గేలిచేయు; వి. గేలి = ఎగతాళి, పరిహాసం.

గేలికొను మా. గేలికొట్టు.

గొడగు సక. = సణుగు. రూ. గొణగు/గొణుగు

గొడవపడు అక. = గోలపడు, ఇబ్బందిపడు, తగాదావచ్చు; వి. గొడవ = ఆపద, కష్టం, దుఃఖం, కలత.

గొడ్డువోవు అక. = వ్యర్థమగు, వట్టిపోవు, పౌరుషహీనమగు; వి. గొడ్డు = ఈనని పశువు, గొడ్రాలు. గొడ్డుబోతు = నిష్ప్రయోజకుడు. గొడ్డురాలు/గొడ్రాలు = పిల్లలులేని స్త్రీ; విణ. గొడ్డు = శూన్యం.

గొణగు అక. = సణుగు. రూ. గొణుగు మా. గొడగు

గొణగొణలాడు అక. = సణుగు, గొణుగు; వి. గొణ గొణ = సణుగుడు, గొణుగుడు.

గొదకొను అక. = మించు, త్వరపడు, విజృంభించు; వి. గొద = ఆకలి. గొదగొద = పగ, విరోధం.

గొనకొను అక. = యత్నించు. కొనకొను

గొరుగు సక. = కత్తిరించు, క్షౌరం చేయు.

గొల్లుమను అక. = ఏడ్చు, గోలపెట్టు.

గొవరువోవు అక. = ఎండిపోవు; వి. గొవరు = వెట్ట, వేడి.

గోండ్రించు అక. = (పులి) అరచు, (ఎలుగ్గొడ్డు) బొబ్బరించు; వి. గోండ్రు = కేక, బొబ్బ, గోండ్రింపు = పులి అరపు.

గోండ్రిలుచు రూ. గోండ్రిలు మా. గోండ్రింపు.

గోకు సక. = గీకు, గీరు, దోకు; వి. గోకుడు పార = దోకుడుపార.

గోచరించు అక. = కనిపించు; వి. గోచరం = కనిపించేది, విషయం.

గోడగించు అక. సక. = మాట్లాడు, చప్పుడు చేయు, తిరస్కరించు.

గోడాడు అక. = ఏడ్చు, దుఃఖించు; వి. గోడు = దుఃఖం, ఏడ్పు.

**గోమించు** సక. = గోము చేయు, ఆదరించు; వి. గోము = ఆదరం, సౌకుమార్యం.

**గోరపడు** అక. = రోతపడు, అసహ్యించుకొను; వి. గోరం = అస్వస్థత, ఆపద, రోత, గోర గింత = భయంకరత్వం, గోరతనం = దుర్మార్గం.

**గోరించు** అక. = పైకిలేచు, ఎగసిపడు; వి. గోరింపు = పైకిలేవటం.

**గోరుపులాడు** సక. = ఎగరవేయు. రూ. గోర్పిల్లాడు

**గోలించు** సక. = నూనెలో వేయించు; వి. గోల = కాగు, గోలకం = కాగు, గోలెం = కాగు.

**గోలురించు** అక. = (పులి) గాండ్రించు.

**గోసడచు** సక. = నిందించు, తిట్టు; వి. గోసు = అపనింద, తిట్టు, తప్పు.

**గౌరవించు** సక. = గొప్పచేయు, మర్యాద చూపు; వి. గురుత్వం/గౌరవం = గొప్ప తనం, పెద్దతనం.

**గ్రక్కతిల్లు** అక. = బెదిరిపోవు.

**గ్రక్కదలు** అక. = బాగా కదులు. గ్రక్కన/గ్రక్కున అవ్య. = వెంటనే, వడిగా.

**గ్రసించు** సక. = తిను, మింగు; వి. గ్రాసం = గడ్డి, తిండి; విణ. గ్రస్తం = తిన్న, మింగిన, గ్రసిష్ణువు = తినే, మింగే.

**గ్రహించు** సక. = తీసుకొను, తెలుసుకొను; వి. గ్రహింపు = తెలివిడి. గ్రహీత/గ్రహిశుడు = తీసుకొనేవాడు, గ్రహయాళువు = తెలుసుకొనేవాడు, గ్రహణం = తెలివిడి, ఆదరం, స్వీకారం, మింగటం.

**గొచ్చు** సక. రూ. క్రొచ్చు = చెక్కు, తవ్వు.

**గ్రొయ్యు** అక. = గుంటపడు; వి. గొయ్యి = గుంట, గోయి.

# ఘ

**ఘనీభవించు** అక. = గడ్డకట్టు, ముద్దకట్టు; వి. ఘనీభవనం = గట్టిపడటం, గడ్డకట్టడం; విణ. ఘనం = గట్టి, దిట్టమైన.

**ఘర్షించు** సక. = రాపిడిపెట్టు; వి. ఘర్షణ = తగాదా, ఘర్షణం = రాపిడి, ఒరపిడి, ఘర్ష ణాలం = పాత్రం, నూరేరాయి.

**ఘాతించు** సక. = చంపు; వి. హత్య = చంపుడు. ఘాతం = దెబ్బ, బాణం; హననం = చంప టం, హంత(కుడు) = చంపేవాడు, హతి = కొట్టు, దెబ్బ, హతుడు = చావుకు గురియైన వాడు, మనసు చెడినవాడు, ఘాతిని = చంపే స్త్రీ, హంతకురాలు, హతకుడు = చచ్చిన వాడు (తిట్టుగా), ఘాతుకుడు = హంత కుడు, బాధకుడు.

**ఘీంకరించు** సక. = (ఏనుగు) ఘీంకారం చేయు; వి. ఘీంకారం/ఘీంకృతి = ఏనుగు అరుపు.

**ఘుర్ఘించు** అక. = (పంది) గురగురలాడు; వి. ఘుర్ఘరం = గుర్రు, గురక.

**ఘూర్ణిల్లు** అక. = తలకిందులగు; మోగు, మోత పెట్టు; వి. ఘూర్ణన(ం) = తిరుగుడు, మోత; విణ. ఘూర్ణితం = తిరుగుపడు పడిన, మోగిన.

**ఘోషించు** అక. = మోగు, మోతపుట్టు; వి. ఘోష = ఉరుము, కంచు, ఆవుల మంద, గొల్లపల్లె. ఘోషణ(ం) = చాటింపు. ఘోష వతి = వీణ.

**ఘ్రాణించు** సక. = మూచూచు, వాసన చూచు; వి. ఘ్రాణ = ముక్కు; విణ. ఘ్రాతం = వాసన చూసి నది. ఘ్రాణతర్పణం = సువాసనగల.

# చ

**చక్కజేయు** సక. = బాగుచేయు, సవరించు; వి. చక్కదనం = సౌందర్యం; విణ. చక్క = సుందరమైన, తిన్ననైన.

**చక్కడచు** సక. = నరుకు, ముక్కలు చేయు; వి. చక్కు = ముక్క.

**చక్కబడు** అక. = సరిపడు, బాగుపడు; వి. చక్కన = అందం. చక్కనయ్య = మన్మథుడు.

**చక్కబెట్టు** సక. = బాగుచేయు, సరిపెట్టు, సరిచేయు, నాశనం చేయు.

**చక్కాడు** సక. = చంపు, నరుకు. చూ. చక్కడుచు

**చక్కలిగింతలు పోవు** అక. = గిలిగింతలు పొందు; వి. చంక/చక్కిలి/చంకిలి = కక్షం, చేతులు మొండేనికి కలిసేతావు. చంకతాళి = చంక మూట. చక్కిలిగింత/చక్కిలిగిలి = గిలిగింత.

**చంక్రమించు** సక. = దాటు; వి. చంక్రమణం = దాటడం.

**చంగలించు** రూ. చెంగలించు/చంగున అవ్య. = టక్కున.

**చచ్చు** అక. = మరణించు, చావుపొందు; వి. చావు = మరణం; విణ. చచ్చుడు = చచ్చిన.

**చంచలించు** అక. = కదలు; వి. చంచలం = మెరుపు, గాలి, లక్ష్మి, చంచలుడు = బుద్ధి స్థిరత్వం లేనివాడు, నిలకడలేనివాడు.

**చతులువడు** అక. = మొక్కపోవు, మొండివారు.

**చట్టలుచీరు** సక. = చంపు; వి. చట్ట = కవచం, చొక్కా, పైపూత.

**చట్టలువాపు** సక. = నాశనం చేయు. చూ. చట్టలు చీరు

**చండించు** అక. = తీవ్రంగా కోపించు; వి. చండి = కోపన, చంపే ఆడది, విపరీతప్రేమగల స్త్రీ, చండిమ = వాడిమి, చండుడు = కోపగాడు, యమ కింకరుడు, చండకం = పెద్దపులి; విణ. చండం = తీవ్రమైన.

**చతికిలు/చదికలు/చతికలబడు** అక. = కూలబడు, కూర్చుండు.

**చదియు** అక. = నలిగిపోవు; వి. చదియ = నలుగుడు, నలక.

**చదివించు** సక. ప్రే. = చదువుచెప్పించు, చదువు నట్లుచేయు, బహువంతులను గురించి చెప్పు/చెప్పించు; వి. చదివింపులు బహు. = బహుమతులు.

**చదుపు** సక. ప్రే. = చదియజేయు, చంపు.

**చదుము** సక. = గుద్దు.

**చదురడుచు** అక. = పరిహాసమాడు; వి. చదురు = నేర్పు, ఆట, సభ.

**చదువు** సక. = నేర్చు, తెలియు, పఠించు; వి. చదువరి = చదువు కొన్నవాడు, చదువు = విద్య, చదువులు = వేదాలు, చదువులయ్య = ఉపాధ్యాయుడు. చదువులపడతి = సరస్వతి, చదువుల పులుగు = చిలుక, చదువుల ముదుకడు/ చదువుల వేల్పు = బ్రహ్మ.

**చను** అక.= వెళ్ళు, పోవు, తగు, దాటు, సక. పొందు; వి. చనువాడు = చెల్లుబడి గలవాడు.

**చనుదెంచు** అక. = వచ్చు, పోవు; వి. చనుప = బిడారు.

**చప్పటించు** సక. = చప్పట్లు కొట్టు; వి. చప్పట = చరుపు, చాచిన వేళ్ళ గల అరచేయి.

చప్పబడు అక. = తగ్గిపోవు, మొత్తబడు; వి. చప్పన = చప్పదనం.

చప్పరించు సక. = కొద్ది కొద్దిగా రుచిచూచు; వి. చప్పరింత = చప్పరించటం.

చప్పుడించు అక. = చప్పుడు చేయు; వి. చప్పుడు = ధ్వని, శబ్దం.

చప్పుడు చేయు అక. = మేళతాళాలు వాయించు (తెలం).

చబుకు చేయు సక. = కొరడాతో కొట్టు; వి. చబుకు = కొరడా.

చమురు సక. = రాయు, పూయు; వి. చమురు = నూనె, తైలం.

చంపు సక. = చచ్చునట్లు చేయు, చావజేయు; వి. చంపుడు గట్టు = వధ్య స్థలం.

చరచు సక. = అరచేతితో కొట్టు, తట్టు, ఆక్ర మించు, తుడుచు; వి. చరపు = దెబ్బ, కప్పు.

చరించు అక. = తిరుగు, సక. చేయు; వి. చరణం = నడవడి, తిరగటం, చరితం/చరిత్రం = నడవడి, చరిత్ర = నడుస్తున్న విషయం, చరుడు = గూఢచారి, అంగారకుడు; విశే. చరం = స్థిరంగాని, కదిలే, చరిష్ణువు = తిరిగే, కదిలే.

చర్చించు సక. = వాదం చేయు, విచారించు; వి. చర్చ = చింత, విచారం, వాదం.

చర్లాటమాడు / చెర్లాటమాడు అక. చూ. చరలాటమాడు.

చలపట్టు అక. = మచ్చరించు, కోపగించు; వి. చలం/చలపకారం = మాత్సర్యం, చల మరి/చలపకారి/చలపాది = మాత్సర్యం కలవాడు.

చలపొడుచు చూ. చలపట్టు.

చలపోరు అక. = పట్టుదలతో పోరాడు.

చలముకొను చూ. చలపట్టు.

చలాయించు/ చెలా యించు సక. = జరి గించు; వి. చలాయింపు/చెలాయింపు = జరపటం. చలామణి/చెలామణి/చెలా వణి = చెల్లుబాటు, వాడుక.

చలించు అక . = కదలు ; వి. చలనం = కదలిక; విశే. చలితం = కదిలినది.

చలివాపు సక. = బుజ్జగించు

చలుపు ప్రే. = చేయు, దాటించు.

చలువచేయు సక. = ఉడికించు ఉతుకు; వి. చలువ = ఉతికినగుడ్డ, చల్లదనం, చలిది/చద్ది/చల్ది = చల్లని తిండి, చల్లదనం = శీత లత, చల్లన = శైత్యం, చల్లదనం; విశే. చల్ల(ని) = శీతలమైన.

చల్లపడు అక. = చల్లనగు.

చల్లసేయు సక. = చల్లబరచు.

చల్లారు అక. = చల్లబడు, తగ్గు.

చల్లు సక. = చిలకరించు; వి. జల్లు = వానపడటం.

చవిగొను సక. = రుచిచూడు; వి. చవి = రుచి.

చాగరకొట్టు సక. = చంపు, బాధించు; వి. చాగర = నాశనం.

చాగరగొను సక. = కొట్టు, నరుకు.

చాగరలాడు సక. = నాశనం చేయు.

చాగిలు/చాగిల్లు/సాగిలు అక. = నేల మీద వాలు; వి. చాగిలింత = నమస్కారం.

చాగు అక. = పొడుగు, పోవు, యత్నించు; రూ. సాగు వి. చాపు = పొడుగాటి గుడ్డ, చాచటం.

**చాటించు** సక. = తెలియ బడరచు, చాటి చెప్పు; వి. చాటింపు = తప్పెట వాయించి చెప్పటం, తెలియ బరచటం, చాటువ = చాటింపు.

**చాటు** చూ. చాటించు.

**చాటుపడు** అక. = మరుగుపడు; వి. చాటు = మరుగు.

**చాతు** సక. = ధరించు; విశే. చాతని/ చాత్తని/ సాతాని = (జుట్టు, జందెం) ధరించే.

**చాదు** సక. = అరగదీయు; వి. చాదు = నల్లటి ద్రవం/ ద్రవ్యం.

**చాపకట్టువడు** అక. = చాపపరిచినట్లు పడిపోవు; వి. చాపకట్టు = చాపవంటి పరుపు. చాపట్టు = అప్పడం వంటి పిండివంట; విశే. చాపకట్టు = నేలబారు.

**చాపు** ప్రే. = సాగదీయు; వి. చాపు = చాచటం, సాగదీత.

**చారు** సక. = కళ్లమూడ్చు.

**చాలించు** ప్రే. = విలుపు, ఆపు, శక్తినిచ్చు; వి. చాలిక = సామర్థ్యం, శక్తి.

**చాలు** అక. = సరిపోవు, కావలసినంత అగు, భరించు; వి. చాలు/ చాలుపు/ చాల్పు= వరుస, గీత, ధార. చాలుబడి / చాలిక = సామర్థ్యం. చాలువాడు = సమర్థుడు.

**చావజూచు** సక. = చంపు; వి. చావు = మృతి.

**చికిత్సించు** అక. = వైద్యం చేయు; వి. చికిత్స = వైద్యం, చికిత్సకుడు = వైద్యుడు.

**చికిలించు** సక. = కళ్లు సగం మూస్తూ తెరుస్తూ చూచు; వి. చికిలింపు = కళ్లు మూస్తూ తెరుస్తూ చూసే చూపు.

**చికిలు** అక. = కొసరి కొసరి ఏడ్చు, ముద్దు ముద్దుగా ఏడ్చు.

**చికిలిచేయు** సక. = తుడిచిబాగు చేయు; వి. చికిలికాడు = కత్తులు మొ॥ నూరేవాడు.

**చిక్కు** అక. = కృశించు, చిక్కిపోవు, తగులు, దొరుకు, మిగులు; వి. చిక్కు = మెలి, ఇబ్బంది.

**చిక్కుపడు** అక. = ఇబ్బందిపడు, ఇరుకునపడు, సంకటపడు; వి. చిక్కుపాటు = సంకటం, ఇబ్బంది, ఇరుకు.

**చిక్కొట్టు** సక. = ఛీయను, రోతపడు.

**చిగిరించు** అక. = చిగురు తొడుగు, చిగుర్చు; రూ. ఇగిరించు విశే. చిగురు = లేత.

**చిగురుకొను** చూ. చిగిరించు.

**చిగురుచు** అక. రూ. చిగుర్చు = చిగిరించు, ఎర్ర నగు, ఎర్రబడు.

**చిగురొత్తు** అక. = పుట్టు, మొలకెత్తు. చూ. చిగిరించు

**చించు** ప్రే. = చినుగునట్లు చేయు, పేలికలు చేయు; వి. చినుగు = పేలిక.

**చిటుచిటుమను** అక. = మండిపడు; వి. చిటుచిటు = మంట, మిడిసిపాటు.

**చిటుచిటులాడు** చూ. చిటుచిటుమను.

**చిటికరించు** అక. = చిటికవేయు; వి. చిటికరింత, చిటిక = వేళ్లుకలిపి పుట్టించిన చప్పుడు.

**చిటుకను** అక. రూ. చిటుక్కను, చిటుకరను = చిటుక్కుమని మోగు.

**చిట్టుమిడుచు** అక. = చిటికవేయు.

**చిట్టాడు** అక. = తిరుగు, తాగు, సోకు, వ్యాపించు, తప్పటడుగులు వేయు, కదలు, ఆడు.

చిట్లు అక. = పగులు, కోపించు. రూ. చిటులు

చిడిముడిపడు అక. = తొట్రుపడు; వి. చిడి ముడి = తొట్రు, చిడిముడిపాటు = తొట్రు పాటు.

చిత్తగించు అక. =మనసుపెట్టి విను, దయతో విను, సక. తలచు, ఆలోచించు; వి. చిత్తగింపు = దయతో వినటం.

చిత్రించు సక. = బొమ్మవేయు, వర్ణించు; వి. చిత్రం = బొమ్మ, పటం; విణ. చిత్రితం = చిత్రించినది.

చిదియు అక. = నలిగిపోవు.

చిదుకు అక. = చిప్పిలు.

చిదుపు ప్రే.= చిదియు నట్లు చేయు..

చిదుము సక. = గిల్లు, కోయు, తుంచు, తెంపు (తెలం.), విసరివేయు; వి. చిదుము = చిగురు.

చినుగు అక. = చిరిగిపోవు, పీలికలగు; వి. చిను గులు బహు. = పీలికలు.

చినుకు అక. = కారు, కురియు, సక. కార్చు; వి. చినుకు / చిన్కు = వాన నీటిబిందువు, చిను కుబూస = ముత్యం.

చింతించు అక. = దుఃఖపడు, ఆలోచించు; వి. చింత = తలపు, ఆలోచన, విచారం, చింతన = చాలా సార్లు తలచుకోవటం, చింతకుడు = ఆలోచనపరుడు; విణ. చింతనీయం = ఆలో చింపదగిన, చింతితం = ఆలోచించిన, చింత్యం = ఆలోచింపదగిన.

చిందరగొను అక. = విజృంభించు; వి. చిందర = విజృంభణ, తూటు, ముక్క.

చిందరరేగు అక. = ఆవేశమెత్తు.

చిందరవందర చేయు సక. = నరుకు, ముక్కలు చేయు; వి. చిందరవందర = తునక, తుంప, గందర గోళం. విణ. చిందరవందర = గగ్గో లయిన.

చిందరవోవు అక. = తూటుపడు.

చిందరసేయు సక. = భేదించు, చీల్చు. రూ. చిందరలు చేయు

చిందాడు అక. = చిందులు తొక్కు; వి. చిందు లాటు = గంతులు, గెంతులు.

చిందిలిపడు అక. = సంభ్రమించు, తొందరపడు; వి. చిందిలిపాటు = వేగిరిపాటు, తొందర పాటు.

చిందిలు అక. = కదలు.

చిందు అక. = (నీళ్లు) తొలకు, రాలు, వ్యాపించు, సక. వెద్చించు; వి. చిందు = ఒకరకం ఆట; విణ. చిందు = చెదరిన.

చిందుద్రొక్కు అక. = నాట్యం చేయు. రూ. చిందులు దొక్కు

చిందువందుచేయు సక. = చెదరగొట్టు; విణ. చిందువందు = చెదరిన.

చిన్నవోవు అక. = ముఖం ముడుచుకొని, ఖిన్నుడగు; వి. చిన్నం = చాలా చిన్నవాణెం. చిన్నిదం = చిన్నపువ్వు, బంగారు; విణ. చిన / చిన్న/ చిని/ చిన్ని = తక్కువయిన, చక్కని, చిన్నరి పొన్నరి/ చిన్నారి పొన్నారి =చక్కని.

చిప్పిల్లు అక. = పైకి ఉబుకు. రూ. చిప్పిలు

చిబుకు సక. = చప్పరించు.

చిముటు సక. = కన్నుగీటు, సైగచేయు.

చిముడు అక. = పాకంచెడు, ముద్ద గట్టు; వి. చిమిడిక = చిమిడిన అన్నం.

చిముడుచు సక. = చిముడునట్లు చేయు, ముద్ద గట్టించు.

చింపు సక. = చినుగునట్లు చేయు; రూ. చించు విశే. చింపి(రి) = చినిగిన, రేగిన.

చిమ్మిరేగు అక. = రెచ్చిపోవు, విజృంభించు.

చిమ్ము సక. = మీటు, వేయు, చల్లు; వి. చిమ్ముడు = చిమ్మటం. చిమ్ములాట = ఒకరి మీద ఒకరు చల్లుకుంటూ ఆడటం.

చిమ్ములాడు సక. = వెదజల్లుతూ ఆడు; వి. చిమ్ములాట = చిమ్ముకొంటూ ఆడే ఆట.

చిరచిరలాడు అక. = మండిపడు; వి. చిర చిర = మంట, కోపం, చిరాకు.

చిరుగు అక. = చినిగిపోవు. రూ. చినుగు

చిరుతలు కవియు అక. = మిరుమిట్లు గొను.

చిరుము అక. = విజృంభించు.

చిర్రలు వొడుచు అక. = వేగిరపడు; వి. చిర్ర, చిర్రు = కోపం.

చిర్రుమను అక. = బుసకొట్టు, కోపించు, గురు మను; వి. చిర్రు = కోపం.

చిర్రుముర్రాడు అక. = పెనగులాడు, సక. భేదించు.

చిలికించు సక. = చల్లు. చూ. చిలుకరించు

చిలి విలిపోవు అక. = తొందరించు, సందడించు.

చిలుకరించు / చిలుకించు / చిలకరించు = వి. చిలకరింపు, చిలుకరింపు = చల్లటం.

చిలుకు అక. = చిందు, ప్రసరించు, మీరు, సక. చల్లు; వి. చిలుకు = కొలికి, గొళ్ళెం, కొక్కెం, ములికి.

చిల్లులువోవు అక. = తూట్లుపడు; వి. చిల్లి, చిల్లు = రంధ్రం, తూటు.

చివుకు/చీకు అక. = తడిసి దుర్బలమగు, సారహీన మగు; విశే. చివుకు / చీకు = చీకిపోయిన.

చివుక్కురుమను అక. = మనసుకు కష్టమగు, చివ్వు సక. = చెక్కు.

చీకాకుపడు అక. = విసిగిపోవు, బలహీనపడు, శ్రమపడు; వి. చికాకు / చీకాకు = కలత, నలత.

చీకిలించు అక. రూ. చికిలించు చూ. = మిరు మిట్లుగొను; వి. చీకటి = వెలుతురు లేమి, చీకు = గుడ్డితనం, గుడ్డివాడు, చీకువాలు = చీకటి; విశే. చీకటి = నల్లని, వెలుతురులేని, చీకు = గుడ్డి, నిస్సారమైన.

చీకు సక. = చప్పరించు, ముద్దాడు; వి. చీకుడు = చప్పరింత.

చీకురించు అక. రూ. చీకిలించు, చికిలించు.

చీకొట్టు అక. = ఛీయను, ధిక్కరించు. రూ. ఛీకొట్టు

చీదరగొను అక. = ఆవేశపడు, అసహ్యించు కొను, తూటుపడు; వి. చీదర = అసహ్యం ప్రమాదం, తూటు.

చీదరరేగు చూ. చీదరగొను.

చీరదలువోవు చూ. చీదరగొను.

చీదు సక. = (చీమిడి) బయటకు, వచ్చునట్లు చేయు.

చీరు సక. = చీల్చు, పిలుచు, గీరు; వి. చీరిక = చీలిక. చీరుడు = చీల్చడం, పిలుపు.

చీలుచు సక. = చీలునట్లు చేయు; రూ. చీల్చు వి. చీలిక = చీరిక.

చుచ్చుకొట్టు అక. = దుఃఖంతో, బాధతో, చొచ్చుచ్చొఅను; వి. చుచ్చు = దుఃఖ సూచక ధ్వని.

చుట్టివచ్చు సక. = ప్రదక్షిణ చేయు, చుట్టుకొని వచ్చు.

చుట్టు సక. = చుట్టగాచేయు, తిరిగి వచ్చునట్లు చేయు; వి. చుట్టు = చుట్ట, కాలివేలి ఉంగరం, చుట్టుగైదువు = చక్రం, చుట్టుగొండ = చక్రవాళ పర్వతం.

చుట్టుకొను సక. = వెంబడివచ్చు, అన్ని వైపులా వచ్చు; వి. చుట్టుదల = చుట్టిరావటం.

చుట్టువారు చూ. చుట్టుకొను.

చుండు అక. = ఎండకు మాడు, వాడు.

చునాయించు సక. = (బట్టలు) మడతపెట్టు.

చుంబించు సక. = ముద్దుపెట్టుకొను; వి. చుంబనం = ముద్దు, చుంబకం = అయస్కాంతం, చుంబకుడు = కొద్దికొద్దిగా చాలా గ్రంథాలు చదివిన వాడు, ముద్దు పెట్టుకొనేవాడు, మోసకాడు.

చురచురవోవు అక. = మండు, తగలబడు; వి. చురచుర = కాల్పు, మంట.

చురుపుచ్చు / చుర్రుకొను సక. = కాల్చు, తగలబెట్టు.

చులుకజేయు సక. = తగ్గించు, అగౌరవించు, తేలికపరచు; వి. చుల్కపాటు/చులుకపాటు/చుల్కన/చులుకన = లాఘవం, సౌలభ్యం; విశే. చుల్క/చులుక = తేలికగా, సులభంగా.

చూతురుపడు అక. = దుఃఖించు, శోకించు; వి. చూతురు = శోకం.

చూచు అక. = యత్నించు, సక. కనుగొను; వి. చూడికి/చూడ్కి/చూపు = దృష్టి.

చూడు సక. = కాల్చు, కాలబెట్టు.

చూపట్టు అక. = కనిపించు; వి. చూపు = దృష్టి.

చూపు ప్రే. = చూపించు; వి. చూపు = దృష్టి, చూడటం.

చూపెట్టు సక. = చూపించు, ఎదురుచూచు.

చూపోవు అక. = చూడగలుగు; వి. చూపోవమి = చూడలేమి, అసహనం.

చూరకొను సక. = కొల్లగొట్టు; వి. చూర = కొల్ల, దోపిడి. చూరకోలు = కొల్లగొట్టడం, చూర కారుడు = కొల్లగొట్టినవాడు, దోపిడి కాడు.

చూరలాడు రూ. చూరాడు చూ. చూర కొను.

చూరవోవు అక. = కొల్లబోవు. రూ. చూరపోవు

చూర్ణీకరించు సక. = గుండకొట్టు, పొడుము చేయు; వి. చూర్ణకం = పేలపిండి. చూర్ణం = గంధప్పొడి, సున్నం, దుమ్ముపొడి.

చూలుకొను అక. = గర్భవతియగు; వి. చూలు = గర్భం, కడుపు.

చూలుపడు అక. = గర్భమగు, కడుపువచ్చు.

చెకపికలాడు సక. = తొందరపెట్టు.

చెక్కు సక. = చివ్వు, పొదుగు, చెక్కలు చేయు; వి. చెక్కడం = చెక్కిన వస్తువు.

చెంగగొట్టు సక. = ఓడించు.

చెంగలించు అక. = మించు, ప్రకాశించు, విజృంభించు, నవ్వు; వి. చెంగలింపు = చెంగలించటం; విశే. చెంగలి = దగ్గర, సమీపం.

చెంగు అక. = తొలగిపోవు, మెముడీయు; వి. చెంగు = చెరగు. చెంగున అవ్య. = వెంటనే, తొందరగా.

చెట్టువట్టు సక. = పెండ్లాడు; వి. చెట్టు = చేయి, చెట్టువట్టు = పెండ్లి.

చెట్టుపడు అక. = మాన్పడు, స్తంభించు.

చెడనాడు అక. = తిట్టు; వి. చెడగరం = క్రూరత, క్రూరుడు, చెడిప/చెడిపె = వేశ్య. చెడుగు = దుర్మార్గుడు, క్రూరుడు, దుష్టు రాలు, అశుభకార్యం, చెడుగడు = దుష్టుడు; విశే. చెడు/చెడ్డ = కీడు, తప్పు. చెడుగు = క్రూరమయిన, అశుభ.

చెడు అక. = కనబడ కుండు, కొల్లపోవు చూ. నశించు.

చెండాడు సక. = నరుకు; వి. చెండు = బంతి.

చెండుచెండాడు చూ. చెండాడు.

చెదరు అక. = చెదిరిపోవు, కలతపడు; రూ. చెదర బడు వి. చెదరు = కలత, చెదరటం.

చెదవట్టు అక. = పురుగులు పడు; రూ. చెదలు పట్టు వి. చెదలు, చెదరు = చెదపురుగు.

చెనకు / చెనుకు సక. = ఎదిరించు, తాకు; వి. చెనకు =ఎదిరింపు, తాకుదల, గోటినొక్కు.

చెనయు సక. = ఎదిరించు, తాకు, సోలు.

చెందు అక. = కలుగు, సక. పొందు.

చెన్నటివోవు అక. =వ్యర్థమగు; విశే. చెనటి/ చెన్నటి = కుత్సితమైన, వ్యర్థమైన, శూన్యమైన.

చెప్పు సక. = వచించు; వి. చెప్పుడు మాట = ఒకరు చెప్పిన మాట, విన్నమాట.

చెమటుపట్టు అక. = చెమటపోయు; వి. చెమట, చెమ్మట = స్వేదం, చెమరింపు.

చెమటపోయు చూ. చెమటపట్టు.

చెమరించు అక. = చెమట పట్టు; రూ. చెమ్మరించు వి. చెమరు = చెమట, చెమరుబోతు = ఎక్కువగా చెమట పట్టేవాడు, చెమ్మ/తేమ = తడి.

చెమరుచు అక. = చెమరించు రూ. చెమర్చు

చెమ్మగిల్లు అక.= తడియు, చెమర్చు; వి. చెమ్మ = తడి. చెమరు/చెమట/చెమ్మట= స్వేదం.

చెమ్మరించు చూ. చెమరించు.

చెరగుమాయు అక. = బహిష్ఠగు; వి. చెరగు = అంచు, కొంగు దిక్కు.

చెరగొను సక. = చెరపట్టు, బంధించు; వి. చెర = కారాగారం, నిర్బంధం.

చెరచు సక. = చెడగొట్టు, పోగొట్టు; వి. చెరపు/ చెరుపు = చెడు, చెడటం.

చెరచెరలాడు చూ. చిరచిరలాడు.

చెరపట్టు సక. = నిర్బంధించు.

చెరపోవు అక. = నిర్బంధం వల్ల పట్టువడు.

చెరవడు చూ.చెరపోవు.

చెరుచు ప్రే. = చెడగొట్టు; వి. చెరుపు = కీడు. చెరుపరి = నాశకుడు.

చెరుము సక. = రాచు.

చెలగు అక. = ఉత్సహించు, శబ్దించు, సంతోషించు, ఒప్పు, ప్రకాశించు, బొబ్బరించు, వికసించు, సక. ఖండించు, నరుకు. చెలవు (చూ).

చెలరేగు అక. = పేట్రేగు, బాగా విజృంభించు.

చెలవు సక. రూ. చెలగు చూ.

చెల్లు అక. = అయిపోవు, గడిచిపోవు, కొనసాగు, చేరు, చచ్చు, తగు, సాధ్యమగు; వి. చెల్లుబడి = అధి కారం; విశే. చెల్లు = చేరిన, బాకీ తీర్చిన, చెల్లుబడి = సిద్ధిపొందిన.

**చెవుడుపడు / చెవుడ్పడు** అక. = చెవుడు వచ్చు; వి. **చెవుడు** = వినబడమి. **చెవుడు పాటు** = చెవిటితనం.

**చేకురు** అక. = దొరుకు, లభించు, సిద్ధించు. రూ. **చేకూడు/చేకూరు**

**చేకొను** సక. = తీసుకొను, గ్రహించు, ఆదరించు, జయించు.

**చేడ్పడు** అక. = బాధపడు; రూ. **కీడ్పడు/కీడ్వడు** వి. **చేడ్పాటు/కీడ్పాటు** = బాధ, కష్టం.

**చేతవులు** అక. = దొరుకు, నష్టంవచ్చు.

**చేదు** అక. = (నీళ్లుమొ॥) తోడు, పైకిలాగు; వి. **చేద** = చేదటానికి వాడే పాత్ర, **చేత్రాడు/చాంతాడు** = చేదటానికి వాడే తాడు.

**చేపట్టు** సక. = తీసుకొను, గ్రహించు, అవలంబించు, పెండ్లాడు; వి. **చేపట్టు** = ఆధారం, అనుగ్రహం, స్థానం.

**చేపడు** అక. = చిక్కు, దొరుకు.

**చేపు** అక. = (పాలు) బయటికి తెచ్చు; వి. **చేపుడు** = చేపటం.

**చేమోడుచు** అక. = నమస్కరించు, మొక్కు; వి. **చేమోడుపు/చేమోడ్పు** = నమస్కారం.

**చేయు** సక. = ఒనర్చు, కావించు, నిర్వహించు; వి. **చే/చేయి/కేలు/కై/కయి** = హస్తం, **చేత** = పని. **చేతకాడు** = క్రియాపరుడు. **చేతరికం** = కీడు. **చే(యి)దోడు** = సహాయకుడు, సహాయకు రాలు.

**చేరు** అక. = ఒరుగు, వాలు, దగ్గరకు వచ్చు, సక. పొందు; వి. **చేరు** = దగ్గర, దండ, తాడు, గొలుసు. **చేరుగడ** = దగ్గర, దిక్కు, శరణం, **చేరిక** = కూడిక, సమీపం, **చేరుగొండి** = వలచి, వచ్చిన భార్య, **చేర్చుక్క/చేరుచుక్క** = పాపటబొట్టు, **చేరుబడి/చేరుపు/చేర్పు** = సమీపం, దగ్గర, **చేర్వ/చేరువ** = సమీపం, సమూహం, సేన, **చేరువకాడు** = సేనాధిపతి, కావలివాడు; విశే. **చేరుగొండి** = దగ్గరకు వచ్చిన, చెడ్డ.

**చేవిచ్చు** అక. = నమస్కరించు; వి. **చేవిప్పు** = నమస్కారం.

**చేష్టించు** అక. = (పిచ్చి) పనిచేయు వ్యాపారం చేయు; వి. **చేష్ట** = పని, వ్యాపారం, **చేష్టితం** = పని, గతి.

**చొక్కడు** సక. = మోసపుచ్చు; వి. **చొక్కు** = పారవశ్యం, మూర్ఛ, మోహం, **చొక్కునీరు** = కల్లు, మద్యం, **చొక్కుపొడి** = మత్తు మందు; విశే. **చొక్కు** = ఉండిన.

**చొక్కిళ్లువోవు** అక. = సొట్టపడు.

**చొక్కు** అక. = పరవశించు. రూ. **సొక్కు** చూ. **చొక్కడు**

**చొక్కుపెట్టు** సక. = సొక్కజేయు, చొక్కించు.

**చొచ్చిల్లు** అక. = చొచ్చుకొని పోవు, చొరబడు, ప్రవేశించు. రూ. **చొచ్చిలు**

**చొచ్చు** అక. = చొరబడు, ప్రవేశించు.

**చొత్తెంచు** అక. = ప్రవేశించు.

**చొనుపు** సక. = ప్రవేశపెట్టు, గుచ్చు, దూర్చు. రూ. **చొన్పు**

**చొప్పడు** అక. = సరిపడు, కలుగు, దొరుకు; వి. **చొప్పు** = జాడ, దారి, విధం.

చొప్పరించు ప్రే. = చొప్పడునట్లు చేయు, కలిగించు.

చొప్పించు ప్రే. = చొరజేయు, చొనుపు.

చొప్పిల్లు అక. = చొప్పడు చూ. తగు.

చొరబడు అక. = ప్రవేశించు, చొచ్చు; వి. చొరవ = ప్రవేశం, నేర్పు, సూక్ష్మబుద్ధి, చొరవకత్తి, చొర వకత్తె = చొరవగల స్త్రీ, చొరవకాడు = చొరవగల వాడు; విణ. చొరపోత = ఎడ తెగని, నిరంతరం.

చొరబారు అక. = చూ. చొరబడు

చొలయు అక. = మూర్ఛపోవు, సొక్కు, వెను దీయు, విముఖమగు, విరమగు; విణ. సొలుపు = సొక్కు, మూర్ఛ.

చోపు సక. = కలచు, తోలు, తరుము; వి. చోపు/ చోపుడు = కలత, చోపుడుకట్టె/ చోపుడు కోల = (గొడ్లమొ॥) తోలడానికి వాడే ములు గఱ్ఱ.

చౌకసేయు సక. = తక్కువచేయు; రూ. చవుక చేయు విణ. చవక/ చౌక = తక్కువ, అగ్గవ.

చౌకళించు అక. = బాధించు, నాలుగు కాళ్ల ఎత్తిదాటు/దూకు, కదలాడు; రూ. చవుక ళించు వి. చవుకళింత/ చౌకళింత/ చవుక ళింపు/ చౌకళింపు = కదలిక, దాటు, దూకు, గెంతు.

## ఛ

ఛేదించు సక. = నరుకు, తుంచు; వి. ఛేత్త = నరికేవాడు, ఛేదనం = నరకటం, ఛేదం, ఛేదం = ముక్క, తునక, నరుకుడు, భిన్నాంకాల్లో కింది సంఖ్య; విణ. ఛేత్తవ్యం = నరకదగిన, ఛేదితం = నరికిన, నరుకు పడిన, ఛేదితవ్యం/ ఛేద్యం = నరక దగిన.

## జ

జక్కించు అక. = కట్టుబడు, బద్ధపడు. రూ. దక్కించు

జగడమాడు అక. = పోట్లాడు, కలహించు; వి. జగడం = పోట్లాట, యుద్ధం, జగడగొండి/ జగడాలమారి = పోట్లాటల మారి.

జగడించు అక. = జగడమాడు.

జంకించు సక. = బెదిరించు; వి. జంకు = బెదురు, భయం.

జంకెయొనర్చు సక. = బెదిరించు. చూ. జంకు

జంగగొను అక. = దూకు, సక. దాటు; వి. జంగ = పిక్క, దాట,గంతు. జంగనడక/ జంగ నడపు = కాలుచాచినడవటం.

జజ్జుగొను అక. = బలహీనపడు; వి. జజ్జు = దుర్బ లత; విణ. జజ్జు = చివిగిన.

జట్టికొను అక.=వెలకుకొను. చూ. జట్టియిచ్చు

జట్టియిచ్చు సక.=కొను, అమ్ము; రూ. జట్టి యిడు వి. జట్టి = వెల, అమ్మకం. జట్టి కత్తియ/ జట్టికత్తె = వ్యాపారిణి, జట్టికాడు = వ్యాపారి.

జడకట్టు అక. = జడవేసుకొను; వి. జడ = వెంట్రుకల అల్లిక. జడకట్టు = కొప్పు.

జడగొను చూ. జడకట్టు.

జడనుపడు అక. = మందగించు, ఆలస్యమగు; వి. జడను = జాడ్యం, ఆలస్యం.

జడిగొను అక. = ఎడతెగకుండు, ఎక్కువగు; వి. జడి = బాధ, వాన; విణ. జడి = ఎడతెగని.

జడిపించు ప్రే. = జడియునట్లుచేయు; రూ. దడి పించు వి. జడుపు/ దడుపు = భయం, బెదురు.

జడియు అక.= భయపడు, చలించు, తొలగు, మోగు, వర్షించు, నక. పెట్టు, ఆపు, నివారించు; రూ. దడియు వి. జడుపు, దడుపు= బెట్టు దురు, భయం.

జడ్డువడు అక. = మొద్దుబారు; వి. జడ్డు = జాడ్యం, తగులం, బాధ్యత, జోలి, జడ్డుతనం = తగులం, బాధ్యత.

జంటపడు నక. = వెంటబడు; రూ. జమటుపడు వి. జంట = జత; విశే. జంట = వెంబడి, దగ్గర.

జంట చూ. జంటపడు.

జతనపడు అక. = యత్నించు; వి. జతను/జతనం = యత్నం; విశే. జతను/జతనం = పదిలం.

జతపడు అక.= తటస్థపడు, సరిపడు, సిద్ధించు, నెరవేరు; వి. జత = జంట, పోలిక.

జంతపట్టు అక. = పైరునడుమదున్ను.

జన్నియపట్టు నక. = బలికోసం సిద్ధం చేసి ఉంచు; వి. జన్నియ/జన్నె = వ్రతం, అచ్చుబోసి వదిలిన ఆంబోతు.

జన్మించు అక. = పుట్టు; వి. జననం/జన్మ = పుట్టుక. జన్మి = జంతువు, పుట్టుక గలది.

జపించు అక. = జపం చేయు; వి. జపం = వేదా లను/మంత్రాలను పదే పదే చదవటం; వి. జప్యం = మంత్రం; విశే. జప్యం = జపించ దగిన.

జబ్బువడు అక. = రోగం వచ్చు, మంచంపట్టు, మందగించు, మెత్తబడు; వి. జబ్బు = రోగం, బల హీనత.

జమలించు నక. = రెట్టించు, రెట్టింపుచేయు; వి. జమలిక/జమళిగ = రెండువైపులా వాయించు దగిన వాద్యం; విశే. జమలి/జమిలి = జంట, జోడు.

జమాయించు నక. = జమచేయు, కూడబెట్టు, అడంబరం చూపు; వి. జమ = చేరిక, కూడిక.

జయించు నక. = గెలుచు; వి. జయం = గెలుపు. జయనం = గెలవటం, జయ్యం = గెలవటానికి వీలయిన.

జరగు అక. = పాకు, ఉండు, దాటు, దూకు, పోవు, గడచు; వి. జరగు = పాకుడు, పాకటం.

జలకమాడు అక. = స్నానంచేయు; వి. జలకం = నీరు స్నానం.

జలగడుచు నక. = నీళ్లలో కలిపి గాలించు; వి. జలగం = జలగడుగు పనివాడు, స్వర్ణకారుడు.

జలదరించు అక. = వణకు, కంపించు; వి. జలదరం = వణకు, కంపం.

జలపరించు అక. = చూ. జలదరించు; వి. జలప రింత = వణుకు, కంపం.

జల్లను అక. = భయాదులతో చెమట పట్టు, భయ పడు; రూ. జల్లుమను; వి. జల్లు = వానకు చెదిరిన నీటి తుంపర, ఉమ్మితుప్పర.

జల్లించు అక. = కారు. నక. = జల్లెడలో చెరగు/తిప్పు, లోపాలు బయట పెట్టు; వి. జల్లెడ = జల్లించే చిల్లుల పళ్లెం. జల్లి = కుచ్చు, వల, అబద్ధం.

జవజవలాడు అక. = ఊగులాడు, నిస్సత్తువగా ఉండు; వి. జవజవ = వణుకు, ఊగులాట.

జవదాటు నక. = మేర మీరు, అతిక్రమించు.

జవ్వాడు అక. =కదలు, కుదులు, ఊగు.

జళిపించు నక. = భయపెట్టు, ఆడించు, కది లించు; వి. జళిపింత = దడుపు, బెదురు.

జాడా చేయు సక. = నాశనం చేయు, పూర్తి చేయు.

జాడా అవ్య. = సమూలం.

జాజువారు అక. = ఎర్రబడు; వి. జాజు = ఎరుపు. జాజుమట్టి = ఎర్రమట్టి; విశే. జాజు = ఎర్రని.

జాడించు సక. = ఉతుకు, విదిలించు, గట్టిగా తిట్టు, నిగ్గదీయు; వి. జాడింపు = ఉతకటం, విదిలించటం, నిగ్గదీయటం.

జాదుకొను అక. = వ్యాపించు, నిండు.

జారీచేయు సక. = విడుదల చేయు; వి. జారీ = విడుదల.

జారు అక. = కిందికి దిగు, జరుగు, వదులు, పరుగెత్తు, కారు; వి. జారు/జారుడు = స్రావం. జారుపాటు = పొరపాటు, స్ఖలిత్యం, జారుపు = కొండ చరియ, దిగుడు; విశే. జారు/జారుడు = వదిలే, వాలే, కిందపడే, ఉండిపోయే.

జారువారు అక. = జారిపోవు. చూ. జారు

జార్చు సక. = వదలి పెట్టు, జారునట్లు చేయు. రూ. జారుచు చూ. జారు

జాలిగొను అక. = దుఃఖపడు, విచారపడు; వి. జాలి = మనోబాధ, దుఃఖం, విచారం, దయ.

జాలిఖడు అక. = దుఃఖపడు.

జాలిబెట్టు సక. = దుఃఖపెట్టు.

జాలుకొను అక. = ప్రవహించు; వి. జాలువు, జాలు = ప్రవాహం, ఏరు.

జితపడు అక. = అనుకూలపడు, వాడుకపడు, స్థిరపడు; విశే. జితం = స్థిరమైన

జితించు అక. = కలిసిపోవు, జీర్ణమగు. చూ. జితపడు

జిమ్ము అక. = బయటికి చిమ్ము. రూ. చిమ్ము

జిరకొట్టు అక. = గిర్రున తిరుగు; రూ. గిరకొట్టు వి. జిర/జిర్ర = గుండ్రం; విశే. జిరజిర = గిర్రున.

జిల్లుమను అక. = చాలా చల్లగా ఉండు.

జివ్వుమను అక. = లాగినట్లనిపించు, ఉద్రేకం పుట్టు.

జీబుకొను అక. = దట్టమగు; వి. జీబు = కట్టు కోక, పీచు, సాంద్రత; విశే. జీబు = దట్టమైన.

జీరాడు అక. = నేలపై పోరు, నేలకు తగులు; రూ. జీరుకాడు

జీరు (కాడు) అక. చూ. జీరాడు = నేలకు తగులు, సక. = గీరు, గీకు; వి. జీరుకు = జరుగుడు, జారుడు. జీరుకుబండ = జారుడు బండ; విశే. జీరుకు = జరిగే, జారే.

జీరులాడు చూ. జీరాడు.

జీరువారు అక. = జరుగు, తొలగు, వ్యాపించు.

జీర్ణించు అక. = అరిగిపోవు; వి. జీర్ణం = అరిగినది, చినిగినది, పాతది, జీర్ణుడు = ముసలివాడు,

జీవించు అక. = బతుకు; వి. జీవం = ప్రాణం, ప్రాణి, తత్వం, బతుకు తెరువు, జీవకుడు = ప్రాణి, జీవించేవాడు, వడ్డీవ్యాపారి, ఉద్యోగి, పిసినిగొట్టు, పాములవాడు. జీవగర్ర = ప్రాణాధారం, జీవదుడు = వైద్యుడు, శత్రువు. జీవనం/జీవిక = బతుకు తెరువు. జీవుడు/జీవి = ప్రాణి, జీవితం = ప్రాణం, బతుకు, జీతం.

జుజురుకొను అక. = గుబురుకొను, దట్టమగు; వి. జుజురు = గుబురు.

జుడుగు అక. = భయంతో ముడుచుకొనిపోవు, వెనుదీయు, దాక్కొను.

జుమాయించు సక. = లాగిపట్టు.

జుర్రు సక. = పీల్చు; వి. జుర్రు = పీల్పు.

జువ్వరించు అక. = విజృంభించు.

జూకించు అక. = తత్తరపడు; వి. జూక = తత్తరం, తత్తర పాటు.

జూటాడు సక. = మోసగించు; వి. జూటు / జూటు దనం = మోసం.

జృంభించు అక. = ఆవలించు, విజృంభించు; వి. జృంభ / జృంభణ = ఆవలింత, ఒళ్లు విరుపు, వికాసం, జృంభితం = ఆవలింత; విశే. జృంభితం = పెరిగిన, వికసించిన.

జేగురించు అక. = ఎర్రబడు; వి. జేగురు / జేవురు = ఎరుపు; విశే. జేగురు / జేవురు = ఎర్రని.

జేపెట్టు సక. = దీవించు.

జేవురించు చూ. జేగురించు.

జోకచేయు సక. = సంపాదించు, సిద్ధంచేయు, వి. జోక = పోలిక, బాగు, జత, విధం, ఉత్సాహం, మొత్తం, స్వరూపం; విశే. జోక = సమానమైన, అధీనమైన, యుక్తమైన.

జోకపడు అక. = జతపడు.

జోకు అక. = తూకం వేయు, సక. తిట్టు; వి. జోకు = తిట్టు, తిట్టడం.

జోకొట్టు సక. = నిద్రపుచ్చుటానికి మెల్లగా తట్టు.

జోదగించు సక. = నడిపించు; వి. జోదన = (గుర్రం) నడక.

జోడించు సక. = జతచేయు, జతకలుపు, చేర్చు; వి. జోడింపు = కలపటం.

జౌరు సక. = కొట్టు, చేతులతో కుప్పచేసి యెత్తు. రూ. జవురు

జ్వలించు అక. = మండు, ప్రకాశించు; వి. జ్వలనం = మంట, నిప్పు, జ్వాల = మంట; విశే. జ్వలితం = మండిన, వెలిగే.

## ఝ

ఝంకరించు అక. = ఝమ్మని రొదపెట్టు; వి. ఝంకారం / ఝంకృతి = తుమ్మెదల రొద.

## ట

టంకరించు సక. = టమ్మని నారిమోగించు; వి. టంకృతి / టంకారం = వింటినారి మోత.

టలాయించు అక. = పని మాని తిరుగు, తప్పుకొని తిరుగు; రూ. తలాయించు; వి. టలాయింపు / తలాయింపు = పనిమాని తిరగటం, తప్పుకొని తిరగటం.

టూకించు సక. = సంగ్రహించు, క్లుప్తపరుచు; వి. టూకీ = సంగ్రహం. క్లుప్తి

## ఠ

ఠలాయించు చూ. టలాయిచు.

ఠవణించు ప్రే. = చేయు, కావించు.

ఠవణిల్లు అక. = జరుగు, ప్రవర్తిల్లు, ఒప్పు.

## డ

డక్కు రూ. దక్కు చూ.

డక్కొను రూ. దక్కొను చూ.

డగ్గరించు రూ. దగ్గరించు చూ.

డగ్గరు రూ. దగ్గరు చూ.

డగ్గు రూ. దగ్గు చూ.

డంగు రూ. దంగు చూ.

డమ్మను / ఢామ్మను అక. = చచ్చు.

డయ్యు అక. = బలహీనపడు, అలసటపొందు, చిక్కిపోవు.
డాకొను రూ. దాకొను (చూ.)
డాగు రూ. దాగు (చూ.)
డాగురించు ప్రే. = దాచిపెట్టు, మోసగించు; రూ. దాగురించు వి. దాగురింత/దాగురింత = దాగుడు మూత, దాపరికం.
డాచు రూ. దాచు. (చూ.)
డాపలించు అక. = ప్రదక్షిణం చేయు; వి. డాపల = ఎడమ భాగం; విణ. డాపల = ఎడమ.
డాపు రూ. దాపు (చూ.)
డాయు రూ. దాయు (చూ.)
డాలించు సక. = డాలు పట్టుకొను; వి. డాలు = కాంతి, టెక్కెం, కత్తి దెబ్బ కాచుకొనే పరికరం. డాలుకాడు = డాలు పట్టినవాడు, డాలువారు = డాలు, టెక్కెం.
డిగద్రావు అక. = దిగు. రూ. దిగద్రావు
డిగ్గద్రావు సక. = దిగు, విడుచు, వదలు.
డిగనాడు రూ. దిగనాడు (చూ.)
డిగనురుకు రూ. దిగనురుకు
డిగబడు రూ. దిగబడు (చూ.)
డిగు రూ. దిగు (చూ.)
డిగ్గద్రావు రూ. దిగద్రావు (చూ.)
డిగ్గదాటు చూ. దిగనురుకు (చూ.)
డిగ్గనాడు రూ. దిగనాడు (చూ.)
డిగ్గనురుకు చూ. దిగనురుకు (చూ.)
డిగ్గు రూ. దిగు, దిగు (చూ.)
డిగ్గువడు అక. = తక్కువపడు, నీచపడు.
డింకవేయు చూ. డింకాకొట్టు.
డింకాకొట్టు అక. = చచ్చు, డింకవేయు చూ.
డింకు అక. = చచ్చు.
డించు రూ. దించు (చూ.)
డిందు అక. = అణగిపోవు, ఇంకిపోవు, కుంగిపోవు, వాలిపోవు.
డిందుపడు అక. = అణగిపోవు, తగ్గిపోవు, శమించు, సమాధానపడు; వి. డిందుపాటు = ఉపశాంతి.
డింపు రూ. దింపు (చూ.)
డిల్లపడు అక. = భయాదులతో దిగులుపడు, బలహీనపడు; వి. డిల్లపాటు = ఢీలాపడటం; విణ. డిల్లం = బలహీనమైన.
డిల్లపోవు చూ. డిల్లపడు
డీకొను అక. = ప్రోత్సాహపడు, కవియు; వి. డీకోలు = డీకొట్టడం.
డీలించు ప్రే. = సడలించు; వి. డీలు/దీలు = ఢీలా; విణ. డీలు/దీలు = బలహీనమైన
డీలుపడు అక. = డిల్లపడు; వి. డీలుపాటు.
డుక్కు అక. = మరుగుపడు.
డుంకు అక. = తగ్గు, తగ్గిపోవు.
డుయ్యు రూ. దుయ్యు (చూ.)
డులుచు ప్రే. = డుల్లచేయు చూ. డుల్లు.
డుల్లు అక. = రాలిపడు, ఊడిపోవు.
డూయు రూ. దూయు (చూ.)
డెక్కు సక. = అడ్డగించు, ఆపు.
డెక్కొను అక. = నెలకొను, నిలబడు.
డెప్పరించు అక. = అసాధ్యమగు; వి. డెప్పరం,

డెప్పరం = ఆపద; విశే. దెప్పరం / డెప్పరం = అసాధ్యం, దుర్లభం, దుస్సహం.
డెప్పు రూ. దెప్పు (చూ.)
డేకు రూ. దేకు (చూ.)
డొకారంబొచ్చు అక. = లోబడు, లోనగు; వి. డొకారం = లోను, లోపలిభాగం.
డొక్కు అక. = ముదిసిపోవు, ముదురెక్కు; విశే. డొక్కు = ముదిసిన, ముసలి అయిన.
డొంకు అక. = ఇంకు, ఎండు, అడగు; వి. డొంకు = వంకర, డొంకెన = వంపు ములికి గల ఈటె.
డొంగు రూ. దొంగు (చూ.)
డొలుచు స్రే. = డొల్లజేయు. రూ. దొలుచు
డొల్లు రూ. దొర్లు (చూ.)
డోకు రూ. దోకు (చూ.)
డోగియాడు అక. = దోగాడు రూ. డోగాడు
డోగు రూ. దోగు (చూ.)

## త

తకసికలాడు అక. = అటూ ఇటూ కదలు.
తక్కు అక. = తప్పు, టక్కు చూపు, సక. విడుచు, టక్కు చేయు; రూ. టక్కు వి. తక్కు = మిగులు. టక్కు = మోసం, టక్కరితనం, తక్కరి(కాడు) / టక్కరి(కాడు) = మోసం చేసేవ్యక్తి, తక్కు లాడు / టక్కు లాడు = మోసగాడు, తక్కు లాడి / టక్కు లాడి = మోసకత్తె, టక్కుబా జీతనం = మోసం. తక్కుడు = తక్కటం, తప్పటం. తక్కరి / తక్కిడి(కాడు) = మోసగాడు. తక్కువ(పాటు) = కొరత, తక్కువ దనం; విశే. తక్కు = ఇతరమైన.
తక్కువపడు అక. = కొరతపడు. చూ. తక్కు
తక్కొను అక. = పూనుకొను, ప్రయత్నించు.
తగు అక. = యుక్తమగు, సరిపడు; వి. తగవు = తగినది, న్యాయం, ధర్మం, డబ్బు మొ॥ వాటి కోసం జగడం. తగవరి = తీర్పరి, న్యాయాధిపతి. తగవు గోరి = సంధి చేసేవాడు; విశే. తగవు = తగిన, యుక్తమైన.
తగులగట్టు సక. = తగిలించు. చూ. తగులు
తగులబడు అక. = ఊడు, దగ్ధమగు. రూ. తగులబడు / తవులబడు / తేలబడు చూ. తగులు
తగులబెట్టు సక. = కాల్చు, ముట్టించు, పెడగొట్టు. రూ. తగలబెట్టు
తగులు అక. = చిక్కు, పట్టు, తాకు, తగులుకొను, అంటు, పొసగు, సక. వెంబడించు; రూ. తొలు వి. తగులు = ఆసక్తి, అభిలాష. తగులం = ఆసక్తి, అడ్డపాటు, తగులాటం = సంబంధం, తగులాటు కత్తె = తగులాటం కల స్త్రీ. తగులుడు / తగులు కోలు = తగులం.
తగులుకొను అక. = రగులుకొను, అంటుకొను, సక. ప్రేమించు, వెంటబడు; రూ. తొలుకొను / తవులుకొను వి. తగులుకోలు / తగులు దల, తగులుడు = తగులం, తగులుబడి = పట్టుబడి. తగులుగొండి = వెంటబడే ఆడది.
తగులుచు స్రే. రూ. తగుల్చు / తవుల్చు / తొల్చు చూ. తగులు.
తగులువడు అక. = పట్టువడు, చిక్కు దొరుకు; వి. తగులువాటు = పట్టుబడటం. రూ. తవులువడు / తొలువడు చూ. తగులు
తగ్గు అక. = తక్కువగు, తెగిపడు; వి. తగ్గు / తగ్గుదల = తక్కువ, క్షయం.

**తచ్చనలాడు** అక. = పరిహసించు, వెక్కిరించు, వి. తచ్చన = మోసం, పరిహాసం.

**తచ్చన సేయు** సక. = వెక్కిరించు, పరిహాస మాడు.

**తటుకాపడు** అక. = చేష్టలుడుగు, నిశ్చేష్టమగు; వి. తటుకా = నిశ్చేష్టత, తటుకాపాటు = నిశ్చేష్టుడ వటం.

**తటుమటించు** సక. = మోస పుచ్చు, కలతపెట్టు; రూ. తటువటించు వి. తటువట/తటుమట = మోసం; విణ. తటువట/తటుమట = మోసం గల, కలత పడిన.

**తటుస్థించు** అక. = అగు, జరుగు, సమీపించు; వి. తటం/తటి = ఒడ్డు, ప్రదేశం, పరిమడి, కొండ చరియ. తటస్థుడు = పక్షపాతం లేనివాడు, మధ్య స్థుడు, న్యాయస్థుడు; విణ. తటస్థం = అటూ ఇటూకాని, ఒడ్డున ఉన్న, దగ్గరలో ఉన్న, జరిగిన.

**తటాయించు** సక. = ఆపు, అడ్డగించు; వి. తటా యింపు.

**తట్టగిల్లు** అక. =తట్టలాగా ఉపయోగపడు; వి. తట్ట = బుట్ట, గంప, తబుకు.

**తట్టాడు** సక. = అడుగలువేయు; వి. తట్టు = పక్క, పార్శ్వం

**తట్టు** అక. = తోచు, కలుగు, సక. మెల్లగా కొట్టు, చరచు; వి. తట్టు = పక్క, ఒడ్డు. తట్టుపునుగు = మంచి పునుగు.

**తట్టుముట్టాడు** సక. = చుట్టుముట్టు, చుట్టు కొను.

**తట్టువడు** అక. బాధపడు.

**తడబడు** అక. = తొట్రుపడు, చలించు; వి. తడ బాటు = తొట్రుపాటు, కదలిక, వ్యత్యాసం.

**తడకట్టు** సక. = అడ్డగించు; వి. తడకట్టు = అడ్డ గింత.

**తడయు** అక. = ఆలసించు.

**తడవు** అక. = పాకు, దోగాడు, సక. నిమురు, వెతుకు, ప్రస్తావించు, విచారించు, రక్షించు; వి. తడవు = ఆలస్యం, చాలాకాలం, తడవుడు = వెతకటం.

**తడియు** అక. = తడిసిపోవు; వి. తడి = తేమ, నీరు; విణ. తడి = తేమగల, తడిసిన.

**తడుపు** సక. ప్రే. = తడియు నట్లు చేయు; వి. తడుపు = గోచి, చిన్న గుడ్డ. తడుపుదాలుపు = బ్రహ్మచారి.

**తడుము** అక.= ఆలోచించు, సక. నిమురు.

**తండు** సక. = (రావలసినసొమ్ము) అడుగు.

**తత్తరపడు** అక. = తొట్రుపడు, తొందరపడు; వి. తత్తరపాటు = తొందర, తొట్రుపాటు.

**తత్తరించు** అక. = సంభ్రమించు, చలించు. రూ. తత్తరిల్లు.

**తత్తరిల్లు** అక. = తొట్రుపడు, తొందరపడు. రూ. తత్తరిలు, తత్తరించు.

**తనరారు** అక. = ఎక్కువ అగు, ఎత్రగు, మించు; వి. తనరుపు/తనర్పు = పొడుగు, అతిశయం.

**తనరు** అక. = అతిశయించు, ఒప్పు, విజృంభించు; వి. తనరుపు, తనర్పు = అతిశయం, పొడుగు.

**తనియు** అక. = తృప్తిపడు; వి. తనివి/తనివు = తృప్తి.

**తనివోవు** అక. = తృప్తిపడు; వి. తనివి. చూ. తనియు

**తనుకు** అక. = కలుగు, వెలుగు, మండు, తపించు; వి. తనుకు = తాపం, వేడి.

**తనువడు** అక. = చల్లబడు; వి. **తనుపు** = తనివి, తృప్తి, చల్లదనం, తడి.

**తన్ను** సక. = కాలితో కొట్టు, తాకు; వి. **తన్ను** = కాలిదెబ్బ.

**తన్నులాడు** అక. = కొట్లాడు, కాళ్లతో తన్నుకొను; వి. **తన్నులాట** = కొట్లాట, కాలిదెబ్బ.

**తపించు** అక. = తాపం పొందు, తపస్సు చేయు; వి. **తబం / తపం** = వేసవి, **తపస్సు / తపస్య** = వ్రత చర్య. **తబిసి / తాపసుడు / తపస్వి** = తపస్సు చేసేవాడు, **తపస్విని** = తపసు చేసే స్త్రీ, **తపన(ం)** = ఉడుకు, వేడి, బాధ, వేసవి, **తపనుడు** = సూర్యుడు. **తాపం** = బాధ, దుఃఖం; విశే. **తాపితం** = వేడెక్కినది.

**తప్పు** అక. = తప్పుచేయు, సక. మించు; వి. **తప్పిదం / తప్పు** = పాడుపని, దోషం. **తప్పుదల** = తప్పటం, **తప్ప** = గింజపట్టని ధాన్యం, **తప్పకాయ** = గింజపట్టని కాయ; విశే. **తప్పుడు** = తప్పయిన. చూ. తక్కు.

**తప్పుడుపడు** అక. = వరసతప్పు. రూ. తప్పువడు

**తమకపడు** అక. = తొందరపడు, మోహపడు; వి. **తమకం** = తొందర, మోహం, **తమకి** = తొందర/ మోహం కలవాడు.

**తమకించు** అక. = తొందరపడు, చలించు.

**తమకు** అక. = చలించు; వి. **తమకు** = విధం.

**తమాయించు** అక. = ఆగిచూచు స్తిమితపడు, శమించు, నిగ్రహం చూపు; వి. **తమాయింపు** = ఆపు, నిగ్రహం.

**తమికొను** అక. = తొందరపడు, కుతూహలపడు, ఆపేక్షపడు, మోహపడు; వి. **తమి** = తొందర, ఆపేక్ష, కుతూహలం, వలపు, ప్రేమ.

**తరకటించు** అక. = తర్కించు; వి. **తరకటింపు** = తర్కం.

**తరటు** సక. = కొరడాతోకొట్టు సక.; వి. **తరటు** = కొరడా.

**తరటుగొను** సక.= కొరడా తోకొట్టు, రూ. **తరటుచేయు** చూ. తరటు

**తరతరలాడు** అక. = తత్తరపడు; వి. **తరతర** = తత్తర(ం)

**తరలు** అక. = ప్రయాణమగు, బయలుదేరు, చలించు, సంభ్రమించు, సక. విడుచు, వదలిపెట్టు; వి. **తరలింపు** = తీసుక పోవటం, స్థలం మార్పిడి.

**తరల్చు** ప్రే. = విడిపించు, వదలించు. రూ. **తరలుచు / తరలించు**

**తరిగొను** అక. = యత్నించు.

**తరించు** సక. = దాటు, గడుచు; వి. **తరి** = ఓడ, మబ్బు. **తరణం** = దాటడం, **తరణి** = ఓడ. **తరపణ్యాం** = ఓడకేవు.

**తరిచుట్టు** సక. = నైవేద్యంపెట్టు.

**తరితీపుచేయు** అక. = గర్వించు, సక. ఉపేక్షించు, నిర్లక్ష్యంచేయు; వి. **తరితీపు** = ఉపేక్ష, అపేక్ష.

**తరియు** అక. = సమీపించు, సక. దాటు, అతిక్రమించు.

**తరుగు** అక. = తగ్గు, క్షయించు, సక. నరుకు, చించు; వి. **తరుగరి** = తరుగు చేరగాడు, **తరుగు** = తగ్గింపు.

**తరుచు** సక. = చిలుకు, మథించు; రూ. త్రచ్చు **తరి**=చిలకటం, మథనం. **తరికాడు** = చిలికేవాడు, **తరిగంబం**= మంథపర్వతం, **తరిగడవ** = పెరుగు చిలికేకుండ. **తరితాడు**= కవ్వంతాడు, **తరిదాల్పు** = విష్ణువు (కచ్ఛపావతారంలో).

**తరుము** అక. = ఎదుర్కొను, తొందరపడు, సక. వెంబడించు, పరిగెత్తించు, బలాత్కరించు, సాన బట్టు; వి. **తరిమెన** = సాన. **తరి** = ఒత్తిడి, రాపిడి.

**తరువు** అక.= తగు, సక. నరుకు. చూ. **తరుము**

**తర్కించు** అక. = తర్కంచేయు, వాదించు, చర్చించు; వి. **తర్కం** = వాదం, చర్చ.

**తర్జించు** సక. = (వేలితో) బెదిరించు, అదిలించు; వి. **తర్జనం** = బెదిరింపు.

**తలంటు** అక. = తలమీద నూనెతో రాచు; రూ. **తలయంటు** వి. **తలంటు** = అభ్యంగనం, నూనె రాసి చేసిన స్నానం.

**తలకడచు** సక. = దాటు; వి. **తల** = చోటు, స్థలం, రంగం, వైపు.

**తలకించు** అక. = చలించు; వి. **తలకు** = చలనం, కదలిక, భయం.

**తలకు** అక. =చలించు, చూ. తలకించు

**తలకూడు** అక. = నెరవేరు, సిద్ధించు.

**తలకొను** అక. = యత్నించు, కలుగు, సక. ధరించు, భరించు, మోయు; వి. తలపు = ఆలోచన, ఊహ, భావం, అభిప్రాయం, కోరిక, చింత, గుర్తు, హృదయం.

**తలచూపు** అక. = పొడచూపు, కనిపించు, పొట మరించు.

**తలడించు** అక. = చలించు, కదలు. రూ. **తల్ల డించు/ తలడిల్లు/ తల్లడిల్లు**

**తలపడు** అక. = మొదలుపెట్టు, ఏర్పడు, సక. ఎదిరించు, తాకు; వి. **తలపాటు** = మొదలు, ఎదిరింపు.

**తలపు చేయు** అక. = భావించు.

**తలపెట్టు** అక. = మొదలు పెట్టు, సక. ఎదు ర్కొను, ప్రస్తావించు.

**తలపోయు** అక. = ఆలోచించు, భావించు, చింతించు, విచారించు; వి. **తలపోత** = ఆలో చన, చింత, విచారం.

**తలమించు** అక. = ముందుకు వచ్చు, గడచు, అధిగ మించు.

**తలమిగులు** అక. = ముందుకు వచ్చు.

**తలముదప్పు** అక. = అశక్యమగు, అసాధ్యమగు; వి. **తలం** = శక్యం.

**తలయెత్తు** అక. = మొలకెత్తు, మొలుచు, పెరుగు.

**తలరు** అక. = చలించు, చించించు, కలతపడు, తొందరపడు, ఉండు, ఒప్పు.

**తలారించు** అక. = మరలు, వెనుదిరుగు.

**తలిర్చు** అక. = చిగిరించు, సంతోషించు, అతిశ యించు; వి. **తలిరు** = చిగురు, **తలిరుదిండి** = కోకిల, **తలిరుపు/ తలిర్పు**=చిగురించటం, సంతోషం, **తలిరువిల్తుడు** = మన్మథుడు.

**తలుగు** అక. = తొలగి పోవు. రూ. **తల్గు/ తలగు** చూ.

**తల్లడపడు** అక. = చలించు; వి. **తల్లడపాటు** = చలనం.

**తల్లడపెట్టు** సక. = బాధపెట్టు, చలింపజేయు. చూ. **తల్లడిల్లు**

**తల్లడిల్లు** అక. = తల్లడపడు, బాధపడు, కదలాడు; వి. **తల్లపాటు** = కదలిక, బాధ.

**తవులబడు** చూ. **తగులబడు.**

**తవులు** చూ. **తగులు**

**తవులుకొను, తౌల్కొను** చూ. **తగులు కొను.**

**తవులుచు** అక. రూ. **తవుల్చు/ తగులుచు/ తగుల్చు** చూ. **తగుల్చు.**

**తసుకు** అక. = ప్రేమ నటించు; వి. **తసుతు** = నటన, టక్కు, చేష్ట, **తసుకులాడి** = టక్కులాడి.

**తస్కరించు** సక. = దొంగిలించు; వి. **తస్కరుడు** = దొంగ, **తస్కరణ** = దొంగతనం.

**తహతహపడు** అక. = తొందరపడు, కుతూహల పడు, తమకపడు; వి. **తహతహ** = కుతూహలం, తమకం, వ్యసనం.

**తహతహపెట్టు** సక. = కుతూహలపెట్టు, తొందరపెట్టు.

**తహతహలాడు** అక. = తహతహపడు చూ.

**తాకించు** సక. = అలసటపెట్టు, శ్రమ పెట్టు. చూ. **తాకు**

**తాకు** అక. = ఎదుర్కొను, మార్కొను; తగులు, సక. ముట్టుకొను వి. **తాకు** = దెబ్బ, తగలటం, **తాకుట/తాకటం** = స్పర్శ, **తాకుదల** = యుద్ధారంభం.

**తాగడించు** సక. = నిర్బంధించు

**తాగు** సక. = పానంచేయు; రూ. త్రాగు వి. **తాగుడు** = మద్యపానం, **తాగుబోతు** = తెగ తాగేవాడు.

**తాచు** సక. = తన్ను, చెక్కు, తొలుచు, అవలంబించు; వి. **తాపు** = తన్ను, కాలిదెబ్బ.

**తాండవించు** అక. = వేగంగా నాట్యం చేయు; వి. **తాండవం** = ఉద్ధత నృత్యం.

**తాపించు** సక. = నెలకొల్పు, నిలుపు, చెక్కు, మోదు; వి. **తాపడం** = దూర్చటం, ఇరికించటం, **తాపడప్పని** = నగల్లో రాళ్లు కూర్చేపని. **తాపికత్తియ/తాపికత్తె** = కలిపేది, సంధాన కర్త్రి, **తాపి కాడు** = కలిపేవాడు.

**తామసించు** అక. = ఆలసించు, ఆలస్యం చేయు; వి. **తామసం** = ఆలస్యం, **తామసుడు** = దుష్టుడు, తమోగుణవంతుడు; విశే. **తామసం** = తమోగుణం గల.

**తారకాణించు** చూ. **తార్కాణించు**

**తారసించు** అక. = సమీపించు, వ్యాపించు; రూ. **తారసిల్లు/తారసిలు** వి. **తారసం** = సమీపం, ఎదుర్కోవటం; విశే. **తారసం** = సమీపించిన.

**తారసిల్లు** రూ. **తారసిలు**, చూ. **తారసించు**

**తారాడు** అక. = తిరుగులాడు, జీరాడు. చూ. **తారు**

**తారు** అక. = తిరుగు, పోవు, సమీపించు, మరుగు పడు, అణగారు; వి. **తారుపు/తార్పు** = తార్చటం, చేర్చటం, కలపటం, **తార్పుకాడు** = ప్రేయసీ ప్రియులను కలిపేవాడు. **తార్పుకత్తె** = తార్చేస్త్రీ.

**తారుకొను** సక. = ఎదుర్కొను, ఎదురుపడు; రూ. **తార్కొను** వి. **తారుకోలు/తార్కోలు** = కదియటం, ఎదుర్కోలు.

**తారుచు** ప్రే. = కలుపు, చేర్చు; వి. **తారుపు/తార్పు** = కలపటం. చూ. **తార్చు**

**తారుమారువడు** అక. = క్రమంతప్పు, వ్యత్యాసమగు; వి. **తారుమారు** = వ్యత్యాసం, క్రమహీనత.

**తార్కాణించు** సక. = దృష్టాంతం చూపు, **తారకాణ/తార్కాణ(ం)** = నిదర్శన. రూ. **తారకాణించు**

**తాలించు** సక. = వేయించు, తిరగమాత పెట్టు; వి. **తాలింపు** = తిరగమాత, వేయించిన కూర.

**తాలుచు** సక. = ధరించు, నులిపెట్టు, పేను, చేతో తట్టి తిప్పు; వి. **తాల్పు** = ధరించేవ్యక్తి.

**తావుకొను** సక. = నిలుచు; వి. **తావు/తావలం** = స్థానం, అవకాశం, ఆధారం.

**తాళగించు** అక. = తాళంవేయు; వి. **తాళగిరి** = తాళం వేసేవాడు, **తాళం** = చేతిచరుపు, (పాటలో) కాలపరిమాణం, తాళంవేసే కంచుచిప్ప; బీగం, **తాళి** = పతకం.

**తాళించు** సక. = పాచికలు కదిలించు, గలగల లాడించు.

**తాళు** అక. = చాలు, సరిపోవు, సహించు, నిదానించు; రూ. **తాళుకొను** వి. **తాళిక** = ఓర్పు, సహనం; విణ. **తాళిక** = చాలిన, సరిపోయిన.

**తికమకగొను** అక. = కలతపడు, తొట్రుపడు; వి. **తికమక** = కలత, తొట్రుపాటు, అవయవాల అస్వాధీనత.

**తికమకలాడు** చూ. తికమకగొను.

**తిక్కగొను** అక. = వెర్రెత్తు; వి. **తిక్క** = పిచ్చి, తలతిరుగుడు, **తిక్కటు/ మక్కటు** = కలత, క్షోభ. తిగియు సక. = లాగు, గుంజు, ఆకర్షించు.

**తిట్టు** సక. = నిందించు, శపించు; వి. **తిట్టు** = నింద, శాపం, **తిట్లాట** = తిట్టుకోవటం, **తిట్టువాటు** = నింద.

**తిట్టుపడు** అక. = నిందపడు, శాపం, పొందు; వి. **తిట్టువాటు** = నింద.

**తిను** సక. = భుజించు; వి. **తిండి** = ఆహారం, భోజనం. **తిండికత్తియ / తిండికత్తె** = తెగతినే స్త్రీ. **తిండీడు / తిండికాడు** = తెగతినేవాడు. **తిండిపోతు** = విపరీతంగా తినేవ్యక్తి.

**తినుకు** అక. = ముక్కి ముక్కి మలవిసర్జన చేయు.

**తిపురుకట్టు** అక. = వ్యాపించు.

**తిమురు** అక. = తొందరపడు, ఉద్రేకపడు, ఒళ్లు విరుచుకొను, గర్వించు; వి. **తిమురు / తిమ్మిరి** = గర్వం.

**తిమ్ము** సక. = దీవించు.

**తిరపడు** అక. = స్థిరపడు; వి. **తిరుడు** = స్థిరపడు; విణ. **తిరం** = స్థిరం.

**తిరస్కరించు** సక. = తిట్టు, తెగడు, అనాదరించు; వి. తిరస్కారం/ తిరస్కృతి/ తిరస్క్రియ, తిరస్కరణ = అనాదరం, తెగడ్త. **తిరస్కరిణి** = తెర. **తిరస్కృతుడు** = నింద/ తిట్టు పడిన వాడు.

**తిరిగివచ్చు** అక. = ప్రదక్షిణముగు, సక. చుట్టుకొని ఉండు; వి. **తిరి** = సుడి, జడ, **తిరిక** = మెలిక.

**తిరితీపులాడు** అక. = పెనుగులాడు.

**తిరియు** సక. = బిచ్చమెత్తు; వి. **తిరిపం** = బిచ్చం. **తిరిపరి / తిరిపగాడు** = బిచ్చగాడు.

**తిరివడు** అక. = కలతపడు.

**తిరుగబడు** అక. = ఎదిరించు, తిరుగు, మరలు, విపరీతమగు; వి. **తిరుగుబాటు** = ఎదురు తిరగటం.

**తిరుగబోయు** అక. = తాలింపువేయు, పోపు పెట్టు; వి. **తిరుగబోత** = తాలింపు, పోపు.

**తిరుగాడు** అక.= సంచరించు. రూ. **తిరుగులాడు**

**తిరుగు** అక.= సంచరించు, గుండ్రంగా కదులు, తిరిగివచ్చు, భ్రమించు, సక. చుట్టుకొనుండు; వి. **తిరుగు** = తిరగటం, భ్రమణం, **తిరుగుడు** (**నొక్కు**) = భ్రమణం, మారుపాటు, మర, వక్రం, **తిరుగుదల** = మరలటం, **తిరుగుబోతు** = దేశదిమ్మరి, వ్యభిచారి; విణ. **తిరుగుముఖం** = తగ్గుముఖం.

**తిరుగుడుపడు** అక. = పరిభ్రమించు.

**తిరువు** చూ. తిరుగు.

**తిలకించు** అక. = వెలుగు, ప్రసన్నంగా ఉండు; వి. తిలకం = బొట్టు, పుట్టుమచ్చ; విశే. తిలకం = శ్రేష్ఠం.

**తివియు** చూ. తిగియు.

**తివురు** అక. = తొందపరడు, కుతూహలపడు, యత్నించు, కోపించు, మోగు, సక. కోరు; వి. తివుట = కోరిక.

**తీగలువారు** అక. = వ్యాపించు, విస్తరించు; వి. తీగ/ తీగియ/ తీగె = లత, తీగయెలుగు = హీనస్వరం, తీగమోడి = గొలుసుకట్టు (రాత). తీగయిల్లు = పొదరిల్లు.

**తీగసాగు** అక.= పెరుగు, విస్తరించు. చూ. తీగలువారు

**తీండ్రించు** అక.= మండు, వెలుగు; రూ. తీడిరించు వి. తీండ్ర = వెలుగు, ప్రకాశం, వేడి, తేజస్సు, చొరవ, చురుకు; విశే. తీండ్రం = తీక్ష్ణమయిన, ప్రచండమయిన.

**తీడిరించు** చూ. తీండ్రించు.

**తీడు** సక. = పదునుపెట్టు.

**తీపారు** అక. = తియ్యనగు, చక్కనగు; వి. తీపి = మాధుర్యం, కోరిక, తీపు = మధురత్వం, బాధ, తియ్యన/ తీయన = తీపి, తియ్యం/ తీయం = తియ్యదనం, తీపి, ఇష్టం; విశే. తీపి = మధురమైన, తీపు = తియ్యని.

**తీయు** అక. = చిక్కిపోవు, తగ్గిపోవు, తొలగిపోవు, సక. ఈడ్చు, తీసుకొను, దబ్బిచ్చికొను, వేయు, వి. తీత = తీయటం.

**తీరుపడు** అక. = నశించు.

**తీరు** అక. = చక్కబడు, సాధ్యమగు, నశించు, వదలిపోవు, అవకాశపడు; వి. తీరు = సంధి, చక్కన, విధం, తీరుపు/ తీర్పు = న్యాయం, చక్కబాటు, తీరుపరి/ తీర్పరి = న్యాయాధికారి, కార్యసాధకుడు, గూఢచారి, తీరిక/ తీరుబడి = అవకాశం, తీరుదల/ తీరుగడ = ముగిసిపోవటం, ముగింపు, తీరుపాటు/ తీర్పాటు = తీరిక, అవకాశం, తీరమి = అక్కర.

**తీరుచు** అక. ప్రే. = (కాపులు) బారకట్టు, సంభోగించు, తీర్పువేయు, చక్కబరచు; రూ. తీర్చు వి. తీర్పు = న్యాయం, నిర్ణయం.

**తీర్థమాడు** అక. = స్నానం చేయు; రూ. తీర్థములాడు వి. తీర్థమాట = స్నానం, తీర్థం = పుణ్య జలం, పుణ్యనది, రేవు, తీర్థవాసి = తీర్థసేవ చేసే వాడు, తీర్థసేవ = పుణ్యక్షేత్రాలకు పోవటం.

**తీలగు** అక. = అణిగిపోవు; రూ. తీలుపడు వి. తీలు = అణిగిపోక, అడకం.

**తీవరపడు** అక. = తొందరపడు; వి. తీవరం = తొందర, తీవరపాటు = తొందరపాటు.

**తీసివేయు** సక. = తొలగించు, తక్కువ చేయు, నరుకు; వి. తీసివేత = తొలగింపు, తగ్గింపు.

**తుకతుకలాడు** అక. = ఉడుకు, మరుగు, మండిపడు, దుఃఖపడు; వి. తుకతుక = దుఃఖం, కోపం, మంట, మరగటం.

**తుటారించు** సక.= తిరస్కరించు; వి. తుటారం = దిట్టతనం, కఠినవచనం, తుటారికత్తియ, తుటారికత్తె = పొగరుబోతు స్త్రీ, తుటారికాడు = పొగరుబోతు.

**తుట్టెగట్టు** అక. = (పురుగులు పడి) ఊడగట్టు; వి. **తుట్టియ/త్రుట్టియ, తుట్టె** = గుంపు, **తుట్టె పురుగు** = సామాన్య సర్పం.

**తుడుచు** సక. = తడిలేకుండా తుడుచు, ఊడ్చు, వి. **తుడుపు** = తుడవటం, దిష్టిబాయి, కొట్టివేత.

**తుండించు** సక. = ఖండించు, నరుకు, చీల్చు; వి. **తుండం/తుండు/తుండె(ం)** = ముక్క, ఖండం.

**తుదిముట్టు** అక. = చచ్చు, పూర్తి అగు; వి. **తుద** = చివర, కడ, కొన, అంతం, **తుదిరేయి** = ప్రళయాంతం, **తుదివాడు** = అందరి కన్నా చిన్న వాడు, కనిష్ఠుడు.

**తునియు** అక. = ముక్కలగు; రూ. **తునుగు** వి. **తునక/తునుక/తున్క/తునియ** = ముక్క.

**తునుమాడు** సక. = నరుకు, చంపు, ముక్కలు చేయు.

**తునుము** సక. = తునుమాడు రూ. **తున్ము**

**తుప్పటిల్లు** అక.= తృప్తిపడు.

**తుప్పలుదూలు** అక.= విపరీతంగా తూలిపోవు.

**తుమ్ము** అక. = క్షుతంచేయు, ఆచ్చియను; వి. **తుమ్ము** = క్షుతం.

**తుంపెసలాడు** అక. = కదలు, చలించు, ఊగాడు, నాట్యంచేయు; వి. **తుంపెసలు** బహు. = కదలిక.

**తుంపెసలుగునియు** చూ. **తుంపెసలాడు.**

**తురగలించు** అక. = ప్రకాశించు, అతిశయించు; వి. **తురగలి** = ప్రకాశం.

**తురుగు** సక. = బలవంతంగా కక్కు.

**తురుము** సక. = చెక్కు, పాడిచేయు, (కొప్పులో) పెట్టుకొను.

**తులకించు** అక. = ప్రకాశించు, కుతూహలపడు; వి. **తులకింపు** = ప్రకాశం.

**తూగు** అక. = జోగు, కదలాడు, ఊగాడు, తూనిక అగు; చూ. ఊగు. వి. **తూకం/తూకు** = బరువు, ఎత్తు, పూనిక, **తూనిక** = తూచటం.

**తూచు** ద్వి. = తూనిక వేయు; వి. **తూచటం/తూచడం** = తూనికవేయుటం.

**తూటాడు** సక. = వేధించు, బాధించు, బొక్కలు పెట్టు; చూ. ఊటాడు వి. **తూటు** = చిల్లి, రంధ్రం.

**తూటుకట్టు/తూటుపడు/తూటుపోవు** అక. = బొక్కలుపడు, బాధపడు.

**తూనికవేయు** సక. = తూచు.

**తూగొట్టు/తూపొడుచు** సక. = ఉమ్మి వేయు, అసహ్యించుకొను, అవమానించు; **తూ** = ఉమ్మి, తూస్కారం.

**తూరు** అక. = సన్నతుప్పరపడు; వి. **తూరు** = పొల్లు, పొట్టు, తాలు.

**తూరుపారబట్టు** = పొల్లుపోగొట్టు, గాలికి చెరుగు; రూ. **తూర్పారబట్టు** వి. **తూరు**= పొల్లు, పొట్టు.

**తూరుపెత్తు** సక.= గాలికి విడుచు, పొల్లుపోగొట్టు, తలవెంట్రుకలు పాయదీసి మీదికెత్తి పట్టు; రూ. **తూర్పెత్తు** వి. **తూర్పిడి**=తూర్పార బట్టడం.

**తూరు** రూ. **దూరు** అక. **తూర్చు/దూర్చు** ద్వి. = చొచ్చు, ప్రవేశించు; వి. **తూరుపు/తూర్పు** = సూర్యుడుదయించే దిక్కు.

**తూలబారు** అక. = కదలు, చలించు, తొలగు; వి. **తూలు** = ఊపు, కదలిక.

**తూలాడు** అక. = కదలాడు, జోగు, ఊగు; రూ. **తూలియాడు** వి. **తూలు** = కదలిక, ఊపు.

**తూలుచు/తూల్చు** ద్వి. =కదిలించు, తొలగించు.

**తృణీకరించు** సక. = తక్కువ చేయు, అలక్ష్య పరచు, తేలిక చేయు; వి. **తృణం** = గడ్డి, పైరు, **తృణత** = తేలికదనం, **తృణీకరణ(ం)** / **తృణీకారం** = నిర్లక్ష్యం, అలక్ష్యం, తక్కువ దనం; విశే. **తృణీకరణం** = తక్కువగా చూసిన, అలక్ష్య పరచిన.

**తెగగొట్టు** సక. = నరుకు, ఖండించు; వి. తెగుట/ **తెగడం**/**తెగుడు** = తెగిపోవటం/ నరుకు, **తెగుదల**/**తెగుబడి** = అంతం, పూర్తి, తెగిపోవటం.

**తెగబడు** అక. = తెగించు; వి. **తెగబాటు** = తెంపు.

**తెగబారు** అక. = తెంపుచేయు, తెగించు; వి. **తెగువ** = తెంపు.

**తెగటారు** అక. = చచ్చు, నశించు; వి. **తెగటు** = తుళ్లు. పొగరు

**తెగటార్చు**/**తెగటారుచు** ప్రే. = నశింపు జేయు, చంపు.

**తెగడు** సక. అక. = ఉపేక్షించు, తిరస్కరించు, నిందించు, ఉపేక్షకు లోనగు, తిట్లుపడు; వి. **తెగడు** = ఉపేక్ష, నిర్లక్ష్యం, తిట్టు.

**తెగవేయు** సక. = నరుకు; వి. **తెగడు**/**తెగవేత** = నరుకు, తెగిపోవటం.

**తెగించు** అక. = తెంపు చేయు, సాహసించు; వి. **తెగువ**/**తెగింపు** = తెంపరితనం, సాహసం, **తెగుదారి** = సాహసి, తెంపరి.

తెగు అక. రూ. **త్రెగు**/**తెంపు**/**తెంచు** ప్రే. = చచ్చు, ముక్కలగు, నరుకుడుపడు, తెగజేయు, ముక్కలు చేయు, నరుకుపెట్టు; వి. **తెంపరి** = సాహసి, **తెగువ**/**తెగింపు**/**తెంపు**/ **తెంపరితనం** = సాహసం, తెగిపోవటం.

**తెగులుకొను** అక. = జబ్బుపడు; వి. **తెగులు** = రోగం, జబ్బు, వ్యాధి, **తెగులుగొంటు** = రోగి, జబ్బుపడిన వ్యక్తి.

**తెగువడు** అక. = వేరుపడు; వి. **తెగుబడి**/ తెగుదల/**తెగుడు** = తెగిపోవటం, వేరుపోడటం, వేరు పడటం, విచ్ఛిన్నమవటం.

**తెచ్చు** సక. = తీసుకవచ్చు; రూ. **తే**/**తేరు** వి. **తెచ్చుట**/**తేవటం**/**తేవడం** = తీసుకురావటం. తెప్పించు ప్రే.

**తెంచు** ప్రే. రూ. త్రెంచు, తెంపు, త్రెంపు; విశే. **తెంపుడు**/**తెంపటం**/**తెంచటం** = తెగునట్లు చేయటం.

**తెగు** అక.; వి. **తెంపి** = విఫవరాలు.

**తెట్టగిలు**/**తెట్టగిలబడు** అక. = నిస్సారమగు.

తెట్టె(లు)గట్టు అక. = తేరు, (నీపైపై)తేలు, (గడ్డ్ గాపం) నీటి మీద చేరు; రూ. **తెట్టువగట్టు**/ **తెట్టు పలుగొను** వి. **తెట్టువ**, **తెట్టియ**, **తెట్టె** = పైకి తేలిన చెత్త.

తెప్ప(ల)దేలు అక. తెప్ప(ల)దేల్చు సక. = ఓలాడు, ఊగాడు; వి. **తెప్ప** = కొయ్య, మాను, పోగు; విశే. తెప్పున = వేగంగా, వెంటనే.

**తెప్పిరిలు**/**తెప్పిరిల్లు**/**తెప్పిరు**/**తెప్పిర్లు** అక. = (బాధ/అపాయం నుంచి) తప్పించుకొను, బయ టపడు.

**తెమలు** అక. **తెమలుచు**/**తెమల్చు** ప్రే. = తేలు, కదలు.

**తెరకొను** అక. = బయటపడు, పైకివచ్చు; వి. **తెరపి** = బయలు, సందు, అవకాశం; విశే. **తెరప** = చాటులేని.

**తెరగువడు** అక. తెరగుపచు ప్రే. = సంధియగు; వి. **తెరకువ** = వివేకం, ఉపాయం, **తెరపు** **మరపు** = తచ్చిబ్బు.

**తెరచు** సక. **తెరపించు** ప్రే. = తెరిపి వేయు; వి. **తెరపి** = తెరచినపోటు, చాటులేనిచోటు.

**తెరలు** అక. **తెరలుచు**/**తెరల్చు** ప్రే. = కదలు, తొలగు, బయలుదేరు.

**తెరలబారు** అక. = తొలగిపోవు; వి. **తెరలుడు** = ప్రయాణం, బయలుదేరటం.

**తెరవారు** అక. = జిడ్డుదేరు, తెరగట్టు; వి. **తెర** = అల, పేరుడు, గుంపు, అడ్డుగుడ్డ, **తెరల** = ముడ్డ. **తెరలిక** = గుంపు.

**తెలతెలఁబోవు** అక. = వెలవెలబోవు, విష్పణ్ణమగు, తెల్లబడు, తెల్లగాతెల్లవారు; వి. **తెల్లన**/**తెలుపు**/**తెల్లదనం** = వెల్లదనం, నిర్మలత, శుభ్రత. **తెలివి**/**తెలుపుడు**/**తెలివిడి** = తెలుసుకోవడం, స్పష్టత, జ్ఞానం; విశే. **తెలి**/ **తెల్ల**/**తెల్లని**/**తెల్లటి** = వెల్లబా రిన, తెల్లగా ఉన్న, రంగులేని, స్వచ్ఛమైన, **తెల్లం** = స్పష్టమైన.

**తెలతెలవారు** అక.= బాగా తెల్లబడు, వెలుతురు వచ్చు, వెలవెలబోవు. చూ. **తెలవారు**

**తెలవారు** సక. = (సూర్యుడు) ఉదయించు, తెల్లబడు, నిస్సారమగు. రూ. **తెల్లవారు**

**తెలియు** అక. = స్పష్టమగు, అర్థమగు, మేల్కొను; వి. **తెలుపుడు**/**తెలివి**/**తెలివిడి** = జ్ఞానం, స్పష్టత, నిదర్శనం, ఎరుక; విశే. **తెల్లమి**/**తెల్లం** = స్పష్టమయిన.

**తెలుపారు** అక. = తెల్లబడు, స్పష్టమైన. రూ. **తెల్వారు**

**తెలుపుడుచేయు** సక. = తెలిసేట్లు చేయు, తెలియజెప్పు; వి. **తెలుపుడు** = ఎరుక, జ్ఞానం. **తెలివిడి** = తెలియ జెప్పటం; దృష్టాంతం.

**తెవులుపడు** అక. = జబ్బుపడు; వి. **తెవులు**/**తెగులు** = జబ్బు, రోగం; విశే. **తెగులు గొంటు**/**తెవులుగొంటు** = జబ్బుపడిన.

**తేజరిల్లు** అక. = ప్రకాశించు, వెలుగు, పరాక్రమించు; రూ. **తేజరిలు** వి. **తేజు**/**తేజస్సు**/ **తేజం** = వెలుగు, ప్రకాశం, పరాక్రమం. **తేజోవంతుడు**/**తేజస్వి** = తేజస్సు కలవాడు, పరాక్రమవంతుడు; విశే. **తేజితం** = పదునుగల, పదునైన.

**తేటపడు** అక. = స్పష్టమగు, బాగా తెలియు, సక. తేటపరచు; వి. **తేర** = తేట, తేరు కొన్నవస్తువు. **తేట** = స్వచ్ఛత, తేరుకొన్న వస్తువు, **తేరుగడ** = ముగింపు, తెలివిడి; విశే. **తేట** = స్వచ్ఛమైన, నిర్మలమైన, బాగా తెలిసిన, బోధపడే. **తేటతెల్లం** = విస్పష్టం.

**తేమగిలు** అక. = చెమ్మగిల్లు; వి. **తేమ** = తడి. **తేమం**, **తేమనం** = తడియటం, తడుపు; విశే. **తేమ** = తడిగల, చెమ్మగిలిన.

**తేరకొను** అక. = తేటపడు; రూ. **తేరుకొను** వి. **తేర** = తేట; విశే. **తేరకు** అవ్య. =వ్యర్థంగా, వృథాగా, **తేరకుతేర** అవ్య. = అతిసునాయాసంగా.

**తేరు** అక. = కలుగు.

**తేరుకొను** అక. **తేరుచు**/**తేర్చు** ప్రే. = తేటపడు, ముగియు, ఊరడు; వి. **తేరుగడ** = ముగింపు, తెలివిడి, ఊరట.

**తేలగిలు**/**తేలగిల్లు** అక. = పైకితేలు, పరవశమగు, తేలగిలబడు.

**తేలవేయు** సక. =పైకితేర్చు, పరవశింపజేయు, తేలగిలునట్లు చేయు; వి. **తేలగింపు**= తేర్చటం.

**తేలాడు** అక. చూ. తేలు

**తేలిపోవు** అక. = (ఆపద) తొలగిపోవు. చూ. తేలు

**తేలు** అక. తేలుచు/తేల్చు సక. ప్రే. = పైకి వచ్చు, తొలగిపోవు; వి. తేలికదనం/తేలిక = అఘుత్వం, పైకి తేలగల గటం/ఎగరగలగటం.

**తొంగలించు** అక. = పుట్టు, వికసించు, ప్రవహించు, కారు, వాలు; విశ. తొంగలి = కారే, ప్రవహించే, వాలే.

**తొంగు** అక. = పడుకొను, వాలు; రూ. తొంగొను విశ. తొంగలి = వాలిన, కారిన.

**తొండాడు** సక. =తొందరపెట్టు.

**తొందరచేయు** సక. = త్వరపెట్టు, బాధించు; వి. తొందర = వేగం, త్వర; బాధ.

**తొందరించు** సక. = తొందరపెట్టు; వి. తొందరపాటు = తొందర, త్వర.

**తొందరపడు** అక. తొందరపెట్టు సక. = వేగపడు, బాధపడు; వి. తొందరపాటు = త్వర, బాధ.

**తొక్కిటుపడు** అక. = ఇబ్బందిపడు; రూ. త్రొక్కటుపడు వి. తొక్కటు/త్రొక్కటు/తొక్కటం / త్రొక్కటం / తొక్కిటుపాటు = ఇబ్బంది, కష్టం, సంకటం.

**తొక్కు** సక. = నూరు, పిదుము, కలిపికొట్టు, పచ్చడి చేయు; వి. తొక్కు/తొక్కుడు = పచ్చడి.

**తొగరుకొను** అక. తొగరుకొలుపు ప్రే. = ఎఱ్ఱబడు, ఎరుపెక్కు; విశ. తొగరు = ఎఱ్ఱని, ఎఱ్ఱటి, ఎరుపెక్కిన.

**తొట్టగిలబడు** అక. = తొట్రుపడు.

**తొట్టగిల్లు** అక. రూ. తొట్టగిలు చూ. తొట్టు.

**తొట్టు** అక. = వ్యాపించు, ఎగదన్ను, జరుగు, నిండు, కారు, సక. తాకు, స్పృశించు, మొదలుపెట్టు, అవలంబించు; విశ. తొట్టు = తాకు, స్పర్శ, చెరువు లోపలి పొలం.

**తొట్టగిలు/తొట్టగిల్లు** అక. = కలుగు, పెరుగు.

**తొట్రిల్లు** అక. = తడబడు; రూ. తొట్రిలు వి. తొట్రు/తొట్రుబాటు = తడబాటు.

**తొట్రుకొను** అక. ప్రే. తొట్రుకొలుపు చూ. తొట్రిల్లు

**తొట్రుపడు** అక. రూ. తొట్రిలబడు; వి. తొట్రు/తొట్రుపాటు/తొట్రుబాటు = తడ బాటు.

**తొడకు** అక. చూ. తొలకు/తొనకు.

**తొడగు** అక. = మొదలు పెట్టు, ఆరంభించు. రూ. తొణగు

**తొడయు** సక. = తుడుచు, కడుగు.

**తొడరు** అక. = కలుగు, యత్నించు, తొట్రుపడు, సక. అనుసరించు, ఎదిరించు; వి. తొడరువు = యత్నం, తొడి = తొందర, తడబాటు, తొడరిక = అనుసరణ; విశ. తొడరువు = మొదటి.

**తొడితెచ్చు** చూ. తోడితెచ్చు చూ.

**తొడిబడు** అక. = కదలు, కదలాడు, చెదిరిపోవు, తడబడు, తొట్రుపడు; వి. తొడి = తొందర, తడ బాటు.

**తొడు** సక. రూ. తొడుగు

**తొడుకు** సక. = పట్టు(కొను), (బాణం) విడుచు, గ్రహించు.

తొడుకొను సక. రూ. తొడికొను, చూ. తోడుకొను = తొడుగుకొను.

తొడుగు అక. = (నగలు) ధరించు, (బాణం) విడుచు/ ఎక్కుపెట్టు, రూ. తొడ్గు/తొడువు చూ. తొడు/తొడుకు; వి. తొడుపు/ తొడువు/తొడ్గు/తొడుగు = నగ, కవచం, బాణం.

తొనకు = తడబాటు, తొట్రుపాటు. చూ. తొలకు.

తొన్నుండు అక. = పడుకొను. రూ. తెన్నుండు

తొప్పదోగు అక. ప్రే. తొప్పగదోగు = బాగా తడియు, మునుగు. తొప్పగదోగు చూ. తొప్పదోగు

తొప్పరిల్లు అక. = ఒరిగిపోవు, వాలు, వాలిపోవు. రూ. తొప్పరిలు/తొప్పరు

తొరుగు అక. = కారు, ప్రవహించు, పడు, విడుచు; రూ. ఒరగు/తొరుగు సక. వి. తొరగు = విడిపోవటం.

తొరగుచొచ్చు/తొరగువోవు అక. = (పశువులు) తప్పించుకొని పోవు.

తొరటులువారు అక. = చిల్లుపడు, వి. తొఱ్ఱ/ తొరటు = రంధ్రం, చిల్లి; విణ. తొర్రి = చిల్లులు పడ్డ, (పళ్లు) సందులిచ్చిన.

తొరపడు అక.= తొందరపడు, వేగిరపడు; రూ. త్వరపడు వి. తొర/త్వర = వేగిరం, తొందర.

తొరలించు సక. రూ. తొర్లించు/ తొల్లించు/ చూ. తొరలు.

తొరపు సక. = తొరలించు.

తొరలు అక. ప్రే. తొరలుచు/తొరల్చు = మారు, కలుగు.

తొలకు అక. = కదులు, కదలాడు, పెరుగు, ప్రకాశించు; రూ. తొనకు వి. తొలకు = కదలిక, అల.

తొలగబారు అక. రూ. తొలగు.

తొలగు అక. ప్రే. తొలగించు/తొలచు = ఒదుగు, పక్కకు తప్పుకొను; వి. తొలగుడు = తప్పుక పోవటం, ఒదిగిపోవటం.

తొలకరించు అక. రూ. తొల్కరించు = (వాన) కురియు, జల్లుపడు; పుట్టు; వి. తొల్కరి, తొలకరి = తొలికారు వాన, వర్షాకాలం, తొలకరి సూడు = హంస.

తొలుచు సక. = బొక్కలుపెట్టు, తోడు; రూ. తొల్చు వి. తొలుపు = తొలిచిన రంధ్రం, తొల్లిక = తవ్వటానికి వాడే పార.

తొల్లించు చూ. తొరలించు.

తోగు అక. = మునుగు, తడియు.

తోచు అక. తోపించు సక. ప్రే. = ఉదయించు, పుట్టు, ప్రత్యక్షమగు, తట్టు; వి. తోపిక = ఆలోచన, తలపు.

తోతెంచు అక. = పుట్టు, ఉదయించు, కనబడు, ప్రత్యక్షమగు, వచ్చు. చూ. తోచు

తోడితెచ్చు సక. తోడి తెప్పించు ప్రే. = వెంటబెట్టుకొని తెచ్చు, పిలుచుకొని వచ్చు; రూ. తోడ్తెచ్చు వి. తోడు = సహాయం, తోబుట్టువు, సహాయకుడు, తోడునీడ = సహాయకుడు, దగ్గరివాడు.

తోడు సక. =(నీళ్ళు) పైకితెచ్చు, కెల్లగించు.

తోడుకొను/తొడికొను అక. = పేరుకొను (పాలు మొ.), సక. పిలుచుకొను.

**తోడుపడు** అక. = సహాయపడు; రూ. **తోడ్పడు** వి. **తోడుపాటు, తోడ్పాటు** = సహాయం.

**తోడువోవు** అక. = సమానమగు, పోలు, సరిలగు.

**తోతెచ్చు** సక. చూ. **తోడితెచ్చు**.

**తోతెంచు** అక. = పుట్టు, కనిపించు, ప్రత్యక్షమగు, వచ్చు.

**తోము** సక. = రుద్దు; వి. **తోముడు** = రుద్దటం.

**తోలించు** ప్రే. = తోలునట్లుచేయు; వి. **తోలకం** = తోలటం, తోలుడు.

**తోలు** సక. = (గొడ్లు మొ॥) నడిపించు; వి. **తోలుడు/తోలకం** = నడపటం.

**తొలబడు** చూ. **తగులబడు**.

**తొలు** చూ. **తగులు**.

**తొలుకొను** చూ. **తగులుకొను**.

**తొలుచు** చూ. **తగులుచు**.

**త్యజించు** సక. = వదిలిపెట్టు, విడుము; వి. **త్యజనం, త్యాగం** = విడుపు, వదిలిపెట్టడం, **త్యాగి** = దాత, శూరుడు. **త్యాజ్యం** = వర్జ్యం; విశే. **త్యక్తం** = విడిచినది, వదిలిపెట్టినది, **త్యాజ్యం** = విడువ దగిన, వదిలిపెట్ట దగిన.

**త్రచ్చు** సక. = చిలుకు; రూ. **తరుచు** వి. **త్రచ్చన** = చెక్కటం, చిలకటం.

**త్రమ్మ** సక. = దుమ్ము చేయు, పొడిగొట్టు; వి. **త్రమ్మ** = దుమ్ము, ధూళి, పొడి.

**త్రవ్వు** సక. = గుంటతీయు, ముక్కలు చేయు, పుట్టు పూర్వోత్తరాలు బయటికి తీయు, ప్రస్తావించు; రూ. **తవ్వు, త్రవు** వి. **త్రవ్వుడు / తవ్వాటం/ త్రవ్వటం/ త్రవ్వకం/ తవ్వకం** = ఖననం, గుంటతీయటం, బయటికి లాగటం, **త్రవ్వు కోల/ త్రవుకోల** = గుద్దలి, గునపం.

**త్రస్తరించు** అక. = ఎగతాళి చేయు, వెక్కిరించు, హేళనమాడు; వి. **త్రస్తరి** = పరిహాసం, హేళనం, ఎగతాళి.

**త్రాగు** సక. రూ. **త్రావు** చూ. **తాగు**; వి. **త్రాగుడు/ త్రావుడు** = తాగుడు, మద్యపానం.

**త్రిక్కు** అక. = తక్కు, మిగులు; వి. **త్రిక్కు** = చిక్కు, బాధ.

**త్రిప్పికొను** అక. = తిరుగు, తిప్పించుకొను; రూ. **తిప్పికొను/ తిప్పుకొను** వి. **త్రిప్పట/ తిప్పట** = తిరుగుడు, **త్రిప్పరి** = (దేశ) దిమ్మరి, తిరుగుబోతు.

**త్రిప్పు** ప్రే. = తిరుగునట్లు చేయు; రూ. **తిప్పు** వి. **త్రిప్పట/ తిప్పట** = తిరుగుడు వి. **త్రిమ్మట/ తిమ్మట** = తిరగటం, **త్రిమ్మరీడు / త్రిమ్మర కాడు** = దేశదిమ్మరి, తిరుగుబోతు; విశే. **త్రిమ్మర** = యథేచ్ఛగా తిరుగు.

**త్రిమ్మరు** అక. చూ. **త్రిప్పుల**.

**త్రుంగు** అక. ప్రే. **త్రుంచు** = ముక్కలగు, నశించు; రూ. **తుంగు** వి. **త్రుంగుడు** = నాశం, ప్రళయం, **త్రుంపు/ తుంపు/ త్రుంపుడు** = ముక్క. **త్రుంచు** ప్రే. రూ. **తుంచు** చూ. **త్రుంగు**.

**త్రుళ్లగించు** అక. = ఎగురు; రూ. **తుళ్లగించు** వి. **త్రుళ్లగింత/ తుళ్ళగింత** = ఎగరటం, ఎగురుడు. **త్రుళ్ళింత/తుళ్ళింత** = ఎగిరి పాటు, పొగరు, గర్వం. చూ. **త్రుళ్ళు**

**త్రుళ్లియాడు** అక. = ఎగిరిపడు, గర్వించు. చూ. **త్రుళ్ళు/ త్రుళ్ళగించు**

త్రుళ్ళు అక. = ఎగిరిపడు, గర్వించు; రూ. తుళ్లు వి. త్రుళ్ళింత/ త్రుళ్ళు/ తుళ్లింత/ తుళ్ళు/ తుళ్లగింత/ త్రుళ్ళగింత/ త్రుళ్లుమింత = ఎగిరిపాటు, అదిరిపాటు, గర్వం, త్రుళ్లు బోతు/ తుళ్లు బోతు = పొగరుబోతు, గర్వి.

త్రెక్కొట్టు అక. = ఎగదట్టు.

త్రెక్కొను సక. = చెరుచు, చంపు, మింగు, తాగు, కలవరపెట్టు; వి. త్రెక్కోలు = చెరపటం, చంపటం.

త్రెగు చూ. తెగు.

త్రెంచు ప్రే. రూ. తెంచు/ త్రెంపు/ తెంపు = తెగునట్లు చేయు. చూ. తెంచు

త్రెంపు చూ. తెంపు.

త్రేచు అక. = తేపువచ్చు, తేపు తెచ్చుకొను రూ. తేచు/ త్రేనుచు/ త్రేన్చు వి. త్రేపు/ త్రేనుపు/ త్రేన్పు = తేపు.

త్రేనుచు అక. రూ. త్రేచు చూ. త్రేచు.

త్రొక్కటుపడు అక. తొక్కిటుపడు.

త్రొక్కు సక. రూ. తొక్కు

త్రొక్కుడువడు చూ. తొక్కుబడు.

త్రొక్కువడు చూ. తొక్కుడువడు.

త్రోచు అక. రూ. తోచు = పూను, నడచు, ఎదుర్కొను, తొందరపడు, నెట్టుకొపోవు, సక. తోయు, నెట్టు, ఉపేక్షించు, చంపు; వి. త్రోపు/ త్రోపాటు/ త్రోపుడు = తోయటం, నెట్టడం.

త్రోయు సక. = నెట్టు, గెంటు, తొలగించు; రూ. తోయు వి. త్రోపు/ త్రోపుడు/ త్రోపాటు = నెట్టు, గెంటు, తొలగింపు, త్రోపరి = తోసేవాడు.

త్రోలు చూ. తోలు.

# ద

దక్కు అక. = మిగులు, అనుభవంలోకి వచ్చు, సొంతమగు; వి. దక్కోలు = స్వాధీనం, దక్కుడు/ దక్కుదల = మిగిలినది, సొంత మైనది; విశే. దక్కు = అనుభ వానికి వచ్చిన, సొంతమైన.

దగదగమను అక. = వెలుగు, ప్రకాశించు; రూ. ధగధమను వి. దగదగ/ ధగధగ = మెరుపు, వెలుగు.

దగ్గరించు అక. = దగ్గరకు వచ్చు, సమీపించు; రూ. డగ్గరించు/ దగ్గరు/ డగ్గరు వి. డగ్గర, దగ్గర = సమీపం.

దగ్గరు అక. రూ. డగ్గరు చూ. డగ్గరించు.

దగ్గు అక. = కాసం చేయు; వి. దగ్గు = కాస(ం).

దంగు అక. ప్రే. దంచు = మెదుగు, మెత్తబడు; వి. దంగుడు = దంచిన, మెదిగిన.

దంచు ప్రే. = మెదుగునట్లు చేయు, దంగునట్లు చేయు; వి. దంచన/ దెంచనం/ దంచనం = ఫిరంగి.

దటాయించు సక. = కోపపడు, అదిలించు, బెదిరించు; వి. దటాయింపు = కోపం, బెదిరింపు.

దట్టించు సక. = బెదిరించు, అదిలించు; వి. దట్టింపు = బెదురు, అదురు.

దడదడమను అక. = తొందరించు, దడదడ (గుండె) కొట్టుకొను, అదిరిపోవు; విశే. దడదడ అవ్య. = వేగంగా

దడిబడు అక. = భయపడు, జడియు. రూ. దడియగబడు చూ. దడియు

దడియు అక. రూ. జడియు ప్రే. దడిపించు/ జడిపించు = వణుకు, భయపడు, దడుచు

కొను, బెదురు; వి. దడ = వణుకు, గుండె కొట్టు కోవటం; బెదురు; జడుపు/ దడుపు = భయం, వణకు. చూ. జడియు

దండపడు అక. = సమీపించు, దగ్గరపడు; వి. దండ = సమీపం, దగ్గర, దండపాటు = దగ్గర పడటం.

దండించు సక. = శిక్షించు; వి. దండన(ం) = శిక్ష.

దండసిల్లు అక. = అణిగిపోవు, అదుముడు పడు, ఇరుక్కొను. రూ. దందసిలు

దండెత్తు అక. = యుద్ధానికి బయలుదేరు, దాడి చేయు; వి. దండు = సేన, గుంపు.

దద్దరిల్లు అక. = మోగిపోవు, తబ్బిబ్బగు. రూ. దద్దరిలు/ దద్దిర్లు/ దద్దరు

దనియు సక. = కూడు, సంభోగించు; వి. దనివు = కూడిక, సంగమం.

దనుకు సక. = తాకు, ఎదుర్కొను, పొందు. రూ. దన్కు

దందడివెట్టు సక. = రాపిడి పెట్టు, తొందరపెట్టు. చూ. దందడించు

దందడించు అక. = ఎక్కువగు; వి. దందడి = తరము, ఎక్కువ.

దబకాయించు సక. = గదమాయించు, అదిమిపెట్టు.

దబాయించు సక. = అదిమి పెట్టు, నెట్టు, బూకరించు; రూ. డబాయించు వి. దబా యింపు = బూకరింపు.

దబ్బడించు సక. = మూకుట్లోమూయు/ దాచు, చప్పట్లు కొట్టు, దెబ్బకొట్టు; రూ. దబ్బరించు, వి. [illegible] దబ్బడ [illegible] వరపు, ద[illegible]వాడు = మేదరి, దబ్బుడు = మూత. చబ్బర/ డబ్బర = గిన్నె.

దబ్బు సక. = చెప్పు; వి. దబ్బు = మాట.

దబ్బుపెట్టు సక. = మూత పెట్టు, మూసివేయు. చూ. దబ్బడించు

దమించు/ దమియించు సక. = అణగ ద్రొక్కు, అణచిపెట్టు; వి. దమం, దమనం = అణచటం. దమి/ దమనుడు = అణచేవాడు, దమితుడు = అణగారినవాడు, సహనంగల వాడు.

దమ్ముకొను అక. = మెత్తబడు, చల్లబడు, అడుసగు, చెమ్మ ఎక్కు, నెమ్మెక్కు, దమ్మెక్కు; వి. దమ్ము = బురద, చెమ్మ, నెమ్ము, తడి.

దంపు చూ. దంచు.

దయచేయు అక. = కరుణించు, ఇచ్చు, వెళ్లు, (గౌరవంగా) వచ్చు; రూ. దయసేయు వి. దయ = కనికరం, కృప.

దరికొను అక. (ప్రే. దరికోలు = ముట్టుకొను, తగలబడు, కాలు, మండు.

దరిసించు సక. = చూచు, బహుమతి ఇచ్చు; రూ. దర్శించు వి. దర్సనం/ దరిసెనం = కానుక దర్శనం.

దరువుచేయు అక. = తాళం వేయు, దెబ్బలు వేయు; రూ. దరువువేయు వి. దరువు = తాళం, దెబ్బ.

దర్పించు అక. = గర్వించు, మిట్టిపడు, మిడిసిపడు; వి. దర్పం = గర్వం, మిడిసిపాటు.

దర్శించు సక. = చూచు; రూ. దరిసించు వి. దృక్కు/ దృశ/ దృష్టి = చూపు.

దహించు సక. = తగలబెట్టు, కాల్చు; రూ. దహియించు వి. దగ్ధ = సూర్యుడున్నదిక్కు, దహనం = కాల్చటం, కాల్పు, దహనుడు = అగ్ని, దగ్ధిక = మాడినపంట, మాడు; విశే. దగ్ధం = తగలబడిన.

దళకొను అక. = ఎక్కువగు, దట్టమగు; రూ. దళముకొను వి. దళం = ఎక్కువ దనం; విశే. దళం = దట్టమైన, దళసరి = మందమైన, దట్టమైన, దిట్ట మైన.

దళగించు అక. = దట్టమగు. మా. దళకొను

దాకొను అక. / దాక్కొను = దాగి ఉండు; రూ. డాగు(కొను) వి. దాగురుమూతలు/ దాగనముచ్చులు/ దాగిలి ముచ్చులు, దాగురింత/ డాగిలింత/ డాగులింత/ దాగిలి మూత/ దాగుడు మూత = పిల్లలు దాక్కొని ఆడే ఆట, దాపరికం/ డాప రికం = దాచిపెట్టడం.

దాగు అక. రూ. దాగికొను/ దాక్కొను/ దాకొను ప్రే. దాచు/ దాచిపెట్టు మా. దాకొను.

దాగురించు సక.= దాచిపెట్టు, మోసగించు; రూ. డాగురించు వి. దాగురింత/ డాగురింత = దాపరికం, దాచిపెట్టడం, మోసగించటం. మా. దాచు

దాచు ప్రే. = దాచిపెట్టు, దాక్కొనునట్లు చేయు; రూ. డాచు/ దాపు; వి. దాపన = దాచిపెట్ట డం, దాపరం = దొంగిలించుటం, దాపరి కం/ దాపుడు/ దాపురం = దాచిపెట్టడం, దాపరీడు = దొంగ.

దాటు అక. = దూకు, ఎగురు, (పశువులు) సంభోగిం, సక. మీరు, ఉల్లంఘించు; వి. దాటు = దూకు, గెంతు, ఎగురు.

దాటుకట్టు అక. = (మృగాలు) సంభోగించు, మందకట్టు, గుమిగూడు.

దాటుకొను అక. = దండెత్తు; వి. దాడి = దండెత్తటం, దాడికాడు = గూఢచారి.

దాడియాడు అక. మా. దాడిచేయు = ఎదు ర్కొను.

దాపరించు అక. = కలుగు, ప్రాప్తించు; వి. దాపరం/ దాపురం/ దాపరింత = ప్రాప్తి.

దాపలించు అక. = ప్రదక్షిణించు, ఎడమకు తిరుగు; రూ. డాపలించు వి. డాపల/ దాపల = ఎడమవైపు.

దాపించు సక. = సమీపించు, దగ్గరకు చేరు/ వచ్చు; వి. దాపు = సమీపం, దగ్గర.

దాపురమగు మా. దాపరించు.

దాయగట్టు సక. = (పాలు పితికేటప్పుడు) పశువు కాళ్లకు బందెం కట్టు.

దాయు అక. = దగ్గరకు చేరు, సమీపించు. మా. డాయు/ దాపించు.

దారించు సక. = చీల్చు; వి. దారణం = చీల్చడం; విశే. దారితం = చీల్చిన.

దిగదీయు సక. మా. దిగదుడుచు.

దిగదుడుచు అక. = (తలచుట్టూ) చుట్టిపార వేయు; వి. దిగదుడుపు = దిగ దుడవటం. మా. దిగు

దిగద్రావు అక. సక. దిగు = విడుచు, వదలి పెట్టు. మా. దిగు

దిగబడు అక. = దిగిపోవు, కూరుకు పోవు, అణగిపోవు, జారిపోవు. రూ. దిగు

దిగనాడు సక. = వదలిపెట్టు, విడుచు. చూ. దిగు

దిగవిడుచు సక. = వదిలిపెట్టు, విడిచిపెట్టు. చూ. దిగు

దిగు అక. = పైనుండి కిందికి వచ్చు, దిగుమతి అగు, ప్రయాణమగు, దిగబడు; రూ. దిగ్గు/ దివు వి. దిగువ = కింద, కిందిభాగం; విశే. దిగసన = కిందన, దిగువన, దిగుడు = వాలిన, వంగిన, తక్కువైన. వి. దిగుదల = కిందిభాగం. దిగు మతి = (సరుకును) దించుకోవటం. దిగు వాటు = దిగువ. దిగ్గియ/ డిగ్గియ = దిగుడు బావి; విశే. దిగువాయి = తక్కువ. చూ. దిగ దీయు, దిగదుడుచు. చూ. దిగబడు చూ. దిగవిడుచు చూ. దిగుచు చూ. దిగుచు, దించు

దిగుచు ప్రే. = దించు. చూ. దిగు

దిగులుపడు అక. = బెంగపడు; వి. దిగులు = విచారం, బెంగ, దిగులుపాటు = బెంగ.

దిగువారు అక. = కిందికి జాలువారు/ ప్రవహించు, కారు. రూ. దిగు

దిగ్గురను అక.= భయంపుట్టు, (గుండె) దడపుట్టు.

దించు ప్రే. = దిగునట్లు చేయు, దిగబెట్టు. చూ. దిగు

దిద్దు సక. = సరిచేయు, సవరించు, (చదువు) నేర్పు; వి. దిద్దుగడ/ దిద్దుడు/ దిద్దుపాటు/ దిద్దుబడి = దిద్దటం, సవరించటం, నేర్పటం.

దింపు ప్రే. చూ. దిగు.

దింపులువోవు అక. = వేలాడు; వి. దింపు = వేలాడటం.

దిమ్ముమవట్టు అక. = బండబారు, మొద్దుబారు, దిమ్మెక్కు, మత్తెక్కు; వి. దిమ్ము = మత్తు, మొద్దు తనం, బండతనం.

దిమ్మెక్కు అక. చూ. దిమ్ముమవట్టు.

దిసంతదచు సక. = తిట్టు, దూషించు; వి. దిసంతు = తిట్టు, దూషణ.

దిసంతు(లు) కొట్టు సక. = తిట్టు, దూషించు, నిందించు.

దీకొను అక. = ఢీకొట్టు, ఎదిరించు; రూ. ఢీకొను వి. దీకు/ ఢీకు = ప్రేరేపణ, దీకోలు/ ఢీకోలు = ఎదిరింపు; విశే. దీ/ ఢీ అవ్య. = తలతో గుద్దు, పొడుచు.

దీక్షించు లక. = దీక్షపట్టు, (ఒకపని నెరవేర్చాలని) పట్టుదలపట్టు; వి. దీక్ష = పట్టు(దల), దీక్షితుడు = (యజ్ఞాదులు చేయడానికి) పట్టు పట్టినవాడు.

దీటు సక. = సరిచేయు, సమానం చేయు; విశే. దీటు = సరి సమానం.

దీటుకట్టు అక. = నిండు, నిండిపోవు.

దీటుకొను అక. = నిండిపోవు, సక. సవరించు, సరిపోలు, ప్రే. దీటుకొలుపు.

దీలు అక. = డీలాపడు; రూ. డీలు వి. డిల్లపాటు = డీలాపడటం; విశే. డిల్ల = డీలాపడిన. దీలు = డీలాపడిన. చూ. డిల్లపడు/ డిల్లపోవు/ దీలు పడు

దీవించు సక. = ఆశీర్వదించు; వి. దీవెన/ దీవన = ఆశీర్వాదం.

దుఃఖపడు అక. = విచారపడు, ఏడ్చు; వి. దుఃఖం = విచారం, బాధ, వ్యథ, దుఃఖపాటు = దుఃఖ పడటం, దుఃఖితుడు = విచారంలో ఉన్నవాడు.

**దుఃఖపెట్టు** సక. = బాధించు, వ్యథపెట్టు.

**దుద్దెక్కు** అక. = గర్వించు, అతిశయించు; వి. దుద్దు = దిమ్మ, గడ్డ.

**దున్ను** సక. = దుక్కిచేయు. రూ. దును

**దుముకు** అక. = ఎగురు, గంతు వేయు; వి. దుముకు/దూకు = గంతు. రూ. దూకు

**దుముకులాడు** అక. = గంతులుపెట్టు, చెంగనాలు వేయు.

**దుముదుములాడు** అక. = మండిపడు, చిటమటమను, నిప్పులు చెరుగు, మటమటలాడు. రూ. ధుమధుమలాడు

**దుయ్యు** అక. చూ. దూయు

**దురపిల్లు** అక. = ఏడ్చు, బాధపడు, కలతపడు, కలవరపడు.

**దులుపు** సక. = (గింజలు) రాల్చు, విదిలించు, (దుమ్ము)పోగొట్టు.

**దువ్వు** సక. = చిక్కుదీయు, నిమురు, సవరించు; వి. దువ్వెన = దువ్వే సాధనం.

**దుసికిల్లు** అక. = జారు, జారిపోవు, తప్పించుకొను.

**దూకు** అక. రూ. దుముకు; వి. దూకుడు = తొందరపాటు; విశే. దూకుడు = ఎగుడు, దిగుడు.

**దూకొను** సక. = పొందు, తాగు, ఆస్వాదించు.

**దూటు** సక. = పొడుచు.

**దూటుకొను** అక. = ఎగురు.

**దూపటిల్లు** అక. = దప్పిగొను, బాధపడు; రూ. దూపటిలు వి. దూప = దప్పి(క).

**దూపించు** అక.= దప్పికగొను, బాధపడు. రూ. దూపిల్లు

**దూపిల్లు** అక. చూ. దూపించు.

**దూయు** అక. = (బాణం) దూసుకొనిపోవు, ప్రవహించు, (ఆకులు మొ॥) పిడికిటితో తీసివేయు/తొలగించు/ఊడగొట్టు, తీయు; రూ. దుయ్యు వి. దూ(యు)ముడి = సులభంగా ఊడదీయు గలముడి.

**దూరు** సక. = తిట్టు, నిందించు; వి. దూరు = నింద, తిట్టు.

**దూరుపడు** అక. = తిట్టుపడు, నిందపడు.

**దూషించు** సక. = తిట్టు, నిందించు; వి. దూషణ(ం) = తిట్టు, నింద; విశే. దూష్యం = నిందించదగిన, దూషితం = నిందపడిన; చెడ్డ, కలుషమైన.

**దృష్టాంతీకరించు** సక. = ఉదాహరించు, నిదర్శన చూపు; వి. దృష్టాంతం = ఉదాహరణ, శాస్త్రం, నిదర్శన, దృష్టాంతీకరణం = నిదర్శన, సాక్ష్యం చూపటం.

**దృషించు** సక. = చూచు; వి. దృష్టి = చూపు.

**దృష్టించు** అక. = చూచు; వి. దృశ్యం = కనిపించేది, దర్శనం = చూపు, కన్ను, కల, శాస్త్రం దర్శకుడు = చూసేవాడు, నేర్పరి, ద్వారపాలకుడు. దర్శం = చూపు, దర్శయిత = చూపేవాడు, ద్రష్ట = పారచూసినవాడు, ముందు చూపు గలవాడు; విశే. దృశ్యం = చూడదగ్గది. దృష్టం = చూసినది. దర్శనీయం = చూడదగినది. ద్రష్టం = చూసినది. ద్రష్టవ్యం = చూపవలసినది.

**దెప్పరిల్లు** = బాధపడు, ఆపదలోపడు; రూ. దెప్పరిలు వి. దెప్పరం/డెప్పరం = ఆపద, బాధ. దెప్పరికం = నూటిపోటు మాటలనటం.

దెప్పు సక. = (గుర్తుకు తెచ్చి) ఆక్షేపించు; వి. దెప్పుడు = ఆక్షేపం.

దేకు సక. = ముడ్డితో కదలు/ఈడ్చు, దేకిసలు పెట్టు; వి. దేకుడు/దేకిస = ముడ్డి నేలమీద ఈడుస్తూ కదులటం.

దేవు సక. = పైకితోడు, తడివితీయు, వెదకు.

దేవురించు అక. రూ. దేబెరించు; వి. దేబె/దేవురు గొట్టు = దీనుడు, ఏడ్పుగొట్టు. దేమరు/దేవురింపు = దీనత్వం.

దేవులాడు సక. = వెతుకులాడు; వి. దేవులాట = వెతకటం.

దైన్యపడు అక. = దీనత్వమొందు; వి. దీనత్వం/దీనత/దైన్యం = విచారంలో/దుఃఖంలో ఉండటం, దురవస్థ; వి. దైన్యపాటు = దీనత్వం, దురవస్థ.

దైవారు అక. = పొరలిపారు, ఎక్కువగు. రూ. దయివారు

దొంగిలించు సక. = కాజేయు, అపహరించు; వి. దొంగ = చోరుడు. దొంగపని/దొంగతనం/దొంగరికం = చాటుపని, మోసం; విశే. దొంగ = మోసం తో కూడిన, రహస్యమైన. చూ. దొంగు /డొంగు /దొంగిలు

దొంగిలు సక. చూ. దొంగిలించు.

దొడ్డువారు అక. = ఎక్కువగు; విశే. దొడ్డు, దొడ్డ = గొప్ప, ఎక్కువ.

దొద్దగొను సక. = కొల్లగొట్టు, దోచుకొను; వి. దొద్ద = కొల్ల, దొద్దకాడు/దొద్దకత్తె = కొల్ల లాడే వ్యక్తి.

దొద్దవోవు అక. = కొల్లబోవు. చూ. దొద్దగొను

దొనదొనమను అక. = జలజలమను; రూ. దొణదొణమను వి. దొన/దొణ = కొండ మీది నీటిపల్లం, ప్రవాహధ్వని.

దొందడించు అక. = నిండియుండు, చట్టంగా ఉండు, సందడిగా ఉండు; వి. దొందడి = సందడి, సమ్మర్దం.

దొమ్ములాడు అక. = దొమ్మిచేయు, కలగలుపుగా పోరాడు; వి. దొమ్మ = సాహసం, ధైర్యం, దొమ్మి/దొమ్మీ = సందడి, గుంపు కట్టి కలియ బడటం.

దొరకు అక. (ప్రే. దొరకించు(కొను) = చిక్కు, లభించు; రూ. దొరుకు వి. దొరకోలు = యత్నం, లాభం, దొరకోలు సన్నాసి = మోసగాడు, నమ్మించి మోసగించే దొంగ.

దొరకొను అక. = యత్నించు, లభించు, సంభవించు, ఫలించు, రూ. దొరంకొను సక. = మొదలు పెట్టు. చూ. దొరకు.

దొరకువడు అక. = చిక్కుపడు, దొరికిపోవు. చూ. దొరకు

దొరయు అక. = సమానమగు, కలుగు, జరుగు, సక. పోలు; విశే. దొర = గొప్ప, సమానమైన, సరిపోలిన.

దొరలు అక. = జారు, పడు, ప్రవహించు, కలయు, ఎదుర్కొను, సక. అనుభవించు. రూ. దొర్లు ప్రే. దొర్లించు/దొరలించు

దొలుపు ప్రే. = దొర్లించు. చూ. దొరలు/దొర్లు

దోకు సక. = (నేల, గడ్డి మొ॥) చెక్కు; వి. దోకుడు/దోకిస = దోకటం, దోకుడు పార = గడ్డి/నేల చెక్కే చిన్నపార.

**దోగాడు** అక. = పారాడు. రూ. దోగియాడు

**దోగు** అక. = దోగాడు, చర్మం వలుచు.

**దోచు** సక. = దోచుకొను, కొల్లగొట్టు; వి. దోగురు = దొంగతనం, దోపరి = దొంగ, బందిపోటు. దోపిడి/ దోపిడీ = దోచుకోపటం, కొల్లగొట్టడం, దోపిడికాడు = దొంగ, బందిపోటు, దోపు = దోచుకోవటం, కొల్ల.

**దోయికట్టు** అక. = జతకట్టు, జంటకట్టు; వి. దోయి = జత, జంట, దోసిలి = చేరల జత, అంజలి.

**దోయిలించు** సక. = నమస్కరించు; రూ. దోసిలించు వి. దోయిలి/ దోసిలి = రెండు చేరలు.

**దోరగల్లువడు** అక. = ఒకవైపు ఒరిగి రెండోవైపు పైకి తేలు, వాలుపడు; రూ. దోరగలువడు వి. దోరగల్లు = ఒడ్డగెడవు.

**దోరగించు** ప్రే. = ఎర్రబడు, వాలు.

**దోరగిల్లు** అక. రూ. దోరగిలు ప్రే. దోరగించు; విశి. దోరపాక = మోరపాక, వారపాక, ఒకవైపు వాలిన పాక; విశి. దోర = ఎర్రబారిన, పండు మొహం పట్టిన, పండీపండని. చూ. దోరు

**దోరు** అక. = చచ్చు, వాలిపోవు. చూ. దోరగిల్లు

**దోరుచు** ప్రే. = చంపు, వాల్చు. రూ. దోర్చు చూ. దోరగిల్లు

**దోషించు** అక. = దోషం పుట్టు; వి. దోషం, దోసం = తప్పు, దోషకారి = తప్పులు చేసే వాడు. దోషజ్ఞుడు = పండితుడు, జోస్యుడు. దోసి, దోషి = తప్పు చేసినవాడు.

**దోసిలించు** సక. చూ. దోయిలించు

**ద్యోతించు** అక. = ప్రకాశించు; వి. ద్యుతి = వెలుగు, కాంతి, ద్యోతం = ప్రకాశించటం; విశి. ద్యోతకం = ప్రకాశింపజేసేది, ద్యోతితం = ప్రకాశించిన. ద్యోతమానం = ప్రకాశిస్తున్న.

**ద్రవించు** అక. = కారు నీరగు; వి. ద్రవం = తడి, కారేది, ద్రావకం = రసం, మందు, ద్రావణం = ద్రవరూపం గలది, ద్రవిణం = సొమ్ము, డబ్బు, చేతులు మారేది, ద్రవ్యం = సొమ్ము, మందు, ప్రవహించే; విశి. ద్రావకం = నేర్పుగల, మోసగించే.

**ద్రొబ్బు** సక. = పడగొట్టు; రూ. దొబ్బు వి. ద్రొబ్బుడు/ దొబ్బుడు = పడవేత.

**ద్వేషించు** అక. = విరోధించు, పగగొను; వి. ద్వేషం = పగ, శత్రుత్వం, విరోధం, ద్వేషి = విరోధి, శత్రువు, పగవాడు, ద్వేషణుడు = శత్రువు, ద్వేష్ట = ద్వేషించేవాడు, ద్వేష్యుడు = పగబట్ట దగినవాడు, విరోధి.

**ధరించు** సక. = తాల్చు; వి. ధరిత్రి/ ధాత్రి/ ధర/ ధరణి = భూమి, కొండ, ధారణి/ ధారుణి = ధరించేది, ధరింపజేసేది, ధరణం = ధరించటం, ధారణ = ధరించటం, గుర్తుంచుకోవటం, ధర్త = ధరించేవాడు; విశి. ధర్తవ్యం = ధరించదగిన, ధార్య = ధరించదగిన.

**ధారపోయు** సక. = ఇచ్చు, (నీటిధారతో కలిపి) దత్తం చేయు; వి. ధార = నీటిపాటు, ప్రవాహం; విశి. ధారాళం = అడ్డులేని.

**ధిక్కరించు** సక. = ఎదురు తిరుగు, తిరస్కరించు; వి. ధిక్కారం/ ధిక్క్రియ = తిరస్కారం, ధిక్కృతుడు = తిరస్కృతుడు.

ధ్యానించు సక. = తలచుకొను, జపం చేయు; వి. ధ్యాత = ధ్యానించేవాడు, ధ్యానం = తలపు, జపం; విశే. ధ్యాతం = ధ్యానించిన, ధ్యేయం/ ధ్యాతవ్యం = ధ్యానింపదగిన.

ధ్వనించు అక. = మోగు; వి. ధ్వానం/ ధ్వని = చప్పుడు, మోత; విశే. ధ్వనితం = మోగే.

ధ్వంసించు సక. = ధ్వంసం చేయు, నాశం చేయు; వి. ధ్వంసం = నాశం; విశే. ధ్వస్తం = నశించిన, జారిన, ధ్వంసితం = ధ్వంసమయిన.

# న

నకనకబడు అక. = వాడిపోవు, చిక్కిపోవు; వి. నకనకలు = చిక్కిపోవటం.

నకనకలాడు అక. = (ఆకలితో) బాధపడు, చిక్కి పోవు, వాడిపోవు.

నక్కు అక. = దాక్కొను, మాటున నిలుచు, పొంచుండు.

నగు అక. = నవ్వు, వెక్కిరించు; వి. నగవు/ నవ్వు = హాసం, నగుబాటు = వెక్కిరింత; వేళాకోళం.

నంకు సక. = నేలను కోరాడు, కుళ్లగించు.

నంగు అక. = ముక్కుతో మాట్లాడు; విశే. నంగి= ముక్కుతో మాట్లాడిన.

నచ్చు అక. = ఇష్టమగు, సక. నమ్ము; వి. నచ్చిక = నమ్మిక, నమ్మకం, నచ్చు = ఆలస్యం, బాధ, నచ్చుకాడు/ నచ్చుగొట్టు/ నచ్చుకుప్ప = బాధించేవాడు.

నచ్చుపెట్టు సక. = తొందరపెట్టు, బాధించు; వి. నచ్చు = ఆలస్యం, బాధ.

నంజు సక. = కొద్దిగాతిను, నంచుకొను; రూ. నంచు(కొను) వి. నంజ = నంచుకొనేది, నంజుడు = మాంసం, నంజుడుదిండి = రాక్షసుడు; విశే. నజ్జు = బాగా నలిగిన, మెత్తబడిన.

నంజువారు అక. = తెల్లబడు, పాలిపోవు; వి. నంజు = పాలిపోవటం.

నటించు అక. = నర్తించు, వేషంకట్టు, అభినయించు, మోసంగా ప్రవర్తించు; వి. నటన(ం) = నాట్యం, నర్తనం, వేషధారణం, మోసం, నటి = నాట్యకర్త్రి, వేషధారిణి, వేశ్య, నటుడి భార్య, నటుడు = నాట్యగాడు, నర్తకుడు, మోసగాడు, నట్టువాడు/ నట్టు/ నటకుడు/ నట్టువుడు / నట్టుగుడు = నటుడు, నర్తకుడు, నట్టువరాలు, నట్టువకత్తె = నటి, నట్టు(వ) పులుగు = నెమలి, నాటకం = నాట్య ప్రధానమైన రూపకం, నాట్యం = నృత్యం. మా. నట్టాడు

నట్టాడు సక. = నాట్యమాడు. మా. నటించు

నట్టుపడు అక. = అడ్డుపడు; రూ. నట్టుపడు వి. నట్టు = అడ్డంకి, ఆటంకం.

నడగొట్టు అక. = నిలుచు, నిలబడిపోవు, ఉండు; వి. నడ, నడక = గమనం, కదలిక.

నడచు అక. ప్రే. నడపు/ నడుపు = ప్రవర్తించు, నడకలో ఉండు; రూ. నడుచు వి. నడ/ నడక = గమనం, నడజోదు = కాలిబంటు, పదాతి, నడవడి/ నడత/ నడితి = ప్రవర్తన.

నడతెంచు అక. = నడుచు, పోవు.

నడయాడు అక. = తిరుగాడు, కదలు, చలించు.

నడుకు అక. = వణకు, కంపించు.

నడుకొను అక. = వణుకు. మా. నడుకు

**నడుచొచ్చు** అక. = మధ్యలో ప్రవేశించు; వి. నడు మంతరం/ నడుమంత్రం/ నడమంత్రం = మధ్యకాలికం, మధ్యవచ్చినది.

**నడుముకట్టుకొను** అక. = సిద్ధపడు.

**నత్తు** అక. = తడబడతూ మాట్లాడు; వి. నత్తి = తడబాటు మాట, నత్తివాడు = తడబడతూ మాట్లాడేవాడు.

**ననయు** అక. = పూచు, చిగురించు; వి. నన = పువ్వు, ననతారు = వసంతకాలం, ననసీరు = మకరందం, పూదేనె.

**ననుచు** అక. ప్రే. ననుపు = పూచు, చిగురించు, మొగ్గదొడుగు, ప్రేమకలుగు, పెరుగు, నచ్చు; వి. ననుపు = అనురాగం, ప్రేమ, ఇష్టం, అతిశయం, ననుపుకత్తె = ప్రేయసి, విటురాలు. ననుపుకాడు/ నన్పుకాడు = విటుడు, ప్రియుడు. చూ. ననుపువడు

**ననుపుపడు** అక. = స్నేహపడు. చూ. ననచు

**నమలు** సక. రూ. నములు = తిను; వి. నములుడు = నమలటం.

**నమస్కరించు** సక.= దండం పెట్టు, దణ్ణం పెట్టు; వి. నమనం = వంగటం, నమసితుడు = నమస్కారం పొందిన, నమస్య = నమస్కారం, నమస్కారం/ నమస్కృతి = దండం, దణ్ణం, నమ్రత = వినయం, వంగి ఉండటం; విణ. నమ స్యితుడు = నమస్సు పొందినవాడు. నమ్రం/ నమితం = వంగిన. చూ. నమించు

**నమ్ము** సక. = విశ్వసించు; వి. నమ్మకం/ నమ్మిక = విశ్వాసం.

**నయించు** సక. = పొందించు; వి. నయనం = పొందించటం, నయ(ం) = ననువు, మెత్తదనం; విణ. నయ(ం) = మెత్తని, నున్నని, అందమైన.

**నరకు** సక. = ముక్కలు చేయు, ఖండించు; రూ. నరుకు వి. నరకుడు/ నరుకుడు = గాటు.

**నరయు** అక. = వెంట్రుకలు తెల్లబడు; రూ. నెరియు వి. నర = తెల్లవెంట్రుక, నరపు/ నరుపు/ నెరుపు = వెంట్రుకలు తెల్ల బడటం.

**నరకుడువడు** అక. నరుకు = తెగు, ముక్కలగు. రూ. నరుకుడువడు

**నరుమాడు** సక. = పొడిచేయు.

**నరుము** సక. = పొడి చేయు.

**నర్తించు** అక. = ఆడు, నాట్యం చేయు; వి. నర్తకి = ఆటకత్తె. నర్తకుడు = ఆటగాడు, నట్టువుడు. నర్తనం = నాట్యం.

**నర్తిల్లు** అక. = ఆడు, రూ. నర్తిలు చూ. నర్తించు.

**నలగు** అక. ప్రే. నలచు, నలుచు, నలిగించు, నలగగొట్టు = నలిగిపోవు, పొడి యగు; రూ. నలుగు వి. నలగుడు/ నలుగుడు/ నలి = పొడియైనది, నలికం = సన్నదనం, నలితిండి = చిరుతిండి; విణ. నలిగులి = తెగనలిగిన, నలిగొట్టు = సన్నటి.

**నలగుడువడు** అక. = పొడిఅగు, అలవాటుపడు. రూ. నలుగుడుపడు చూ. నలగు

**నలగుడుపెట్టు** సక. = పొడిగొట్టు, బాధించు, పీడించు. రూ. నలుగుడుపెట్టు చూ. నలగు

**నలచు** సక. =నలత పెట్టు, పిండి చేయు, బాధించు, నలగగొట్టు; రూ. నలుచు వి. నలక/ నలత/ నలకువ = బాధ, నలగుడు/ నలుగుడు = పీడనం, బాధ.

నలుగు అక. =నలగునట్లు చేయు చూ. నలగు

నవయు అక. = రోగాదులవల్ల చిక్కిపోవు.

నవీకరించు సక. = క్రొత్తదనం కలిగించు, మార్చు; వి. నవ్యత = క్రొత్తదనం; విశ. నవ్యం, నవం = క్రొత్తదైన.

నవ్వు అక. = హసించు, సక. వెక్కిరించు, వేళాకోళం చేయు; రూ. నవు/ నగు వి. నగవు/ నవ్వు = హాసం, వికాసం, పరిహాసం, నవ్వు బాటు. నగు బాటు =వెక్కిరింత, వేళాకోళం, నవ్వులాట/ నవ్వుటాల = ఎగతాళి, పరిహాసం; విశ. నవ్వుల బండి = నవ్వే.

నశించు అక. = ధ్వంసమగు, నాశనమగు; వి. నష్టం/ నష్టి =నష్టం, నాశ(న)ం =ధ్వంసం; విశ. నశ్వరం = నశించే.

నసుకు సక. = వెక్కిరించు, సణుగు, అబద్ధమాడు; వి. నసుకు = అసత్యం.

నాకు సక.= నాలుకతో తుడుచు.

నాచు సక.= నాచికోలు= అపహరణ, దొంగతనం. రూ. నాచికొను

నాటు అక. = పాతు, గుచ్చు (కొను); రూ. నాడు వి. నాటు/ నాట్లు = చేలో నాటువేయు.

నాటుకొను అక.= పాదుకొను, నెలకొను, అమరు, నిలిచిపోవు; విశ. నాటు = పాతు.

నాదించు అక. = మోగు, మోతపుట్టు; వి. నాదు/ నాదం = ధ్వని, మోత.

నాను అక. ప్రే. నాన్చు/ నానుచు = నీటిలో చాలా కాలముండు; వి. నానబియ్యం = తడిపి నానబెట్టిన బియ్యం, నానుడు వాన= ఎడతెగని వాన; విశ. నానుడు = తడిసిన, తెగని.

నానుచు ప్రే. =నానబెట్టు, ఎటూ తెల్చకుండు. రూ. నాన్చు చూ. నాను

నామమడచు సక. = చంపు; వి. నామం = పేరు.

నారుచు ప్రే. = నాటబెట్టు. రూ. నార్చు చూ. నాటు

నాశిల్లు అక. = నశించిపోవు; రూ. నాశిలు; వి. నాశ(న)ం = ధ్వంసం.

నిక్కవొడుచు అక. =నిలువున నిలుచు. చూ. నిక్కు

నిక్కు అక. = పెరుగు, ఎత్తగు, ఉన్నతమగు, గర్వించు, విర్రవీగు; వి. నిక్కు/ నిక్కుడు = ఉన్నతి, గర్వం

నిక్షేపించు సక. = దాచిపెట్టు, పాతిపెట్టు, పూడ్చి పెట్టు; వి. నిక్షేపం = దాచిన సొమ్ము, నిధి.

నిగదించు సక. = స్పష్టంగా చెప్పు ; వి. నిగదనం = స్పష్టంగా చెప్పటం.

నిగిడారు అక. = వ్యాపించు. చూ. నిగుడు

నిగుడు అక. ప్రే. నిగుడుచు/ నిగుడ్చు = నిక్కు, వ్యాపించు, సాగు, విజృంభించు, తొందర పడు, ఎదుర్కొను, చక్కబడు. రూ. నివుడు

నిగ్గు అక. = నరిపడు, సరిపెట్టుకొను, నిర్వహిల్లు రూ. నెగ్గు

నిగ్రహించు సక.= జయించు, తోసివేయు, పెట్టు; వి. నిగ్రహం = బెదురుమాట, తోసివేయటం

నింగివడు అక. = అస్తమించు; వి. నింగి= ఆకాశం.

నించు ప్రే. = నిండజేయు. రూ. నినుచు/ నింపు చూ. నిండు

నిట్టనిలుచు =నిటారుగా నిలుచు; రూ. నిట్టుక నిలుచు వి. నిట్టనిలువు =నిటారైన నిలువు నిటరాడు/ నిట్రాడు = నిలువు కొయ్య/ స్తంభం.

నిటూరుచు అక. = నిట్టూర్పు విడుచు; రూ. నిట్టూర్చు వి. నిట్టూరుపు/ నిట్టూర్పు = దీర్ఘ శ్వాస.

నిత్రించు సక. = నిలువుగా ఉంచు.

నిత్రిల్లు అక. = ఉపవాసముండు; వి. నిత్రు = ఉపవాసం, నిత్రుపవాసం =కటిక ఉపవాసం.

నిండబడు అక.= నిండిపోవు. చూ. నిండు

నిండారు అక. = నిండిపోవు, వ్యాపించు. చూ. నిండు

నిండు అక. = నిండిపోవు, పూర్ణమగు; విశే. నిండు = పూర్ణమైన

నిండుకొను అక. ప్రే. నిండుకొలువు. చూ. నిండు

నిదానించు అక. = తొందరపడక, విచారించు; వి. నిదానం = మెల్లన, తొందరలేమి.

నిదురవోవు అక. = నిద్రించు; రూ. నిద్దుర వోవు వి. నిద్దుర/ నిదుర = నిద్ర

నిదురించు అక. = నిద్రపోవు

నిద్రపోవు అక. = నిద్రించు

నిద్రించు అక. =నిద్రపోవు; వి. నిద్ర = నిదుర, నిద్రాళువు/ నిద్రాళువు =నిద్రపోతు విశే. నిద్రాణం = నిద్రమత్తులో ఉన్న, పైకి కనిపించని.

నిద్రిల్లు అక. = నిద్రించు. రూ. నిద్రిలు

నినుచు ప్రే. చూ. నించు

నిపతించు సక. = నిపాతసూత్రం చెప్పు, పడ వేయు; వి. నిపాతం = పడటం, నిపాతనం = పడ వేయటం.

నిందించు సక. = తిట్టు, దూషించు; వి. నింది తుడు = నేరంచేశాడన్న ఆరోపణకు గురైనవాడు, నింద్యుడు = తిట్టదగినవాడు, నింద = తిట్టు, అపవాదు.

నిబద్ధించు సక. = నిజంచేయు; రూ. నిబద్ధించు/ నిబద్ధిలించు వి. నిబ్బద్ది/ నిబద్ది/ నిబద్ధి = సత్యం.

నిబంధించు సక. = కట్టివేయు, అడ్డగించు; వి. నిబంధం =కట్టుబాటు, నిబంధనం = ఏర్పాటు, నిబంధన = నియమం; విశే. నిబంధనం = కూర్చిన, నిబద్ధ = బంధించిన, కట్టివేసిన, అడ్డ గించిన

నిబిడీకరించు అక. = గట్టిపరచు, దట్టంచేయు; వి. నిబిరీసం=సాంద్రమైనది; విశే. నిబిడీకృతం = దట్టంచేసిన, నిబిడ = సాంద్రం, దట్టమైన.

నిబ్బరించు అక. =నిదానించు, అతిశయించు; విశే. నిబ్బరం = ఎక్కువ, అధికం

నిబ్బరికించు అక. = కరుణించు, దయదలచు, ఉప్పొంగు; వి. నిబ్బరికం = దయ, కరుణ.

నిభాయించు అక. = ఓర్చు, తాలు, సహించు; వి. నిభాయింపు = సహనం.

నిమంత్రించు సక. = (శ్రాద్ధాదులకు) ఆహ్వానించు, నియమించు; వి. నిమంత్రణ(ం) = నియామకం, పిలుపు, నిమంత్రితుడు = పిలుపు వచ్చిన వాడు

నిముకు సక. = వెదకు. రూ. నెమకు

నిమురు సక. = మెల్లగా తడుము.

నిమ్మళించు అక. = తగ్గు, (ఆరోగ్యం) కుదురు; వి. నిమ్మళం = స్వస్థత, ఆరోగ్యం.
నియంత్రించు సక. = అదుపులో ఉంచు/పెట్టు; వి. నియంత్రణ = అదుపు, అడ్డు, అడ్డగింత; విశ. నియంత్రితం = అదుపులో ఉంచిన/ ఉన్న.
నింపారు లక. రూ. నినుపారు మా. నినుపు.
నింపు ప్రే. = నిండించు, నిండజేయు. మా. నిండు
నియమించు సక. = (ఉద్యోగంలో) పెట్టు, పంపు, ఆజ్ఞాపించు; వి. నియతి = నియమం, నియమం = ఏర్పాటు, కట్టడి, మనువు, ప్రతిజ్ఞ, నియమనం = ఏర్పాటు, నియమించటం, నియామకుడు = నియమించేవాడు; విశ. నియతం = నియమంగల, నిత్యమైన, నియమితం = నియుక్తమయిన, కట్టుబడిన, నియమ్యం = నియమించ దగిన.
నియోగించు సక. = ఆజ్ఞాపించు, పంపు, నియమించు; వి. నియుక్తుడు = నియమించినవాడు, నియోగం = ఆజ్ఞ, ఉద్యోగం, నియోగి = ఉద్యోగి, ఉద్యోగం కలవాడు, నియోగ్యుడు = నియోగించదగినవాడు, నియోజనం = నియమించటం, నియోజ్యుడు = పనివాడు, ఉద్యోగి, భృత్యుడు. విశ. నియోక్తవ్యం = నియోగించ దగిన
నిరసించు సక. = తిరస్కరించు, వదలిపెట్టు, విడిచిపెట్టు; వి. నిరసన(ం) / నిరాస(న)ం = తిరస్కారం, ఆక్షేపం, ఉమ్మివేయటం; విశ. నిరస్తం = తిరస్కరించినది, తొందరగా చెప్పిన, తిరస్కృత మైన, నిరాసకం = నిరసించేది.
నిరాకరించు సక. = తిరస్కరించు, వద్దను; వి. నిరాకరణ(ం) / నిరాకృతి/ నిరాకారం = తిరస్కారం. విశ. నిరాకృతం = తోసివేసిన, కాదనిపించుకున్న
నిరీక్షించు సక. = ఎదురుచూచు; వి. నిరీక్ష (ణం) = ఎదురుచూపు; విశ. నిరీక్షితం = ఎదురు చూసిన
నిరూపించు సక. = రుజువు చేయు, నిదర్శన చూపు; వి. నిరూపణ(ం) = రుజువు, నిదర్శన, ధ్రువీకరణం, తార్కాణం; విశ. నిరూపితం = రుజు వయిన, నిరూప్యం = రుజువు చేయదగిన.
నిరోధించు సక. = అడ్డగించు, అడ్డుపెట్టు; వి. నిరోధం = అడ్డు, వేటు, ప్రమాదం.
నిర్గమించు అక. = బయటికివెళ్ళు, వెళ్ళిపోవు; వి. నిర్గతి/ నిర్గమనం = బయటికి వెళ్ళటం; విశ. నిర్గత = బయటకు పోయిన
నిర్జించు సక. = గెలుచు, జయించు; వి. నిర్జితుడు = గెలిచినవాడు, జేత.
నిర్ణయించు సక. = నిశ్చయించు, ఏర్పాటు చేయు; వి. నిర్ణయం = ఏర్పాటు, నిశ్చయం, నిర్ణాయకుడు = నిర్ణయించేవాడు, నిర్ణేత = నిర్ణయించే వాడు; విశ. నిర్ణీతం = నిర్ణయమైన నిర్ణేయం = నిర్ణయించదగిన.
నిర్దహించు సక. = బాగాకాల్చు, పూర్తిగా తగల బెట్టు. వి. నిర్దహనం = పూర్తికాల్చు.
నిర్దేశించు సక. = చూపు, చెప్పు, ఆజ్ఞాపించు, పంపు
నిర్ధరించు అక. = తేల్చిచెప్పు, స్పష్టంగా చెప్పు, నిశ్చయంగా చెప్పు; వి. నిర్ధారణ = నిశ్చయం, నిర్ధార్యుడు = పట్టుదలతో పనిచేసే వాడు;

విణ. నిర్ధార్యం/ నిర్ధారణీయం = నిర్ధరించదగిన, నిర్ధారితం = నిర్ధరించిన.

నిర్బంధించు సక. = కట్టుబాటులో అదుపులో ఉంచు, కట్టివేయు, బలాత్కరించు; వి. నిర్బంధం = బలాత్కారం, కట్టు, అదుపు.

నిర్భర్త్సించు సక. = అదిలించు, బెదరించు వి. నిర్భర్త్సనం = అదలింపు; విణ. నిర్భర్త్సిత = అదిలించిన, బెదరించిన.

నిర్మించు సక. = కట్టు; వి. నిర్మాణం, నిర్మితి = కట్టడం. నిర్మాత/ నిర్మాయి = కట్టేవాడు; విణ. నిర్మిత =కట్టిన

నిర్మూలించు సక. = నాశనం చేయు, మొదలంట ధ్వంసం చేయు; వి. నిర్మూలన = విధ్వంసం, వినాశం; విణ. నిర్మూలం =వేరులేని, ఆధారం లేని.

నిర్వచించు సక. = వివరించు, విశదీకరించు; వి. నిర్వచన(ం) = వివరణ, విశదీకరణ; విణ. నిర్వ చనీయం = వివరించదగిన.

నిర్వర్తించు సక. = నెరవేర్చు

నిర్వర్తిల్లు అక. = నెరవేరు

నిర్వహించు సక. = నెరవేర్చు; వి. నిర్వాహం = జరుగుబాటు, నిర్వాహకుడు = నెరవేర్చేవాడు, నిర్వహణ =నెరవేర్చటం.

నిర్వహిల్లు అక. = నెరవేరు.

నిర్వేదించు అక. = దుఃఖపడు, విచారించు వి. నిర్వేదం = విచారం, దుఃఖం.

నిర్రనీలుగు అక. = తెగనీల్గు, గర్వించు. చూ. నీలుగు

నిలబడు అక. = నిలుచు, నిల్చొని ఉండు;రూ. నిలువబడు; వి. నిలక/ నిలుపు=నిల్చొని ఉండటం, నిలుకడ/ నిలకడ= ఉనికి, స్థిరత్వం, విశ్రాంతి.

నిలుగు అక. చూ. నీలుగు

నిలుచు అక. ప్రే. నిలుపు = నిలబడు, ఉండు, మిగులు, అడ్డుపడు; రూ. నిల్చు వి. నిలువ/ నిల్వ = మిగిలినది. నిలువు = నిలిచిఉన్న, నిలకడ/ నిల్కడ = ఉనికి, స్థిరత్వం, విశ్రాంతి.

నిలుచుండు అక.= నిలిచి ఉండు, నిలవబడు. చూ. నిలుచు

నిలుపు అక. ప్రే. = నిలుచునట్లుచేయు, నిలవబెట్టు

నిలువరించు అక. = కదలకుండా నిలుపు, అడ్డం పడు; రూ. నిల్వరించు వి. నిల్వరం/ నిలువరం = అడ్డు

నివర్తించు ప్రే. = మరల్చు; వి. నివర్తన(ం) = మరల్చు.

నివర్తిల్లు అక. = మరలు, వెనుదిరుగు; వి. నివర్తన(ం) = మరలటం.

నివసించు అక. = (కాపురం) ఉండు; వి. నివాసం/ నివసతి/ నివసనం = ఇల్లు, గృహం, ఉండేచోటు, నివాసి = వాస్తవ్యుడు.

నివారించు సక. = ఆపు, అడ్డు, అడ్డుపడు, అడ్డగించు; వి. నివారణ = ఆపు, అడ్డగింపు; విణ. నివారితం = అడ్డుకు గురి అయిన, నివారణీయం = ఆపదగిన, అడ్డగించదగిన.

నివాళించు అక. = హారతిపట్టు, గౌరవించు; వి. నివ్వాళి/ నివాళి/ నివాళిక =హారతి; విణ. నివాళితం = చుట్టిన.

నివుడు అక. చూ. నిగుడు
నివుడుచు ప్రే. = నిగిడించు. రూ. నివుడ్చు చూ. నిగుడు
నివురు సక. రూ. నిమురు చూ.
నివేదించు సక. = విన్నవించు, తెలియజెప్పు సమర్పించు; వి. నివేదన/ నివేదనం = సమర్పణ, విన్నపం; విణ. నివేదిత = సమర్పించిన, నివేద్యం = సమర్పించ దగిన, చెప్ప దగిన, విన్నవించవలసిన.
నివ్వటించు సక. = నెరవేర్చు, కలిగించు, వ్యాపింప జేయు.
నివ్వటిల్లు అక. = నెరవేరు, వ్యాపించు, కలుగు. రూ. నివ్వటిలు
నివ్వెరపడు అక.= ఆశ్చర్యపడు, దిగ్భ్రాంతి చెందు, పారవశ్యం పొందు; వి. నివ్వెర/ నివ్వెర పాటు/ నివ్వెరగు = ఆశ్చర్యం, దిగ్భ్రాంతి, పారవశ్యం, నిశ్చేష్టత.
నిశ్చయించు సక. = నిర్ణయించు; వి. నిశ్చయం = నిర్ణయం, నిశ్చాయకుడు = నిర్ణయించే వాడు; విణ. నిశ్చితం = నిర్ణయించిన
నిశ్వసించు అక. =నిట్టూర్చు; రూ. నిశ్వాసించు వి. నిశ్వసనం/ నిశ్వాసం = నిట్టూర్పు.
నిశ్వాసించు అక. చూ. నిశ్వసించు.
నిషేధించు సక. = నిరాకరించు, వద్దను, తిరస్కరించు, కూడదను, అడ్డుపడు, అడ్డగించు; వి. నిషేధం = నిరాకరణ, నిరాకృతి, తోపుడు
నిషేవించు సక. = బాగాసేవించు, తాగు. వి. నిషేవణం = బాగాతాగటం, మందు కొట్టడం; విణ. నిషేవితం = బాగాతాగిన, నిషేవ్యం = బాగా తాగదగిన.
నిష్కర్షించు సక. = నిశ్చయించు; వి. నిష్కర్ష = నిశ్చయం.
నిష్కాసించు సక. = వెళ్ళగొట్టు, తోలివేయు; వి. నిష్కాసనం = వెళ్ళగొట్టడం; విణ. నిష్కాసితం = వెళ్ళగొట్టిన.
నిష్క్రమించు అక. = బయటికి వెళ్ళిపోవు; వి. నిష్క్రాంతి/ నిష్క్రమం/ నిష్క్రమణ = బయటికివెళ్ళడం; విణ. నిష్క్రాంత = బయటికి వెళ్ళిన.
నిష్ఠించు అక. = స్థిరమగు; వి. నిష్ఠ = ఉనికి; విణ. నిష్ఠిత = ఉంచిన.
నిష్పాదించు సక. = పుట్టించు, సాధించు; వి. నిష్పాదనం/ నిష్పత్తి/ నిష్పాదన = సిద్ధి, పుట్టుక, సాధన; విణ. నిష్పన్న = పుట్టిన, నిష్పాదిత = పుట్టించిన, నిష్పాద్య =పుట్టించ దగిన
నిస్తరించు సక. = జాగ్రత్తగా దాటు, అధిగమించు; వి. నిస్తారం, నిస్తరణం = దాటడం, వెళ్ళడం, ఉపాయం, నిస్తారకం = విస్తరింపజేసేది, దాటించేది.
నిహ్నవించు సక. = దాచిపెట్టు, మరుగు పుచ్చు; వి. నిహ్నవం/ నిహ్నుతి = దాపరికం, దాచిన మాట.
నీగు సక. = మరల్చు, నివర్తించు
నీరాడు అక. ప్రే. నీరారుచు/ నీరార్చు = స్నానం చేయు, నీళ్లలో ఆడు; వి. నీరాట = జలక్రీడ, స్నానం; నీరాటం = నీటిజంతువు.
నీరారుచు ప్రే. రూ. నీరార్చు చూ. నీరాడు.
నీరుముట్టు అక. = తాగు
నీరువట్టు అక.= దప్పికొను, దాహమగు. రూ. నీర్వట్టు

నీలుగు అక. = ఒళ్లు విరుచుకొను, చచ్చు రూ. ఈలుగు/ నీల్గు

నీళ్ళాడు అక. = ప్రసవించు; స్నానమాడు

నుగ్గాడు సక. = ముక్కలుచేయు, ఖండించు; వి. నుగ్గు = పొడి, ముక్క.

నుగ్గు అక. = నలిగిపోవు; వి. నుగ్గు = పొడి, ముక్క.

నుగ్గులువారు అక. = నుగ్గయిపోవు, పొడిఅగు, ముక్కలగు; వి. నుగ్గు = పొడి, ముక్క.

నుచ్చు సక. = పాతగుడ్డలు(మేక మెడ చన్నులకు) చుట్టు; వి. నుచ్చుపాత =(మెడ చన్నులకు కట్టే) చుట్టేపాతగుడ్డ.

నుడుగు సక. = చెప్పు; రూ. నుడువు/ నొడుగు/ నొడువు వి. నుడి/ నుడువు/ నుడుగు = మాట, నుడికారం/ నొడికారం = మాట నేర్పు, నుడువరి = మాటకారి, వాగుడు కాయ, నుడుగురేడు = బృహస్పతి, నొడికాడు/ నొడికారి = చమత్కారి, మాట కారి.

నుడువు సక.= చెప్పు. రూ. నొడువు/ నొడుగు / నుడుగు. చూ. నుడుగు

నుతించు సక. = పొగడు; సక. నుతి =పొగడ్త

నురిచియాడు సక.= నాశంచేయు చూ. నురుపు

నురుచు సక. = (ధాన్యం) కాళ్లతో నలగదొక్కు; రూ. నూరుచు/ నూర్చు వి. నురుము/ నురిపిడి/ నుప్పిడి/ నూరుపిడి/ నూర్పిడి = నుగ్గు, పొడి, కాలితో ధాన్యన్ని తొక్కటం.

నురుపు సక. = నూర్చు, చంపు.

నురుమాడు సక. = పొడిచేయు, చంపు.

నురుము సక. = పొడిచేయు, చంపు; వి. నురుము = పొడి.

నులించు ప్రే. = నులుచు, నులియబెట్టు; వి. నులి = చిక్కు, మెలిక, పేగుల్లో నొప్పి; విశే. నులి= కొద్ది(పాటు)

నులిగొను అక.= పొడియగు, పట్టుతప్పు, ... భ్రంశత పొందు; వి. నులివు = నులియటం.

నులివెట్టు సక. చూ. నులుచు

నులుచు ప్రే. = నులియబెట్టు. రూ. నులుపు చూ. నులియు

నులుము సక. = నలుపు, బుగ్గలుపిసుకు, పెళ్లగించు.

నుసలు అక. = మసలు, ఆలస్యం చేయు. సక. (ఒళ్లు) విరుచుకొను.

నుసుగు సక. = తిరస్కరించు

నుసుము సక. = ఆకర్షించు

నుసులు సక. = మెదలు; వి. నుసులు = నేర్పు, వీలు.

నూకు సక. = కొట్టు, తోసివేయు, తోలు; వి. నూకుడు = తోపుడు, దెబ్బ.

నూరు సక. = పదునుబెట్టు.

నూరుచు సక. చూ. నూర్చు

నూర్చు సక. రూ. నూరుచు; వి. నూర్పు/ నూర్పిడి/ నూరుపిడి/ నురిపిడి/ నుర్పిడి = ధాన్యం తొక్కటం.

నూలుకొను అక. ప్రే. నూలుకొలుపు/ నూల్కొల్పు = కుదురు కొను, ఒప్పుకొను, చక్కబడు; రూ. నూల్కొను వి. నూలు కోలు / నూల్కోలు = నూల్కొనటం.

నూల్కొను చూ. నూలుకొను

నెక్కొను అక. ప్రే. నెక్కొలుపు/ నెక్కొల్పు = పాదుకొను; రూ. నెలకొను వి. నెక్కోలు = పాదుక పోవటం.

**నెగడు** అక. = వర్ధిల్లు, పెరుగు, ఉండు.

**నెగయు** అక. = పైకి ఎగురు/ లేచు. చూ. ఎగయు

**నెగయుదెంచు** అక. = పైకెగురు. చూ. ఎగయు

**నెగ్గు** అక. = గెలుచు, బయటపడు, నిర్వహిల్లు. రూ. నిగ్గు

**నెట్టు** సక. = తోయు, ప్రయత్నించు; వి. నెట్టు = పూనిక, ప్రయత్నం, త్రోపు; విశే. నెట్టన(ం) (అవ్య) = త్వరగా, తప్పక.

**నెట్టుకొను** అక. = పూనుకొను, ప్రయత్నించు, ఉండు, పెరుగు. సక. బలాత్కరించు

**నెప్పరించు** సక. = నిరూపించు; వి. నెప్పరం = వేగం, తొందర, నెప్పలి = ఉపాయశీలి.

**నెప్పుకొను** అక. = పాదుకొను, పాతుకపోవు; వి. నెప్పు = స్థానం.

**నెమకు** సక. = వెతుకు; వి. నెమకుడు = వెతకటం.

**నెమరుచు** సక. = నెమరువేయు; వి. నెమరు = (మళ్లీ) నమిలితిను.

**నెమ్ముకొను** అక. = చెమ్మగిల్లు; వి. నెమ్ము = తడి, చెమ్మ.

**నెయ్యమాడు** అక. = స్నేహంచేయు. వి. నెయ్యం/ నెయ్యమి = స్నేహం, మైత్రి, నెయ్యరి = స్నేహితుడు, స్నేహితురాలు, నెయ్యుడు = మిత్రుడు, నెయ్యురాలు = స్నేహితురాలు.

**నెరపు** ప్రే. = నెరవేర్చు, నింపు, వ్యాపింపజేయు; వి. నెరయిక = నింపు, నిండటం, నెరవు = వ్యాప్తి, పూర్తి; విశే. నెరవు = నిండిన, ఎక్కువైన, విశాలమైన, వ్యాపించిన.

**నెరయు** అక. = వ్యాపించు, నిండు, నెరవేరు. చూ. నెరపు

**నెత్తురువారు** అక. = ఎర్రబడు; వి. నెత్తురు, నెత్రు = రక్తం.

**నెరపు** ప్రే. = నింపు, నెరవేర్చు, వ్యాపింపజేయు; వి. నెరపు = వ్యాప్తి; విశే. నెరపు = ఎక్కువ.

**నెరయు** అక. = నిండు, నెరవేరు; వి. నెరపు = వ్యాప్తి; విశే. నెరపు = ఎక్కువ.

**నెరయు** అక. = నిండు, నెరవేరు; వి. నెరవు = పూర్తి, వ్యాప్తి; నెరవు = పూర్ణమయిన, ఎక్కువ, తగిన, విశాలమైన.

**నెరవేరు** అక. = ముగియు, సిద్ధించు.

**నెరిపడు** అక. = అగు, సిద్ధించు; వి. నెరి = పూర్తి; విశే. నెర = పూర్తి అయిన, నిండయిన.

**నెలకొను** అక. = నిలుచుండు, నిలకడగా ఉండు; రూ. నెలవుకొను వి. నెలవు = (నివాస)స్థలం, నెలకువ = సాధనం.

**నెలవుకొను** అక. చూ. నెలకొను

**నేటించు** అక. = గట్టిపడు; వి. నేటు = నిశ్చయం; విశే. నేటు = గట్టి.

**నేటుసేయు** సక. = గట్టిపరచు చూ. నేటించు.

**నేమించు** సక. = నియమించు; వి. నేమం/ నేమకం = నియమం.

**నేము** సక. = (చేటతో) చెరుగు

**నేయు** సక. = అల్లు, నేతపని చేయు; వి. నేత = అల్లకం, నేయటం.

**నేరుచు** అక. = భరించు, ఓపు, సక. అభ్యసించు; వి. నేరిమి/నేర్పు/నేర్పు = నైపుణ్యం, పని తనం, నేరుపరి, నేర్పరి, నేరుపుకాడు, నేరుపు లాడు=సమర్థుడు.

**నేలగలుపు** సక. = చంపు, మన్ను గరిపించు; వి. నేల = మన్ను, భూమి

నొక్కు సక. = అదుము; వి. నొక్కు/నొక్కుడు = ముడత.

నొగులు అక. ప్రే. నొగలుచు/నొగల్చు = బాధపడు, నొచ్చుకొను; వి. నొగులు = వైకల్యం, నొప్పి.

నొగులుచు ప్రే. రూ. నొగుల్చు చూ. నొగులు

నొచ్చు అక. = నొప్పిచెందు, బాధపడు; వి. నొప్పి = బాధ, కష్టం, అయిష్టం.

నొచ్చుకొను అక. = బాధపడు, పశ్చాత్తాపపడు; వి. నొచ్చుకోలు = బాధ, పశ్చాత్తాపం

నొంచు ప్రే. = నొప్పించు; వి. నొప్పి = బాధ, ఆపద; విశ. నొప్పిగుంటి = జబ్బుపడ్డ.

నొడుగు సక. చూ. నుడుగు.

నొడుగు సక. = తప్పులుపట్టు; వి. నొడుపు = తప్పులుపట్టడం.

నొల్లు సక. = చప్పరించు.

నొల్లుకొను అక. = దొరికినంత రాబట్టుకొను

నోచు సక. = వ్రతం చేయు; వి. నోత/నోము = వ్రతం.

నోచుకొను అక. = పొందగలుగు

నోము సక. = వ్రతం చేయు, పొగొట్టు; వి. నోము/నోత = వ్రతం.

నోయు అక. చూ. నొచ్చు.

నోరూరు అక. = నోటనీరూరు, కోరు, అపేక్షించు.

నోరెత్తు అక. =మాట్లాడటానికి ప్రయత్నించు.

నౌడకొట్టు అక. = మిటకరించు. రూ. నవుడుకొట్టు

## ప

పగగొను అక. = విరోధపడు. చూ. పగబట్టు

పగబట్టు అక. = విరోధపడు, శత్రుత్వం, (మనసులో) పెట్టుకొను, వి. పగ = విరోధం, విరోధి, పగతుడు = శత్రువు, పగతురాలు = శత్రురాలు, పగవాడు = శత్రువు, విశ. పగదారి = శత్రువైన, విరోధియైన.

పగులగొట్టు సక. రూ. పగలగొట్టు చూ. పగులు

పగులబారు అక. రూ. పగలబారు/పగుళ్ళువారు చూ. పగులు

పగులు అక. ప్రే. పగుల్చు/పగులుచు = చీలు, పగిలిపోవు; వి. పగులు = చీలిక.

పగులుచు ప్రే. = పగలచీల్చు, పగలగొట్టు. రూ. పగుల్చు

పగ్గించు అక. = ప్రగల్భములుపలుకు, బడాయికొట్టు; పగ్గియ/పగ్గె = బడాయి మాట, సామర్థ్యం.

పంకించు అక. = చలించు సక. (బురద) పట్టించు.

పంగటించు సక. = దూరంగాచాచు, పంగచాచు; వి. పంగ= దూరంగా సాగినశాఖ/ కాలు; పంగటి కాళ్లు = దొడ్డికాళ్లు, విశ. పంగటి = ఎడమైన, ఎడంగా ఉన్న.

పచరించు అక. = ప్రవర్తించు, సక. ప్రసరింపజేయు, ప్రయోగించు, సవరించు, ప్రకటించు, అమర్చు; వి. పచరింపు = ప్రసరణ, పచారం = అంగడి, పచారి = చిల్లర కొట్టువాడు. చూ. పచారించు సక. = నడుపు, నడిపించు. చూ. పచరించు

పచారించు అక. = వ్యాపించు; వి. పచారం= వ్యాప్తి, అతిశయం.

పచ్చిదేరు అక. = పచ్చిగా ఉండు, పచ్చిఅగు; విశ. పచ్చి = తడిగల, ఎండని, కాలని, ముదరని, మరుగులేని.

పంచితిల్లు అక. = (ఆవు) మూత్రంవిడుచు; రూ. పంచితిలు వి. పంచితం = గోమూత్రం.

పంచు సక. = ఆజ్ఞాపించు, పంపు; రూ. పనుచు
– వి. పని = కార్యం, పనిముట్టు = సాధనం, కొరముట్టు, పనితనం = నేర్పు, నైపుణ్యం, పనివాడు = నేర్పరి, సేవకుడు.

పట్టించు ప్రే. = (చదువు) మొదలు పెట్టు, తేల్చు;
_వి. పట్టింపు = అక్కర, అవసరం, పట్టుదల, మొదలు

పట్టు అక. = చెల్లు, పట్టుకొను, మొదలుపెట్టు, అవసరపడు, అంటుకొను, నచ్చు; సక. గ్రహించు, అవలంబించు, ఊదు, ఎదుర్కొను, వి. పట్టు = గ్రహణం, పద్దు, పూత, నివాసస్థలం, స్థానం, అవకాశం, వెడల్పు, ధైర్యం, విషయం, కారణం, ఆధారం, అవసరం, పట్టుదల, బంధుత్వం, సన్నమాలు, పట్టుదల/పట్టుడు = వదలని పట్టు, పట్టుగొమ్మ = ఆధారం, పట్టుబడి = ఖర్చయిన సొమ్ము.

పట్టుకొను అక. ప్రే. = ఉండు, నిలుచు, అంటి పెట్టుకొని, బిగిసిపోవు; వి. పట్టుకోలు = నిలువు.

పట్టువడు అక. = చిక్కు, అలవడు, తెలియవచ్చు. చూ. పట్టు

పఠించు సక. = చదువు; వి. పఠిత = చదివేవ్యక్తి, పాఠ = చదవటం, పఠనం = చదువు, చదవటం, పాఠనం = చదువునేర్పటం, పాఠి/పాఠకుడు = చదివేవాడు, పాఠశాల = బడి; విణ. పఠితం = చదివినది, పఠితవ్యం = చదవదగినది, పాఠ్యం = చదవదగినది.

పడుచు సక. రూ. పడయు = సంపాదించు, పొందు; వి. పడపు = సంపాదన, గడన.

పడయు సక. = పొందు, సంపాదించు (బిడ్డను) కను; రూ. పడచు వి. పడపు = సంపాదన, సంపాదించిన సొమ్ము.

పడు అక. = రాలు, పడిపోవు, కష్టమొందు, చచ్చు, పూడు, అస్తమించు, పొందు; వి. పడుక/పడక = శయ్య, పరుపు, పడకటిల్లు/పడుకటిల్లు = శయనగృహం.

పండించు సక. = పైరుచేయు, పెంచు, సేద్యం చేయు; వి. పంట = పండటం, ఫలితం, ఫలసాయం, పంటవలతి = భూమి, పంటసాల = ఉగ్రాణం, ధాన్యంకొట్టు.

పండు అక. = పైరగు, ఫలితమిచ్చు, పండిపోవు; వి. పండు = ఫలం, పండినకాయ. విణ. పండు = పండిన.

పండుకొను అక. = శయనించు, నిద్రించు. రూ. పడుకొను

పదనుకొను అక. = పడియు; వి. పదను/పదును = తడుపు.

పదరు అక. సక. = తొందరపడు, కోపించు, చలించు, ఆక్షేపించు, దూషించు; వి. పదరు = తొందర మాట.

పదిలపడు అక. ప్రే. = గట్టిపడు, స్థిరపడు, పదిలపరచు, పదిలపరుచు; వి. పదిలం = స్థిరత్వం, దృఢత్వం, పదిలుడు = జాగ్రత్త గలవాడు, స్థిరుడు; విణ. పదిలం = గట్టి, జాగ్రత్తగల.

పదిలించు సక. = పదిలపరచు, భద్రపరచు, దృఢపరుచు, స్థిరపరుచు. చూ. పదిలపడు

పదురు అక. ప్రే. పదురుచు/పద్రుచు = తొందరపడు; వి. పదురు = పద్ధతి, విధం.

పనవు సక. = తలుకొని ఏడ్చు.

పనిగొను సక. = నియోగించు, ఆజ్ఞాపించు.

**పనివంచు** సక. = పనిచేయించు, నియోగించు.

**పనివడు** అక. = అవసరపడు, అక్కరపడు.

**పనివిను** అక. = చెప్పినట్లు చేయు.

**పనుకు** అక. = కోపించు.

**పనుగొను** అక. = గట్టిపడు, కలుగు.

**పనుచు** సక. = పంపు, నియోగించు, నియమించు; రూ. పంచు, పంపు వి. పనుపరి = ఆజ్ఞా బద్ధుడు, పనుపు = ఆజ్ఞ.

**పనుపడు** అక. =నాటు, కలుగు. రూ. పన్నుపడు

**పంతగించు** అక. = పంతంపట్టు, పోటీ చేయు, ప్రతిజ్ఞ పట్టు, విధించు.

**పన్ను** అక. = (యుద్ధానికి) సిద్ధపడు, కలుగు, ప్రే. సిద్ధపరచు, సక. ఏర్పరచు, చేయు; వి. పన్ను= కప్పం, అరి, పన్నుగడ = వ్యూహం.

**పన్నుండు** అక. = పడుకొను, పరుండు.

**పన్నుపడు** అక. ప్రే. పన్నుపరచు = అలవాటు పడు, కలుగు, నాటు.

**పప్పుచేయు** సక. = నురుమాడు, బద్దలు కొట్టు; వి. పప్పు= బద్ద, బేడ, సూపం.

**పంపించు** సక. = పోవునట్లు చేయు; వి. పంపిణీ = పంచిపెట్టడం.

**పంపు** సక. = ఆజ్ఞాపించు, పంపించు; వి. పంపు, పనుపు = ఆజ్ఞ, పంపకం, వరిమ్లవరస , పంపకం =పంచిపెట్టడం, పంచటం, పంపటం.

**పంపువడు** అక. = ఆజ్ఞపొందు. చూ. పంపు

**పంపువెట్టు** సక. = అతిశయించు, అంచులు మడిచికట్టు; చూ. పంపు వి. పమ్మకం = అంచులు మడిచికట్టిన కట్టు.

**పయనించు** అక. = ప్రయాణమగు; వి. పయనం = ప్రయాణం.

**పరగు** అక. = ప్రవర్తిల్లు, ఉండు, ప్రయుక్తమగు, ప్రసరించు, ప్రసిద్ధమగు, ప్రయాణమగు, విహరించు;

**పరచు** అక. ప్రే. = పారు, పడగొట్టు, (దుప్పటి మొ॥) పరచివేయు. వి. పరత/పరతి/పరద/ పరవ = ప్రవాహం.

**పరతెంచు** అక. = పారిపోయివచ్చు.

**పరపు** ప్రే.= (బాణం) వేయు, ప్రవహింప జేయు, పోగొట్టు, తోలు, ప్రయోగించు, పూయు; వి. పరపు = విరివి, పడక, వేగం. విణ. పరపు = విరివియైనది. చూ. పరచు

**పరమువడు** అక. = ప్రాణాచారంపడు

**పరవు** అక.= వ్యాపించు; రూ. పరగు వి. పరవు= వ్యాప్తి, వ్యాపనం.

**పరాకుపడు** అక. = పొరపాటుపడు, ప్రమాద పడు, పరధ్యానంలో ఉండు; వి. పరాకు = తత్పరత, ప్రమాదం, పొరపాటు.

**పరాక్రమించు** సక. = తిరగబడు, శౌర్యం చూపు; వి. పరాక్రమం, పరాక్రాంతి = వీర్యం, శౌర్యం, సామర్థ్యం.

**పరాభవించు** సక. = అవమానించు; వి. పరాభవం/పరాభూతి = అవమానం, పరాభూతుడు = అవమానంపాలయినవాడు.

**పరామరిసించు** సక. = పలకరించు, ఓదార్చు, విచారించు; రూ. పరామర్శించు వి. పరామరిక/ పరామరిస = పలకరింపు, పరామర్శ (౦) = ఓదార్పు.

**పరామర్శించు** సక. చూ. పరామరిసించు

**పరికరించు** సక. = పరీక్షించు.

పరికించు సక. = చూచు, పరీక్షించు, విచారించు.

పరిక్రమించు సక. = విహరించు, అటునిటు తిరుగు; వి. పరిక్రమ(ం) = విహారం, తిరగటం.

పరిగణించు సక. = లెక్కించు, ఎంచు; వి. పరిగణన(ం) = లెక్క, ఎంపిక; విణ. పరిగణితం = ఎంచినది, లెక్కించినది

పరిగొను అక. = బారులుతీరు సక. చుట్టుకొను, అపహరించు; వి. పరి = సేన, గుంపు, పంక్తి, చుట్టు.

పరిగ్రహించు సక. = (ఇష్టంగా) తీసుకొను, స్వీకరించు; వి. పరిగ్రహం / పరిగ్రహణం = స్వీకారం, తీసుకోవటం, పుచ్చుకోవటం.

పరిఘ్రాణించు అక. = ఎదురుచెప్పు/పలుకు.

పరిచయించు అక. = స్నేహంచేయు, తెలుసుకొను; వి. పరిచితి, పరిచయం = ఎరుక, స్నేహం. విణ. పరిచితం = తెలిసిన, ఎరిగిన.

పరిచరించు అక. = సేవచేయు; వి. పరిచర్య/ పరిచారం = సేవ, కొలువు, పరిచారకుడు = సేవకుడు, పరిచారిక = సేవకురాలు, దాసి. పరిచరుడు = భటుడు

పరిజించు సక. = కత్తిపిడితో కొట్టు; వి. పరుజు = కత్తిపిడి.

పరిఢవించు ప్రే. = నడుచు, జరుగు, ప్రవర్తించు, ˈమించు, ఎక్కువగు, అతిక్రమించు; పరిఢవం = అతిశయం, విశేషం.

పరిఢవిల్లు అక. = ప్రవర్తిల్లు, జరుగు, నడుచు; రూ. పరిఢవిలు వి. పరిఢవం = అతిశయం, విశిష్టత.

పరిణమించు అక. = మారు, మారురూపం ధరించు; వి. పరిణామం / పరిణతి = మార్పు, పర్యవసానం, మారురూపం; విణ. పరిణతం = మారిన, మార్పుపొందిన.

పరితపించు అక. = దుఃఖించు, బాధపడు; వి. పరీతాపం / పరితాపం = సంతాపం, దుఃఖం.

పరితోషించు అక. = చాలాసంతోషించు; వి. పరితుష్టి / పరితోసం = ఎక్కువ సంతోషం.

పరిత్యజించు సక. = వదిలిపెట్టు, పూర్తిగా వదులుకొను; వి. పరిత్యాగం / పరిత్యజనం = విడుపు; విణ. పరిత్యక్త = విడిచిన, వదిలిన, పరిత్యాజ్యా = విడువ దగిన.

పరిపాలించు సక. = ఏలు, కాపాడు; వి. పరిపాలన(ం) = ఏలుబడి, రక్షణ, పరిపాలితం = కాపుపొందినది, రక్షితం.

పరిపూరించు సక. = నింపు, నెరవేర్చు, వి. పరిపూరణ / పరిపూర్తి = నింపడం, నెరవేరటం.

పరిపోషించు సక. = చక్కగా పోషించు. వి. పరిపోషణ(ం) = మంచి పోషణ, పరిపోషితుడు = మంచి పోషణ పొందిన వాడు; విణ. పరిపోషిత = బాగా పోషించిన.

పరిభవించు సక. = అవమానించు. వి. పరీభావం / పరిభవం / పరిభావం = అవ మానం.

పరిభ్రమించు అక. = తిరుగు, అంతటా తిరుగు, చుట్టూ తిరుగు; వి. పరిభ్రమణం / పరిభ్రమం = చుట్టూ తిరగటం.

పరిమళించు అక. = సువాసన యిచ్చు; వి. పరిమళం = సువాసన.

పరిమార్జించు సక. = బాగాతుడుచు; వి. పరిమార్జన = తుడవటం, తుడుపు.

పరిమారుచు సక. = చంపు, నరుకు రూ. పరిమార్చు

పరియవాయు అక. = చీలు; వి. పరియ= చీలిక, బద్ద.

పరియాచముసేయు సక. = వెక్కిరించు, మేలాకోళమాడు; వి. పరియాచకం = వెక్కిరింత, మేలాకోళం.

పరియు అక. = చెడు, తప్పు, (పైభాగం) రాలిపోవు.

పరిరంభించు సక. = కౌగిలించు వి. పరిరంభం/ పరీరంభం = కౌగిలింత.

పరిమార్జించు అక. = చంపు, పూర్తిగా విడిచిపెట్టు; వి. పరివర్జనం = పూర్తిగా విడిచిపెట్టడం, చంపటం; విశే. పరివర్జితం = వదిలివేసిన.

పరివర్తించు అక. = తిరుగు, చుట్టివచ్చు; వి. పరివర్తం/ పరివర్తన(ం) = వెనక్కుతిరుగు, చుట్టివచ్చు, వస్తువుల మార్పిడి.

పరివేష్టించు సక. = చుట్టివచ్చు, చుట్టూ ఉండు వి. పరివేష్టనం/ పరివేషం/ పరివేశం = చుట్టిరావటం, గాలిగుడి/ వరదగుడి.

పరివోవు అక. = కొల్లబోవు, నశించు చూ. పరిగొను

పరిశీలించు సక. = శోధించు, వెతుకు, విచారించు; వి. పరిశీలన(ం) = శోధనం, వెతకటం, విచారణ.

పరిశోధించు సక. = బాగావెతుకు/ తెలుసుకొను; వి. పరిశోధన(ం) = చక్కని పరిశీలన, పరిశుద్ధి = మంచిశోధన విశే. పరిశుద్ధ = బాగా శుభ్రమయిన.

పరిశ్రమించు అక. = కష్టపడు, అలిసిపోవు; వి. పరిశ్రమ = అలుపు, కష్టం, అలవాటు, పరిశ్రాంతి = ఎక్కువ ఊరట, విశ్రాంతి. విశే. పరిశ్రాంతం = బాగావిశ్రాంతి పొందిన

పరిషేచించు సక. = (నీళ్లను) చుట్టూచల్లు; వి. పరిషేచనం = నీళ్లు చల్లటం.

పరిష్కరించు సక. = చక్కబెట్టు, బాగుచేయు, సరిదిద్దు, అలంకరించు, సరిపెట్టు; వి. పరిష్కృతి / పరిష్కారం = చక్కబెట్టడం, సరిపెట్టడం, సరిదిద్దటం. విశే. పరిష్కృతం = బాగుపరిచిన, అలంకరించిన.

పరిస్ఫోటించు సక. = చీల్చు, ప్రకాశింప జేయు; వి. పరిస్ఫోటనం = చీల్చటం, ప్రకాశింపజేయటం.

పరిహరించు సక. = తొలగించు, విడుచు, విసర్జించు; వి. పరిహారం/ పరిహృతి = విడుపు, ప్రతి ఫలం, పరిహారి = విడిచేవాడు. విశే. పరిహార్యం = విడువదగిన, పరిహృతం = విడిచిన.

పరిహసించు సక. = వెక్కిరించు; వి. పరీహాసం/ పరిహాసం/ పరిహాసనం = వెక్కిరింత

పరీక్షించు సక. = పరిశీలించు, పరీక్షకుడు = పరిశీలించేవాడు; విశే. పరీక్షితం = పరీక్షించినది.

పరుచు ప్రే. = పడజేయు, (గుడ్డలను) విశాలంగా ఉంచు, పాటుపడేట్లు చేయు.

పరుండు అక. = పడుకొను, శయనించు.

పరుగెత్తు అక. = పరుగులీయు; రూ. పరిగెత్తు/ పరువెత్తు వి. పరుగు/ పరువు = త్వర త్వరగా సాగటం/ నడవటం.

పరుపు ప్రే. = పడజేయు; వి. పరుపు = పడక.

పరువిడు అక. = పరిగెత్తు. రూ. పరుగిడు

పరువుగొను అక. = పరిగెత్తు రూ. పరుగుగొను

పరువువారు అక. = పరిగెత్తు రూ. పరుగువారు

పరువువెట్టు అక. = పరిగెత్తు. రూ. పరుగువెట్టు

పర్యటించు అక. = తిరుగు వి. పర్యటన(ం) = తిరుగుడు.

పర్యవసించు అక. = ముగియు, పూర్తిఅగు; వి. పర్యవసానం = ఫలితం. విశ. పర్యవసితం= ముగిసిన.

పర్యాలోచించు సక. = బాగా ఆలోచించు; వి. పర్యాలోచన(ం) = జాగ్రత్తగా ఆలోచించ టం; విశ. పర్యాలోచితం = బాగా ఆలోచించిన.

పర్యుదాసించు సక. = తోసివేయు; వి. పర్యు దాసం = తోపుడు, పర్యుదస్తం = తోసివేసి నది.

పర్వు అక. = వ్యాపించు; రూ. పరవు వి. పర్వు = పరుగు.

పలకరించు చూ. పలుకరించు

పలవరించు అక. = అసందర్భంగా మాట్లాడు, ప్రలాపించు; రూ. పలవించు / పల్వరించు వి. పలవరింత / పలవరం / పలవరింపు = ప్రలాపం.

పలవించు చూ. పలవరించు.

పలాములుచేయు సక. = పాడుచేయు, దోపిడీ చేయు.

పలుకబారు అక. = తెల్లబడు, వివర్ణమగు; వి. పలుక, పలుకన = తెల్లన.

పలుకరించు అక. ప్రే. మాట్లాడించు = మాట్లాడు, ఓదార్చు. రూ. పలకరించు / పల్కరించు

పలుకు అక. సక. = మాట్లాడు, నిందించు; వి. పలుకు = మాట, నింద, ముక్క, పలుకుజెలి = సరస్వతి, పల్కుబడి / పలుకుబడి = మాట్లాడే తీరు, ఉచ్చారణ, మాటచెల్లటం.

పలుచపడు అక. = పలచనగు, వెలితిపడు, చులకన అగు; వి. పలుచన = వెలితి, తేలికదనం, చులకన.

పలుము అక. = ప్రలాపించు, పలవరించు; వి. పలుము = ప్రలాపం, పలవరింత.

పల్కరించు అక. చూ. పలుకరించు

పల్లగించు సక. చూ. పల్లించు

పల్లటిల్లు అక. = చలించు, తలకిందులగు, తెల్ల బోవు, ఎర్రబారు; రూ. పల్లటిలు వి. పల్లటు / పల్లటం = వ్యత్యాసం, కదలిక.

పల్లటీల్గొను అక. = పల్టీలు కొట్టు.

పల్లటీల్డాటు అక. = పల్టీలుకొట్టు.

పల్లటీల్వైచు అక. = ఎగురు, పల్టీవేయు; వి. పల్లటీ = ఎగురు, గెంతు, పల్టీ.

పల్లవించు అక. = చిగురించు, చిగురెత్తు; వి. పల్లవం = చిగురు; విశ. పల్లవితం = చిగిరించిన.

పల్లించు సక. = జీనువేయు; వి. పల్లం= జీను, మెత్త.

పల్వరించు చూ. పలవరించు

పవడించు అక. రూ. పవ్వడించు / పవళించు / పవ్వళించు = పడుకొను; వి. పవళింత / పవ ళింపు = పడక.

పవళించు చూ. పవడించు

పవ్వడించు చూ. పవడించు

పవ్వళించు చూ. పవడించు

పసగు అక. = తెలియవచ్చు.

పసగరగొను సక. = పీడించు, బాధించు.

పసరించు అక. = వ్యాపించు, ప్రసరించు వి. పసరింపు = వ్యాపనం, వ్యాప్తి.

పసాపడు అక. = తిను, భుజించు.

పసిపట్టు అక. = వాసనపట్టు వి. పసి = గాలి, వాసన

పసుపాడు అక. = పసుపు నీళ్లతో స్నానమాడు.

పస్తాయించు అక.= పశ్చాత్తాపపడు, (ఆలోచనతో) ఆలస్యం చేయు; వి. పస్తాయింపు = ఆలస్యం, పశ్చాత్తాపం.

పాచు ప్రే. = తొలగించు, చిక్కుతీయు. చూ. పాయజేయు

పాటించు సక. = ఆదరించు, మన్నించు, విచారించు, ఎదురుచూచు, ధరించు, పొందు; వి. పాటన = ఆదరణ.

పాటిగొను సక. = సరిచేయు విశే. పాటి = పోలిక, సామ్యం.

పాటిల్లు అక. = కలుగు. రూ. పాటిలు

పాటునబడు అక. = మామూలు/మొదటి స్థితికి వచ్చు. వి. పాటు = తగ్గుదల, శమనం.

పాటుపడు అక. = శ్రమపడు, కష్టపడు; వి. పాటు మానిసి = కష్టజీవి; పాట్లమారి = కష్టపడే

పాడు అక. = గానం చేయు, పాటపలుకు వి. పాట = గానం.

పాడరు అక. చూ. పాడుపడు

పాడువడు అక. = చెడిపోవు, పాతబడు, శూన్యమగు; విశే. పాడు = శూన్యం, చెడిన, పాతగిల్లిన.

పాడువారు అక. = పాడుపడు

పాతగిల్లు అక. రూ. పాతగిలు/ ప్రాతగిల్లు/ ప్రాతగిలు = పాతబడు; వి. ప్రాత/ పాత = గుడ్డ, పాతగుడ్డ; విశే. ప్రాత / పాత = పూర్వపు, చినిగిన, చీకిన.

పాతరలాడు అక. = నర్తించు, నాట్యం చేయు. రూ. పాత్రలాడు

పాతు సక. = పూడ్చు, నాటు; వి. పాతర = (ధాన్యం దాచటానికి) తవ్వినగుంట; నిధి.

పాత్రలాడు చూ. పాతరలాడు

పాదుకొను అక. ప్రే. పాదుకొలుపు/ పాదుకొల్పు = నిలుచు, నెలకొను.

పాదునిలుచు అక. = పాదుకొను, నిలకడగా ఉండు.

పాపటపుచ్చు ప్రే. = దారివిడిచి తొలగించు; వి. పాపట = తలవెంట్రుకల పాయ

పాపటవోవు అక. = దారివిడిచి తొలగిపోవు.

పాపు ప్రే. చూ. పాయజేయు

పాము సక. = రుద్దు, రాజు, పులుము; వి. ప్రాముడు = పులుముడు.

పాయబారు అక. = (అన్నం మొ॥) పాసిపోవు

పాయగిల్లు అక. = తొలగిపోవు; రూ. పాయగిలు వి. పాయ = చీలిక, ముక్క, మునుము.

పాయవడు అక. = చీలు, తొలగు, బయటపడు.

పాయవారు అక. = చీలిపోవు, తొలగిపోవు.

పాయు అక. = తొలగు, చిక్కువడిపోవు, (వంట) పాసిపోవు సక. విడుచు.

పారకాడు అక. = దోగాడు.

పారజాచు సక. = దూరంగా చూచు, చూపునిలిపి చూచు.

పారదోలు సక. = తరిమివేయు.

పారబోయు సక.= కుమ్మరించు; వి. పారబోత = పారబొయ్యటం.

పారవేయు సక. = విసిరి వేయు, పోగొట్టు.

పారాడు అక.= పారిపోవు, పారకాడు. రూ. పారియాడు

పార్వైచు సక.= విసరివేయు.

**పారాణించు** సక. = పారాణితో అలంకరించు వి. **పారాణి** = కుంకుమాదులతో కాళ్లకు చేసే అలంకారం.

**పారు** అక. = పరిగెత్తు, పానం చేయు, ప్రవహించు, ప్రసరించు; వి. **పారుడు** = పానం, పారుదల = ప్రవాహం, ప్రవహించటం.

**పారుకాడు** అక. = పరిగెత్తు, పాకు. రూ. పారకాడు

**పారుతెంచు** అక. = పరిగెత్తివచ్చు రూ. పార్తెంచు

**పాలాడు** సక. = నరుకు, ఖండించు.

**పాలారుచు** సక. = చంపు. రూ. పాలార్చు

**పాలించు** సక. = కాపాడు, రక్షించు; వి. పాలన(ం) = రక్ష(ణ); విశ. **పాలితం** = రక్షణ పొందిన, పాలిని = రక్షించేది.

**పాలు** అక.= తెల్లబడు; వి. పాలు = తెల్లటిరసం.

**పాలుగొను** అక. = పంచుకొను; రూ. పాల్గొను వి. పాలు = భాగం, వంతు.

**పాలుపడు** అక.= సిద్ధపడు, పూను, స్వాధీనముగు; రూ. పాల్పడు వి. పాలు = వశం.

**పాలుపుచ్చు** ప్రే. = విభజించు, నిర్ణయించు; వి. పాలు = భాగం, వంతు.

**పాలుపోవు** అక. = తోచు, భాగాలగు, నిర్ణీతమగు; వి. పాలు = వంతు, భాగం.

**పాలుమాలు** అక. = సోమరిగా ఉండు, బద్ధకించు; రూ. ప్రాలుమాలు/ పాల్మాలు విశ. పాల్మాలిక/ పాలుమాలిక/ ప్రాలు మాలిక = సోమరితనం.

**పాలువెట్టు** సక. = భాగమిచ్చు, భాగించు, నిర్ణయించు; వి.పాలు = వంతు, భాగం.

**పాల్కొను** చూ. పాలుగొను

**పాల్పడు** చూ. పాలుపడు

**పాల్మాలు** చూ. పాలుమాలు

**పాళెందిగు** అక. ప్రే. పాళెందించు = దండు విడియు, సేనలు దించు. వి. పాళియం/ పాళెం = కావలి, సేన, సేనలుదిగే చోటు, సరిహద్దులోని కోట/గడి. **పాళెగాడు** = సామంతుడు, సరిహద్దు కావలి సేనాపతి, పాళెముపట్టు = సామంతుడి రాజ్యం.

**పిక్కటిల్లు** = నిండు, వ్యాపించు, పిగులు, పెరుగు. రూ. పిక్కటిలు

**పిక్కు** అక. సక. = వెనుదీయు, మోసగించు; వి. పిక్కు = మోసం, మర్మం.

**పిగులు** అక. = (గుడ్డలు మొ॥) చినుగు.

**పింగటించు** అక. = బడాయిగా మాట్లాడు. రూ. పింగళించు

**పిచ్చిల్లు** అక. = పైకి ఉబుకు. రూ. పిచ్చిలు/ చిప్పిలు/ చిప్పిల్లు

**పిచ్చలించు** అక. = పెరుగు, అతిశయించు, భయపడు, సక. పొగడు.

**పింజించు** సక. = నీళ్లు చిలకరించు/ విరజిమ్ము, పింజెపోయు; వి. పింజె = కొంగు, కుచ్చె.

**పిడికిలించు** సక. = పిడికిటపట్టు; వి. పిడి/ పిడికిలి = వేళ్లు ముడిచిన అరచేయి.

**పిడిగొట్టు** సక. = (ఎడ్లకు) వట్టలుకొట్టు.

**పిడుచు** సక. = (రసం) పిండు; వి. పిడుచ = ముద్ద, **పిడుచపాత** = అలుగుడ్డ.

**పిండు** సక. = పాలుపితుకు, నీళ్లుపిడుచు.

**పితుకు** సక. = (పాలు) పిండు. రూ. పిదుకు

**పిత్తు** అక.= అపానవాయువు విడుచు; వి. **పిత్తు** = అపానవాయువు.

పిదుకు రూ. చూ. పితుకు
పింపిసలాడు అక. = నోటితో ధ్వనిచేస్తూ నాట్యం చేయు; వి. పింపిసలు = పింపిళ్లు.
పింపిళ్లాడు అక. = నోటితో ఊదుతూ ఆడు; వి. పింపిళ్లు = ఊదాట
పింపిళ్లు గూయు అక. = నర్తించు, ఆడు; వి. పింపిళ్లు = ఊదాట.
పిరిగొను అక. = పెనగొను, సక. మెలికపడు, మెలిపెట్టు; వి. పిరి = పెంటి, మెలి(క).
పిరుతివియు అక. = వెనుదీయు; వి. పిరుదు = వెనుక.
పిరుతివుచు అక. = వెనుదీయు.
పిరుదీయు అక. = వెనుదీయు; వి. పిరుదు = వెనుక
పిరుదుకొను సక. = వెంబడించు; వి. పిరుదు= వెనుక.
పిరువడు అక.= వెనుదీయు, భయపడు; వి. పిరుదు = వెనక.
పిరువీకులాడు అక. = పెనుగులాడు; పిరువీకు/ పిర్వీకు = పీకులాట, బాధ.
పిరివీకుసేయు సక. = పీకులాడు, బాధించు; వి. పిర్వీకు/ పిరువీకు = పీకులాట, బాధ.
పిరువెట్టు సక. = అనాదరించు, నిర్లక్ష్యంచేయు.
పిరువోవు అక. = వెనుదీయు; వి. పిరుదు = వెనక.
పిరుసను అక. = వెనుదీయు, వెనక్కుపోవు; వి. పిరుదు = వెనక.
పిలుకుమారు అక. = చచ్చు, నాశనముగు; రూ. పిలుకుమాలు / పిల్కుమాలు / పిల్కుమారు వి. పిలుకు = గర్వం.
పిలుకుమార్చు ప్రే. = చంపు, నాశనం చేయు.
పిలుచు సక. = ఆహ్వానించు; రూ. పిల్చు వి. పిలుపు/ పిలుపుడు = ఆహ్వానం.
పిసాళించు అక. = మెరయు, వ్యాపించు, వెలుగు, దొంగ ఎత్తులు వేయు, వెక్కిరించు, వేళాకోళ మాడు; వి. పిసాళం = వికాసం, వెలుగు, ఎగతాళి, వ్యాప్తి, దొంగ ఎత్తు; విశే. పిసాళి = మెరిసే, వ్యాపించే, దొంగ ఎత్తులువేసే.
పిసుకు సక. = చేత్తోమర్దించు/ ఒత్తు; వి. పిసుకుడు/ పిసుకులాట = పిసకటం.
పీకు సక. = పెరకు, లాగు, తీసివేయు.
పీకులాడు అక. = పెనగులాడు; వి. పీకులాట = పెనగటం, పెనుగులాట.
పీకువీకాడు సక. = తెగపెనుగులాడు.
పీకెవారు సక. = చప్పబడు, చిక్కిపోవు; వి. పీకె= పలచనిముక్క, ఆకు ముక్క.
పీటవెట్టు సక. = కదలకుండా ఉన్నచోటనే ఉండు; వి. పీట = గద్దె, ఆసనం, పీఠం.
పీడించు సక. = బాధపెట్టు; వి. పీడ = బాధ, పీడనం = రాపిడి; విశే. పీడితం = బాధకు గురైన. పీడ్యమానం = బాధలోనున్న.
పీరు అక. = జారు, బలహీనపడు; రూ. పీలు/ పీగులు వి. పీలిక = పీలిక, ముక్క, పీరు = పాలధార, గుమ్మ విశే. పీల = బక్కచిక్కిన.
పీరుచు సక. = జారు. రూ. పీర్చు/ పీలుచు/ పీల్చు చూ. పీరు
పీలుచు సక. = లోపలికి లాక్కొను, జారు. రూ. పీల్చు/ పిర్చు చూ. పీరు
పుకిలించు సక. రూ. పుక్కిలించు

**పుక్కిలించు** అక. రూ. పుకిలించు = (నీళ్లు) పుక్కిటబట్టు, వి. **పుకిలింత/పుక్కిలింత** = పుక్కిటిలో ఉంచటం, పుకిలి/పుక్కిలి = బుగ్గ లోపలి భాగం.

**పుచ్చు** అక. = పుప్పిపట్టు, పురుగులుబడు, సక. గ్రహించు, పీకు.

**పుచ్చుకొను** సక. = తీసికొను, గ్రహించు, స్వీకరించు; వి. పుచ్చుకోలు = తీసుకోవటం, స్వీకరించటం.

**పుంజికొను** అక. రూ. పుంజుకొను = బలపడు, గట్టిపడు, గుబురుగట్టు; వి. పుంజం = పోగు, గుట్ట, రాశి, పుంజి = సమృద్ధి; విశే. పుంజి = సమృద్ధం.

**పుంజీభవించు** అక. = గుట్టపడు, రాశిపడు, ఒక చోట చేరు. చూ. పుంజికొను

**పుంజుకొను** అక. చూ. పుంజికొను

**పుటపుటనగు** అక. = పెరుగు; విశే. పుటపుటన = ఎక్కువ.

**పుటముబ్బు** అక.=పైకి ఉబ్బు/ పెరుగు; వి. పుటం =దొప్ప, బుట్ట.

**పుటమెగయు** అక. = పైకితేలు, దాటు; వి. పుటం = గుర్రపునడక, బుట్ట, దొప్ప.

**పుట్టు** అక. = జన్మించు, మొలకెత్తు; వి. పుట్టు/పుట్టుగు/పుట్టుక/పుట్టువు = జన్మ.

**పుడికిరించు** సక. = కొద్దిగా ఇచ్చు, వేళ్లతో తీసుకొను; వి. **పుడికిరింత/పుణికిరింత** = కొద్దిగా ఇవ్వటం, కొంచెమివ్వటం. రూ. పుణికిరించు చూ. పుడుకు

**పుడిసిలించు** సక. = పుడిసిటపట్టు; వి. పుడిసిలి = మూసిన చేరలో సగం, పుడిసిలింత = అరచేతి గుంటలో ఉంచటం.

**పుడుకు** సక. = కొంచెంగా ఇచ్చు, ఇచ్చు, అయిదు వేళ్లతో తీసుకొను; రూ. పుణుకు వి. పుడుకం గల్లు = చింతామణి, పుడుకుపు పొడుపు = కామధేనువు, పుడుకుపమాను = కల్పవృక్షం.

**పుణికిరించు** చూ. పుడికిరించు.

**పుణుకు** చూ. పుడుకు

**పుండలించు** అక. = లేనిపోనివి కల్పించు.

**పుతపుతపోవు** అక. = వివశమగు, చెలంబారు, కలకబారు; వి. **పుతపుత** = కలత, కదలిక.

**పుత్తెంచు** ప్రే. చూ. పుచ్చు = పంపు.

**పుప్పించు** ప్రే. = పంపు చూ. పుచ్చు

**పుయిలోడు** అక. = వెనుదీయు, సంకోచించు; వి. పుయిలోటు(ం) = సంకోచం.

**పురడించు** అక. = పెరుగు, విజృంభించు; రూ. పురుడించు/పురణించు/పురుణించు; విశే. పురుడి = సమానమైన.

**పురణించు** చూ. పురడించు.

**పురపురలాడు** అక.= చాలా ఆశించు, వెంపరలాడు, అపేక్షించు; వి. పురపుర= అత్యాశ, కోరిక.

**పురమాయించు** సక. = ఆజ్ఞాపించు, ఒప్పచెప్పు, నియమించు; వి. ఫర్మానా= ఆదేశం.

**పురస్కరించు** సక. = ముందుంచు, పూజించు; వి. పురస్క్రియ/పురస్కారం/పురస్కృతి = గౌరవం, పూజ, సన్మానం; విశే. పురస్కార్యం = గౌరవించదగిన, పూజనీయ, పురస్కృతం = ముందుంచిన, పూజించిన, గౌరవించిన.

**పురణించు** అక.= పెరుగు, వర్ధిల్లు, విజృంభించు; వి. పురాణం = పాతకథ. విశే. పురాణం = ప్రాచీనమైన, పాతకాలపు.

**పురాయించు** అక. = పెరుగు, వర్ధిల్లు.

**పురికొను** అక. ప్రే. పురికొలుపు/పురికొల్పు = కమ్ముకొను, ఎదుర్కొను, ఆక్రమించు.

**పురికొలుపు** ప్రే. = ప్రోత్సాహ పెట్టు, రెచ్చగొట్టు. చూ. పురికొను

**పురివిచ్చు** అక. = వేరుపడు, పీలిపోవు; వి. పురి = మెలి(క).

**పురిలోము** అక.= పౌరుషం చూపు

**పులకరించు** అక.= గగుర్పొడుచు; రూ. పుల్కరించు వి. పులకలు = గగుర్పాటు, పులకరింత/పులకరం/పులకరింపు = గగుర్పాటు, జ్వరం.

**పులకించు** అక. = గగుర్పడు; వి. **పులకింత** = గగుర్పాటు.

**పులపొడుచు** అక. = రెప్పలార్పకుండా చూచు. రూ. పుల్పొడుచు

**పులిమిపుచ్చు** సక. = (విషయాన్ని) తేలికగా పోనిచ్చు.

**పులియబారు** సక. = పులిసిపోవు చూ. పులియు

**పులియు** అక.= పులిసిపోవు, పుల్లబడు; వి. పులుప = పుల్లని ఊరుబిండి. విశే. పులుపు/పులుసు = పుల్లదనం, పుల్లన, పుల్ల/పుల్లని = పులు పెక్కిన, పులిసిన.

**పులుము** సక. = రుద్దు, నలువు, కొట్టు, పూయు; వి. **పులుము** = కుష్ఠురోగం, **పులుముడు** = రుద్దుడు, పూత.

**పుల్లగిల్లు** అక. = భయపడు; రూ. పుల్లగిలు వి. పుల్ల = పుడక, కట్టె, సమిధ.

**పుల్లవడు** అక. = స్తంభించు, మాన్పడు, కట్టెవారు; వి. పుల్ల = పుడక, కట్టె, సమిధ.

**పుల్లసిల్లు** అక. = తెల్లబడు, రంగుమారు, కలతబడు, కలవరపడు. రూ. పుల్లసిలు

**పుష్పించు** అక. = పూచు, వికసించు; వి. పుష్పం = పువ్వు; విశే. **పుష్పితం** = పూచినది.

**పుసలాయించు** సక.= బుజ్జగించు; వి. పుసలాయింపు = బుజ్జగింపు.

**పూచు** అక. = పూను, ప్రయత్నించు, ఉద్యమించు, పుష్పించు, నిస్సారుము; చూ. పూను వి. పూ(వు)/పువ్వు = పుష్పం, **పూత** = పూచటం, పువ్వు తొడగటం.

**పూజించు** సక. = పూజచేయు, గౌరవించు; వి. **పూజ** = అర్చన, పూజారి, **పూజకుడు** = అర్చకుడు, పూజనం=అర్చించటం, పూజనీయుడు/**పూజితవ్యుడు** = గౌరవించదగిన వాడు, **పూజితుడు** = గౌరవం పొందినవాడు, అర్చితుడు, **పూజ్యుడు** = గౌరవించదగినవాడు.

**పూజెసేయు** సక. = అలంకరించు, బొమ్మలు వేయు. వి. పూజె = బొమ్మ, అలంకారం, పూజె కుండలు, పూజెగులు = అయిరేనికుండలు

**పూంచు** ప్రే. = కట్టు. రూ. పూనుచు

**పూటపడు** అక. = మరొకరి బాధ్యతను నెత్తిన వేసుకొను; వి. పూటకాపు/పూట = ఇతరుల పనికి బాధ్యుడైన వ్యక్తి, **పూటవాటు** = బాధ్యుడు కావటం. విశే. పూట = బాధ్యుడైన

**పూటపెట్టు** సక. = మరొకరిని తనకు బదులుగా బాధ్యుని చేయు/ ఇరికించు. చూ. పూటపడు

**పూడు** అక. = మట్టితోనిండు, పూడిపోవు; వి. పూడు/**పూడిక** = అడుగున నిండిన మట్టి/మన్ను, పూడుపు/పూడ్పు = పూడ్చటం, నిక్షేపం.

**పూడుచు** సక. = మట్టితోనింపు. రూ. పూడ్చు చూ. పూడు

**పూదెగట్టు** అక. = బంగారపు పూసగా ఏర్పడు; వి. పూదె/పుదియ = బంగారు పూస.

**పూను** అక. = మొదలుపెట్టు, ఉద్యమించు, పట్టు పట్టు సక. ధరించు, వహించు, వి. పూని/పూనిక/పూనిక = పట్టుదల.

**పూనుచు** సక. = (బండికి) కట్టు, పూసజేయు. రూ. పూన్చు/పూంచు చూ. పూను

**పూయు** సక. = మెత్తు, అద్దు, రాయు; వి. పూత = గచ్చు, మెత్తు.

**పూరగించు** సక. = నెరవేర్చు, నడుపు

**పూరించు** సక.= నింపు; వి. పూరణం = నింపటం; విశే. పూరకం = నింపేది, పూర్తి చేసేది, పూర్ణ = నిండిన, పూరిత = నింపిన. చూ. పూరగించు

**పూర్ణీభవించు** అక. = నిండు. చూ. పూరించు

**పూవుగట్టు** అక.= పూలుపూయు.

**పృచ్ఛించు** సక. = ప్రశ్నించు, అడుగు; వి. పృచ్ఛ = ప్రశ్న, అడగటం.

**పెకలు** అక. ప్రే. పెకలించు = పెళ్ళగిల్లు; ప్రయాణమగు. రూ. పెగలు

**పెకలుచు** సక. రూ. పెకల్చు, పెగలుచు = పెళ్ళగించు.

**పెంచు** ప్రే. = అభివృద్ధి చేయు, పెరగజేయు; రూ. పెనుచు వి. పెంపు/పెనుపు/పెంపుదల = అభివృద్ధి, అతిశయం. విశే. పెంపుడు = పెంచిన. చూ. పెరుగు

**పెంచుకొను** సక. = దత్తుతీసుకొను.

**పెటపెటమను** అక. = కొరుకు, చరుచు, మోగు, పేలు; వి. పెటపెట = చప్పుడు.

**పెటపెటలాడు** అక. చూ. పిటపిటలాడు = (రొమ్ములు) కదలాడు బిగువుగా నుండు.

**పెటిలు** అక. = పెళ్లపోవు, మోతతో పేలిపోవు. చూ. పెటులు/పెట్లు

**పెటులు** అక.= పేలు, పేలిపోవు. చూ. పెటిలు/పెట్లు

**పెట్టు** అక. = కలుగు, సక. ఉంచు, (పక్షులు) కను, ధరించు, ఇచ్చు, మోపు, నాటు, కొట్టు; వి. పెట్టు = దెబ్బ, పెట్టుడు = త్యాగం, దానం, పెట్టుబడి = మొదలుపెట్టిన సొమ్ము.

**పెట్టుకొను** సక. = ఉంచుకొను; వి. పెట్టుకోలు = ఉంచుకోవటం, పెట్టుకోవటం.

**పెట్టువడు** అక. = దెబ్బలుతిను; వి. పెట్టు = దెబ్బ, వేటు.

**పెట్టెవెట్టు** అక. = చుట్టచుట్టుకొను.

**పెట్లు** అక. = పేలు, పేలిపోవు. రూ. పెటిలు/పెటులు

**పెడబాయు** సక. = వదిలిపోవు, వదిలిపెట్టు. రూ. ఎడబాయు

**పెడమరలు** అక. = వెనుదిరుగు; రూ. పెడమర్లు/పెడమరు వి. పెడమరలు/పెడమర్లు = వెనకకు తిరగటం.

**పెడమోమువడు** అక. = ముఖం తిప్పుకొను; వి. పెడం/పెడమోము = పెడమొహం.

**పెడరేచు** ప్రే. = పురికొల్పు.

**పెండిలియగు** సక.= పెళ్లాడు, పెళ్లిచేసుకొను రూ. పెండ్లియగు ; వి. పెండ్లం/పెండ్లాం/పెళ్ళాం = భార్య, పెండిలి, పెండ్లి. పెళ్ళి = వివాహం.

**పెండిలియాడు** సక. = వివాహమగు. రూ. పెండ్లాడు/పెళ్ళియాడు

**పెండిలిసేయు** సక. పెళ్ళిచేయు (ప్రే. = పెళ్ళాడు, వివాహమగు, పెళ్ళిచేయు, బాధించు. రూ. పెండ్లిసేయు

**పెండ్లాడు** అక. = వివాహమగు, పెండ్లిచేసుకొను. రూ. పెళ్ళాడు

**పెద్దనిదురపోవు** అక.= చచ్చు; రూ. పెద్దనిద్దురపోవు/పెద్దనిద్రపోవు వి. పెద్దనిద్ర = చావు.

**పెనగబడు** అక. = పెనవేసుకొనిపోవు; వి. పెన = మెలి(క), కట్టు.

**పెనగాడు** అక. = మెలితిరుగు, చుట్టుకొను, కలియు, యుద్ధం చేయు, మారు మాట్లాడు; వి. పెన = మెలి(క), కట్టు. పెనకువ = పెనగులాట, చుట్టుకొనడం, యుద్ధం, తగాదా, కలయిక.

**పెనగులాడు** అక. = పోరాడు, కలియబడు; వి. పెనగులాట = పోరు, కలియబడటం.

**పెనగొను** అక. = మెలిదిరుగు, కలియబడు, చేరు.

**పెనచు** సక. = పెనవేయు, మెలిదిప్పు.

**పెనయు** అక. = పెనగులాడు, కలియబడు.

**పెనవెట్టు** సక. = మెలిదిప్పు.

**పెనవేయు** సక. = మెలిదిప్పు, (గొలుసు) కలిపి కట్టు; వి. పెనవేత = కలిపి కట్టడం.

**పెనుచు** (ప్రే. రూ. = వర్ధిల్లజేయు.

**పెనుపడు** అక. = అతిశయిల్లు, పెరుగు, పెంపొందు.

**పెనుపారు** అక. రూ. పెంపారు; వి. పెనుపు/పెంపు = అభివృద్ధి, పెంచటం, గొప్పదనం, పెను పరి = వృద్ధికితేచ్చేవాడు.

**పెంపగు** అక. = పెరుగు, వర్ధిల్లు; వి. పెంపు = సమృద్ధి, అతిశయం, గౌరవం, గొప్పతనం.

**పెంపారు** అక. = గొప్పయగు, వర్ధిల్లు. రూ. పెనుపారు

**పెంపు మీరు** అక. = అతిశయించు.

**పెరుకు** సక. = పీకు, పెల్లగించు, మోయు. రూ. పెర్కు

**పెరుగు** అక. = ఎదుగు, వర్ధిల్లు, తెగు, పూను, మొదలిడు, విజృంభించు, ఉద్యమించు. రూ. పెర్గు/పెరువు/పెర్వు

**పెరువు** అక. రూ. పెర్వు, పెరుగు చూ.

**పెర్కు** చూ. పెరుకు

**పెర్గు** చూ. పెరుగు

**పెర్వు** చూ. పెరువు

**పెలుకురు** అక. = (భయాదుల వల్ల) విలవిలలాడు. రూ. పెల్కురు

**పెల్లగించు** (ప్రే. = పాదుకదిలి పైకిలేచు, ఊడిపడు, పారిపోవు. రూ. పెళ్ళగిలు/పెళ్ళగిల్లు/పెల్లగిలు

**పెల్లుకొను** అక. = పెరుగు, ఎక్కువగు, అతిశయిల్లు; వి. పెల్లు = అతిశయం; విశే. పెల్లు = ఎక్కువ.

**పెళ పెళయను** అక. = చప్పుడుతో విరుగు, మోగు; రూ. పెళపెళమను వి. పెళపెళ = మోత.

**పెళ్ళగించు** చూ. పెల్లగించు

**పెళ్ళగిలు** రూ. పెళ్ళగిల్లు/పెల్లగిలు/పెల్లగిల్లు

**పేకాడు** సక. = అదరగొట్టు.

**పేడు** సక. = దారం పేను/ పెనవేయు.

**పేటునబెట్టు** అక. = యత్నించు.

**పేటాడు** అక. = భేదించు, చీల్చు.

**పేదవడు** అక. = దరిద్రంలో మునుగు, దీనమగు, దుర్బలమగు; వి. పేదరికం/పేదరికి/పేదరిమి = దారిద్ర్యం, పేదతనం.

**పేను** సక. = (దారం) మెలివేయు, మెలిదిప్పు, పురిబెట్టు.

**పేరు** అక. = గట్టిపడు, గడ్డకట్టు, పెరుగు; వి. పేరు = నామధేయం, కీర్తి, దండ, **పేరుడు** = గడ్డకట్టడం; విశే. **పేరు** = పెద్ద, ఎక్కువయిన.

**పేరుకొను** సక. = పేరుబెట్టి పిలుచు, పిలుచు, పలుకు, చెప్పు, పొగడు; రూ. పేర్కొను వి. **పేరుకోలు** = పేర్కొనటం.

**పేరుగుచ్చు** సక. = పేరెత్తి పిలుచు, చెప్పు.

**పేరుచు** అక. = అతిశయించు, విజృంభించు, సక. ఒకదానిపై మరొకటి ఉంచు/ అమర్చు; రూ. పేర్చు వి. పేరుపు/పేర్పు = ఒకదానిపై మరొకటి అమర్చటం. విశే. పేర్కోలు/ పేరుకోలు

**పేర్కొను** సక. = పేర్కొనటం. రూ. పేరుకొను

**పేలు** అక. = పేలిపోవు, వాగు. రూ. ప్రేలు

**పేలుచు** ప్రే. = పేలునట్లు చేయు, వాగించు. రూ. పేల్చు/ ప్రేలుచు/ ప్రేల్చు

దుర్కొను, కలియబడు, మించిపోవు, యత్నించు, కలుగు; రూ. పయికొను వి. పయి/పై = మీదు, పైభాగం/ పయట/ పైట = పైగుడ్డ.

**పైపడు** అక. = మీదపడు, కలియబడు, మీరు; రూ. పయిపడు వి. పైపాటు = కలియటం, తాకు, సోకు.

**పొకారు** అక. = నాశనమగు. రూ. పోకారు

**పొకారుచు** ప్రే. = నాశం చేయు. రూ. పొకార్చు/ పోకారుచు/ పోకార్చు

**పొకాలు** అక. = పోవు, ఇల్లువదలు రూ. **పోకాలు**

**పొక్కు** అక. = దుఃఖించు, బొబ్బలులేచు, ఒలికిపడు; వి. పొక్కు = దుఃఖం, బొబ్బ, ఎండిన పెళ్ల, **పొక్కుడు** = బెడ్డ.

**పొగచు** ప్రే. = పొగవచ్చునట్లు చేయు, సాతాళించు; వి. పొగ = ధూపం.

**పొగచూరు** అవి. = పొగపట్టు, పొగవల్ల రంగు మారు, నల్లబడు.

**పొగడు** సక. = మెచ్చు, స్తుతించు; వి. **పొగడిక/ పొగడ్త/ పొగడిత** = స్తుతి, మెప్పు, **పొగడికోలు** = పొగుడు కొనటం.

**పొగడ్తవడు** అక. = పొగడిక పొందు, స్తుతులందు.

**పొగపు** ప్రే. = సాతాళించు, వేయించు.

**పొగయు** అక. = పొగకలదగు, కుములు, పొగలు గక్కు.

**పొగులు** అక. = విచారపడు, కుమిలిపోవు.

**పొంకపడు** అక. ప్రే. పొంకపరచు = పొందికగా ఉండు; వి. పొంకం = పొందిక.

**పొంకించు** సక. = పొంకపరచు. చూ. పొంకపడు

**పొంగలించు** అక. = నిక్కు.

**పొంగారు** అక. = ఉబుకు, పెరుగు, విజృంభించు, నిక్కు, నిగుడు; వి. పొంగు = గర్వం, సంతోషం, పెరుగుదల.

**పొంగు** అక. = పెరుగు, సంతోషించు, గర్వించు; వి. పొంగు = పెరుగుదల, గర్వం, సంతోషం.

**పొంచు** అక. = చాటున ఉండికనిపెట్టి ఉండు, పొంచి ఉండు, వి. పొంచిక = చాటున ఉండి కనిపెట్టడం.

**పొంజు** సక. = (నార) చిక్కుతీయు. రూ. పోజు/ ప్రోజు

**పొటకరించు** అక. = అతిశయించు, వర్ధిల్లు, ఎన్ను వేయు; వి. పొటకర, పొట్టికర =(పరి) ఎన్ను.

**పొటమరించు** అక. = పుట్టు, మొలకెత్తు; రూ. పొటమరిల్లు/ పొటమరిలు వి. పొట = దొప్ప.

**పొటము** అక. =పుట్టు, మొలకెత్తు. చూ. పొడము

**పొట్టపోసికొను** అక. = ఏదోవిధంగా బతుకు/ కడుపు నింపుకొను.

**పొట్టుపొరలగు** అక. = బాధితమగు; వి. పొట్టు = ఊక, తోలు.

**పొడకట్టు** అక. = కనబడు, కనిపించు, ప్రత్యక్షమగు వి. పొడ = రూపు, రూపం, ఆకారం, చూపు (చర్మం మీది) మచ్చ.

**పొడగను** సక. ప్రే. పొడగనిపించు= చూచు; వి. పొడ = చూపు, రూపు, మచ్చ.

**పొడగాంచు** సక. = చూచు; వి. పొడగాన్పు/ పొడగానుపు = దర్శనం.

**పొడగాంచు** సక.= చూచు; వి. పొడగాన్పు/ పొడచూచు సక. = చూచు, గుర్తుపట్టు.

**పొడచూపు** అక.=కనబడు, కనిపించు, ప్రత్యక్షమగు.

**పొడతెంచు** అక. = పుట్టు, ఉదయించు.

**పొడము** అక.= పుట్టు.

**పొడవడగు** అక. = చెడిపోవు, చచ్చు.

**పొడవడచు** అక. = చెరుచు, చంపు.

**పొడవడు** అక. = కనపడు, కనిపించు.

**పొడవు సూపు** అక. = కనపడు, ప్రత్యక్షమగు

**పొడిగొట్టు** సక. = పొడిపొడి చేయు, (చేలోని) వెట్టుకొట్టు; వి. పొడి = చూర్ణం, పొడుము = చూర్ణం; విణ. పొడి = ఎండిన, తడిలేని.

**పొడిసేయు** సక.=చూర్ణం చేయు.

**పొడుగు** అక.= ఉన్నతమగు, పెరుగు; రూ. పొడవు వి. పొడుగు =ఎత్తయిన, మేలయిన

**పొడుచు** అక. = పోట్లాడు, పుట్టు సక. పిడికిలితో గుద్దు/ కుమ్ము, కుట్టు, (ఒట్టు) పెట్టు; వి. పొడుపు = పుట్టడం, ఉదయం, పోటు.

**పొత్తుసేయు** అక. = స్నేహం చేయు; వి. పొత్తు = స్నేహం, మైత్రి.

**పొదలాడు** అక.=పెరుగు; రూ. పొదలియాడు చూ. పొదలు.

**పొదలు** అక.=పెరుగు, వర్ధిల్లు; వి. పొదలిక = పెంపు, పెరుగుదల.

**పొదలుకొను** అక. = పెరుగు, బలియు. చూ. పొదలు

**పొదవెట్టు** సక. = సూచించు, ఆరోపించు.

**పొదుగు** సక. = కమ్ము, వ్యాపించు, చెక్కు, కప్పు; వి. పొది = పొదుగు, పెట్టె, తోలుసంచి, అడపం, పొదుగు = (జంతువుల) స్తనం, పొదుక = పొది, భారం, పొదుగుడు = కప్పు(డు)

**పొదురు** అక. ప్రే. పొదించు = పూచు.

**పొదువు** అక. = కవియు, సక. కమ్ము, చెక్కు, కప్పు; వి. పొదువు/పొదుగు = కప్పు(డు).

**పొనరారు** అక. = ఒప్పు, తగు. రూ. ఒనరారు చూ. పొనరు

**పొనరు** అక. = అగు, పొసగు; రూ. ఒనరు వి. పొనరు/ ఒనరు = పొందిక, ఇంపు.

పొనరుచు ప్రే. = కావించు, చేయు, పొసగించు. రూ. పొనర్చు/ ఒనర్చు/ ఒనరుచు చూ. పొనరు

పొనరువడు అక. = పొందుపడు, వీలగు.

పొనలు అక. = ధనధగమండు.

పొనుగువడు అక. ప్రే. పొనుగుపరచు = వెలవెల పోవు, నిస్తేజమగు, నశించు, శూన్యమగు; రూ. పొనుపడు విశే. పొనుగు = నిస్తేజమైన, వెలవెల బోయే, పొట్టి.

పొనుపడు అక. = వెలవెలపోవు, వ్యర్థమగు, ఉడుగు. రూ. పొన్పడు/ పొనుగుపడు చూ.

పొందు అక. = (కన్ను) వాలు, సక. ప్రాప్తించు, కలియు; వి. పొందిక = పొంకం, చేరిక, కలయిక. విశే. పొందు = స్నేహితుడు.

పొరడువోవు అక. = గూనిఅగు, గూనుపడు; వి. పొరడు = గూను.

పొరపడు అక. = పొరపాటుపడు ; వి. పొర= కుబుసం, స్తరం, మడత, తప్పు, పొరపు = భేదం; విశే. పొరపు = భిన్నం.

పొరపోవు అక. = (నీళ్ళు, అన్నం)వేరేదారిలోనికి పోవు. రూ. కొరబోవు

పొరయు అక. కలుగు, పొంచుండు, సక. పొందు చూ.

పొరలబడు అక. =తలకిందులగు, దొర్లు.

పొరలాడు అక.= దొర్లాడు;వి. పొరలిక/ పొరలాట/ పొర్లాట = దొర్లటం.

పొరలు అక. = దొర్లు, ప్రవర్తిల్లు; రూ. పొర్లు వి. పొరలు/ పొరలిక = దొర్లటం.

పొరలుచు ప్రే.=పొర్లించు, దొర్లించు, రూ. పొరల్చు

పొరిగొను సక. = చంపు; విశే. పొరి/ పొలి (అవ్య.) =అత్యంతం, ప్రథంగా, మాటిమాటికి.

పొరివమారుచు ప్రే. రూ. పొరివమార్చు/ పొరి మాలుచు = చంపు.

పొరిమాలు అక. = చచ్చు.

పొరిమాలుచు ప్రే. = చంపు. రూ. పొరిమాల్చు

పొరివుచ్చు ప్రే. = కలతపెట్టు.

పొరివోవు అక. = చచ్చు, కలతపడు.

పొర్లాడు అక. చూ. పొరలాడు

పొర్లు అక. = (జంతువులు) సంభోగించు; చూ. పొరలు వి. పొర్లిక/ పొరలిక = దొర్లటం.

పొలమారు అక. = పొరపాటుపడు, ప్రమాదపడు; వి. పొలకువ = జాడ, పోబడి, పొలపరి = జాడ తెలిసిన వ్యక్తి.

పొలమార్చు ప్రే. = ప్రమాదపెట్టు, పొరపాటుపడ జేయు.

పొలయు అక.= తిరుగు, వ్యాపించు, సమీపించు, ప్రవేశించు; వి. పొలయిక = సంచారం, వ్యాపనం, తిరుగుడు.

పొలసాడు అక. = తిరుగు, సంచరించు. చూ. పొలయు

పొలియు అక. = చెడు, చచ్చు; వి. పొలి=బలి, పొలియిక = చావు, నాశనం.

పొలివుచ్చు ప్రే. = చచ్చు, చెడు, వ్యర్థమగు, భంగపడు, ఉడుగు. చూ. పొలియు

పొలుచు అక. = ప్రత్యక్షమగు, కనిపించు, స్థిరమగు; వి. పొలుపు = ఒప్పు, విధం, స్థిరత్వం; విశే. పొలుపు = స్థిరమైన. రూ. పొడుచు చూ.

**పొలుపారు** అక. = ఒప్పారు, రూ. పొల్పారు

**పొలువడు** అక. =తరిగిపోవు, క్షీణించు; వి. పొల్ల / పొల్లు = నిరర్థకమైన మాట, గింజపట్టని ధాన్యం. విశే. పొల్ల/ పొల్లు = వ్యర్థమైన. రూ. పొల్లువడు

**పొల్లపుచ్చు** ప్రే. = వృథాచేయు, వ్యర్థంచేయు.

**పొల్లపోవు** అక.=వ్యర్థమగు, పొల్లపడు. చూ. పొల్లవడు

**పొల్లువడు** అక. = క్షీణించు, వ్యర్థమగు; రూ. పొలువడు వి. పొల్లు/ పొల్ల = గింజపట్టని ధాన్యం, వ్యర్థపదం, పొల్లుదనం = పౌరుషహీనత; విశే. పొల్లు/ పొల్ల = వ్యర్థమైన.

**పొవడు** సక. చూ. పొగడు

**పొవయు** అక. చూ. పొగయు

**పొవులు** అక. చూ. పొగులు

**పొసగు** అక. = అనుకూలించు, చక్కబడు, తగు, ఒప్పు, వీలుపడు; వి. పొసగుడు = అనుకూలత, ప్రాప్తి.

**పోకడపెట్టు** సక. = పోగొట్టు, అమ్ము; వి. పోక = నడత, ప్రవర్తనం, గమనం, మోసం, పోకు =ప్రవర్తన, పోకడ = పోవటం, గతిగమనం, నడత, నాశనం, పోకలాడి = మోసగత్తె, పోకలాడు = మోసగాడు.

**పోకాడు** అక. = పోవు, నశించు; వి. పోక = పోవటం, గమనం.

**పోకారుచు** ప్రే. = పోగొట్టు(కొను) రూ. పోకార్చు

**పోకాలు** అక. చూ. పొకాలు

**పోగుపోయు** సక. = పోగుపోసి కుట్టు; వి. పోగు = దాడు, తీగ, పోగుపోత = పోగు పోయటం.

**పోగువారు** సక. = ఆవరించుకొను, పోగులు పారించు. చూ. పోగుపోయు

**పోగొట్టు** సక. = పోవునట్లు చేయు.

**పోజు** సక. = నారలోని నలుసులు పోగొట్టు, చిక్కుదీయు. రూ. ప్రోజు

**పోటులాడు** అక.= పోరాడు, యుద్ధంచేయు; రూ. పోట్లాడు వి. పోటరి = వీరుడు, పోటి = స్పర్థ, పోటిగాడు = పోటీపడేవాడు, పోటు = పొడుపు, యుద్ధం, శౌర్యం, పోటుకాడు/ పోటు బంటు/ పోటు మగడు/ పోటు మనిసి = వీరుడు, పోటుముట్టు = యుద్ధ సాధనం, ఆయుధం, పోట్లాట = యుద్ధం, పోట్లాడటం.

**పోటొగ్గు** అక. = యుద్ధ ప్రయత్నం చేయు. చూ. పోటులాడు

**పోటొడ్డు** అక. = యుద్ధానికి సిద్ధపడు. చూ. పోటులాడు

**పోట్లాడు** అక. రూ. పోటులాడు

**పోతరించు** అక.= కొవ్వెక్కు, మదించు; రూ. పోసరించు వి. పోతరం = మదం, కొవ్వు.

**పోనాడు** సక. = పోగొట్టు, దూషించు, తిట్టు.

**పోవడు** అక.= పోవు.

**పోయు** అక. = పుట్టు, సక. విడిచిపెట్టు, తగిలించు, ఎక్కుపెట్టు; వి. పోత = పోయటం.

**పోరాడు** అక. = యుద్ధం చేయు, దెబ్బలాడు, కలియబడు; వి. పోరాట(ం) = యుద్ధం, దెబ్బలాట.

**పోరితమాడు** అక. = కలహించు, యుద్ధం చేయు, పోటీపడు; వి. పోరితం =స్పర్థ, పోటీ, కలహం.

పోరు అక. = కలహించు, యుద్ధం చేయు; వి. పోరు = యుద్ధం, కలహం.

పోరుపెట్టు అక. = (పసిపిల్లలు) గట్టిగా ఏడ్చు.

పోలు అక.= తగు, ఒప్పు, శక్యమగు, సక. సరితూగు; వి. పోలు = ఒప్పు, పోలిక, పోలికి = సామ్యం.

పోలుచు ప్రే. = సామ్యం చెప్పు/చూచు. చూ. పోల్చు

పోవు అక.= దగ్గరునుంచి దూరానికి కదులు, చచ్చు, మొదలు పెట్టు, దాటు, చెడు, కలియు, అగు; వి. పోక = పోవటం, పోబడి/పోవడి = పోవటం

పోవు దెంచు అక. = పోవు, దాటు. చూ. పోవు

పోషించు సక. = కాపాడు, భరించు, తిండిపెట్టు; వి. పోషకుడు = పోషించేవాడు, పోషణ(ం) = పోషించటం; విణ. పోష్ట = పోషించే, పోష్యం = పోషించదగ్గ.

పోసరించు అక.= కూర్చు, అమర్చు, గుచ్చు; రూ. పోతరించు చూ. పోహణించు విణ. పోహణ = కూర్పు, నేర్పు.

పోహళించు సక. చూ. పోహణించు

పౌజుతీరు అక. = బారుకట్టు, బారులుతీరు. రూ. పవుజు తీరు, పవుజులుతీరు

పౌజులుతీరు అక. = బారులుతీరు; రూ. పౌజు తీరు/పవుజుతీరు వి. పవుజు/పౌజు = బారు, వరస, సేన, దండు.

పౌజులు తీరుచు సక. = బారులుకట్టించు, (సేన లను) బంతి కట్టించు. రూ. పవుజులు తీరుచు/తీర్చు .

పౌజులుసేయు సక. చూ. పౌజులు తీర్చు

పౌలు లక. రూ. పవులు/పగులు చూ.

ప్రకటించు సక. = వెల్లడి చేయు, తెలియబరుచు; వి. ప్రకటన(ం) =వెల్లడి చేయటం; విణ. ప్రకటం = ప్రసిద్ధం, వెల్లడి, ప్రకటితం = వెల్లడిచేసిన, వెల్లడి అయిన.

ప్రకాశించు అక. = వెలుగు, మెరయు; వి. ప్రకాశం = వెలుగు, వెలుతురు, కాంతి, విణ. ప్రకాశం = ప్రసిద్ధమైన, బయటపడిన, సమానమైన.

ప్రకోపించు అక. = ముమ్మరమగు, ఎక్కువగు తీవ్రమగు; వి. ప్రకోపం = ముమ్మరం, • ప్రకోపనం = తీవ్రమవటం.

ప్రక్షాళించు సక. = కడుగు, తుడుచు; వి. ప్రక్షాళన(ం) = తుడుపు, కడగటం, ప్రక్షాళకుడు = కడిగేవాడు; విణ. ప్రక్షాళితం = బాగా కడిగిన/తుడిచిన.

ప్రక్షేపించు సక. = బాగావిసురు; వి. ప్రక్షేప(ణ)ం = బాగా విసరటం.

ప్రక్షోభించు అక. = చాలాకలతపడు, కలగుండుపడు; ప్రక్షోభన(ం) = కలత.

ప్రచ్ఛాదించు సక. = కప్పు; వి. ప్రచ్ఛాదనం = ఉత్తరీయం, ఆచ్ఛాదన ; విణ. ప్రచ్ఛాదిత = బాగా కప్పిన.

ప్రజ్వలించు అక. = మండు, వెలుగు; వి. ప్రజ్వలనం = మంట, ప్రకాశం. విణ. ప్రజ్వలిత(ం) = మండిన, ప్రకాశించిన.

ప్రణమిల్లు అక.= నమస్కరించు, వంగు; వి. ప్రణామం/ప్రణతి = నమస్కారం, ప్రణతుడు = నమస్కారాలందుకొన్నవాడు, నమస్కరించిన వాడు, *శిక్షపడ్డవాడు.*

ప్రణయించు సక. = మండించు.

ప్రణుతించు సక. = తెగపొగుడు; వి. ప్రణుతి = మంచి పొగడ్త; విశే. ప్రణుత = పొగడ్తలందిన.

ప్రతాపించు అక.= పరాక్రమించు; వి. ప్రతాప(ం) = వేడిమి, పరాక్రమం, ధనశక్తి.

ప్రతారించు సక.= మోసగించు; వి. ప్రతారణ = మోసం, ప్రతారకుడు = మోసగాడు, ప్రతారితుడు = మోసపోయినవాడు,

ప్రతికూలించు అక. = వ్యతిరేకమగు; వి. ప్రతికూలం = వ్యతిరేకం.

ప్రతిగ్రహించు సక.= దానం పుచ్చుకొను; వి. ప్రతిగృహీతుడు = దానం పట్టినవాడు, ప్రతిగ్రహం = (దానం) పుచ్చుకోవటం, దానంగా వచ్చిన ద్రవ్యం; విశే. ప్రతిగ్రాహ్యం = తీసుకోదగిన.

ప్రతిఘటించు అక= ఎదుర్కొను; వి. ప్రతిఘటన(ం) = ఎదుర్కోవటం.

ప్రతిపాదించు సక. = తెలుపు, నిరూపించు, కలిగించు, ఇచ్చు; వి. ప్రతిపాదన(ం) = తెలివిడి, చెప్పినది, ఇచ్చినది, నిరూపించినది, ప్రతిపాద్యం = చెప్పదగినది, ఇవ్వదగినది, నిరూపించదగినది, ప్రతిపాదకం = ఇచ్చేది, కలిగించేది, తెలిపేది, నిరూపించేది; విశే. ప్రతిపాదిత = చెప్పిన, ఇచ్చిన, నిరూపించిన, తెలిపిన.

ప్రతిపాలించు సక. = రక్షించు, కాపాడు; వి. ప్రతి పాలన(ం) = రక్షణ, కాపు(దల), ప్రతిపాల కుడు = రక్షకుడు.

పతిఫలించు సక. = ప్రతిబింబించు; వి. ప్రతిఫలనం = మారురూపం, కనిపించటం; ప్రతిఫలితం = ప్రతిబింబించినది.

ప్రతిబంధించు సక. = అడ్డగించు; వి. ప్రతిబంధం = అడ్డు, అడ్డగింత, ప్రతిబంధకం = అడ్డగించేది; విశే. ప్రతిబద్ధ = అడ్డగింతకు గురైన, మనసు చెడిన.

ప్రతిబింబించు అక. = ప్రతిఫలించు, నీడపడు; వి. ప్రతిబింబం = నీడ, ప్రతిఫలనం, ప్రతిబింబితం = ప్రతిఫలితం.

ప్రతిరోధించు సక.= అడ్డుపడు, ఆపు, వీరోధించు; వి. ప్రతిరోధం = విరోధం, ఎదిరింపు.

ప్రతివసించు అక. = కాపురముండు, ఉండు, నివసించు; వి. ప్రతివసథం = ఊరు, గ్రామం.

ప్రతివాదించు అక. = ఎదురువాదించు; వి. ప్రతివాక్యం = ఎదురుమాట, ప్రతివాదం = ఎదురు వాదం, ప్రతివాది = ఎదురువాదించేవాడు, ప్రతిపక్షి.

ప్రతిషేధించు సక. = నిషేధించు, అడ్డగించు; వి. ప్రతిషేధం/ ప్రతిష్టంభం = అడ్డగింత, నిషేధం, ప్రతిష్టబ్ధం = నిషిద్ధం.

ప్రతిష్ఠించు సక. = శాశ్వతంగా నిలుపు; వి. ప్రతిష్ఠ/ ప్రతిష్ఠాపన = శాశ్వతంగా నిలపటం; విశే. ప్రతిష్ఠితం = శాశ్వతంగా నిలిపిన.

ప్రతిస్పర్ధించు అక.= పోటీపడు; వి. ప్రతిస్పర్ధ = పోటీ.

ప్రతీక్షించు అక. = ఎదురుచూచు; వి. ప్రతీక్ష, ప్రతీక్షణం = ఎదురుచూపు

ప్రత్యుద్గమించు అక. = ఎదురువడుచు; వి. ప్రత్యుద్గమం = ఎదురుకోలు, ప్రత్యుద్గతుడు = ఎదురుకోలు చేసినవాడు.

ప్రత్యేకించు అక. = వేరువేరగు, సక. వేరుపరచు, ప్రత్యేకంగా చెప్పు; వి. ప్రత్యేకం = వేరు, వేరైన.

ప్రదక్షిణించు సక. = (ఎడమనుంచి కుడికి) చుట్టు, వలగొను; వి. ప్రదక్షిణ(ం)= చుట్టు తిరగటం.

ప్రదర్శించు సక. = బహిరంగ పరచు, స్పష్టంగా చూపు; వి. ప్రదర్శన = బహిరంగంగా చూపటం, విశదపరచటం, ప్రదర్శకుడు = విశదంగా చూపేవాడు; విణ. ప్రదర్శితం = స్పష్టంగా చూపిన

ప్రధావించు అక. = పరిగెత్తు; వి. ప్రధావనం = పరుగు.

ప్రధ్వంసించు సక. = పూర్తిగా ధ్వంసం చేయు; వి. ప్రధ్వంసం = నాశనం.

ప్రపంచించు సక. = పెంచిచెప్పు, విస్తరించు, విరివి చేయు; వి. ప్రపంచం = విరివి, విస్తరం; విణ. ప్రపంచితం = పెంచి చెప్పిన.

ప్రబలు అక. = పెరుగు, అతిశయిల్లు, వర్ధిల్లు; విణ. ప్రబల = బలంగల.

ప్రబోధించు సక. = మేలుకొలుపు, బాగా తెలుపు; వి. ప్రబోధం = మేలుకొల్పు, ప్రబోధనం = గొప్పతెలివి, ప్రబుద్ధుడు = మేలు కొన్న వాడు; విణ. ప్రబుద్ధం = వికసించిన.

ప్రబ్బు అక. = వ్యాపించు, వర్తిల్లు, వర్ధిల్లు, అతిశయించు, సక. కలియు, నిందించు; వి. ప్రబ్బు = నింద.

ప్రభవించు అక. = పుట్టు, కలుగు; వి. ప్రభవ = పుట్టుక, జన్మకారణం.

ప్రమాణీకరించు సక. =దృష్టాంతీకరించు, నిజమనిభావించు; వి. ప్రమాణం = జ్ఞాన కారణం, సత్యం, శాస్త్రం, ప్రామాణ్యం = సాక్ష్యం, దృష్టాంతం, ప్రామాణికుడు = సత్యం తప్పని వాడు, మేర మీరని వాడు, శాస్త్రం తెలిసిన వాడు.

ప్రమోదించు అక. = సంతోషించు; వి. ప్రమోదం = సంతోషం.

ప్రయత్నించు అక. = బాగాయత్నించు; వి. ప్రయత్నం = ఎక్కువయత్నం.

ప్రయాణించు అక. = బయలుదేరు, ప్రయాణం చేయు; వి. ప్రయాణం = పయనం, బయలుదేరం; విణ. ప్రయాత = ప్రయాణమై పోయిన.

ప్రయాసపడు అక. = శ్రమపడు, అలసటపడు, పాటుపడు; వి. ప్రయాస (ం) = అలసట, శ్రమ, పాటు.

ప్రయోగించు అక. = వాడు, నడపు, ఉపయోగించు; వి. ప్రయోగం/ ప్రయుక్తి = నడపటం, వాడుక, తార్కాణం, ప్రయోక్త= ప్రయోగించేవాడు, ప్రయోజకుడు= ప్రయోగించేవాడు, నెరవేర్చే వాడు, ప్రయోజనం =పని, కారణం.

ప్రలాపించు అక. = పలవరించు, అర్థం లేని మాటలాడు; వి. ప్రలాపన/ ప్రలాపం = పలవరింత, అర్థంలేని వాగుడు.

ప్రలోభించు సక. = ఆశపెట్టు; వి. ప్రలోభం = పేరాస, దురాశ.

ప్రవచించు సక.= గొప్పగా చెప్పు; వి. ప్రవచనం = గొప్పమాట,వేదం; విణ. ప్రవచనీయం = చక్కగా చెప్పదగినది.

ప్రవర్తించు అక. = బాగా వృద్ధిపొందు; రూ. ప్రవర్తిల్లు వి. ప్రవర్ధనం = పెరుగుదల, వృద్ధి.

ప్రవహించు అక. = పారు; వి. ప్రవహణం = పడవ, యానపాత్ర, ప్రవహం = బయటికి పోవటం, ప్రవాహం = ఏరు.

*ప్రవేశించు సక. = చొచ్చు, చొరబడు; వి. ప్రవేశం = చొరవ, చొచ్చటం.*

**ప్రశంసించు** సక. = పొగడు ; వి. ప్రశంస/ ప్రశంసనం = పొగడ్త.

**ప్రసంగించు** సక. = మాట్లాడు, వివరంగా చెప్పు, ప్రస్తావించు; వి. ప్రసంగం/ ప్రసక్తి = విస్తరం, ప్రస్తావం.

**ప్రసక్తించు** అక. = ప్రస్తావనకు తెచ్చు; వి. ప్రసక్తి = ప్రస్తావన.

**ప్రసరించు** అక. = వ్యాపించు; రూ. ప్రసరిల్లు వి. ప్రసరణ/ ప్రసరణి = వ్యాపనం, వ్యాప్తి, ప్రసరం / ప్రసర్పణం = వ్యాపనం, వేగం, విషయం, ప్రసారం = వ్యానం, ప్రసారణం = ప్రసారం చేయటం; విణ. ప్రసూత = పుట్టినది, ప్రసూనం = పుట్టినది.

**ప్రసవించు** సక. =(బిడ్డను) కను; వి. ప్రసువు = తల్లి, ప్రసవం = కాన్పు, ప్రసూత = బాలెంతరాలు, ప్రసూతి = కాన్పు, పుట్టుక, బిడ్డ, ప్రసూతిక = బాలెంతరాలు, ప్రసూనం = పువ్వు. విణ. ప్రసూత = పుట్టింది. ప్రసూనం = పుట్టింది.

**ప్రసాదించు** సక. = దయతో ఇచ్చు; వి. ప్రసాదం = అనుగ్రహం, ప్రసాదనం = బహుమానం, అన్నం.

**ప్రస్తరించు** సక. = పెంచు, విస్తరించు; వి. ప్రస్తారం = విస్తారం, పెంపుదల.

**ప్రస్తావించు** సక. = చెప్పు, ప్రస్తావనకు తెచ్చు; వి. ప్రస్తావన = ప్రసంగం, ప్రస్తావం = చెప్పటం, అవసరం, విణ. ప్రస్తుత = చెప్పిన.

**ప్రస్తుతించు** సక. = పొగుడు, స్తోత్రం చేయు; వి. ప్రస్తుతి = పొగడ్త.

**ప్రస్థానించు** సక. = ప్రయాణంచేయు; వి. ప్రస్థానం = ప్రయాణం. విణ. ప్రస్థితం = ప్రయాణమై పోయినది.

**ప్రస్థాపించు** సక. = బాగా నిరూపించు; వి. ప్రస్థాపితం = చక్కగా నిరూపించినది.

**ప్రహరించు** సక. = కొట్టు, దెబ్బతీయు; వి. ప్రహరణ/ ప్రహారం = దెబ్బ, తాకు, ప్రహరణం = ఆయుధం.

**ప్రహరిచరించు** అక. = (ప్రాకారం చుట్టూ) తిరుగు, కాపలాకాయు; వి. ప్రహరి = ప్రాకారం.

**ప్రహరిదిరుగు** అక. = చుట్టూ తిరుగు, కాపలా కాయు. చూ. ప్రహరిచరించు

**ప్రహసించు** అక. = పెద్దగా నవ్వు; వి. ప్రహసనం = పెద్దనవ్వు, వెక్కిరింత, ఒకరకం నాటకం, ప్రహసితం = తలవూపుతూ నవ్విన నవ్వు.

**ప్రాకు** అక. = రొమ్ముతో జరుగు, ఎక్కు; రూ. పాకు వి. ప్రాకు/ పాకు = అల్లు పెట్టిన కొయ్య, పాచి/ ప్రాకుడు/పాకుడు = పాకటం, పాచి.

**ప్రాకుదెంచు** అక. = పాకు చూ. పాకు

**ప్రాకులాడు** అక. = పాకియెక్కు, మథనపడు; రూ. పాకులాడు వి. పాకులాట/ ప్రాకులాట = పాకి ఎక్కటం, మథనపడటం.

**ప్రాకొను** అక. = పాచిపట్టు

**ప్రాణాచారం(ము) పడు** అక. = ప్రాయోపవేశం చేయు; వి. ప్రాణాచారం = ప్రాయోపవేశం.

**ప్రాతగిల్లు** అక. = పాతపడు, పాతదిఅగు; రూ. పాతగిల్లు/ పాతగిలు/ ప్రాతగిల్లు వి. ప్రాత = గుడ్డ, చివికిన గుడ్డ, చినిగిన గుడ్డ; విణ. ప్రాత = పాతకాలపుది, పూర్వకాలపుది.

ప్రాతవడు అక. = పాతదిలగు. రూ. పాతవడు/ ప్రాబడు

ప్రాథేయపడు(టు) అక. = వేడుకొను, కాళ్లా వేళ్లాపడు

ప్రాదుర్భవించు అక. = పుట్టు; వి. ప్రాదుర్భావం = పుట్టుక; విశ. ప్రాదుర్భూతం = పుట్టినది.

ప్రాపించు సక. = పొందు వి. ప్రాపణం = పొందటం, ప్రాపణీయం = పొందదగినది, ప్రాపు = ఆశ్రయం, ప్రాప్తి = పొందిక, పొందు, లాభం. విశ. ప్రాప్తం = పొందినది, ప్రాప్యం = పొందదగిన.

ప్రాప్తించు అక. = కలుగు, దొరుకు; వి. ప్రాప్తి/ ప్రాప్తం = దొరికినది, పొందు, లాభం, శుభోదయం.

ప్రాబడు అక. = పాతపడు, పాతదగు.

ప్రాము సక. = రాయు, పూయు, రుద్దు, అలదు, పులుము, మూయు, పీడించు, ఖండించు; రూ. పాము వి. ప్రాముడు = పులుముడు, ప్రామిడి = క్రౌర్యం; విశ. ప్రామిడి = క్రూరమైన.

ప్రారంభించు అక. = మొదలుపెట్టు, ప్రయత్నించు; వి. ప్రారంభం = మొదలు.

ప్రార్థించు సక. = వేడు, అడుగు; వి. ప్రార్థనం = అడగటం, వేడటం, వేడుకోలు, ప్రార్థకుడు = వేడుకొనేవాడు; విశ. ప్రార్థనీయం = వేడదగిన, ప్రార్థితం = వేడిన, అడిగిన.

ప్రాలుమాలు అక. = అశ్రద్ధచేయు, బద్ధకించు; రూ. పాల్మాలు/ ప్రాల్మాలు వి. పాల్మాలిక/ ప్రాలుమాలిక = బద్ధకం, అశ్రద్ధ, సోమరితనం.

ప్రాల్మాలు అక. = అశ్రద్ధచేయు, సోమరిగా ఉండు, బద్ధకించు. రూ. ప్రాల్మాలు/ ప్రాలుమాలు.

ప్రాశించు సక. = తిను, భుజించు; వి. ప్రాశనం = భోజనం; విశ. ప్రాశితం = భుజించిన, తాగిన.

ప్రిదులు అక. = విరిసిపోవు, సడలిపోవు, తగ్గు, ఊడు, జారు, తొలగు.

ప్రియపడు అక. = ఇష్టపడు; రూ. ప్రియంపడు వి. ప్రియం = సంతోషం, స్నేహం, ప్రియవాది = ఇచ్చకాలమారి, ప్రియత = స్నేహం, ప్రియుడు = ఇష్టుడు, ప్రియురాలు = ఇష్టురాలు; విశ. ప్రియం = ఇష్టమైన, హెచ్చువెలగల.

ప్రుచ్చు అక. = పురుగులుపడు, పుప్పిపట్టు; రూ. పుచ్చు వి. ప్రుప్పి/ పుప్పి = పుచ్చటం, ప్రువ్వు / పురువు/ పురుగు = కీటకం.

ప్రేచు సక. = ప్రేరేపించు. రూ. ప్రేరేచు

ప్రేముడించు అక. = ఇష్టపడు, శోకించు, ఏడ్చు, బాధపడు; వి. ప్రేమ(ం) = స్నేహం, ఇష్టం, సంతోషం, ప్రేముడి = స్నేహం.

ప్రేరించు సక. = ప్రేరేపించు, పురికొల్పు; వి. ప్రేరణ/ ప్రేరణం = ప్రోత్సాహం, ప్రేరకుడు = ప్రేరేపించేవాడు, ప్రేరేపణ = ప్రేరణం; విశ. ప్రేరితం = ప్రేరణకు గురియైనది.

ప్రేరేపించు సక. = పురికొల్పు మా. ప్రేరించు

ప్రేరేచు సక. = పురికొల్పు మా. ప్రేరేపు

ప్రేరేపు సక. = ప్రేరేపించు. రూ. ప్రేరేచు

ప్రేలు అక. = వదరు, ఎడాపెడావాగు, వేగి ఉబుకు; రూ. పేలు వి. ప్రేలరి = వదరుబోతు, పేలడం, పేలుడు/ ప్రేలడం/ ప్రేలుడు = వదరటం.

ప్రేలుచు ప్రే.రూ. పేలుచు/ పేల్చు/ ప్రేల్చు = వేయించు, వేచు.

**ప్రోజు** సక. చూ. పోజు

**ప్రోక్షించు** సక. = (నీళ్లు) చిలకరించు, (యజ్ఞం లో) పశువును బలి ఇచ్చు; వి. ప్రోక్షణం = చిలక రింపు, చంపటం; విశే. ప్రోక్షితం = చిలకరించిన, బలియిచ్చిన.

**ప్రోచు** సక. = పోషించు; రూ. పోచు వి. ప్రోపరి = పోషకుడు, రక్షకుడు, ప్రోపు = రక్షణ.

**ప్రోదిగొను** సక. = పోషించు; వి. ప్రోది = పోషణ, వైభవం.

**ప్రోదిసేయు** సక. = పోషించు; వి. ప్రోది = పోషణ.

**ప్రోల్గడుపు** సక. = ప్రేరేపించు.

**ప్రోవుకొను** అక. ప్రోవుకొలుపు ప్రే. = ప్రోవు, ప్రోగు, పోగు = రాశి, గుట్ట

# ఫ

**ఫర్మాయించు** సక. = ఆజ్ఞాపించు; వి. ఫర్మానా = ఆజ్ఞ, ఆదేశం, ఫర్మాయిషీ = ఆదేశించటం, ఆజ్ఞాపించటం.

**ఫలించు** అక. =పండు, నెరవేరు; వి. ఫలం = పండు, ఫలితం, పంట, లాభం, ప్రయోజనం, ఫలం పాటు =లాభదాయకం, ఫలసాయం=పంట, ఫలినం / ఫలిని = పండ్లున్నది. విశే. ఫలవంతం = పండ్లు న్నది, ఫలితమిచ్చి నది, ప్రయోజనకర మైనది, లాభ సాటి, ఫలితం = పండ్లిచ్చినది, ఫలించినది.

**ఫిరాయించు** సక. = మార్చు; వి. ఫిరాయింపు = మార్పు, మార్పిడి.

# బ

**బక్కటిల్లు** అక. = చిక్కిపోవు, సన్నబడు; రూ. బక్కటిలు విశే. బక్క = పేద, సన్న, చిక్కిన.

**బగళంబుసేయు** సక. = తొలగించు; బగళం = తొలగింపు. రూ. బగళవుసేయు / బగ ళమ్ముసేయు

**బగ్గుమను** అక. = మండిపోవు; రూ. భగ్గుమను / భగ్గురుమను వి. బగ్గు = మంట.

**బజారించు** అక. = వ్యభిచరించు; వి. బజారం = వ్యభిచారం, బజారి = వ్యభిచారిణి, బజారు = అంగడివీధి.

**బడలు** అక. = అలసటపడు, శ్రమపడు; రూ. బడలుపడు / బడల్పడు వి. బడలు / బడ లిక = అలసట, శ్రమ.

**బడలుపడు** అక. = అలసటపడు, శ్రమపడు. చూ. బడలు

**బడాయించు** అక. = అభివృద్ధి అగు, పెరుగు, సక. పెంచు, అభివృద్ధిపరుచు; వి. బడాయి = గర్వం, అతిశయం, బడాయింపు = పెంపు, బడాయి ఖోరు = అతిశయంగా మాట్లాడే వ్యక్తి.

**బడిద్రిప్పు** సక. = దిష్టితీయు, దిగదుడుచు; చూ. బడియు వి. బడిమి = గుండ్రంగా తిరగటం, భూతబలి, దిష్టితీయటం.

**బడియు** సక. = దిగదుడుచు, దిష్టితీయు. చూ. బడిద్రిప్పు

**బండిగిల్లు** అక. = ఇబ్బందులు పడు, కష్టాలుపడు, కడగండ్లుపడు. రూ. బండిగిలు

**బతిమాలు** సక. = దీనంగా వేడుకొను; రూ. బ్రతివాలు వి. బ్రతిమిలాట / బతిమి లాట = వేడుకోలు, బతిమాలిక = బతిమాల టం.

బతిమాాలుచు ప్రే. = బతిమాలునట్లు చేయు చూ. బతిమాాలు

బదలాాయించు సక. = మార్చు; వి. బదలాయింపు = మార్పు, బదులు = మారు.

బద్ధకించు అక. = పాలుమాలు, ఆలస్యంచేయు, అశ్రద్ధచేయు; రూ. బద్దకించు వి. బద్దకం/ బద్ధకం = ఆలస్యం, అశ్రద్ధ, సోమరితనం.

బనాాయించు సక. = కల్పించు; వి. బనాాయింపు = కల్పన.

బందనగొాను అక. = జిగటదేలు, జిగురుగా ఉండు; వి. బందన = జిగురు, బంక.

బందెగొాను సక. = చెరపట్టు, బందెలదొడ్డిలో పెట్టు; వి. బందె = పశువుల చెర, నిర్బంధం, బందెకత్తె = చెరలో పెట్టేది, బందెకాాడు = చెరలో పెట్టేవాడు, బందెలపోాతు = బంధించే స్వభావం గలవాడు.

బంధించు సక. =కట్టు, కట్టివేయు; వి. బంధం, బంధనం = కట్టు, చెర, కుదువ, బంధకం = చెరసాల, కుదువ, బంధకి = రంకులాలు, వేశ్య.

బమ్మరించు అక. = దిమ్మతిరుగు, తలతిరుగు, భ్రమపడు. రూ. బమ్మరిల్లు

బమ్మెరపోావు అక. = భ్రమపడు, భ్రాంతిపడు; వి. బమ్మెర = భ్రమ, భ్రాంతి, బమ్మెరపోాక = భ్రాంతిపడటం, భ్రమపడటం.

బయలుదేరు అక. = వెళ్లు, బయటికిపోవు; వి. బయలు = బహిరంగప్రదేశం, చెట్టూచేమాలేని చోటు; విశే. బయలు = శూన్యం.

బయలుపడు అక. = బయటపడు, తెలిసిపోవు; రూ. బయల్పడు విశే. బయలు = బహిరంగమైన.

బయలుమెరయు అక. = బయటపడు, తెలిసిపోవు.

బయలువెడలు అక. = బయలుదేరు, నిర్గమించు.

బయలువోావు అక. చూ. బయలుపడు

బరటు సక. = గోాకు, గిల్లు.

బరాాబరులుచేయు సక. = హెచ్చరించు, హడావిడి చేయు; వి. బరాాబరి(క) = హెచ్చరిక, హడావిడి.

బరుకు సక. = తోాలు లేచునట్లు గీకు, గోాకు; వి. బరుకుడు = గోాకటం, గీకటం

బర్తరఫ్‌చేయు సక. = (ఉద్యోగం నుంచి) తొాలగించు; వి. బర్తరఫ్ = తొాలగింపు.

బలకరించు అక. = గిలకరించు, వ్యాపించు; వి. బలకరం = కావలి, కాపు.

బలకాాయించు అక. = అతిశయించు, మించు.

బలకొాట్టు అక. = శ్రుతి పెట్టు/పట్టు.

బలపడు అక. =గట్టిపడు, ఎక్కువగు, శక్తిపెరుగు; వి. బలం = సత్తువ, బలుపు; విశే. బలం = అధికమైన

బలయు సక. = చుట్టుముట్టు, పరివేష్టించు.

బలాత్కాారించు సక. = బలవంతం చేయు, నిర్బంధించు; వి. బలాత్కాారం = బలవంతం, నిర్బంధం.

బలిపెట్టు సక. = చంపు; వి. బలి = దేవతలకిచ్చే కానుక, చంపుడు.

బలియు అక. = బలమెక్కు, బలిసిపోవు, అధికమగు; వి. బలిమి = బలం, బలత్కారం, బలిమికాడు/ బలియుడు/ బలుడు/ బలువుడు = బలవంతుడు, బలుపు/ బలువు = పుష్టి; విశే. బలిష్ఠం = చాలా బలంగల, బలీయం = బలం గల, బలుపు/ బలువు =అధికం, మిక్కుటం, ఎక్కువ.

బలివారు సక. = చంపు.

బలుపుకొను అక. = అతిశయించు, బలపడు రూ. బల్పుకొను

బవిరితిరుగు అక.= గుండ్రంగా తిరుగు; రూ. బవ్రితిరుగు వి. బవిర = గుండ్రటి నగ

బహివడు అక.=వెలియగు, వెలికిగురి అగు.

బహివెట్టు సక. = వెలివేయు

బహిష్కరించు సక. = వెలివేయు; వి. బహిష్కృతుడు = వెలికి గురి అయినవాడు, బహిష్కరణ(ం) / బహిష్కారం = వెలి.

బహూకరించు సక. = సమ్మానించు, గౌరవించు; వి. బహూకరణం / బహూకృతి = బహుమతి.

బాగుచేయు సక. = చక్కబరచు, శుభ్రపరచు, అభివృద్ధికి తెచ్చు.

బాతశించు అక. = తత్తరపడు, గాభరాపడు.

బాదరించు అక. = సమానమగు.

బాదు సక. = కొట్టు; వి. బాదుడు = దెబ్బ.

బాదుకొను సక. = కొట్టు, బాదు. చూ. బాదు

బాధించు సక. = బాధపెట్టు, ఇబ్బంది పెట్టు, నొప్పి పుట్టించు; వి. బాధ = కష్టం, దుఃఖం, నిషేధం; విశే. బాధకం = అడ్డుపడేది, బాధ్యం = బాధించ దగింది, బాధితం = బాధపడ్డది.

బానగిల్లు అక. = బలవంతంగా లాగబడు; రూ. బానగిలు వి. బాన = కడవ, ఏతపు కడవ.

బారకించు అక. = బరువగు, భారమగు

బారపోయు సక. = బారెడు నూలువడుకు; వి. బార = అడ్డంగా చాచిన చేతుల కొనల మధ్య దూరం; విశే. బారెడు = బారకొలతగల.

బారిసమరు సక. = హింసించు, బాధపెట్టు; వి. బారి = నిర్బంధం, హింస.

బారుచేయు సక.= తుపాకి గొట్టంలో మందు కూరు.

బావుకొను సక. = అనుభవించు, ఆబగాతిను.

బావురుమను అక. = పెద్దగా ఏడ్చు; వి. బావురు గాడు / బావురుపిల్లి = గండుపిల్లి.

బాసాడు అక. = మాట్లాడు, పలుకు.

బాహిరపోవు అక. = బయటపడు, మూర్ఛపోవు; వి. బాహిరం = బయటపడ్డ వెలి అయిన.

బిగించు ప్రే. = బిగియునట్లు చేయు, బిగగట్టు; రూ. బిగియించు వి. బిగువు / బిగింపు / బిగి / బిగుతు / బిగువూనం = గట్టిగా ఉండటంచ బిగిసి ఉండటం; విశే. బిగితం = దృఢం, గట్టి, పదులుకాని.

బిగియు అక. = బిగిసిపోవు, బిగవుగా ఉండు. చూ. బిగించు

బిగుచు ప్రే. చూ. బిగించు

బిగువుకొను అక. = బిగిసిపోవు, బిగువగు. చూ. బిగించు

బిజుగు సక. = బొంకు, అబద్ధాలాడు.

బిడాయించు సక. = ఒకదానిలో మరొకటి అమర్చు, బిగించు, గట్టిగా మూసివేయు; వి. బిడాయింపు = మూసివేయటం, బిగించటం.

బిత్తరపోవు అక. = ఆశ్చర్యపడు, చలించు; విశే. బిత్తరం = చంచలం.

బిత్తరములాడు అక. = సరసమాడు; వి. బిత్తరం = సరసం, బిత్తరి = శృంగారిణి, సరసాలు.

బిత్తరించు అక. = సరసమాడు, కదలాడు, చలించు, ఊగులాడు; వి. బిత్తరం = సరసం; విశే. బిత్తరం = చంచలం.

బిబ్బరించు అక. = (పులి) అరచు, గాండ్రించు; వి. బొబ్బరింత, రూ. బొబ్బరించు = గాండ్రింపు.

బిమ్మిటిగొను అక. = వివశమగు, వశం తప్పు, మూర్ఛిల్లు; వి. బిమ్మిటి = వివశత్వం, సంకోచం; విశే. బిమ్మటి = సంకోచించే, వివశమైన

బిమ్మిటివోవు అక. = వివశమగు, మూర్ఛపోవు.

బిరబిగియు అక. = బాగాబిగిసిపోవు; వి. బిర్ర = బిగువు.

బిర్రు అక. = బిరుసగు.

బిల్లకట్టు అక. = నెత్తురుగడ్డకట్టు, గుండ్రటి గడ్డలు లేచు; రూ. బిళ్ల(లు) కట్టు విశే. బిల్ల/ బిళ్ల = గుండ్రనిది.

బిసివోవు అక. = పట్టువదలు; వి. బిసి = పట్టు; విశే. బిసిబిసి = లగువుబిగువుగల.

బీటగిల్లు అక. = పగుళ్లు వారు; రూ. బీటగిలు వి. బీటిక, బీట = పగులు.

బీటలువారు అక. చూ. బీటగిల్లు.

బీటలువోవు అక. చూ. బీటగిల్లు.

బీతుకొను అక. ప్రే. బీతుకొలుపు = భయపడు; వి. బీతు = భీతి, భయం.

బీరువడు అక. = వ్యర్థమగు; వి. బీరు = వ్యర్థం.

బీరువోవు అక. చూ. బీరువడు.

బుగులుకొను అక. = గుప్పుమను, గుప్పుమని వాసనవచ్చు, వ్యాపించు, విజృంభించు; రూ. గుబులు కొను వి. బుగులు/ గుబులు = వాసన.

బుగులుపుచ్చు ప్రే. = బయలుపరచు, బయట పెట్టు. చూ. బుగులుకొను

బుగులుపోవు అక. = బయటపడు. చూ. బుగులుపుచ్చు

బుజ్జగించు సక. = బతిమిలాడు, (పసిపిల్లలను) ముద్దాడు; వి. బుజ్జగం/ బుజ్జవం/ బుజ్జగింపు/ బుజ్జగింత = బతిమిలాడటం, ముద్దాడటం.

బుడివడు అక. = తొట్రుపడు; వి. బుడిబుడి = తొట్రుపాటు; విశే. బుడిబుడి = కొంచెం, కొద్ది, అల్పం.

బుడ్డగించు అక. = (పంది) ముట్టెతో కోరాడు, గుర్రించు/ గుర్గించు; వి. బుడ్డగింపు = గుర్గింపు.

బులియు అక. = సుఖపడు, సుఖించు; వి. బులుపు = సుఖం.

బుసకొట్టు అక. = (పాము) బుస్సుమను, కోపగించు; వి. బుస = బుస్సుమనటం.

బుసబుసలాడు అక. = (నీళ్లమొ॥) కాగి పొంగు; వి. బుసబుస = పొంగు.

బుస్సుమను అక. = (పాము) బుసకొట్టు.

బూకరించు సక. = దబాయించు, లేనిది ఉన్నట్టు అబద్ధమాడు, మాయమాటలు చెప్పు; వి. బూక = మాయ.

బూజుపట్టు సక. = బూజుగలదగు, పాతపడు, మాసిపోవు, చెడిపోవు; వి. బూదు, బూజు = తడివస్తువుల మీద పుట్టే చెడు వస్తువు.

బూతాడు అక. = బూతులు మాట్లాడు; వి. బూతు = అశ్లీలం, పాడుతిట్టు, బూతాటం = బూతులు కూయటం.

బూదిచరచు అక. = బూజుపట్టు; వి. బూతి/ బూది/ బూడిద = దుమ్ము.

బూదుపారు అక. చూ. బూజుపట్టు

బూరటించు ప్రే. = నింపు, ఉబ్బించు, పెంచు; వి. బూరడు = ఉబ్బిన, ఉబికిన వ్యక్తి, బూరటు

= పెరుగుదల, ఉబ్బు, బూరియు/బూరె = ఉబికిన తినుబండారం; విశే. బూర = లావెక్కిన.

**బూరటిల్లు** అక. = ఉబ్బు, ఉబుకు, పెరుగు, నిండు. చూ. బూరటించు

**బెకబెకలాడు** అక. = (కప్ప) బెకబెకమను, [illegible]

**బెక్కొట్టు** అక. = బెంగపడు, వాపోవు; వి. బెంగ = దిగులు; విశే. బెంగ = కూత.

**బెగడు** అక. = భయపడు; రూ. బెగ్గడు వి. బెగడు = భయం.

**బెగడువడు** అక. ప్రే. బెగడుపర(ఱ)చు = భయపడు; చూ. బెగడు.

**బెగ్గడిల్లు** అక. = భయపడు; వి. బెగడు/బెగ్గడు = భయం, బెగ్గలం / బెగ్గలికం = భయం, విహ్వలత.

**బెగ్గలించు** అక. = భయపడు, విహ్వలించు. చూ. బెగ్గడిల్లు

**బెగ్గిల్లు** అక. = భయపడు, పవారించు, విహ్వలించు, వెరచు, బెదిరిపోవు. రూ. బెగ్గిలు చూ. బెగ్గడిల్లు

**బెట్టించు** సక. = (నిర్బంధం నుండి) తప్పించు, దక్కించు.

**బెడకు** అక. = కదులు, తొలగు; రూ. బెణుకు/బెణకు వి. బెడకు = కదలిక, తొలగుట.

**బెడగారు** అక. = అందగించు, ఎక్కువగా ఉండు; వి. బెడగు = అందం, విలాసం; విశే. బెడగు = ఎక్కువైన, ఎక్కువైన.

**బెడగు** అక. = అందగించు. చూ. బెడగారు

**బెడియు** అక. చూ. బెడకు

**బెండగిల్లు** అక. = ప్రయోజనముడుగు, పెళ్లగిల్లు. చూ. బెండగిలు.

**బెండువడు** అక. = బలహీనపడు; వి. బెండు = జీలుగ, బెండు మానిసి = బలహీనుడు; విశే. బెండు = దుర్బల, నిస్సార.

**బెదరు** అక. = భయపడు; రూ. బెదురు వి. బెదరింపు/బెదిరింపు = భయపెట్టడం, బెదరు = భయం, బెదరుపోతు = భయపడేవ్యక్తి.

**బెదరుపడు** అక. = బెదిరిపోవు, భయపడు; వి. బెదరుపాటు = భయం.

**బెరయు** అక. = కూడు, చేరు, కలుగు, వ్యాపించు, సక. పొందు; వి. పెరశి/బెరశి = కూడిన, మొత్తం.

**బెలయు** అక. = వ్యాపించు.

**బెల్లించు** సక. = మోసగించు; వి. బెల్లింపు = మోసం; విశే. బెల్లి = మోసపు.

**బెసుకు** అక. = తప్పిపోవు, గాడితప్పు, బెణుకు.

**బెళకు** అక. = కదులు, తొలగు; రూ. బెడకు వి. బెళకు/బెడకు = చలనం, కదలిక, తొలగుట.

**బెళగు** అక. = అందగించు; రూ. బెడగు వి. బెళగు = అందం, విలాసం; విశే. బెళగు = ఎక్కువైన.

**బెళుకు** అక. = తళతళమను; వి. బెళుకు = ప్రకాశం, తళతళ.

**బేరీజువేయు** అక. = లెక్కించు, వివరం రాయు; వి. బేరీజు = లెక్కవివరం, ఖర్చుమొత్తం.

**బేలుపడు** అక. ప్రే. బేలుపరుచు = మోసపోవు; రూ. బేల్పడు వి. బేలు = మోసం, బేలరి = మోసకాడు.

**బేలుపోవు** అక. ప్రే. బేలుపుచ్చు = బేలుపడు.

**బేలుపెట్టు** సక. = మోసపుచ్చు.

**బైలగు** అక. = బయటపడు; రూ. బయలగు వి. బయలు, బైలు/బయలు = బహిరంగ ప్రదేశం.

బొక్కు సక. = తెగతిను, గబగబా తిను; వి. బొక్కు = నిండిననోరు, బొక్క

బొక్కులాడు సక. = తెగతిను, త్వరగా తిను.

బొంకించు సక. ప్రే. బొంకజేయు = మోస పుచ్చు.

బొంకు అక. = అబద్ధమాడు; వి. బొంకు = అసత్యం, అబద్ధం; బొంకం = అసత్యవాది, బొంకు లాడి = అబద్ధాల మారి స్త్రీ, బొంకులాడు = అబద్ధాలాడే మగవాడు; విశే. బొంకు = అబద్ధమైన, అసత్యమైన.

బొబ్బరించు అక. = గాండ్రించు, గావుకేకలు పెట్టు; వి. బొబ్బాటం/బొబ్బరింత = పొలికేక.

బొమ్మరముపోవు అక. = గుండ్రంగా తిరుగు; వి. బొమ్మరం = బొంగరం.

బోడించు సక. = తలగొరిగించు, బోడిచేయు; వి. బోడింపు = బోడిచేయటం; విశే. బోడు/ బోడి = జుట్టులేని.

బోధచేయు సక. చూ. బోధించు

బోధపడు అక. = అర్థమగు, తెలియు. చూ. బోధించు

బోధించు సక. = తెలియజెప్పు, చదువునేర్పు; విశే. బోధ(ం) = తెలివి, జ్ఞానం, బోధకుడు = గురువు, ఉపాధ్యాయుడు, బోధనం = చదువు చెప్పటం, నేర్పటం, బోధితుడు = చదువు నేర్చినవాడు.

బోరగించు ప్రే. = బోర్లాపడవేయు.

బోరగిల్లు అక. = బోర్లాపడు; రూ. బోరగిలు వి. బోర = రొమ్ము, గుండె.

బోరుకలగు అక. = మోగు, మోతపుట్టు.

బోరుకాడించు ప్రే. = స్నానం చేయించు చూ. బోర్కాడించు

బోరుకాడు అక. = స్నానమాడు, స్నానం చేయు.

బోరుకొను అక. ప్రే. బోరుకొలుపు = మోగు, మోతపుట్టు.

బోసివడు అక. = బొక్కెలగు, పళ్ళు లేకుండు; విశే. బోసి = పళ్ళులేని.

బోసిపోవు అక. ప్రే. బోసిపుచ్చు = పళ్ళూడి పోవు.

బోంచేయు సక. = తిను, భోజనం చేయు. చూ. భోంచేయు

బ్రతుకు అక. = జీవించు, ఉండు; రూ. బతుకు, బ్రదుకు; వి. బ్రదిమి/ బ్రతుకు/ బ్రదుకు/ బతుకు = జీవనం, స్థితి, బ్రతుకు తెరువు = జీవనోపాయం.

బ్రదుకు అక. చూ. బ్రతుకు.

బ్రమయు అక. = భ్రమపడు, భ్రాంతిపడు.

బ్రమరిపెరుంగు అక. = మళ్ళిపెట్టు, మట్లా డుగు.

బ్రమరివాడు అక. చూ. బ్రమరిపిరుగు.

బ్రుంగు అక. ప్రే. బ్రుంచు = పూడిపోవు, మునిగి పోవు, మరుగునపడు; వి. బ్రుంగుడు = మునిగిన, మరుగుపడ్డ.

బ్రుంగుడుపడు అక. ప్రే. బ్రుంగుడుపరచు = మరుగుపడు; రూ. బ్రుంగుపడు; వి. బ్రుంగుడు పాటు = మరుగుపడటం.

బ్రుంగువడు అక. = మునిగిపోవు.

బ్రుయ్యు అక. = నశించు

## భ

భక్షించు సక. = తిను; వి. భక్షకుడు = తిండిపోతు, భక్షణం = తినటం, తిండి, భక్షణీయం/

**భక్ష్యం** = తినదగ్గది, తిను బండారం, **భక్షితం** = తిన్నది, **భక్ష్య(ం) కారుడు** = వంట వాడు.

**భంగపడు** అక. = అవమానపడు; వి. **భంగం** = వెరుపు, **భంగపాటు** = అవమానం.

**భంగపెట్టు** సక. = అవమానపరచు; వి. **భంగపాటు** = అవమానం.

**భంగించు** సక. = అవమానించు.

**భండించు** సక. = నీచంగా ప్రవర్తించు; వి. **భండుడు/ బండడు/ బండు** = ఆకతాయి, నీచుడు, **భండనం** = దుశ్చేష్ట.

**భజించు** సక. = పూజించు, సేవించు, భాగించు; వి. **భజన** = పొగడ్త/ **భజనం** = సేవించటం, భాగించటం; విశే. **భజమానం** = సేవించే, భాగించే, **భజోష్యం** = సేవించదగ్గ, విభజించదగ్గ.

**భజించు** సక. = విరుచు, విరగ్గొట్టు; వి. **భంజనం** = విరచటం, విరగ్గొట్టడం, విరువు; విశే. **భంజకం** = విరిచేది.

**భరించు** సక. = మోయు, కాపాడు; వి. **భరం** = బరువు, అతిశయం, **భారం** = బరువు, **భారకుడు** = బరువులు మోసేవాడు, కూలివాడు, **భరణం** = భరించటం, కూలి, జీతం, **భరటుడు** = కూలి వాడు, **భరణ్యం** = కూలి, జీతం.

**భస్మీకరించు** సక. = బూడిదచేయు, ధ్వంసం చేయు; వి. **భస్మం** = బూడిద, బూది, **భస్మీకరణం** = బూడిదచేయటం, కాల్చటం, కాల్పు.

**భాగించు** సక. = విభజించు, భాగాలు చేయు; వి. **భాగం** = పాలు, వంతు, **భాగదేయం** = కష్టం, విశే. **భాగ్యం** = విభజించదగ్గది.

**భావించు** అక. = ఊహించు, అనుకొను, తలచు, ఆలోచించు; వి. **భావం** = అభిప్రాయం, **భావన** = తలపు, ఆలోచన, **భావ్యం** = తప్పక కాదగినది, **భావిని** = ఆలోచన పరురాలు.

**భాషించు** అక. = మాట్లాడు; వి. **భాష** = మాట, **భాషణం** = మాట్లాడటం; విశే. **భాషితం** = మాట్లాడినది, **భాష్యం** = మాట్లాడదగ్గది.

**భాసిల్లు** అక. = ప్రకాశించు, అనిపించు; రూ. **భాసిలు** విశే. **భాసమానం** = ప్రకాశిస్తున్నది, అనిపిస్తున్నది, **భాసురం, భాస్వంతం** = ప్రకాశించే, అనిపించే, **భాసంతం** = చక్కని.

**భిక్షించు** సక.= బిచ్చమెత్తు; వి. **భిక్ష** = బిచ్చం, **భిక్షుకుడు** = సన్యాసి, అడుక్కొనేవాడు

**భిన్నించు** అక. = భిన్నంగా ఉండు, మరోవిధంగా ఉండు; వి. **భిన్నం** = వేరయిన.

**భీతిల్లు** అక. = భయపడు, వెరచు; వి. **భీతి** = భయం, వెరపు; విశే. **భీతం** = భయపడ్డ.

**భీష్మించు** అక. = మొండికిపడు, పట్టుబట్టు (భీష్ముడిలా పట్టుదలతో ఉండు)

**భుజించు** సక. = తిను, భోజనంచేయు; వి. **భుక్తి** = భోజనం, అనుభవం, **భోజనం** = ఆహారం, తిండి, **భోజ్యం** = తినదగ్గ, **భోక్త** = తినేవాడు, అనుభవించేవాడు; విశే. **భుక్తం** = తిన్నది, **భోక్తవ్యం** = తినదగిన, అనుభవించదగిన.

**భూషించు** సక. = పొగడు; వి. **భూష/ భూషణం** = అలంకారం, **భూషితుడు** = అలంకృతుడు.

**భేదించు** సక. = చీల్చు, వేరు చేయు; వి. **భేదకుడు** = చీల్చేవాడు, వేరుచేసేవాడు, **భిద/ భేదనం/ భేదం** = చీల్చటం, వేరుపరచటం, చీల్పు, వేరిమి; **భిత్తం** = ముక్క, పీలిక, **భిత్తి** = గోడ, తునక, చీల్పు; **భిదురం** = చీల్చేది, వజ్రం.

**భేదిల్లు** అక. = చీలు, వేరగు. చూ. భేదించు

**భోగించు** అక. = సుఖించు, అనుభవించు; వి. భోగం = సుఖం, భోజనం, ధనం, భోగిని = వేశ్య, భోగ్యం = ధనం, ధాన్యం, భోగగృహం = పడకటిల్లు; విణ. భోగవతి = సుఖాలుకలది, భోగ్యం = అనుభవించదగిన.

**భోంచేయు** సక. = భోజనం చేయు, తిను.

**భ్రమరించు** అక. = తిరుగాడు, చుట్టూ తిరుగు; వి. భ్రమణం = తిరుగుడు, తుమ్మెద, భ్రమం = తిరుగుడు, భ్రమరకం = తుమ్మెద, భ్రమరి, భ్రామకం = తిరిగేది, తిప్పేది, భ్రాంతి = తిరుగుడు, భ్రమి = తిరుగుడు; విణ. భ్రాంతం = తిరిగిన.

**భ్రమించు** సక. = తిరుగు, చుట్టూతిరుగు. చూ. భ్రమరించు

## మ

**మక్కళించు** అక. = తిరగబెట్టు, సరిపడు, సరిపోలు, ప్రే. తిరగబెట్టించు, సరిపరచు, సరిపెట్టు, సరిపోల్చు.

**మక్కు** అక. = వెలవెలపోవు, బాధపడు, చచ్చు, సక. గీరు, గీకు; వి. మక్కు = మురికి; విణ. మక్కి = నిస్సారం.

**మగుడబడు** అక. = మరలు, తిరిగిపోవు.

**మగుడు** అక. = మరలు, మళ్ళు.

**మగుడుచు** ప్రే. = మరలించు, మళ్లించు. రూ. మగుడ్చు

**మగ్గు** అక. = (ఉక్కుతో) చెమ్మగిలు, మాగు; వి. మగ్గుడు = మగ్గిపోవటం.

**మగ్గుడుపారు** అక. చూ. మగ్గు.

**మచ్చరించు** అక. = ఈర్ష్యపడు, ద్వేషించు, . పోటీపడు; రూ. మచ్చరికించు వి. మచ్చరం = ద్వేషం, మచ్చరీడు / మచ్చరి = ఈర్ష్యాళువు, ద్వేషించే వ్యక్తి, మచ్చరింత / మచ్చరికం = ద్వేషం, పోటీ, ఈర్ష్య.

**మచ్చరికించు** అక. చూ. మచ్చరించు

**మచ్చికపడు** అక. = అలవాటగు, మరులుకొను; వి. మచ్చిక / మచ్చిగ = మోహం, ఆసక్తి.

**మంచు** ప్రే. రూ. మనుచు

**మటుమటలాడు** సక. = చిటచిటలాడు, మండిపడు; వి. మటుమటు = మలమల, చిటచిట, కోపం.

**మట్టగించు** సక. = తగ్గించు; వి. మట్టసి = పొట్టివాడు; విణ. మట్టం = తక్కువ, పొట్టి, మట్టసం = పొట్టి, పరిమితం.

**మట్టాడు** సక. = తిరుగు, ప్రయాణించు, వ్యాపించు. చూ. మట్టు

**మట్టు** సక. = తొక్కు; వి. మట్టు = తొక్కుడు, కుదురు, మితి, ప్రదేశం; విణ. మట్టు = తక్కువ, మితం.

**మట్టుకొను** అక. = కుదురుకొను; వి. మట్టు = కుదురు.

**మట్టుచేయు** సక. = తగ్గించు.

**మట్టుపడు** అక. = కుదురుపడు, అణిగిపోవు.

**మట్టుపెట్టు** సక. ప్రే. మట్టుపరచు / మట్టుపరుచు = అణగార్చు, చంపు.

**మట్టుమిగులు** అక. = అతిక్రమించు, మించు.

**మట్టుమీరు** అక. చూ. మట్టుమిగులు

**మడగు** అక. = వంగు, మెనుదిరుగు; వి. మడక / మడుపు = మడత. చూ. మడచు

**మడచు** అక. = వంచు, మళ్లించు. చూ. మడగు

**మడత్రొక్కు** సక. = (అడుగులు పొంతని) లొంగ దొక్కు.

**మడవు** అక. = పెడమొహంపెట్టు, నిష్ఠురమగు.

**మడియు** అక. = చచ్చు, తునకలగు.

**మడుగు** అక. = అణిగిపోవు; రూ. మడుంగు/ మడ్గు/ మణుగు వి. మడుగు = అణుగు, ఉపశాంతి.

**మడుచు** ప్రే. = అణగించు. చూ. మడుగు

**మణగు** అక. చూ. మడగు

**మణచు** ప్రే.= మణుగునట్లుచేయు చూ. మడుగు

**మణువు** అక. చూ. మడుగు.

**మండాడు** సక.= దీనంగాయాచించు, మొక్కిపెట్టు, వి. **మండి** = ఒక కాలును నేలమీద మోకరించ టం; **మండాటం** = హీనయాచన.

**మండు** అక. = మంటవచ్చు, జ్వలించు, మరుక్కు మను, వేడెక్కు; వి. **మంట** = జ్వాల, కోపం, మరుక్కుమనే నొప్పి; **మంటమారి** = కోపనారి, **మండిపోయే** మనిషి, **మండునెల** = వేసవి.

**మండెతిరుగు** అక. = (బావి) కుంగిపోవు, పూడిపోవు.

**మండ్రాడు** అక. = దుఃఖపడు, బాధపడు; వి. **మండ్రాటం** = దుఃఖం, సంతాపం.

**మత్తిల్లు** అక. = మదించు, మత్తెక్కు; వి. **మత్తు** = మంపు, మదం, **మత్తుడు** = మదించిన వాడు.

**మథించు** సక. = చిలుకు; వి. **మథనం** = చిలకటం, **మంథనం** = చిలకటం, కవ్వం, **మంథదండం**/ **మంథం**/ **మంథరం**/ **మంథానం** = కవ్వం.

**మదమడచు** సక. = చంపు; వి. **మదం** = కొవ్వు, **పొగరు**, గర్వం.

**మదించు** అక. = కొవ్వెక్కు, తలచు, సక. లెక్కించు, అంచనావేయు; రూ. **మదియించు** వి. **మదింపు** = అంచనా, లెక్క.

**మదురు** సక. = బాగాపండు, ముదర బండు. రూ. మదులు

**మనస్కరించు** అక. = నచ్చు, మనసుపెట్టు; వి. మనస్కారం = మనఃపూర్వకమైన యత్నం, మనఃపూర్తి.

**మనాయించు** సక. = లక్ష్యపెట్టు, విను, లోబడు, తెలియజెప్పు; వి. మనాయింపు = తెలియ జెప్పటం.

**మనికితపడు** అక. = దుఃఖపడు; వి. **మనికితం** = దుఃఖం

**మను** అక. = బతుకు, జీవించు, వర్తించు; వి. మను/ మన్ను = నేల, భూమి, **మనుకువ** = నివాసస్థలం, **మనుగడ** = జీవనం, జీవన మార్గం, **మన్నిక** = చాలాకాలం ఉండటం, **మనువర్తి** = జీవనభృతి, **మనికి/ మన్కి**= జీవించటం, నివసించటం, జీవనం, నివాసస్థలం.

**మనుచు** ప్రే. = మననిచ్చు, బతికించు, బతక నిచ్చు; రూ. **మంచు/ మనుపు** వి. **మనపు** = రక్షణ.

**మనుపు** ప్రే. రూ. **మనుచు** చూ.

**మంతిరించు** అక. = మంత్రంవేయు, మంత్రం పెట్టు; రూ. **మంత్రించు** వి. **మంతరం**= మంత్రం, **మంత్రకాడు** = మంత్రంవేసేవాడు, మోసగాడు, వశీకరించేవాడు, **మంత్రం** = మంతరం, రహస్యం, **మంత్రవాది** = మాంత్రికుడు, **మంత్రాంగం** = తంత్రం, నేర్పు, **మంతరసాని/ మంత్రసాని** = సుఖప్రసవం చేయించే వైద్యురాలు/ దాది.

మంత్రించు అక. రూ. మంతిరించు

మందగించు అక. = మెత్తబడు, మెల్లనగు, మందమగు; వి. మందగామి = మెల్లగా నడిచేవాడు, మందగింపు = మెల్లన, ఆలస్యం, మందుడు = శని; విశే. మందం = మెల్లని, పొరపలేని, మందుడు = మొద్దు, లల్పుడు, తిరుగుబోతు, మూర్ఖుడు.

మందలించు సక. = హెచ్చరించు, ఆజ్ఞాపించు, తప్పు గుర్తించి తెల్పు, మనవి చేయు, తలచుకొను; వి. మందల = మేర, హద్దు, మనుదల = జీవం, మందలింపు = హెచ్చరిక, తప్పు ఎత్తి చూపటం.

మందీభవించు అక. = మందబుద్ధిలగు, మొద్దుబారు, మెల్లబడు. చూ. మందగించు

మన్నించు సక. = గౌరవించు; వి. మన్ని = జీవం, మన్నన = సమ్మానం, మర్యాద, మన్నింపు = గౌరవమివ్వటం, మన్నిక = సమ్మానం, మన్నన.

మప్పు అక. = అలవాటు చేయు, మరిగించు, (పాతవాటిని) మరపించు. రూ. మరపు

మబ్బుకొను అక. = మత్తిల్లు, మంపుగొను. చూ. మంపుగొను

మభ్యపెట్టు సక. = మోసగించు, నేర్పుగా దాటవేయు, టోకరాయిచ్చు.

మంపిల్లు అక. = మత్తిల్లు, మైకంలోపడు; రూ. మంపిలు వి. మంపు = మత్తుమైకం, మదం.

మంపుగొను అక. చూ. మంపిల్లు = మత్తిల్లు.

మంబరముసేయు సక. = తగలబెట్టు, దహించు; వి. మంబరం = మంట, దహనం.

మరగు అక. = అలవాటుపడు, ఆశపడు, సక. ఆశించు.

మరచు సక. = మరిచిపోవు; వి. మరపు/ మరుపు = గుర్తుతప్పటం, మరగువ = అజ్ఞానం, జ్ఞాపకశక్తి లోపం.

మరణించు అక. = చచ్చు; వి. మరణం = చావు.

మరపు ప్రే. = అలవరచు, అలవాటుచేయు. చూ. మప్పు

మరలు అక. = వెనుదిరుగు, వెనక్కుమళ్లు రూ. మళ్లు

మరలుచు ప్రే. = వెనక్కు మళ్లించు/ తిప్పు రూ. మరల్చు

మరించు అక. రూ. మరణించు చూ.

మరుగు అక. = చాటున ఉండు, అదృశ్యమగు, దుఃఖపడు; వి. మరుగు = చాటు, మరుకువ = దుఃఖం; విశే. మరుగు = చాటుగా ఉన్న.

మరుగుపడు అక. = చాటగు, కనుపించకుండు; రూ. మరుపడు వి. మరుగుపాటు = చాటు, అదృశ్యత.

మరుపడు అక. రూ. మరుగుపడు

మరులుకొను అక. = మోహించు, మోహంలోపడు; వి. మరులు = మోహం, మరులుదీగ/ మరులుజడ/ మరుల మాతంగి = మోహం పుట్టించే ఒక మూలిక.

మర్దించు సక. = పిసుకు, నూరు, గుద్దు, పిండికొట్టు, పొడిగొట్టు; వి. మర్దనం/ మర్దింపు = పిసకటం, నూరటం, చూర్ణం, పొడి, మర్దలం = మద్దెల; విశే. మర్దితం = నూరినది.

మలగు అక. = తిరుగు, మళ్లు, వంకరలగు; రూ. మలంగు వి. మలక = మెలిక; విశే. మలక = వంకర.

మలచు ప్రే. సక. = మలగునట్లు చేయు, మళ్లించు, తిప్పు, తొలుచు, చెక్కు.

మలపు ప్రే. చూ. మలచు = తిప్పు, మళ్లించు.

మలపుగొను అక. = నాట్యమాడు, నర్తించు; వి. మలపు = నాట్యం, నర్తనం.

మలయు అక. = తిరుగు, పెనగులాడు, ఉద్యమించు, ఉద్రేకించు, లపించు, వ్యాపించు; వి. మలయిక = విహారం.

మలుగు అక. = ఆరు, నశించు.

మలుచు సక. = చెరగు, తరిమెసబెట్టు, రాతిని తొలచు/ చెక్కు. రూ. మల్చు

మలుపు ప్రే. = ఆర్పు, నశింపజేయు.

మల్లచరచు అక. = జబ్బచరచు, సవాలు చేయు; వి. మల్లచరపు = జబ్బచరచటం.

మల్లడించు అక. = అతిశయించు, ముమ్మరమగు, పెనగులాడు; వి. మల్లడి = పరితాపం, పెనగులాట.

మల్లడిగొను అక. ప్రే. మల్లడి గొలుపు = పెనగొను, దుఃఖించు.

మల్లాడు అక. = పెనగులాడు; వి. మల్లాట= పెనగులాట; విశే. మల్లామడి = పెనగులాడే.

మల్లుకట్టు సక. = అడ్డగించు; విశే. మల్లు = కుస్తీపట్టు, మల్లుడు = జెట్టి, పస్తాదు.

మల్లుపెనగు అక. = కుస్తీపట్టు పట్టు. చూ. మల్లుకట్టు

మసగు అక. = రేగు, విజృంభించు, రెచ్చిపోవు. రూ. మసంగు

మసలు అక. = ఆలసించు, (నీళ్లు) మలమల కాగు, విహరించు, వెనుదిరుగు; వి. మసలిక = మాంద్యం, ఆలస్యం; విశే. మసలిన = మంది మైన, మెల్లని.

మసలుకొను అక. చూ. మసలు = ఆలస్యం చేయు.

మళ్లించు ప్రే. చూ. మరలించు

మళ్ళు అక. చూ. మరలు

మాకొను సక. = కరచు, కొరుకు.

మాగు అక. = బాగాపండు; వి. మాగు/ మాగుడు = మలినం, నలుపు.

మాగుడువారు అక. = మాడిపోవు, మాసిపోవు; వి. మాగుడు/ మాగు = నలుపు, మలినం. చూ. మాయు

మాగువడు అక.= మాసిపోవు, మాడిపోవు.

మాగువారు అక. = మాసిపోవు, నల్లబడు, మాడిపోవు.

మాటాడు అక. = పలుకు, మాటలు చెప్పు; రూ. మాట్లాడు వి. మాట = పలుకు, పదం, వృత్తాంతం, మాటకాడు = నిర్భయంగా మాట్లాడే వక్త, మాటకారి = నేర్పుగా మాట్లాడే వాగ్మి; విశే. మాటలమారి = అతిగా మాట్లాడే.

మాటు అక. = తగులుకొను, సక. మరుగుపరచు; వి. మాటు = తగులం, మరుగు, చాటు; విశే. చాటు మాటు = రహస్యమైన.

మాటుమణుగు అక. = నిశ్శబ్దమగు; రూ. మాటు మడుగు వి. మాటు = తగులం.

మాటువడు అక. = మరగుపడు; వి. మాటు = చాటు, మరుగు.

మాడు అక. = నల్లబడు, మాడిపోవు, తగలబడు, అడుగంటు, మెలగు, కలిసిఉండు; వి. మాడు= అడుగంటి మాడిన అన్నం మొ॥.

మాడుచు ప్రే. = మాడించు, మాడేట్లు చేయు, కాల్చు, నల్లబరచు; రూ. మాడ్చు వి. మాడు, మాడుపు = నల్లబడ్డ అన్నం మొ॥.

**మానసించు** అక. = తలచు, ఆలోచించు; వి. మానసం = మనస్సు, మానిసి = మనిషి.

**మాను** సక. = మానుకొను, విడుచు, వదిలిపెట్టు; రూ. మ్రాను విణ. మాను = చక్కని.

**మానుచు** ప్రే. = మానేట్లుచేయు, మానిపించు. రూ. మాన్చు/ మానుపు/ మాన్పు/ మానించు

**మాపు** ప్రే. = పాగొట్టు, మాసేట్లు చేయు, మాయించు; వి. మాపు = సాయంత్రం, రాత్రి, మైల, మకిల, మాడుపు = మైల, మకిల, ముని మాపు = సాయంత్రం; విణ. మునిమాపు = కొద్దిపాటి చీకటి.

**మాఫీ చేయు** సక. = రద్దుచేయు, క్షమించు, మన్నించు; వి. మాపు = మన్నించటం, క్షమించటం, మాఫీ = క్షమ, రద్దు.

**మాయు** అక. = మలినమగు, మకిలపడు, మాసిపోవు; వి. మాపుడు/ మాపు = మకిల, మైల, నల్లదనం, మాయి = వాటు, నలుపు.

**మారాడు** అక. = మారుమాట్లాడు, ఎదిరించి పలుకు; వి. మారాట = మారుమాట, ఎదురు మాట, మారాటం = పోట్లాట, కలహం, మారుదల, మారుపాటు/ మార్పాటు = మార్పిడి, మారటం వ్యత్యాసం, మారుమాట = ఎదురు మాట, మారుమూల = ఎదురు మూల, మారు మనువు = మరోపెళ్లి, మారు మగడు = మరోభర్త, మారుదల్లి = సవతితల్లి, మారుమోత = ప్రతిధ్వని.

**మారు** అక. మా. మారాడు = మారిపోవు, చెడిపోవు, నశించు, మరోరూపం పొందు; వి. మారు = ఎదురు; విణ. మారు = ప్రతి.

**మారుచు** ప్రే. రూ. మార్చు = మారేట్లు చేయు; వి. మారుపు/ మార్పు = మార్చటం, మారుదల/ మారుపాటు = మారుపడటం, మారుతుడు, మార్తుడు = మార్చేవాడు, శత్రువు.

**మారుపడు** అక. = మారిపోవు, ఒకదాని కింకొకటి సమకూడు, భేదపడు; వి. మారకం = మార్పు, మార్పిడి, మారుపాటు = మారుపడటం.

**మారుపెట్టు** అక. = ఎదిరించు. రూ. మార్పెట్టు

**మారుమొగము వడు** అక. = పెడమొహం పెట్టు; వి. మారుమొగం = పెడమొహం, పరాఙ్ముఖం.

**మారొడ్డు** అక. = ఎదురొడ్డు, ప్రతిఘటించు; వి. మారొడ్డు = ప్రతిఘటన.

**మార్కొను** అక. = ఎదుర్కొను, సక. ఎదిరించు; రూ. మారుకొను వి. మారు = ఎదిరి, ప్రతి

**మార్చు** ప్రే. = మారేట్లుచేయు, మార్చివేయు, నాశనంచేయు, సక. వర్ధించు; మా. వార్చు వి. మార్పిడి / మారుపు/ మార్పు = ఒకదాని బదులు మరొకటి ఇవ్వటం, పుచ్చుకోవటం (కుండ మార్పిడిలో లాగా)

**మార్జించు** సక. = తుడుచు, కడుగు; వి. మార్జన(ం) = తుడవటం, తోమటం, మార్జని = చీపురు (కట్ట); విణ. మార్జనీయం = మడవ దగ్గది.

**మాలు** అక. = చెడు, చెడిపోవు, నశించు.

**మాలుగు** అక. = సోమరియగు, బద్ధకించు; రూ. మాల్గు వి. మాలుగు = సోమరితనం, బద్ధకం, మాలుగుబోతు = సోమరి, బద్ధకస్థుడు.

**మాలుచు** ప్రే. = సోమరిని చేయు. రూ. మాల్చు

**మిక్కిలు** అక. = ఎక్కువగు, మించు, మీరు; వి. **మిక్కిలివాడు** = శ్రేష్ఠుడు, మిక్కిలి కన్ను = మూడోకన్ను; విశే. మిక్కిలి = అధికం, ఎక్కువ, శ్రేష్ఠమైన, మిక్కుటం = అధికం, మిక్కుటం.

**మిగులు** అక. = శేషించు; రూ. మివులు వి. మిగులు = శేషం, మిగతా = మిగులు, శేషం.

**మిగులుచు** ప్రే. = మిగిలేట్లుచేయు, శేషింప జేయు. చూ. మిగులు

**మింగు** సక. = కబళించు; వి. మింగుడు, మ్రింగుడు = మింగటం, కబళనం.

**మింగుడుపడు** అక. = మింగటానికి వీలగు. చూ. మ్రింగుడుపడు

**మించు** అక. = అతిక్రమించు, దాటు, అతిశయించు, అధిగమించు; వి. మించు = ఆధిక్యం, ఎక్కువవడం, మించుదల = అతిక్రమణ, ఆధిక్యం.

**మిటారించు** అక. = నిక్కు, అతిశయించు, విజృంభించు; వి. మిటారం = నిక్కు, అతిశయం, **మిటారి** = నిక్కుగల స్త్రీ.

**మిట్టాడు** అక. = నడచు, తిరుగు, ఎగురు, కదలు, సంచరించు; వి. **మిట్టిపాటు** = మిడిసిపాటు. చూ. మిట్టిపడు

**మిట్టించు** అక. = మిడిసిపడు, ఎగిరిపడు; వి. **మిట్టిపాటు** = మిడిసిపాటు, ఎగురు, **మిడి/ మిడిసిపాటు/ మిడిమేలం** = మిట్టిపాటు. చూ. మిట్టు

**మిట్టు** అక. = ఎగురు, మిట్టించు. చూ. మిట్టించు

**మిడియు** అక. = ఎగురు, మిట్టిపడు, మిడిసిపడు; వి. మిట్ట = ఎత్తయిన చోటు ఉన్నతి, మిట్టిపాటు / మిడి / మిడిసిపాటు / మిడిమేలం = ఎగిరిపడటం, మిట్టిపడటం, గర్వం; మిట్టమిర్రు = చాలా ఎత్తయిన నేల, మిడిగుడ్లు = ముందుకు పొడుచుకు వచ్చిన కళ్లు, మిడిపళ్లు = మిట్టపళ్లు, పొడుపళ్లు, మిడినాగు/ మిణ్నాగు = ఎగిరిపడే పాము; విశే. మిట్ట = ఉన్నతమైన, ఎత్తయిన, మిడిమిడి = తెలిసీ తెలియని, వచ్చీరాని, పొగరుబోతు.

**మిడిసిపడు** అక. = మిట్టిపడు; వి. **మిడిసిపాటు** = మిట్టిపాటు. చూ. మిట్టిపడు

**మిడుకు** అక. = తుళ్లిపడు, కదలు, తిరుగు, బతుకు, బాధపడు, ఎండిపోవు; వి. **మిడుకు** = జీవం, బతుకు.

**మిడుచు** సక. = (నీళ్లు మొ॥) బొట్లు బొట్లుగా కార్చు, మెటికలు విరుచు.

**మిడుమిడుకను** సక. = బాధపడు, పరితపించు; వి. మిడుకు = పరితాపం, బాధ, దుఃఖం.

**మిణకరించు** అక. = తోచకతిరుగు; వి. మిణకరం/ మిణకరింత = తోచని తిరుగుడు.

**మినమినలాడు** అక. = మిలమిలా మెరయు; వి. మిణకరం/ మిణకరింత = తోచని తిరుగుడు.

**మినహాయించు** సక. = తగ్గించు, తీసివేయు; వి. మినహాయింపు = తగ్గింపు, తీసివేత.

**మినుకు** అక. = మెరయు, మెరిసిపోవు; రూ. మిన్కు వి. మినుకు/ మిన్కు = వెలుగు, కిరణం, వేదం, మాట, మిన్ను/ మిను = ఆకాశం, మినుకు జేడియ = సరస్వతి, మినుకుల బరణి/ మినుకులయిక్క = సూర్యుడు.

**మినుకు మినుకు మను** అక. = తళతళమని మెరిసిపోవు.

**మినుక్కురను** అక. = మిలమిలా మెరిసిపోవు.

**మినుకుమినుకను** అక. = మిలమిలా మెరయు

**మిరుమిట్లుగొను** అక. = కళ్లుచెదరు; వి. మిరుమిట్లు/ మిర్మిట్లు = కళ్ళుచెదిరేకాంతి; విశే. మిరుమిరు = మెరిసిపోయే.

**మిలమిలలాడు** అక. = తళతళామెరయు; చూ. మినమినలాడు వి. మిలమిల/ మినమిన = తళతళ. మిలమిలన = మెరిసిపోవటం;

**మిలాయించు** సక.= కలుపు; వి. మిలాయింపు = కలపటం.

**మివులు** అక. చూ. మిగులు

**మిశ్రీకరించు** సక. =కలిపివేయు; వి. మిశ్రణం = కలపటం, మిశ్రీకరణం = కలిపివేయటం; విశే. మిశ్రం/ మిశ్రితం = కలిసిపోయినది.

**మిసమిసమను** అక. = మెరిసిపోవు; చూ. మిసమిసను వి. మిస/ మిసమిస= వెలుగు.

**మిసమిసలాడు** అక. = (యౌవనంలో) ఆరోగ్యంగా కనిపించు, తళుకు బెళుకులు కనిపించు. **మిసిమి** = కొత్తతళుకు, చక్కదనం, మెరుపు.

**మిసుకు** అక. =కదలు

**మీటు** సక. = (తీగలు) కదిలించు, (వస్తువులు) ఎగజిమ్ము, పొడుచుకొని వచ్చు, (తేలు) కుట్టు, పొడుచు, గోళ్లతో తాకు; వి. మీటు = ఉద్రేకం, పెంపు(దల); విశే. మీటు = ఎక్కువయిన.

**మీరు** అక. = దాటు, అతిశయించు, సక అతిక్రమించు, హద్దుదాటు.

**ముకుళించు** అక. ప్రే. = ముడుచుకొనిపోవు, ముడిపించు; వి. ముకుళం = సగం విచ్చిన మొగ్గ; విశే. ముకుళితం = ముడుచుకుపోయినది.

**ముకుళీభవించు** అక. ముకుళించు చూ.

**ముక్కు** అక. = ఊపిరి బిగబట్టి మూలుగు, వెడిపోవు.

**ముష్కారు** అవి. = తోపకుండు

**ముక్కొను** అక. = ముసుకొను, ముందు నడుచు

**ముక్తాయించు** సక. = ముగించు; వి. ముక్తాయింపు = ముగింపు.

**ముగించు** సక. = పూర్తిచేయు; చూ. ముగియు వి. ముగియుట/ ముగింపు = పూర్తి, సమాప్తి.

**ముగియు** సక. = పూర్తిఅగు, సమాప్తమగు; వి. ముగింపు/ ముగియుక = పూర్తి, సమాప్తి.

**ముచ్చిరు** అక. = ఏడ్చు, దుఃఖించు వి. ముచ్చిరి = దుఃఖితుడు, ముచ్చిరితనం = ఏడ్పుగొట్టుతనం.

**ముచ్చిలించు** సక. = దొంగిలించు; చూ. మ్రుచ్చిలించు వి. ముచ్చిలిపాటు = కునికిపాటు, ముచ్చు/ మ్రుచ్చు = దొంగ, మ్రుచ్చిమి/ మ్రుచ్చిరి = దొంగతనం, మ్రుచ్చిలిపోటు = దొంగపోటు, నిద్రించేవాళ్లపై బడటం, మ్రుచ్చు గోర = పెద్దదొంగ, మ్రుచ్చు ప్రొద్దు = అర్ధరాత్రి.

**ముచ్చటపడు** అక. = కోరు, కావాలనుకొను, ప్రేమించు, ఇష్టపడు; వి. ముచ్చట = సల్లాపం, సరససంభాషణ, వృత్తాంతం, కబురు, కోరిక, ముచ్చటకాడు = కబుర్లరాయుడు, కోరిక కలవాడు, ముద్దుముచ్చట్లు = ఇచ్చకాలు.

**ముచ్చటించు** అక. = ముద్దుగా మాట్లాడు, ముచ్చటలాడు. చూ. ముచ్చటపడు

**ముచ్చముడుగు** అక. = పూర్తిగా ముడుచుకొని పోవు, చేతులు కాళ్ళాడక పోవు.

**ముంచు** ప్రే. చూ. మునుచు

**ముంచుకొను** సక. = ఆక్రమించు, ముట్టడించు. చూ. మునుచు

**ముట్టబడు** అక. = అలసిపోవు, డస్సిపోవు.

**ముట్టడించు** సక.= చుట్టుముట్టి నిర్బంధించు, ఆక్రమించు, దండెత్తు; వి. ముట్టడం/ముట్టణం/ముట్టడి = నిర్బంధం, ముట్ట డించటం/ముట్టుకోలు = ముట్టడి.

**ముట్టించు** ప్రే.= తగలబెట్టు, రగులు, కాల్చు

**ముట్టు** సక. = తాకు, ముట్టడించు, తగిలేట్లు మాట్లాడు; వి. **తాకు/తాకుడు** = దెబ్బ, ముట్టడి, పరికరం.

**ముట్టుకొను** సక. ప్రే. ముట్టుకొలుపు = ముట్ట డించు, తాకు, ఆక్రమించు

**ముట్టుకోలుగొను** సక. రూ. ముట్టు కోల్గొను చూ. ముట్టడించు.

**ముట్టుకోలుపరచు** సక. = ముట్టడించు. చూ. ముట్టడించు

**ముట్టుపడు** అక. = ఇబ్బందిపడు; వి. ముట్టు **పాటు** = ఇబ్బంది, సంకటం.

**ముడిగొను** అక. ప్రే. ముడికొలుపు = ముడుచు, ముడిపెట్టు; వి. ముడి =(జుట్టు మొ॥) కలిపికట్టిన చిక్కు, కలయిక, సంధి, ముడికాడు = తార్పుడు కాడు, కలిపేవాడు; విశే. ముడి = విడిపోనిది, వికసించనిది, విడివనిది

**ముడివడు** అక. = కలిసిపోవు, ఒకచోటికిచేరు, పెనగొను, పెరుగు, కలుగు, జరుగు; వి. ముడి **వాటు** = ముడివడటం.

**ముడిపెట్టు** సక.= ముడివేయు.

**ముడుగబారు** అక. చూ. ముడుగు.

**ముడుగు** అక. ప్రే. ముడుచు =ముకుళించు, ముడుచుకొనిపోవు, తగ్గు, సంకోచించు, చేష్టలుడుగు

**ముడుచు** సక. ప్రే.=ముడివేయు, ముకుళింపజేయు, ముడుగునట్లు చేయు, ముడిపెట్టు; వి. ముడుపు =మూట.

**ముండమోయు** అక. = విధవరాలగు, వ్యర్థమగు; వి. ముండ/ముండమోపి = విధవరాలు; విశే. ముండ/ముండమోపి = వ్యర్థమైన, పనికిరాని.

**ముదలకించు** సక. = ఎదుర్కొను, అడుగు, లక్షించు; రూ. ముదలించు వి. ముదల = ఆజ్ఞ, లక్ష్యం.

**ముదలపెట్టు** సక. = ఆజ్ఞాపించు.

**ముదలించు** సక. చూ. = ఎదుర్కొను. రూ. ముదలకించు

**ముదురు** అక. =(కాయ మొ॥) పరిణమించు, గింజగట్టిపడు, పెరుగు; వి. ముదిమి = ముసలి తనం; విశే. ముదురు = వయసు పెరిగిన, ముది/ముదుసలి/ముదుక/ముసలి = వయసు మళ్ళిన.

**ముద్దాడు** సక. = ముద్దుపెట్టుకొను, ముద్దుచేయు, ఆదరించు; వి. ముద్దు = చుంబనం, చక్కదనం, ముద్దులాట = ముద్దులు పెట్టుకోవటం, ముద్దుగుమ్మ/ముద్దులాడి/ముద్దురాలు = ముద్దు వచ్చే స్త్రీ, ముద్దులాడు = ముద్దువచ్చే పురుషుడు. విశే. ముద్దు = చక్కని, నచ్చే.

**ముద్దిడు** సక. = ముద్దుపెట్టుకొను. చూ. ముద్దాడు

ముద్దుపెట్టుకొను సక. = చుంబించు. చూ. ముద్దాడు

ముద్రించు సక. = అచ్చొత్తు; వి. ముద్ర= గుర్తు, అచ్చు, (ఉంగరం మొ॥) మీది అక్షరాల గుర్తు ముద్రణ(ం) = అచ్చొత్తటం, ముద్రాపకుడు = ముద్రించేవాడు; విశే. ముద్రితం = అచ్చయినది

మునుకు అక. = మారుమాట్లాడు, పలుకు, దుఃఖించు.

మునుకొను అక. = ముందుకు నడుచు, మొదలు పెట్టు, ముందుకు వచ్చు; రూ. మున్కొను వి. మునుకోలు = ముందుకు రావటం, మును కువ = పూనిక, పట్టుదల, మునుపు = ముందు, పూర్వం; విశే. మున్నడి / మున్నుడి (అవ్య.) = ముందుగా.

మునుగు అక. = మునకవేయు, మరుగుపడు, అణిగిపోవు, నశించు; రూ. మున్గు వి. మునుక/ మునక = మునగటం, మునక వేయటం.

మునుచు అక. మునుకొను చూ.

మునుపడు అక.చూ. మునుకొను

మునుముకొను అక. = వరసపెట్టు; రూ. మున్ము; వి. మున్ము/ మునుము = ఎదురు, ఎదటి చోటు, సేనలముందుచోటు, రణరంగం, వరస.

మున్గు అక. చూ. మునుగు

ముందుపడు అక.= ముందుకు వచ్చు, మును కొను; చూ. మునుకొను వి. ముందర = మునుపు, మొదలు, ఎదురు, ముందల = తలపై భాగం, ముందు = ఎదురు, పూర్వకాలం.

ముప్పటిలు అక. = చల్లారు, చల్లబడు.

ముప్పిరిగొను అక. = పెనుగొను, పెనవేసుకొను; వి. ముప్పిర/ ముప్పిర = మూడు మెలికలు; విశే. ముప్పిర/ ముప్పిరి = మెలికపడ్డ, పురి ఎక్కిన, మూడింతలయిన.

ముబ్బడించు అక. = మూడింతలగు; రూ. ముమ్మడించు విశే. ముబ్బడి/ ముమ్మడి = మూడింతలు, ముమ్మడుగు = మూడురెట్లు.

ముమ్మడించు అక. మూడింతలగు. రూ. ముమ్మ డించు

ముమ్మరించు అక. = ఎక్కువగు, అతిశయించు; వి. ముమ్మరం = ఎక్కువ, అగ్గలం.

ముంపుగొను అక. = గుంపుగట్టు; వి. ముంపు = గుంపు.

మురకటించు సక. = తిప్పు; వి. మురకటం = తిప్పటం, తిప్పుడు.

మురమురమను అక. = ఏద్రుబుద్రుమను, చిట పటలాడు.

మురమురలాడు అక. చూ. మురమురమను

మురళించు సక. = తిరస్కరించు

మురాళించు సక. = దిగదుడుచు; వి. మురాళం = దిగదుడుపు.

మురించు ప్రే. = తిప్పు. చూ. మురియు

మురికొను సక. = ఖండించు, నరుకు; వి. మురియ = ముక్క, ఖండం.

మురియబడు అక. = అతిశయించు. చూ. మురియు

మురియు అక.= నడుస్తూ కులుకు, తిరుగు, గర్వించు, తెగిపోవు, విరిగిపోవు; వి. మురిపం/ మురిపెం = నడకలో కులుకు, గర్వం, మురువు = గర్వం, చక్కదనం; విశే. మురువు = చక్కని.

**మురుగు** అక. = కుళ్ళిపోవు; విణ. ముదుగుడు = మురిగిపోయినది.

**ములుసూపు** అక. = మించు, మీరు, నెగ్గు; వి. ములు / ముల్లు = త్రాసు ముల్లు.

**ముసముసమను** సక. = చిరచిరలాడు, చిఱ్ఱుబుఱ్ఱుమను, చిటచిటలాడు; వి. ముసముస = చిఱ్ఱుబుఱ్ఱు.

**ముసరు** అక. = వ్యాపించు, కమ్ము. రూ. ముసురు

**ముసించు** అక. = చెడిపోవు.

**ముసుగుపడు** అక. = మూతపడు, తడిసిపోవు; రూ. ముసుగుడుపడు వి. ముసుగు/ ముసు గుడు = మూత, కప్పు.

**ముసురుకలియు** అక. చూ. ముసురుకొను

**ముసురుకొను** అక. = (వానలా) కురియు, కప్పివేయు, (మబ్బులా) కమ్ముకొని వచ్చు; రూ. ముసరుకొను వి. ముసురు = ఎడతెగని వాన, ముసాపు/ ముసాటు = ముసురువాన.

**మూగబారు** అక. మూగు చూ.

**మూగు** అక. = కమ్ము, గుంపుగా ఒకచోట చేరు; వి. మూక = గుంపు, సేన.

**మూచూచు** సక. = వాసనచూచు

**మూడు** అక. = ముసించుకొనివచ్చు, కలుగు, ముగియు.

**మూడుచు** ప్రే. = మూడేట్లు చేయు, కలిగించు. రూ. మూడ్చు చూ. మూడు

**మూదలించు** సక. = నిరూపించు, రుజువు చూపు, హెచ్చరించు; వి. మూదల/ మూదలిక = నిరూపణ, తార్కాణం, రుజువు.

**మూను** సక. = గుద్దుతో పడకట్టు; వి. మూన = పడకట్టుగా మిగిలినది.

**మూరిబోవు** అక. = పెరుగు, అతిశయించు, విజృంభించు, సఫలమగు, సడించు.; విణ. మూర = పొడుగాటి. చూ. మూరు

**మూరు** అక. = అతిశయించు.

**మూరుకొను** సక. = వాసనచూచు. రూ. మూర్కొను

**మూర్ఛిల్లు** అక. = మూర్ఛపోవు, సొమ్మసిల్లు; వి. మూర్ఛ = సొమ్మ, అపస్మారం, మూర్ఛాలుడు = మూర్ఛరోగి, మూర్ఛితుడు = మూర్ఛ పోయినవాడు, సొమ్మరోగి.

**మూలుగు** అక. = బాధతో సన్నగా కూయు / ధ్వనించు; రూ. మూల్గు వి. మూలుగు = బాధగల సన్నటి ఏడ్పు.

**మెండుకొను** అక. ప్రే. మెండుకొలుపు = ఎక్కువగు, విజృంభించు, నిండు, అతిశయించు; వి. మెండు = ఆధిక్యం, అతిశయం, మిట్ట; విణ. మెండు = అధికం.

**మెండొడ్డు** అక. = బాగా ఎదిరించు.

**మెకమెకపడు** అక. = గర్వించు, ఉద్ధతమగు; వి. మెకమెకపాటు = ఉద్ధతి

**మెక్కు** సక. = తెగతిను; వి. మెక్కటం = కడుపు నిండాతినటం.

**మెచ్చు** సక. ప్రే. మెచ్చించు/మెప్పించు = మెచ్చుకొను, శ్లాఘించు, పొగడు, లక్ష్యపెట్టు; వి. మెచ్చు/మెప్పు = పొగడ్త, బహుమానం, మెచ్చులాడి = మెచ్చుపగ్గస్త్రీ, మెచ్చులాడు = మెచ్చుపగ్గ పురుషుడు.

**మెట్టు** సక. = ఎక్కు; వి. మెట్టు/మెట్టిక = తాప, సోపానం, మెట్టినిల్లు = ప్రవేశించిన ఇల్లు, అత్తవారిల్లు, మెట్టు = కొండ, గుట్ట, తిప్ప.

**మెత్తబడు** అక. = మృదువగు, అణిగిపోవు; విశే. మెత్త(న) = మృదువైన, మెతుక/మెతక = మెత్తని, మృదువైన

**మెత్తగిల్లు** అక. రూ. మెత్తగిలు, మెత్తబడు చూ.

**మెత్తు** సక. = (మట్టిమొ॥) మందంగా/ఒత్తుగా పూయు/రాయు; వి. మెత్తడం = మెత్తటం.

**మెదలు** అక. = కొంచెంగా కదులు, తిరుగు; వి. మెదలిక = మెదలటం.

**మెదలుచు** ప్రే. = మెదిలేట్లుచేయు. రూ. మెదల్చు

**మెదించు** సక. = కలగలుపు, కలిపివేయు. రూ. మేదించు/మెదచు

**మెదుకగొను** అక. =(తలవెంట్రుకలు) జిడ్డు పట్టు/అట్టగట్టు; వి. మెదుక = జిడ్డు, అట్ట; విశే. మెదుక = మందమైన.

**మెదుగు** అక. = నలుగు, పొడిఅగు; విశే. మెదుపు =మెత్తన.

**మెదుచు** సక. రూ. మేదించు

**మెదుపు** ప్రే. = మెదిగించు, మెదిగేట్లు వేయు. చూ. మెదుగు

**మెనుపు** సక.= కష్టంతో నూరు, ఎనుపు.

**మెయికొను** అక. చూ. మయికొను/మైకొను = సమ్మతించు, అనుకూలించు, కలుగు సక. అంగీక రించు, ఒప్పుకొను; వి. మైకోలు/మెయికోలు/మయికోలు = ఒప్పుదల, అంగీకారం, సమ్మతి.

**మెరచు** అక. = తళుక్కుని వెలుగు; వి. మెరపు/మెరుపు = వెలుగు, తటిత్తు.

**మెరమెరపడు** అక. = సందేహపడు; వి. మెరమెర = సందేహం, మనోవ్యథ, మెరమెరపాటు = సందేహపడటం .

**మెరమెరలాడు** అక. = సందేహపడు; వి. మెర మెర = మనోవ్యథ

**మెరము** సక. = (ముల్లు మొ॥) అయా ఇయా పెట్టు.

**మెరయు** అక. = వెలుగు, ప్రకాశించు, బయట పడు; రూ. మెఱియు వి. మెరపు/మెరుపు = విద్యుత్తు, తటిత్తు, మెరుగు =తళతళమనే కాంతి, మెరుపు.

**మెరుపు** సక. = పెరుకు, బయటికి లాగు, పెకలించు.

**మెలకు** అక. = జాగ్రత్తగా నడుచుకొను/ తిరుగు; వి. మెలకువ = మేలుకొని ఉండటం, ప్రవర్తన, నడవడి, జాగ్రత్త, కదలిక, తిరుగుడు, జీవనం; మెలకువకాడు = జాగ్రత కలవాడు.

**మెలచు** ప్రే. = మెలిగేట్లుచేయు. రూ. మెలపు చూ. మెలగు

**మెలపు** ప్రే. = మెలిగించు, మెలిగేట్లు వేయు; రూ. మెలచు వి. మెళ్వు/మెలపు = జాగ్రత, మెత్తదనం.

**మెలిగొను** అక.= పెనవేసుకొను వి. మెలసు/మెలి/మెలిక = పెన.

**మెలియు** అక. రూ. మెలయు చూ.

**మెలివెట్టు** సక. = మెలికవేయు, పురిబెట్టు.

**మెసగు** సక. = తిను, భుజించు. రూ. మెసపు

**మేకొను** అక. ప్రే. మేకొలుపు = సమ్మతించు, పూను, ప్రయత్నించు, కలుగు, సక. పొందు; రూ. మెయికొను వి.మేకోలు/మేగలి = పూనిక, ప్రయత్నం, **మేముడు** = సమ్మతి.

**మేగు** సక. = పూయు. రూ. మ్రేగు

**మేటిల్లు** అక. = అతిశయించు; వి. మేటి = అధిపుడు, సేవకుడు; విశే. మేటరి = మేటి, శ్రేష్ఠుడు; మేటి = శ్రేష్ఠమైన.

**మేడము పొడచు** సక. = తెలివి తక్కువగా ఉండు. రూ. మేడపడు

**మేంఢించు** సక.= భేదించు.

**మేతాడు** అక. = మేతమేయు; రూ. మేతలాడు వి. మేత = (పశువుల) తిండి; విశే. మేతరి = తిండిపోతు.

**మేపు** ప్రే. = మేసేట్లు వేయు, మేతకుతిప్పు; వి. **మేత** = పశువుల ఆహారం, మేపరి = తినేవాడు, భక్షకుడు.

**మేయు** సక. ప్రే. మేపు = (గడ్డి మొ॥) తిను; వి. **మేత** = పశువులతిండి.

**మేలమాడు** సక. = పరిహసించు, పరాచికాలాడు; వి. మేలం = పరాచికం, పరిహాసం.

**మేలుకను** అక. ప్రే.= నిద్రలేచు, మత్తువదలు, రూ. మేలుకొను/ మేల్కను/మేల్కొను వి. మేలుకొలుపు/మేల్కొల్పు = నిద్రలేపటం, మత్తువదిలించటం. ప్రే. మేలుకొలుపు, మేల్కొల్పు.

**మేలుకనుపు** అక.= మేలుకొను, మేలుకను చూ.

**మేలుపడు** అక.= ప్రేమించు, వలచు; రూ. మేల్పడు వి.మేలువాడు = ప్రేమికుడు, వలపుకాడు, మేలు = వలపు, ప్రేమ, మేలిమి = ఆధిక్యం, గౌరవం; విశే. మేలు = ఎక్కువ, శ్రేష్ఠం, శుభ స్కరమైన.

**మేళగించు** అక. = జతగూడు, కలియు, సక. జతగూర్చు, కలుపు; వి. మేళకం/మేళనం = కూడిక, మేళం = వాద్యాల జత, కూడిక, కూర్పు, మేళగాడు = మేళం వాయించేవాడు.

**మేళవించు** అక. = జతగూడు, కలియు, సక. జతకూర్చు, కలుపు. రూ. మేళగించు

**మైకొను** = సమ్మతి, అంగీకారం. రూ. మేకొను వి. మైకోలు = సమ్మతి, అంగీకారం.

**మైలపడు** అక.= మురికిపడు, మడిపోగొట్టుకొను, అశుచిలగు; వి. మైల = మురికి, అశుచి, మైలక్రోవి = మురళి.

**మొక్కచెడు** అక. చూ. మొక్కపడు

**మొక్కపడు** అక. ప్రే. మొక్కపరచు = భంగ పడు, అవమానపడు; వి. మొక్క =మొన, పదును, మొక్కలం = శౌర్యం, ధైర్యం.

**మొక్కపోవు** అక. = భంగపడు, అవమానపడు, మొక్కపడు. చూ.మొక్కపడు

**మొక్కలించు** అక. = ఉత్సాహపడు, ధైర్యపడు, మొండికిపడు; వి. మొగ్గలం/మొక్కలం = ధైర్యం, శౌర్యం, ఉత్సాహం, మొండితనం, మొక్కలి/మొక్కలికాడు/మొక్కలుడు = మొండివాడు, ధైర్యవంతుడు, మొక్కలింపు = సాహసం; విశే. మొగ్గలం/మొక్కలం = మొండి, తిరుగులేని.

**మొక్కు** అక. = నమస్కరించు, ముడుపుకట్టు; రూ. మ్రొక్కు వి. మొక్కు/ మ్రొక్కు = నమస్కారం, దండం, మొక్కుబడి/ మ్రొక్కు బడి = దేవతాప్రార్థన, ముడుపు కట్టడం.

**మొగకట్టు** అక. = మోగు, మొదలగు; వి. మొగ= మొదలు.

**మొగకొను** అక. = ఎదురువచ్చు, ఎదుర్కొను; వి. మొగ/మొగం = ఎదురు, మొగపు = (నగల) కనిపించే భాగం, మొగదల = ఎదురు, ముందు భాగం.

**మొగడించు** అక. = ముకుళించు, ముడుచుకొనిపోవు; వి. మొగడ/మొగ/మొగ్గ = కోరకం.

**మొగతప్పు** అక. = వెనుదిరుగు, పారిపోవు; వి. మొగం = ముఖం, ఎదురు.

**మొగతిరుగు** అక. = వెనుదిరుగు, మొగతప్పు

**మొగపడు** సక. = చూచు; వి. మొగమాటం, మొహమాటం/మొగమోటు = సంకోచం, మొహం చెల్లకపోవటం.

**మొగరించు** సక. రూ. మొగ్గరించు = వ్యూహం పన్ను, ఎదురించు, ఆక్రమించు; వి. మొగరం/మొగ్గరం = (సేనా) వ్యూహం, పన్నుగడ.

**మొగుచు** ప్రే. = ముకుళింపజేయు. రూ. మొగుడుచు/మొగుడ్చు.

**మొగుడు** అక. = ముకుళించు, ముడుచుకొనిపోవు; వి. మొగడ/మొగ/మొగ్గ = కోరకం, విచ్చని పువ్వు.

**మొగుడుచు** ప్రే. = ముకుళింప జేయు, ముడిచి వేయు. రూ. మొగుడ్చు

**మొగ్గతిలబడు** అక. = ఒకవైపు వాలు/మొగ్గు, మోకరిల్లు. రూ. మ్రొగ్గతిలబడు

**మొగ్గతిల్లు** అక. = ఒకవైపు వాలు, మోకరిల్లు. రూ. మొగ్గతిలు/మ్రొగ్గతిల్లు/మ్రొగ్గతిలు

**మొగ్గబడు** అక. = వాలు, పడిపోవు, మోకరిల్లు; రూ. మ్రొగ్గబడు వి. మొగ్గు = ఎక్కువ, కొసరు; విశే. మొగ్గు = ఒకవైపు వాలిన.

**మొగ్గవిచ్చు** అక. = విప్పారు, విచ్చు, వికసించు; వి. మొగ్గ/మొగ/మొగడ = విచ్చని పువ్వు, కోరకం.

**మొగ్గు** అక. = ఒకవైపు వాలు; రూ. మ్రొగ్గు వి. మ్రొగ్గు/మ్రొగ్గు = ఎక్కువ, మ్రొగ్గుదల/మొగ్గుదల = ఒకవైపువాలి వుండటం.

**మెట్టు** అక. = (నెత్తిమీద పిడికలితో) కొట్టు; మొట్టికాయ/మొట్టు = తలమీది పిడికిటి పోటు; విశే. మొట్లమారి = మొట్టికాయలు తినే.

**మొండాడు** అక. = మొండిగా ఆటలాడు; వి. మొండికట్టె/మొండతి = మొండివాడు, మొండి = మూర్ఖుడు, మొద్దు, మొండెం = తలలేని శరీరం; మొండి = కాళ్ళూ చేతులూ తెగిన/లేని, బండ బారిన, పదునులేని.

**మొత్తు** సక. = కొట్టు, నరుకు; వి. మొత్తు = దెబ్బ.

**మొత్తులాడు** అక. = కొట్లాడు, దెబ్బలాడు; వి. మొత్తు = దెబ్బ.

**మొత్తువడు** అక. = దెబ్బలు తిను; వి. మొత్తు = దెబ్బ.

**మొదలుకొను** అక. =మొదలుపెట్టు, సక. = మొదలు చేయు, రూ. మెదల్కొను; వి. మొదలు = ఆది; పూర్వం, మూలం, విశే. మొదలు అవ్య. = నుంచి

**మొదలుపెట్టు** అక. = ఆరంభించు, మొదలు కాను.

మొద్దువోవు అక.= బండబారు, పదునుపోవు; వి. మొద్దు = మూర్ఖుడు; విశే. మొద్దు = వాడిలేని, లావైన.

మొనకట్టు అక. = వ్యూహం నిర్మించు, పన్ను, ఉత్సహించు, ముందు నిలుచు; వి. మొన = కొన, ముందుభాగం, వ్యూహం, సైన్యం, మొనకాడు = సేనాధిపతి, మొనగాడు = యుద్ధవీరుడు, సమర్థుడు.

మొనకొను అక. = పూను, ప్రయత్నించు.

మొనదప్పు అక.=వెన్ను చూపు, వెనుదిరుగు; వి. మొన = సేన, ముందు భాగం.

మొనపు ప్రే. = మొనయజేయు, కలిగించు, పూనుకొనేట్లు చేయు; వి. మొనపు = పూనిక.

మొనయు అక. ప్రే. మొనపు = పూనుకొను, సిద్ధపడు, కలుగు.

మొరయు అక.= మోగు, ధ్వనించు.

మొరగు అక. = పొంచి ఉండు, సక. మోసగించు; వి. మొరగు = మోసం, మోసగాడు.

మొరమొరలాడు అక. = (గుడ్డలు మొ॥) రెపరెపలాడు, పరపరలాడు; వి. మొరమొర = పరపర, రెపరెప.

మొరవవోవు అక. = మొక్కపోవు, మొద్దుబారు; వి. మొరవ = మొనలేనిది, మొక్కపోయినది, మొరక = తక్కువదనం, మొరకు(డు) = మొద్దు, మూర్ఖుడు; విశే. మొరక = తక్కువైన, న్యూన.

మొరుగు = (కుక్క) అరచు, కూయు, వాగు; రూ. మొరువు వి. మొరుగుడు/మొరుగు/మొరువు = (కుక్క) అరుపు; మొరసడం = ఉడుప కుక్క.

మొ(్రిపోవు అక. = తొ(్రిపడు, పెంకులేచు; వి. మొ(్రి = అవయవ లోపం, తొ(్రి; విశే. మొ(్రి = తొ(్రి, అవయవాలు లోపించిన.

మొలకకట్టు సక. = విత్తనాలను తడిపి ముడికట్టు; వి. మొలవ/మొల్క/మొలక/మొక్క = మొలకెత్తుతున్న విత్తనం; విశే. మొలక = లేత.

మొలకెత్తు అక.= మొలుచు, పుట్టు; వి. మొలక, మొక్క = మొలుస్తున్న విత్తనం, చిన్న చెట్టు.

మొలచు అక. = మొలకెత్తు. రూ. మొల్చు/మొలుచు

మొలతెంచు అక. = మొలచు, పుట్టు, కలుగు. చూ. మొలచు

మొలవేయు సక. = మొలకెత్తించు, నాటు. చూ. మొలకెత్తు

మొవుడు అక. చూ. మొగుడు

మోకరించు అక. = మోకాలిపై నిలుచు, వంగి నమస్కరించు, ముందు కొరుగు; వి. మోకాలు = తొడ, పిక్కలు కలిసే చోటు. మోకరింత = ముందుకు వంగటం, నమస్కారం.

మోకరిల్లబడు అక. చూ. మోకరించు

మోకరిల్లు అక. రూ. మోకరిలు చూ. మోకరించు.

మోగు అక. = ధ్వనించు, శబ్దించు, మొరయు; రూ. మ్రోగు వి. మోత/మ్రోత/మోగుడు = ధ్వని. చూ. మొరయు.

మోచు అక. = మోయు, ఆను, సక. మొదలు పెట్టు, భరించు, వహించు; వి. మోత = బరువు, భారం.

మోటించు సక. = పోటీగా నిలుపు, తాటించు; వి. మోటుబరి = బరువులు మోసే ఎద్దు.

మోడుచు ప్రే. = ముకులింపజేయు; రూ. మోడ్చు/ మొగుడుచు/మొగుడ్చు వి. మోడుపు/ మోడ్పు = ముకులింపు.

మోడుపడు అక. ప్రే. మోడుపరచు = మోడయి పోవు, మొక్క అగు, తునిగిపోవు, నరుకుపడు; రూ. మోడ్పడు వి. మోడు = ఎండుచెట్టు, కొమ్మలు లేని చెట్టు.

మోదకట్టు అక. = (దెబ్బతగిలి) నెత్తురు గడ్డకట్టు; వి. మోద = నెత్తురుగడ్డ.

మోదింపు అక. = సంతోషించు; వి. ముదం/ మోదం = సంతోషం, మోదనం = సంతోష పెట్టడం; విణ. మోదమానం = సంతోషిస్తున్న. ముదితం = సంతోషపడిన.

మోదిల్లు అక. రూ. మోదిలు చూ. మోదించు.

మోదు సక. = కొట్టు, బాదు; వి. మోదుడు = బాదుడు.

మోపిడు సక. = విల్లు ఎక్కుపెట్టు; వి. మోపు = వింటినారి, మోపుదల = ఎక్కుపెట్టడం; విణ. మోపు = ఎక్కువ.

మోపు ప్రే. = మోసేట్లు చేయు, ఆనించు, (విల్లు) ఎక్కుపెట్టు.; వి. మోపు = బరువు, వింటినారి, మోపరి/మోపుకాడు = బరువులు మోసే వాడు, మోపుదల = బరువు, భారం; విణ. మోపు = ఎక్కువ.

మోపెట్టు సక. = (విల్లు)ఎక్కుపెట్టు. చూ. మోపు

మోమోడు అక. = మొహమాటపడు, సంకో చించు. రూ. మొగమోడు.

మోయు సక. = బరువెత్తు; వి. మోత = మోయ టం. మోపు = బరువు.

మోరటిల్లు అక. = మొహం పయికెత్తు; రూ. మోర టిలు వి. మోర = (పశువుల)మొహం, (నిందలో) మనిషిమొహం, మోరత్రోపు = పెడమొహం.

మోసపోవు అక. ప్రే. = మోసానికి గురిఅగు, పొరబడు, మోసపుచ్చు; వి. మోష = మోసం. మోస/మోసం = వంచన, దొంగతనం, మోసగాడు = వంచకుడు, మోషకుడు = వంచకుడు.

మోసులెత్తు అక. = మొలకెత్తు; వి. మోస/ మోవు = మొవ్వ.

మోహరించు అక. = వ్యూహం పన్ను, ఎదు ర్కొను, సక. ఎదిరించు; వి. మోహరం = ముగ్గరం, వ్యూహం.

మోహించు అక. = అజ్ఞానంలోపడు, మూర్ఛిల్లు, వలచు, ప్రేమించు; వి. మోహం = అజ్ఞానం, మూర్ఛ, వలపు, ప్రేమ.

మ్రక్కు అక. రూ. మక్కు

మ్రగ్గు అక. = చిరాకుపడు, కుతకుత ఉడికిపోవు, నష్టపడు, చచ్చు. రూ. మగ్గు

మ్రంగబడు అక. = కుంగు, వాలిపోవు.

మ్రంగు అక. చూ. మ్రంగబడు.

మ్రందు అక. = చచ్చు, నొచ్చు, సోలు, సొరుగు, వదిసిపోవు; విణ. మ్రందిలి = నొచ్చిన, దెబ్బతిన్న.

మ్రాగన్నువడు అక. = కళ్లుతేల వేయు/అర మోడ్చు; వి. మ్రాగన్ను = సోలిన కన్ను, తేలకన్ను.

మ్రాగు అక. = సోలు, తేలబడు.

మ్రానుదేరు అక. చూ. మాన్పడు.

ౖమానుపడు అక. = మొద్దుబారు, బండ బారు, స్తంభించిపోవు; రూ. మానుపడు/మాన్పడు/ ౖమాన్పడు వి. ౖమానుపాటు = బండ బారటం.

ౖమానుపిల్లు అక. = మానుపడేట్లు చేయు, బండ బారించు. రూ. ౖమానుపిలు

ౖమానుసెందు అక. చూ. ౖమానుపడు, ౖమాన్పడు. = బండబారు, స్తంభించు. రూ. ౖమానుపడు/ మానుపడు/మాన్పడు.

ౖమింగు సక. రూ. మింగు

ౖమింగుడువడు అక. = మింగటానికి వీలుపడు. రూ. మింగుడుపడు

ౖముచ్చిలించు సక. = దొంగిలించు. రూ. ముచ్చిలించు

ౖముచ్చిలు సక. = దొంగిలించు. రూ. ముచ్చిలు

ౖమేగు సక. = పూయు, అద్దు, ఆవరించుకొను. రూ. మేగు/మేవు చూ. మేగు

ౖమేవు సక. = పూయు, అద్దు. రూ. ౖమేగు/ మేగు

ౖమొక్కు సక. రూ. మొక్కు

ౖమొగ్గబడు అక. = మోకరించు, వాలిపోవు. రూ. మొగ్గుబడు

ౖమొగ్గతిల్లబడు అక. = ఒకవైపు వాలు, మోకరిల్లు. రూ. ౖమొగ్గతిలబ్బడు/మొగ్గతిలబడు

ౖమొగ్గు అక. = ఒకవైపు; రూ. మొగ్గు వి. ౖమొగ్గ దల/మొగ్గుదల = ఒకవైపు వాలి ఉండటం.

ౖమోగు అక. = ధ్వనించు, శబ్దించు మొరయు; రూ. ౖమోవు/మోగు వి. మోత/ౖమోత/ ౖమోగుడు/మోగుడు = ధ్వని, చప్పుడు.

ౖమోడుపడు అక. = మొండి బారు, మొక్కపోవు, బండబారు; రూ. మోడుపడు వి. మొరడు/ ౖమోడు/మోడు = ఎండుమొక్క, కొమ్మలు లేని చెట్టు.

ౖమోయు అక. = మోగు, మోతపుట్టు, మోగిపోవు; చూ. మోగు వి. ౖమోత/మోత = ధ్వని.

# య

యజించు అక. = యజ్ఞం చేయు, సక. పూజించు, అర్చించు; రూ. యజియించు వి. యజ్ఞం = యాగం, వేలిమి. యజనం = యజ్ఞం చేయటం, యాగం = యజ్ఞం, యాజన = యజ్ఞం చేయించటం, యాజకుడు/ యాజ్ఞికుడు = యజ్ఞం చేయించే వ్యక్తి, యజ్వ = యజ్ఞం చేసిన వాడు; విణ. యాజ్యం = యజ్ఞం చేయదగింది.

యత్నించు అక. = ఉద్యోగం చేయు, ప్రయత్నించు, కడగు; వి. యత్నం/యతనం/జతనం = ప్రయత్నం, కడ.

యంత్రించు సక. = కట్టు, నియమించు, రక్షించు; వి. యంత = నడిపేవాడు, యంత్రం = ప్రత్యేక సాధనం, యంత్రణం = కట్టు, బంధనం, రక్షణ, నియమం ప్రకారం నడపటం; విణ. యంత్రితం = కట్టినది, బంధించినది.

యమించు సక. = అణచివేయు, అణచిపెట్టు.

యాచించు సక. = అడుక్కొను; వి. యాచ్ఞ/ యాచన = అడుక్కోవటం, బిచ్చమెత్తటం, యాచ(న)కుడు = బిచ్చగాడు, అడుక్కొనే వాడు, యాచితకం = ఎరువు సొమ్ము/ వస్తువు.

యోచించు సక. = ఆలోచించు, యోచన = ఆలోచన.

యోజించు సక. = కూర్చు; వి. యుగం = బండికాడి, యుగళి/యుగళం/యుగ్మం = జత, జంట, యోగం = కూడిక, కూర్పు,

ప్రయత్నం, యుక్తి = కూడిక, యోక్త్రం = పశువుల మెడ పలుపు. యోజనం = కూర్పు.

# ర

**రక్కు** సక. = గీరు, గీకు, (గోళ్ళతో) చీరు; వి. రక్కు = గీరు, గీటు.

**రక్కొను** అక. = పెరుగు, తేరుకొను, కలుగు. రూ. రెక్కొను

**రక్షించు** సక. = కాపాడు; వి. రక్ష(ణ) / రక్షణం = కాపు(దల), రక్షకుడు / రక్షి = కాపాడేవాడు. రాక్షసుడు = పాలకుడు, కాపాడే వాడు; విశే. రక్షితం = కాపుపొందినది. రక్షితవ్యం / రక్ష్యం = కాపాడదగినది.

**రగులు** అక. = మంటవచ్చు.

**రగులుచు** ప్రే.= రగిలేట్లు చేయు, మంట పుట్టించు. రూ. రగుల్చు

**రంకాడు** అక. = వ్యభిచరించు; వి. రంకాటు / రంకు=వ్యభిచారం, రంకుబోతు =వ్యభిచారి(ణి), రంకుటాలు = వ్యభిచారిణి, రంకు తెవులు = మేహరోగం, రంకు మగడు = జారుడు, రంకు లాడి / రంకెత = వ్యభి చారిణి.

**రంకుపోవు** అక. = వ్యభిచరించు. చూ. రంకాడు

**రంకుపోవు** అక. చూ. రంకాడు.

**రంగరించు** సక. = కలిపినూరు, కలగలుపు; రూ. రంగలించు వి. రంగరింపు / రంగరింత = కలిపి నూరటం, కలగలుపు చేయటం.

**రంగలించు** అక. రూ. రంగరించు; వి. రంగ లింపు = కలిపి నూరటం.

**రంగాయించు** సక. = రంగుచేయు; వి. రంగు = వర్ణం, కాంతి. రంగరి / రంగారి / రంజ కుడు = రంగులు వేసేవాడు, రంగులద్దేవాడు. రంజనం = రంగులు వేయటం. రంగవల్లి = రంగులముగ్గు; విశే. రంగుగా అవ్య. = చక్కగా.

**రచించు** సక. = రాయు, నిర్మించు; వి. రచన = నిర్మాణం, రాత(పని); విశే. రచితం = రాసి నది, కట్టినది.

**రచ్చగొను** అక. = గుంపుగూడు, గుమికట్టు; వి. రచ్చ = సభ, గోష్ఠి. రచ్చకొట్టం / రచ్చ పట్టు = సభ, మండపం, రచ్చబండ = పది మంది సమావేశ మయ్యేచోటు, రచ్చమాను = రచ్చజరిగే చోట నీడ నిచ్చే చెట్టు.

**రజ్జు** అక. = పేలు, వాగు; వి. రజ్జన = ఆత్మస్తుతి. రజ్జు = పేలుడు, అవసర ప్రసంగం, రజ్జులాడి = ఆత్మస్తుతి చేసుకొనే / అనవసరంగా మాట్లాడే స్త్రీ, రజ్జులాడు = ఆత్మస్తుతి పరుడు, వ్యర్థభాషి.

**రంజించు** ప్రే. = ఎఱ్ఱబరుచు, సంతోషపెట్టు, అనురాగపరచు; వి. రంజకం = ఇంగిలీకం, రంజనం = ఇంగిలీకం, ఎఱ్ఱగంధం, సంతోష పెట్టడం. రంజ కుడు = సంతోషపెట్టేవాడు, రంజని = నీలిచెట్టు. రాగం = ప్రేమ, రంగు, రక్తం = కుంకుమ (పువ్వు), నెత్తురు, ఎరుపు. రక్తి = అనురాగం, ఎఱ్ఱదనం. రక్తిమ(ం) = ఎఱ్ఱరంగు, రక్తాంగం = కుంకమ, పగడం, రక్త కుడు = ప్రేమికుడు, అనురాగం / అనురక్తి = ప్రేమ, అభిమానం; విశే. రక్తం = ప్రేమగల, ఎఱ్ఱని, రంగువేసిన.

**రంజిల్లు** అక. = కలకలమని ధ్వనిచేయు, గొడవ చేయు; వి. రంతు = గొడవ, కలకలధ్వని. రూ. రంజిలు చూ. రంజించు

**రప్పించు** ప్రే. = వచ్చేట్లు చేయు, రావించు. మూ. వచ్చు/ రావించు

**రమణించు** అక. = ఒప్పుగా ఉండు, చక్కగా ఉండు; రూ. రవణించు వి. రవణ/ రమణ = ఒప్పిదం, ప్రీతి, పద్ధతి, రమణి = విలాసవతి స్త్రీ, రమణుడు = మన్మథుడు, భర్త, రవణం = అలంకారం, రామణీయకం = చక్కదనం, ఒప్పరికం; విశే. రవణ/ రమణ = మనోజ్ఞమైన, రమణీయం = చక్కని, రమణుడు = చక్కటి వాడు, రవణం = మోగేది.

**రమించు** అక. = ఆటలాడు, సంభోగించు; రూ. రమియించు విశే. రమ్యం = చక్కని(ది).

**రంపిల్లు** అక. = వ్యాపించు, పెరుగు, విజృంభించు, అతిశయించు; రూ. రంపిలు వి. రంపు = రచ్చ, కలకలం.

**రవణించు** అక. చూ. రమణించు

**రవళించు** అక. రూ. రువాళించు; వి. రవలి/ రవాళి/ రవళి = ధ్వని, చప్పుడు.

**రహించు** అక. = ఒప్పు, వర్ధిల్లు; వి. రహి = ఆనందం, ఆసక్తి, తెలివి, బాగు, రక్తి, విధం.

**రాకించు** సక. = మోదు, బాదు.

**రాకొట్టు** అక. = రా-చేర్చి తేలికగా మాట్లాడు, అరే తురే అను, సక. తిరస్కరించు.

**రాగించు** అక. రూ. రాగిల్లు చూ. రంజిల్లు.

**రాచు** అక. = ఒరుసుకొనిపోవు, సక. చెరుచు, చెడ గొట్టు, పూయు.

**రాజిల్లు** సక. = ప్రకాశించు; రూ. రాజిలు వి. రాజితం = ప్రకాశించినది.

**రాజు** అక. = నిప్పు అంటుకొను.

**రాటుదేలు** అక. = గట్టిపడు, అనుభవం, సంపాదించు; వి. రాటు = ప్రమాదం, ఉపద్రవం.

**రాటుపడు** = బాధపడు, ఇబ్బంది పడు. రూ. రాట్పడు

**రాణించు** అక. = ఒప్పు, గుర్తింపుకు వచ్చు; వి. రాణ/ రమణ = చక్కదనం, **రాణింపు** = గుర్తింపు.

**రాపడు** అక. = స్తంభించు, రాయిలా మారు, గట్టి పడు; వి. రా(యి) = శిల.

**రాపాడు** సక. = రాయిడి పెట్టు, బాధించు, పీడించు; వి. రాపిడి/ రాపు/ రాపుడు = ఒరపిడి. రాపుడురాయి = ఒరపిడి రాయి.

**రాబట్టు** = ఇచ్చినదాన్ని తిరిగి తెచ్చుకొను, సేకరించు; మూ. వచ్చు వి. **రాబడి, వచ్చుబడి** = ఆదాయం.

**రాబట్టుకొను** అక. = తిరిగి తెచ్చుకొను, వచ్చునట్లు చేసుకొను.

**రాయిడించు** అక. = అల్లరిచేయు, మోగు, బాధించు; వి. రాపిడి/ రాయిడి = ఒరపిడి, రాయిడికాడు = ఉపద్రవకారి, రాయిడికత్తె = ఉపద్రవకారిణి.

**రాయు** అక. = (గొంతు) రాసుకొనిపోవు, ఒరపిడి పొందు, ఎదిరించు, కలహించు; వి. రాయిడి/ రాపిడి = ఒరపిడి.

**రాలగొట్టు** ప్రే. చూ. రాలుచు/ రాల్చు

**రాలు** అక. = పడిపోవు, రాలిపోవు.

**రాలుచు** ప్రే. = రాలేట్లు చేయు; రూ. రాల్చు వి. రాలుపాటు/ రాల్పాటు = రాలటం.

రావడు అక. = రాయిపడు, గట్టిపడు, మొద్దు బారు; వి. రా(యి) = శిల.

రావించు ప్రే. = వచ్చేట్లుచేయు; రూ. రప్పించు వి. రావటం = రాక, రాబడి/ వచ్చుబడి = ఆదాయం.

రిక్కించు సక. = నిక్కించు, నిక్కేట్లు చేయు, నిగిడించు.

రిచ్చవడు అక. = ఆశ్చర్యపడు; వి. రిచ్చ = నిశ్చేష్టత, రిచ్చవాటు = ఆశ్చర్యం.

రిత్తవోవు అక. = వ్యర్థమగు; వి. రిత్తకత్తె = సంబంధం లేని స్త్రీ, అన్యస్త్రీ, రిత్తకాడు = సంబంధం లేనివాడు, అన్యుడు, విశే. రిత్త = వట్టి, కల్ల, అబద్ధమైన, ఊరక.

రిమ్ము సక. = (నీరు మొ॥) చిమ్ము.

రుచించు అక. = ఇష్టపడు; వి. రుచి = చవి, ఇష్టం; విశే. రుచిరం/ రుచ్యం = రుచిగల, రుచిపుట్టే.

రుత్తు సక. = కొట్టు.

రుద్దు సక. = తోము; వి. రుద్దుడు = తోమటం.

రుప్పు సక. రూ. రువ్వు/ రూవు

రుబ్బు సక. = మెదుపు; వి. రుబ్బురాయి/ రుబ్బుగుండు = రుబ్బేరాయి, రుబ్బురోలు = రుబ్బడానికి వాడేరోలు.

రువ్వు సక. = విసరివేయు; వి. రువ్వు = విసరి వేయటం, రెక్కల గాలివచ్చుడు. చూ. రుప్పు

రూణించు సక. = కుస్తీపట్టులో బిగించు; వి. రూణింపు = కుస్తీపట్టు.

రూపగు అక. = వర్ధిల్లు, పెరుగు; వి. రూపు = ఆకారం, చక్కదనం, పద్ధతి.

రూపడగు అక. ప్రే. = చచ్చు, నశించు, రూప డచు.

రూపరు అక. = అంగవిహీనముగు, నశించు, చచ్చు; వి. రూపు = ఆకారం, చక్కదనం, రూపరి/ రూపసి = చక్కని వ్యక్తి, రూపాజీ = వేశ్య.

రూపించు సక. చూ. నిరూపించు. వి. రూపం = ఆకారం, సౌందర్యం, స్వభావం.

రూపుమాపు ప్రే. = నశింపజేయు, చంపు; వి. రూపు = ఆకారం, సౌందర్యం.

రూపుమాయు అక. = చచ్చు, నశించు, ప్రే. చూ. రూపుమాపు.

రూపుసెడు అక. = చచ్చు, నశించు; వి. రూపు = ఆకారం, సౌందర్యం.

రెక్కొను అక. ప్రే. రెక్కొలుపు = పెరుగు, తేరు కొను; వి. రెక్కోలు = తేరుకోవటం, పెరగటం.

రెచ్చగొట్టు ప్రే. = పోత్సాహపరచు, పురికొల్పు, రెచ్చిపోయేట్లు చేయు.

రెచ్చు అక. = పేట్రేగు, రేగిపోవు, పురికొను, ఉద్రేకపడు.

రెట్టించు సక. = మాటకు మాట బదులు చెప్పు, రెచ్చగొట్టు, రెండింతలు చేయు; వి. రెట్టింపు/ రెట్టి = రెండింతలు.

రెపరెమను అక. = గాలికి కదులు; వి. రెపరెప = కదలిక.

రెపరెపలాడు అక. = గాలికి కదులు; వి. రెపరెప = కదలిక. చూ. రెపరెపమను

రెపరెపలాడు అక. చూ. రెపరెపమను.

రెమ్ము సక. = ఒడిసిపట్టు, లాగు.

రేకుమడచు సక. = అణగదొక్కు; వి. రేకు = పుష్పదళం, ఈక, దుప్పటిలో సగం, అంచూ కమ్ములూ లేని గుడ్డ.

రేకెత్తు అక. = పెరుగు; వి. రేక = తాటాకుముక్కతో చేసిన దొప్ప, జాబు. రేకు = పుష్పదళం, ఈక.
రేగు అక. ప్రే. రేచు = పైకిలేచు, విజృంభించు.
రేచు ప్రే. = రేగగొట్టు. రూ. రేపు
రేపు ప్రే. రూ. రేచు
రేయు అక. = అతిశయించు, విజృంభించు, సక. సరుకు, ఖండించు.
రొక్కించు సక. = రొక్కంగామార్చు; వి. రొక్కం = వెల, డబ్బు.
రొదాళించు అక. = రొదచేయు, ధ్వనించు; వి. రొద = (కలకల) ధ్వని, రొదాళం = ధ్వని, చప్పుడు.
రొప్పు అక. = ఆయాసపడు, గాండ్రుమను, సక. కోపించు, తరిమివేయు.
రొల్లుకొను అక. = సేకరించు, అడుగంట పోగు చేయు, వాగు, ప్రలాపించు; రూ. నొల్లుకొను వి. రొల్లు = ప్రలాపం, వాగుడు.
రోజు అక. = నిట్టూర్చు, రొప్పు; వి. రోజు = నిట్టూర్పు, రోజుడు/రొంజుడు = నిట్టూర్పు, ప్రలాపం, శ్వాసరోగం.
రోతగించు అక. = అసహ్యించుకొను, రోతపడు, ఏవగించుకొను; వి. రోత = ఏవం, అసహ్యం, జుగుప్స.
రోతపడు అక. = ఎండుక పోవు, ఈచపోవ, సన్నబడు, పీలఅగు; మా. రోతగించు వి. రోటు = ఈచ, ఎండిపోవటం, పీలకావటం.
రోదించు అక. = ఏడ్చు; వి. రుదితం/రోదనం = ఏడ్పు.
రోధించు అక. = అడ్డగించు; వి. రోధస్సు = అడ్డం(కి).
రోయు అక. = అసహ్యించుకొను, ఏవగించుకొను; వి. రోత = ఏవం, అసహ్యం, జుగుప్స.
రోలు అక. = బాధతో అరచు, ఏడ్చు.
రోషపడు అక. = కోపపడు, కినియు; వి. రోషం = కోపం, కినుక.
రోషించు అక. = కోపపడు, కినియు; రూ. రోసించు వి. రోషం = కినుక.
రోసించు అక. రూ. రోషించు; వి. రోసం = రోషం, కోపం.
రౌలు అక. రూ. రవులు/రగులు మా. రౌలుచు ప్రే. రూ. రవుల్చు/రవులుచు/రగులుచు/మా. రగుల్చు

## ల

లక్షించు సక. = చూచు, గురిపెట్టు; వి. లక్ష్మణ/లక్ష్మం = గుర్తు, లక్ష్యం = గురి.
లగించు సక. = లగ్నంచేయు, తగిలించు, చూపు నిలుపు; వి. లగ్గం = తగులం; విశే. లగనం/లగ్నం = తగులు కొన్నది.
లగ్గపట్టు సక. = (కోటను) పట్టుకొను, ముట్ట డించు; వి. లగ్గ = ముట్టడించి కోటను పట్టు కోవటం.
లఘూకరించు సక. = తక్కువచేయు, తేలిక పరచు; వి. లఘువు = తేలికైనది, చులకన అయినది. లఘిమ = చులకన, తేలికదనం; విశే. లఘువు = చులకనైన, తేలికైన, చేవలేని, లఘీ్వ = తేలికైనది, లఘిష్ఠం = పూర్తిగా తేలికైన.
లంకించు అక.= ఎరుగు, తగులుకొను, సక. పెన వేయు, అవమానించు; వి. లంక = రంకుటాలు, లంకియ/లంకె = తగులం, పెనవేత.

లంకెవెట్టు సక. = తగిలించు, ముడివేయు, పెన వేయు; వి. లంకియ/ లంకె=తగులం, పెనవేత.

లంగగొను సక. = లంఘించు, దూకు, దాటు; వి. లంఘ/ లంగ = దూకుడు, దాటుడు, లంఘనం.

లంఘించు అక. = దూకు, దాటు, ఎగురు; వి. లంకణం/ లంఘ/ లంఘనం = దాటుడు, దూకుడు, ఎగురుడు, లాఘవం = తేలికదనం.

లజ్జించు అక. = సిగ్గుపడు; వి. లజ్జాళువు = సిగ్గరి. లజ్జ = సిగ్గు, బిడియం; విశే. లజ్జితం = సిగ్గ పడ్డది.

లభించు అక. = కలుగు, ప్రాప్తించు; వి. లబ్ధం = (భాగహారం చేస్తే) మిగిలినది, లబ్ధి = ప్రాప్తం, లాభం, కలిమి, లాభం = (అమ్మగా) మిగిలి నది, ప్రాప్తి, వృద్ధి; విశే. లబ్ధం = మిగిలినది, దొరికినది, పొందినది, లభ్యం = మిగిలిన, దొరి కిన, పొందిన.

లంపటువడు అక. = శ్రమపడు, ఆపదలోపడు; వి. లంపటం = తగులం, శ్రమ, ఆపద. లంప టుడు = విపరీతాసక్తి కలవాడు; విశే. లంపాకం = ఆసక్తి గల(ది).

లంభించు సక. = తిట్టు, దూషించు, వి. లంభనం = తిట్టడం, దూషించడం.

లయించు అక. = నశించు, చచ్చు; వి. లయం= నాశనం, చావు.

లవించు సక. = కోయు; వి. లవం/ లవనం = (పైరు మొ॥) కోత, లవిత్రం = కొడవలి.

లసుకు సక. = నాశనం చేయు.

లాగించు అక. = దూకు, దాటు, ఎగురు, సక. గుంజు, ఆకర్షించు, తీసుకొనిపోవు.

లాగు సక. = గుంజు, ఈడ్చు; వి. లాగు/ లాగుడు = లాగటం.

లాగుకొను సక. = గుంజుకొను, ఈడ్చు. రూ. లాక్కొను

లాగులాడు అక. = గుంజు, ఈడ్చు, లాగు. చూ. గుంజు/ ఈడ్చు/ లాగు

లాచు అక. = ఎదుర్కొను, పొంచి ఉండు; వి. లాపు/ లాత = లాచటం, ఎదుర్కోవటం, ఉద్రేకం, విజృంభణ; విశే. లాపు/ లాత = ఎక్కువ.

లాతసేయు అక. = విజృంభించు, ఎదుర్కొను.

లాయు అక. = విజృంభించు, ఉద్రేకించు; వి. లాత = ఉద్రేకం, విజృంభణ. చూ. లాచు

లాలించు సక. = బుజ్జగించు; వి. లాలింపు, లాలన(ం) = బుజ్జగించటం.

లిఖించు సక. = రాయు; రూ. లిఖియించు వి. లేఖ/ లేక = జాబు, ఉత్తరం, లేకరి/ లేఖ కుడు = రాతకాడు, లేఖని/ లేఖిని =కలం, రాసే సాధనం, లేఖనం/ లిఖితం = రాయటం, రాత, లిఖితుడు = సాక్షి, లేఖనికుడు = జాబు తీసుకొనిపోయేవాడు. లేఖహారకుడు = జాబులు బట్వాడా చేసేవాడు, లేఖ్యం = (దస్తా వేజ) రాత; విశే. లేఖనీయం = రాయదగిన(ది), లేఖితం = లిఖితం, రాసింది. లేఖ్యం = రాయ దగినంది.

లుకలుకలాడు అక. = (పురుగులతో) పుచ్చి పోవు; వి. లుకలుకలు = పురుగులకదలికలు.

లులివడు అక. = నీచపడు, హీనపడు; వి. లులి = తక్కువ, లుల్లిగాడు = నీచుడు, దరిద్రుడు, కష్టాల్లో ఉన్నవాడు.

లెక్కగొను సక. = లక్ష్యపెట్టు; వి. లెక్క = లక్ష్యం.
లెక్కపెట్టు సక. = లక్ష్యపెట్టు, గుణించు, లెక్కించు.
లెక్కసేయు సక. చూ. లెక్కించు.
లెక్కించు సక. = లక్ష్యపెట్టు, లెక్కపెట్టు; వి. లెక్క = సంఖ్య, లక్ష్యం.
లేచు అక. = మేలుకొను, పైకివచ్చు, పొటమరించు.
లేపు ప్రే. = లేచేట్లు చేయు.
లొగ్గడిల్లు అక. = కలగుండు పడు, క్షోభపడు, గందరగోళపడు; రూ. లొగ్గడిలు వి. లొగ్గడి = కలవరం, క్షోభ.
లొంగు అక. రూ. లోగు = లోకువ అగు, లొంగి పోవు, వెనుదీయు.
లొటలొటమను అక. = చప్పుడు చేయు, లొడ లొడమను; వి. లొటలొట = లొడలొడ.
లొట్టపోవు అక. = అణిగిపోవు, సొట్టపడు; వి. లొట/లొట్ట = పల్లం, గుంట; విశే. లొట/లొట్ట = అణగిన, సొట్టపడు.
లొట్టవేయు అక. = (రుచిగల పదార్థం తినేటప్పుడు) నాలుకతో చప్పుడు చేయు; రూ. లొట్టలు వేయు వి. లొట్ట = నాలుకతో చేసే చప్పుడు.
లోగు అక. = లోకువఅగు, అణగిపోవు, వెనుదీయు; రూ. లొంగు వి. లోకువ = లోబడి ఉండటం, తక్కువ.
లోగొను సక. = స్వాధీనం చేసుకొను, లోపలికి లాక్కొను.
లోడు సక. = వేళ్లతో కెళ్లగించు, తోడు.
లోపించు అక. = తక్కువ అగు, మరుగునపడు; వి లోపం = తక్కువ, మరుగుపడటం.
లోబడు అక. = లొంగిపోవు, అధీనమగు.
లోభించు సక. = లోభిగా ప్రవర్తించు, తెగువ లేకపోవు; వి. లోభి = పిసినిగొట్టు.
లోవు అక. = వెనుదీయు. రూ. లోగు

## వ

వక్కణించు అక. = చెప్పు, (దస్తావేజుల్లో) ఉదాహరించు; రూ. వక్కాణించు వి. వక్కాణ/వక్కణ(ం) = వివరణ, (జాబుల్లో దస్తావేజుల్లో) పూర్వవిషయాలు ఉదాహరించే భాగం, వక్కాణం = సమాచారం.
వక్కరించు అక. = వంకర తిరుగు, తిరగబడు. రూ. వక్కళించు/వక్రించు
వక్కళించు అక. రూ. వక్కరించు
వక్కాణించు సక. రూ. వక్కణించు
వక్రించు అక. = వంకర తిరుగు, పెడ తిరుగు, వంగు, తిరగబడు; వి. వక్రం = వంకర. వక్రిమ(ం) = వంపు; విశే. వక్రం = వంకరైన, వక్రిమ(ం) = వంగిన. చూ. వంగు
వగచు అక. = దుఃఖించు, పశ్చాత్తాపపడు, ఏడ్చు, సక. విచారించు, ఆలోచించు, తలచు; వి. వగ/వగపు = దుఃఖం, శోకం, విచారం, విలాసం, వగలాడి/వగకత్తె = విలాసవతి, వగలాడు/వగకాడు = విలాసవంతుడు; విశే. వగలమారి = విలాసపరులైన.
వగదెంచు ప్రే. = పరిష్కరించు, నిర్ణయించు, తేల్చు; వి. వగ = ఆలోచన.
వగదెగు అక. = తేలిపోవు, పరిష్కారమగు. రూ. వగదిగు
వగరుచు అక. = నిట్టూర్చు, ఆయాసపడు; రూ. వగర్చు వి. వగరం/వగర్పు/వగరు = ఉబ్బసం, శ్వాసరోగం.

**వంకరపోవు** అక. = వంకరలగు, వక్రముగు, కొంగర్లు పోవు; వి. వక్కారం/ వంకర = వక్రత, వంగినది, వంకదార = (కోటవాటికి ముందున్న) వంకరదారి, వంకియ/ వంకె/ వంకీ = వంగిన (కత్తి, నగమొ.); వి. వక్కారం/ వంకర = వక్రమైన, వంకరటింకర = చాలావంకర.

**వంగదీయు** సక. = వంచు, వంగేట్లుచేయు. చూ. వంగు/ వంకరపోవు

**వంగు** అక. = ముందుకువాలు, నమ్రమగు; వి. వంక = వంక, వంపు, వాగు, వంగుడు = బీటిక, వక్కారం/ వంకర=వక్రత, వంకియ/ వంకిణి / వంకె = వంపుగల (కత్తి, నగమొ॥), వంపు = వంగటం, వక్కారాలు = మోసకత్తె, వంకరపనులు చేసే స్త్రీ; విశే. వక్కారం / వంకర= వంగిన, వంకరటింకర = చాలా వంపులు గల, వంపు = వంగినది, వంకరయినది.

**వచించు** సక. = మాట్లాడు, చెప్పు; వి. వక్త = మాట్లాడేవాడు; పండితుడు, వచనం/ వచస్సు = మాట; విశే. వక్తవ్యం = మాటాడదగినది, తిట్ట దగినది.

**వచ్చు** అక. = దగ్గరకు చేరు, కలియు, (సమ) కూడు; వి. వచ్చుబడి/ రాబడి = ఆదాయం, రాక = రావటం, వచ్చురాములు = రావటం, రాకపోవటం.

**వంచాడించు** అక. = బెదిరిపోవు. రూ. వంచాళించు

**వంచించు** సక. = మోసపుచ్చు; విశే. వంచకం = మోసగించే.

**వంచు** ప్రే. = వంగేట్లు చేయు, వంగదీయు. చూ. వంగు

**వటించు** అక. = పస్తులుండు, ఉపవాసం చేయు.

**వట్టు** అక. = ఇంకిపోవు, ఎండిపోవు, చిక్కిపోవు, వట్టిపోవు; వి. వట్టు = వరుగు, ఎండిన పక్కు; విశే. వట్టి = లేనిది, ఏమీలేనిది, ప్రయోజనం లేనిది.

**వ్రటిపడు** అక. = తగ్గిపోవు; విశే. వ్రటం = పొట్టి, చిన్న.

**వ్రటిపెట్టు** సక. = తగ్గించు, తక్కువచేయు; విశే. వ్రటం = తక్కువ, పొట్టి.

**వ్రటించు** అక. = (గుండ్రంగా) తిరుగు, పెడమొహంపెట్టు; వి. వ్రటున/ వ్రటువ = గుండ్రన, వర్తులత్వం, వ్రటువసుడి = గుండ్రటి సుడి; విశే. వ్రటు = గుండ్రని, వర్తులమైన.

**వ్రటిల్లు** అక. = (గుండ్రంగా) తిరుగు, కలుగు, ప్రవర్తిల్లు. రూ. వ్రటిలు చూ. వ్రటించు

**వడకాడు** అక. = వణికిపోవు; వి. వడుకు/ వణుకు/ వడకు/ వణకు = కంపనం, భయం, దడ.

**వడకు** అక. = వణికి పోవు, భయపడు, కంపించు, దడదడలాడు. రూ. వణకు చూ. వడకాడు

**వడగొను** అక. = తపించు, తాపంపొందు, వేడెక్కు; వి. వడ = సెగ, వేడిమి, వడగాలి = వేడిగాలి.

**వడచు** సక. = వడియగట్టు, కార్చు. రూ. వడుచు

**వడబోయు** సక.= వడియకట్టు, వడకట్టు; చూ. వడుచు వి. వడబోత = వడబోయటం.

**వడలు** అక. = (పూలు మొ.) వాడిపోవు, వడిలి పోవు; వి. వడం = దండ. వడ = సెగ, వేడిమి.

**వడిగట్టు** సక. = (పాత్ర నోటికి గుడ్డముట్టి) కార్చు. రూ. వడియకట్టు చూ. వడుచు

**వడిపెట్టు** సక. = మెలిపెట్టు, నులుము; వి. వడి = పురి, మెలిక, బిగువు.

**వడిబెట్టు** అక. = వడియగట్టు. చూ. వడుచు

**వడియబోయు** సక. = వడబోయు; రూ. వడియు వి. వడియబోత = వడబోత.

**వడియు** అక. = కారు, ఇంకు, చిక్కిపోవు; వి. వడుపు = వడియటం, విధం.

**వడివేయు** సక. = మెలికపెట్టు, మెలిదిప్పు; వి. వడి = మెలి(క).

**వడుకు** సక. = (దూదిని) మెలిబెట్టు, పేను; వి. వడుకుడు = వడకటం.

**వడుచు** ప్రే. = వడియ జేయు, వడికట్టు, కార్చు, (నూనె మొ॥) దించు.

**వడుసువోవు** అక. = (గుడ్డ) పిగిలిపోవు; వి. వడుసు = పిగిలిపోవటం.

**వణకు** అక. = వణికిపోవు. రూ. వడకు

**వండు** సక. = వంట చేయు; వి. వంట = వండినది, పాకం, వంటుకత్తె = వంటచేసే స్త్రీ, వంట చెరకు = కట్టె(లు), వంటసాల/వంటయిల్లు = వండే చోటు, వంటరి = వంటచేసే వ్యక్తి, వంటవాడు = వంట చేసే వాడు.

**వదరు** అక. = (నోటికి వచ్చినట్లు)వాగు, పేలు, అదిరిపడు; వి. వదరు = పేలుడు, వదరు బోతు = వాగుడుగాడు, వదావళి = వదరు బోతు తనం.

**వదలు** అక. = వదిలిపెట్టు, విడిచి పెట్టు; రూ. వదులు వి. వదలు/వదులు = విడుపు.

**వదలు** అక. = బిగువు తప్పు, సడలి పోవు. చూ. వదలు

**వధించు** సక. = చంపు; వి. వధ(ం) = చంపటం, చంపుడు.

**వనరు** అక. = ఏడ్చు, దీనంగాపలుకు, శోకించు; వి. వనట = దుఃఖం.

**వందరలాడు** సక. = నరుకు, ఖండించు; వి. వందర = ముక్క.

**వందించు** సక. = పొగడు, స్తుతించు; వి. వందారువు = నమస్కరించేవాడు, వంది = పొగడి బతికేవాడు, వందితుడు = పొగడ్తలందినవాడు, నమస్సు లందిన వాడు, వంద్యుడు = స్తుతింప దగినవాడు, నమస్కరించదగినవాడు.

**వందు** అక. = విచారపడు, బాధ పడు, దుఃఖపడు. రూ. వందురు

**వమ్ముపోవు** అక. = వ్యర్థమగు, నష్టమగు; వి. వమ్ము = నాశనం; విశే. వమ్ము = వ్యర్థమైన.

**వరగలించు** అక. = ప్రకాశించు. చూ. వరలు

**వరదవారు** అక. = ప్రవహించు; వి. వరద = వెల్లువ, ప్రవాహం, వ(ర)రు = ప్రవాహం, వరద.

**వరలు** అక. = ప్రవర్తిల్లు, ప్రకాశించు, వ్యాపించు.

**వరువట్లుగొను** అక. = బాగా ఎండిపోవు; వి. వరువట్లు = బాగా ఎండిపోవటం.

**వరించు** సక. =కోరు, అభిల షించు; రూ. వరియించు వి. వరణం = వరించటం.

**వర్గించు** సక. = తెగలుగా విభజించు; వి. వర్గం/వర్గు(వు) = తెగ, భాగం, లెక్క.

**వర్గీకరించు** సక. = తెగలుగా విభజించు, వర్గించు. రూ. వర్గించు

**వర్జించు** సక. = విడిచిపెట్టు; వి. వర్జనం = విడుపు, త్యాగం, వర్జ్యం = (వదిలిపెట్టు దగిన) చెడు కాలం; విశే. వర్జనీయం = విడువదగినది, వర్జితం=వదిలి పెట్టినది, వర్జ్యం = విడువదగిన.

**వర్ణించు** సక. = పొగడు, వివరించు; వి. వర్ణం = అక్షరం, స్తుతి, వర్ణనం = పొగడ్త. వర్ణి = రాతగాడు; విణ. **వర్ణితం** = పొగడ్తలందినది.

**వర్తించు** అక. = ఉండు, ప్రవర్తించు; రూ. వర్తిల్లు వి. వర్తనం = నడవడి, జీవనం, వర్తిష్ణువు/వర్తి/ వర్తనుడు = ప్రవర్తించేవాడు, వర్తమానం = వృత్తాంతం, సంగతి, వర్ధి = వర్తమానం.

**వర్తులీకరించు** సక. = గుండ్రంగా చుట్టు; వి. **వర్తులం** = గుండ్రటిది.

**వర్ధించు** ప్రే. = వర్ధిల్లేట్లు చేయు, పెంచు; వి. వర్ధనం = పెరగటం, వర్ధమానం = పెరుగుతుండేది. వర్ధిష్ణువు = పెరిగేవాడు; విణ. వర్ధనం = పెరిగేది, **వర్ధితం** = పెంచినది, నిండినది.

**వర్ధిల్లు** అక. = పెరుగు. చూ. **వర్ధించు**

**వర్షించు** అక. = వానపడు; వి. వర్ష = మబ్బు, మేఘం, వర్షం = వాన, వర్షణం = వానపడటం, వర్షోపలం = వడగల్లు; విణ. వర్షాభువు = వర్షాకాలంలో పుట్టేది.

**వఱ్ఱొడ్డు** అక. = ప్రవహించు; వి. వఱు = ప్రవాహం.

**వలకట్టు** సక. = అనుకూలపరచు; వి. వల = కామం, వలకాక = మదనతాపం, వలకాడు = కాముకుడు, ప్రేమికుడు; విణ. వలకారి = ప్రేమపుట్టించే, **వలతి** = నేర్పరి, అనుకూలమైన.

**వలగొను** సక. = ప్రదక్షిణంచేయు, చుట్టూ తిరుగు; వి. **వలను / వలకు** = దిక్కు, వలనం = తిరుగుడు.

**వలచుట్టు** సక. = ప్రదక్షిణంచేయు. రూ. వలగొను

**వలచు** అక. = వాసన కొట్టు, సక. కోరు, కామించు; వి. **వలపు** = కామం, ప్రేమ, వాసన, **వలపు కత్తె** = కాముకి, **వలపుకాడు** = కాముకుడు, **వలపు రాయుడు**, వలదొర = మన్మథుడు. చూ. **వలకట్టు**

**వలయు** అక. = ఇష్టమగు, అవసరమగు, తగు, కావలసి వచ్చు.

**వలసతేయు** అక. = వలసపోవు; వి. వలస = దేశం వదిలిపోవటం.

**వలసపోవు** అక. = దేశం వదలిపోవు.

**వలిగొను** అక. = చలివచ్చు; వి. వలి = చల్లదనం, శైత్యం, వణుకు, వలిపని = శీతలోపచారం, వలి వెలుగు = చంద్రుడు; విణ. వలి = చల్లని.

**వలియు** అక. = సన్నగిల్లు, అలసిపోవు, వణికిపోవు.

**వల్చు** అక. సక. చూ. **వలచు**

**వల్లించు** సక. = వల్లెవేయు; వి. **వల్లె** = చెప్పినది మళ్ళీ చెప్పటం.

**వశీకరించు** సక. = లోబరచు; వి. వశీకరణ(ం) = లోబరచుకోవటం, వశవర్తి = విధేయుడు, వశౌషధం = లోబరుచుకొనేమందు, పెట్టు మందు, వశంవదుడు = చెప్పినట్లు మాట్లాడేవాడు. వశక్రియ = లోబరుచుకొనేమందులూ మాత్రలు; విణ. వశ్యం = లొంగిపోయినది, వశ = లోకువైనది,

**వసపడు** అక. = లోబడు, లోకువఅగు; వి. వసం, వశం = స్వాధీనత; విణ. వసం / వశం = స్వాధీనం, లోకువ, శక్యం.

**వసపోవు** అక. చూ. **వసపడు**.

**వసించు** అక. = ఉండు, కాపురముండు, నివసించు; వి. **వాసకం / వాసం** = ఇల్లు, **వాసగృహం** = పడకటిల్లు, **నివాసం** = ఉనికి, ఇల్లు, **నివాసి** = వసిస్తున్నవాడు.

వసిగొను అక. = పూను, ఉత్సాహపడు; వి. వసి = ఉనికి; విశ. వసి అవ్య. = ఎక్కువ, చాలా.

వసులు అక. = తొలగిపోవు.

వహించు అక. = మోయు, తాల్చు, ధరించు; రూ. వహియించు వి. వాహం/వహం/వాహనం = మోసేది, వాహ్యాం = వాహనం, వాహ్యాళి = స్వారి; విశ. వహి = మోసేవాడు, వాహితం = మోసినది, వాహ్యాం = వహించ దగ్గది.

వాకఖు చేయు సక. = తెలుగుకొను, విచారించు; వి. వాకఖు = వివరం, విషయం.

వాకొను అక. ప్రే. వాకొలుపు/వాకొల్పు = మాట్లాడు, అరచు; వి. వా(యి) = నోరు, వాకు/వాక్కు=పలుకు, మాట, వాకాటు = వాగ్వాదం, తగాదా, వాకట్టు = (మంత్ర తంత్రాలతో) మాట రాకుండాచేయు, వాత రట్టు = వదరుబోతు, వాతవాడి = అనిష్టం మాట్లాడేవాడు, అప్రియవాది, వాతి కాసు = లంచం (నోరుమూయించటాని కిచ్చేది), వాతి బియ్యం = శవం నోట్లో బియ్యం.

వాక్రుచ్చు సక. = చెప్పు, పేరు పెట్టి చెప్పు; వి. వా(యి) = నోరు. వాకు/వాక్కు = మాట, పలుకు, వాదోడు = మాటసాయం.

వాగు అక. = వదరు, అతిగామాట్లాడు, మోగు; వి. వాగు = సెలయేరు, సైన్యం, అల. వంక/వాక = పిల్ల ఏరు, వాగుడు = మోత, ధ్వని, ఎక్కువగా మాట్లాడటం, వాగడుపు = వాపుగల కడుపు/పొట్ట.

వాచరచు అక. = మొరపెట్టు, మొత్తుకొను; వి. వాచరం/వాచరపం = ఏడ్పు, దుఃఖం, వాయి = నోరు.

వాచారు అక. = దుఃఖపడు; వి. వాచార(ప)ం = ఏడ్పు, దుఃఖం.

వాచించు సక. = చెప్పు; రూ. వచించు వి. వాచికం = సమాచారం, వార్త, నోటితో పలికే తీరు, వాచాలుడు/వాచాటుడు = వదరు బోతు, వాగుడు కాయ, వాచకం = శబ్దం, పుస్తకం, వాచ/వాకు/వాక్కు = మాట, పలుకు, వాగ్మి = నేర్పు గామాట్లాడేవాడు, వాఙ్మఖం = ఉపన్యాసం, వాచస్పతి = బృహస్పతి, వాచ్యం = స్పష్టమైన సూటి అర్థం; విశ. వాచ్యం = చెప్పదగినది, నిందించ దగినది.

వాచు అక. = దేబిరించు, ఉబ్బు, వాచిపోవు; వి. వాపి/వాపిరిగొట్టు = వాపురోగం గలవాడు, వాపిరి = వాచటం, వాపు = వాచిపోవటం.

వాంచు ప్రే. రూ. వంచు

వాంఛించు సక. = కోరు; వి. వాంఛ = కోరిక; విశ. వాంఛితం = కోరిన(ది), వాంఛనీయం = కోరదగినది.

వాటుపడు అక. = అనుకూలమగు, అలవాటగు; వి. వాటుపద్యాలు = ఆటవిడుపు పద్యాలు; విశ. వాటం = అనుకూలమయిన, పొందిక అయిన, అలవాటు పడ్డ.

వాటులాడు అక. = కొట్లాడు, దెబ్బలాడు; వి. వాటు = దెబ్బ, వాట్లీడు = కొట్లాడేవాడు.

వాడబారు అక. = వాడిపోవు, వాడు మొహంవచ్చు. రూ. వాడుపారు చూ. వాడు

వాడు అక. = మాసిపోవు, వాడిపోవు; వి. వాడుపు/వాడ్పు = వాడిపోవటం.

వాడుకపడు అక. = అలవాటుపడు, అభ్యాస మగు, ఉపయోగపడు; వి. వాడుక/వాడుదల = అల వాటు, అభ్యాసం.

వాడుకొను సక. = ఉపయోగపెట్టు; వి. వాడుక/వాడుదల = అలవాటు, అభ్యాసం, ఉపయోగం.

వాడుచు ప్రే. = వాడేట్లుచేయు. చూ. వాడు

వాడుదెంచు అక. చూ. వాడబారు

వాడుపడు అక. ప్రే. = వాడబారు, వాడుపరచు. చూ. వాడబారు

వాడుపారు అక. రూ. వాడబారు

వాదడుచు అక. = వాదించు, వాదులాడు; వి. వాదన/వాదం/వాదు = ఎదురుమాట, వాగ్వాదం, అభిప్రాయం, వాదనం = (వీణ మొ॥) ధ్వని, మోగించటం, వాది = తగవుపెట్టు కొన్నవాడు, వాదిత్రం = వా(యి)ద్యం, వాద్యం = వాయించే సాధనం.

వాదాడు అక. = వాదులాడు, వాదించు. చూ. వాదడుచు

వాదించు అక. = వాదులాడు, తగవులాడు. చూ. వాదడుచు

వాను సక. = (కుండలు) చేయు

వాపసుచేయు సక. = తిరిగియిచ్చు, తిప్పిపంపు; వి. వాపసు = తిరిగియివ్వటం.

వాపుచ్చు సక. చూ. వాదడుచు = నోరు తెరిచి చెప్పు, నోరు తెరచు.

వాపోవు అక. = అరచు, ఏడ్చు; వి. వాపోక = ఏడ్పు, అరవటం. చూ. వాదడుచు

వాము సక. = జవురు, కొట్టు, కుప్ప చేయు; వి. వామి = కుప్ప, రాశి, గుట్ట, పోగు.

వాయించు అక. = మోగించు, చావగొట్టు, తిట్టు; వి. వాయింపు = మోగించటం, కొట్టడం, తిట్టడం, వాయిదం = వాద్యం.

వాయోడు అక. = నోటితో చెప్పటానికి భయ పడు/ సంశయించు. చూ. వాదడుచు/ ఓడు

వారబట్టు సక. = నోటపట్టు, ఆపోశించు, ఇంకించు

వారడు సక. = చాలించు; వి. వారడి = నష్టం, లోపం.

వారించు సక. = అడ్డగించు, నివారించు; వి. వారణ(ం) = చెలియలికట్ట, అడ్డగించటం. వారింపు = నివారణ, అడ్డగింపు.

వారు అక. = ఉడుగు, ఆగు, సక. చివ్వు, చెక్కు, వడియు. చూ. వడియు

వారుచు అక. = ఆచమించు, వడియ గట్టు, సక. ఎదురు చూచు, ప్రే. వారజేయు; వి. వారుపు/వార్పు = వడియ గట్టడం, ఆచమనం.

వార్చు చూ. వడియగట్టు.

వార్చు రూ. వారుచు

వాలయించు సక. = నిర్బంధించు; రూ. వాలా యించు వి. వాలాయం = నిర్బంధం; విణ. వాలాయం = నిర్బంధించే, వాలాయం అవ్య. = అవశ్యంగా.

వాలాయించు అక. = నిర్బంధపడు, ప్రే. నిర్బంధ పెట్టు. రూ. వాల్లయించు.

వాలు అక. = వంగిపోవు, వంగు, అతిశయించు, కిందికి దిగు, ఒరిగిపోవు, సక. అతిక్రమించు, దాటు; వి. వాలు = పొడుగు,వాడిమి. వాలుపు/వాల్పు = వాలి ఉండటం, వాలుగంటి/వాల్గంటి = పొడుగైన కళ్లున్న స్త్రీ, వాలుగ గంటి =

వాలుగ చేపలా ఉండే కళ్ళు గల స్త్రీ, **వాలు ప్రొద్దు** = సాయంత్రం; విణ. **వాలారు** = వాడి యైన, **వాలు** = పొడుగైన, వాడి అయిన, క్రూర మైన, **వాలిక** = పొడుగయిన, వాడి అయిన.

**వాలుచు** ప్రే. = వాలేట్లు చేయు. రూ. **వాల్చు** చూ. **వాలు**

**వాసించు** అక.= పసించు, సక. వాసన వచ్చు; వి. **వాశి / వాసి**= భేదం, ఎక్కువ దనం, లాభం, ప్రసిద్ధి; విణ. **వాశి, వాసి** = బాగు. చూ. **వాసనవచ్చు**

**వికటించు** అక. = ఎదురు తిరుగు, బెడిసి కొట్టు, వంకర అగు; విణ. **వికటం** = వక్రమయిన, విరివి అయిన, చక్కని.

**వికల్పించు** సక. = చెడగొట్టు, మార్చు; వి. **వికల్పం** = మార్పు.

**విక్కవిరియు** అక. = బాగా విప్పారు. చూ. **విరియు**

**విక్కు** అక. = విజృంభించు, గర్వించు.

**విక్రమించు** అక. = పరాక్రమించు, శౌర్యం చూపు; వి. **విక్రాంతి / విక్రమం** = బలం, పరాక్రమం, శౌర్యం, **విక్రాంతుడు** = విక్రమించినవాడు.

**విక్రయించు** సక. = అమ్ము; వి. **విక్రయం** = అమ్మకం, **విక్రయి(కుడు) / విక్రేత** = అమ్మే వాడు; విణ. **విక్రీతం** = అమ్మినది.

**విక్షేపించు** సక. = విసరివేయు, ఎగురవేయు; వి. **విక్షేపం** = కదలిక, ఎగర వేయుటం, విసరి వేయుటం; విణ. **విక్షిప్తం** = ఎగరవేసినది, విసరి వేసినది.

**విగాహించు** అక. = మునుగు, మునిగి పోవు, కుంగిపోవు; వి. **విగాహ(న)ం** = మునక, మునక వేయుటం.

**విగర్వించు** సక. = బాగావిరుచు; వి. **విగుర్వణ** = విరుపు.

**విగ్రహించు** అక. = పోరాడు, పోట్లాడు, చెడ గొట్టు; వి. **విగ్రహం** = యుద్ధం.

**విఘటించు** సక. = చెడగొట్టు; వి. **విఘటన** = చెరుపు, **విఘాతం** = దెబ్బ, అడ్డంకి, **విఘ్నం** = అడ్డంకి, అంతరాయం

**విఘాతించు** సక. = చెరుచు, చంపు; వి. **విఘాతం** = చెరుపు, అడ్డంకి, గట్టిదెబ్బ.

**విఘ్నపడు** అక. = అడ్డుపడు; విణ. **విఘ్నం** = అడ్డంకి.

**వింగడించు** సక. = విభజించు, వేరుపరచు; వి. **వింగడం** = విశాలం, విపరీతం, వేరు.

**విచారపడు** అక. = దుఃఖపడు, సంతపించు; వి. **విచారం** = దుఃఖం, ఆలోచన.

**విచారించు** అక. = దుఃఖించు, ఆలోచించు, విచా రణ చేయు; వి. **విచారం** = దుఃఖం, ఆలోచన, **విచారణ** = చర్చ, పరీక్ష, **విచారణీయం** = విచారించదగినది; విణ. **విచారితం** = విచారించి నది, **విచార్యం** = విచారించ దగినది.

**విచేష్టించు** అక. = పిచ్చిపనులు చేయు, పిచ్చివేషాలు వేయు; వి. **విచేష్ట** = పిచ్చిపని, విపరీతకార్యం.

**విచ్చు** అక. = విప్పారు, విరియు, చీలు; వి. **విప్పు** = వైశాల్యం, **విచ్చు మొగ్గు** = విరిసే మొగ్గ.

**విచ్చేయు** అక. = (సగౌరవంగా) వచ్చు, (సగౌర వంగా) పోవు, కూర్చుండు.

**విజయం చేయు** అక.=(సగౌరవంగా) వచ్చు, పోవు; వి. **విజయం** = గొప్పగెలుపు, **విజయి** = గెలుపు గలవాడు, **విజిగీష** = గెలవాలనే కోరిక,

విజి గీషువు = గొప్ప గెలుపు గలవాడు, **విజితుడు** = బాగా ఓడినవాడు.

**విజ్ఞాపించు** సక. = వినతి చేయు, విన్నవించు; వి. విజ్ఞాపన(ం) / విజ్ఞప్తి = విన్నపం, వినతి.

**విజ్జు** అక. = వ్యాపించు; విణ. విజ్జు = తుక్కు తుక్కు, విపరీతం.

**విజ్జోడుపడు** అక. = భేదంగా ఉండు, దూరమగు; విణ. విజ్జోడు = జోడుకాని, సరిపడని.

**విడంబించు** సక. = అనుకరించు, మోసపుచ్చు; వి. **విడంబన(ం)** = మోసం, అనుకరణ.

**విడద్రొక్కు** సక. = విడిపడేటట్లు చేయు, విడగొట్టు. చూ. విడుచు / **తొక్కు**

**విడనాడు** సక. = వదిలిపెట్టు. చూ. విడుచు

**విడియు** అక. = మజిలీచేయు, విడిపోవు, జారిపోవు; వి. విడిది / విడిదల / విడిపట్టు = విడిసిన చోటు, విడమర / విడుపు / విడుదల / విడుగర / విడుగడ / విడ్పు = వదిలిపెట్టడం, విడిపోవటం, విడుపరి = త్యాగి.

**విడివడు** అక. = వేరుపడు, (నిర్బంధం నుంచి) తొలగు, జారు, తొలగిపోవు, వీడు. చూ. **విడియు**

**విడివోవు** అక. = వదిలిపోవు, వేర్పడు, విడివడు. చూ. **విడివడు**

**విడు** అక. రూ. వీడు ప్రే. విడుచు

**విడుగు** అక. = విప్పారు, వికసించు.

**విడుచు** ప్రే. రూ. విడ్చు = విడునట్లుచేయు; వి. విడుపు / విడ్పు = త్యాగం, దానం, వదిలిపెట్టడం. చూ. **విడియు**

విడ్చు ప్రే. చూ. విడుచు

**వితర్కించు** అక. = ఊహించు, అనుమానించు, బాగా చర్చించు; వి. **వితర్కం** = ఊహ, అనుమానం, చర్చ.

**వితాకుపడు** అక. = నిశ్చేష్టితుడగు, పరవశుడగు, పరాకు చిత్తగించు; వి. **వితాకు** = పరాకు, నిశ్చేష్టత, పరవశం. **వితాకుడు** = నిశ్చేష్టితుడు.

**విత్తు** సక. = విత్తనాలు చల్లు, నాటు; వి. **విత్తు**/ విత్తనం = బీజం.

**విదళించు** సక. = ముక్కలుగా నరుకు, చించి చెండాడు; వి. విదళనం = నరకటం, పగలగొట్టడం; విణ. **విదళితం** = ముక్కలైనది, నరుకు పడ్డది.

**విదారించు** సక. = చీల్చు, చంపు; వి. విదారణం = చీల్చటం, చంపటం, యుద్ధం; విణ. విదారకం = చీర్చేది. విదారితం = చీలినది, చచ్చినది.

విదురు అక. రూ. విదులు చూ.

విదురుచు ప్రే. = రాల్చు, విదిలించు; రూ. విదుర్చు/ విద్రుచు / విదులుచు / విదుల్చు వి. విదురుపు / విదుర్పు = రాల్చటం, విదిలించటం.

విదులు అక. = రాలిపోవు, రూ. విదురు చూ. విదురుచు.

విదులుచు ప్రే. రూ. విదుల్చు / విదురుచు / విదుర్చు / విద్రుచు చూ. విదులు.

**విద్యోతించు** అక. = వెలుగు, ప్రకాశించు; వి. **విద్యుత్తు** = మెరుపు, వెలుగు.

**విద్వేషించు** అక. = విరోధించు, పగపట్టు, అసహ్యించుకొను; వి. విద్వేషణం / విద్వేషం = విరోధం, శత్రుత్వం, పగ, విద్వేషి / విద్విషుడు = శత్రువు, పగవాడు.

**విధించు** సక. = కట్టడిచేయు, ఏర్పాటు చేయు, ఆజ్ఞాపించు; వి. విధ = ప్రకారం, పద్ధతి, కట్టడి, విధాయకం = ఆజ్ఞ, కర్తవ్యం, విధానం = పద్ధతి, చేయుటం, ఆజ్ఞ, పూజ, విధి = కర్తవ్యం, ఏర్పాటు, బ్రహ్మ. విధాయకుడు/ విధాయి = విధించేవాడు, విధాత/ విధాతృడు = బ్రహ్మ, మన్మథుడు.

**వినిందించు** సక. = వెడలిట్టు. చూ. నిందించు

**వినిమయించు** సక. = (వస్తువులను) మార్చు; వి. వినిమయం = (వస్తువుల) మార్పిడి.

**వినియోగించు** సక. = ఉపయోగపెట్టు, వాడు; వి. వినియోగం = ఉపయోగం, వాడుక; విణ. వినియుక్తం = వినియోగించినది.

**విను** సక. = ఆకర్ణించు; వి. వినికి(డి) / విన్కి/ విన్కలి/ వినుకలి = వినటం.

**వినుచు** అక.చూ. విను = వినవచ్చు, సక./ప్రే. వినేట్లు చేయు.

**వినోదించు** అక. = సరదాగా పొద్దు బుచ్చు, ఆడుకొను; వి. వినోదం = ఆట, సరదా.

**విన్నబడు** అక. = చిన్నబోవు, తెల్లబోవు; వి. విన్నన/ విన్నబాటు = వైవర్ణ్యం, తెల్లబోవటం.

**విన్నబోవు** అక. = తెల్లబోవు. చూ. విన్నబడు

**విన్నవించు** సక. = మనవి చేయు, వినతి చేయు; వి. విన్నపం/ వినతి = విజ్ఞాపన.

**విన్యసించు** సక. = ఉంచు, (ఒకపద్ధతిలో) అమర్చు; వి. విన్యాసం = అమరిక, ఉంచటం, రచన; విణ. విన్యస్తం = అమర్చినది, ఉంచినది.

**విప్పు** ప్రే. రూ. విడుచు

**విభజించు** సక. = పంచు; రూ. విభాగించు వి. విభజన(ం) = పంపకం.

**విభాగించు** సక. = పంచు, భాగించు; వి. విభాగం = పాలు, వంతు, పంపకం, విభాజనం/ విభజనం = భాగించటం, పంచడం; విణ. విభాజకం = విభజించేది. విభాజ్యం = విభజింపదగినది, విభాజితం = విభజన పొందినది.

**విభ్రమించు** అక. = భ్రాంతిపడు; వి. విభ్రమం = భ్రాంతి.

**విమర్శించు** సక. = తప్పులెన్ను, పరిశీలించు, బాగా విచారించు; వి. విమర్శ/ విమర్శన(ం) = పరిశీలన, విచారణ.

**విమోహించు** అక. = బాగా ప్రేమించు, మోహించు; వి. విమోహం = మిక్కిలి ప్రేమ, తీవ్ర మోహం, విమోహితుడు = తీవ్ర మోహంలో పడ్డ వాడు.

**వియ్యమందు** అక. = (వివాహ) సంబంధం చేయు; వి. వియ్యం = వివాహ సంబంధం, వియ్యంకుడు/ వియ్యంపుడు = వియ్యమందినవాడు, వీయపురాలు/ వియ్యపురాలు/ వియ్యపు సాని = వియ్యమందిన స్త్రీ.

**విరచించు** సక. = చక్కగా రాయు; వి. విరచన(ం) = మంచిరాత; విణ. విరచితం = బాగా రాసింది.

**విరమించు** అక. = మానుకొను, విశ్రాంతి పొందు; వి. విరామం/ విరమణ(ం) = మానుకోవటం, విశ్రాంతి, ఆపు.

**విరవిరవారు** అక. = విలవిల్లాడు, పడిపోవు, విచ్చిపోవు; రూ. విలవిలవారు వి. విరవిర = విల విల, ఫెళఫెళ.

**విరవిరవోవు** అక. విరవిరవారు. రూ. విలవిలవోవు

**విరసించు** అక. = విరసంగా ఉండు, ద్వేషించు; వి. విరసం = రసహీనం.

విరాజిల్లు అక. = ప్రకాశించు; వి. విరాజమానం = బాగా ప్రకాశిస్తున్నది, విరాజితం = బాగా ప్రకాశించినది.

విరిచికట్టు సక. = (చేతులను) వెనక్కు పెట్టికట్టు. చూ. విరుచు

విరిపోటుసేయు సక. = భేదించు; వి. విరిపోటు = భేదం.

విరియబడు అక. = విచ్చిపోవు, వీడు. చూ. వీడు

విరియబారు అక. = విప్పారు, వికసించు, వ్యాపించు, పగులు. చూ. విరియు

విరియబోయు సక. = (జట్టు) వేలాడేట్లు వదులు. చూ. విరియు

విరియు అక. = విప్పారు, వికసించు, పగులు, వీడు, చెదరు, తొలగిపోవు, ఉప్పొంగు; వి. విరి = పూవు, విరిబోడి/ విరిబోణి = పువ్వులాంటి స్త్రీ, విరిపోటు = భేదం, వేర్పాటు, విరివి = విస్తృతి, విరివిడి = విస్తృతి; విశే. విరి = విచ్చిన, వికసించిన, విరిదట్టు = ఎడబాటు పొందిన, విడివడిన, విరివి = విస్తారమైన, విరివిడి = విస్తరించటం.

విరుగబడు అక. = ఓడిపోవు, గర్వించు; రూ. విరగబడు వి. విరుగబాటు/ విరగబాటు = గర్వం, పొగరు.

విరుగు అక. = ముక్కలగు, ఓడిపోవు, చెడిపోవు; రూ. విర్గు వి. విరుగుడు = విరిగిన వస్తువు. విరుపు = విరచటం; విశే. విరుగుడు = విరిచేది. విరుపు = విరుగుడు.

విరుచు ప్రే. = విరిగేట్లు చేయు. చూ. విరుగు

విరోధించు అక. = ద్వేషించు, పగబట్టు, శత్రుత్వం పెట్టుకొను; వి. విరోధం = పగ, శత్రుత్వం. విరోధనం = పగబట్టడం; విశే. విరుద్ధం = విరోధం గల.

వి(ౖ)రవీగు అక. = విడిపివడు, పొగరెక్కు, అహంకరించు, తెగనీలుగు, నిక్కు. చూ. వీగు

విలంఘించు సక. = ఎగిరిదూకు. చూ. లంఘించు

విలపించు అక. = ఏడ్చు; రూ. విలాపించు వి. విలపనం/ విలాపం = ఏడ్పు.

విలవిలపోవు అక. = తన్నుకొను, బలహీనమగు; వి. విలవిల = బలహీనత, గిజగిజ.

విలవిలలాడు అక. = గిజగిజ లాడు, లబలబమను; చూ. విలవిలపోవు

విలసిల్లు అక. = ఒప్పుగా ఉండు, ప్రకాశించు, సుఖంగా ఉండు, విలాసంగా బతుకు; వి. విలసనం = ఆటపాటలు, సుఖం, ప్రకాశం, విలాసం, విలాసం = ఆట, హావభావాలు, శృంగార చేష్ట, విలాసిని = విలాసవతి, విలాసి = విలాస పురుషుడు; విశే. విలసితం = విలాసంగా ఉన్నది.

విలాపించు అక. రూ. విలపించు చూ.

విలుచు సక. = వెలయిచ్చికొను; రూ. విల్చు వి. వెల/ విలువ = ధర, ఖరీదు, విలువకాడు = వెల యిచ్చికొనేవాడు.

విలోకించు సక. = చూచు; వి. విలోకనం/ విలోచనం = చూపు, దృష్టి.

వివక్షించు సక. = చెప్పదలచుకొను; వి. వివక్ష = చెప్పాలనే కోరిక, వివక్షువు = చెప్పాలనుకొనేవాడు; విశే. వివక్షితం = చెప్పదలచినది.

వివరించు సక. = విశదీకరించు, విపులంగా చెప్పు, విస్తరించి చెప్పు, వ్యాఖ్యానించు; వి. వివరణ = వ్యాఖ్య, వివరాలు చెప్పటం.

**వివాహమగు** సక. = పెళ్లాడు; వి. వివాహం = పెళ్లి.

**వివేకించు** సక. = ఆలోచించు, విచారించు; చూ. వివేచించు వి. వివేకం = తెలివి, ఆలోచన, వివేకి = వివేకం కల వ్యక్తి.

**వివేచించు** అక. = వివేకంతో ఆలోచించు, ప్రవర్తించు; వి. వివేచనం = వివేకించటం; విశే. వివేచనీయం = వివేకించ దగినది.

**విశదీకరించు** సక. = స్పష్టం చేయు, వివరించు; విశే. విశదం = స్పష్టమైనది.

**విశసించు** సక. = చంపు, బలియిచ్చు; వి. విశసనం = చంపుడు, బలి, కత్తి.

**విశేషించు** అక. = ప్రత్యేకించు, అతిశయించు; వి. విశేష్యం = వస్తువుల పేరు, నామవాచకం, విశేషం = భేదం, ప్రత్యేకత, అతిశయం; విశే. విశేషకం = విశేషింపజేసే.

**విశ్రమించు** అక. = విశ్రాంతి తీసుకొను, ఊరడిల్లు; వి. విశ్రమం/ విశ్రామం/ విశ్రాంతి = ఊరట. చూ. ఊరడిల్లు

**విశ్లేషించు** సక. = విడమరచి చెప్పు, పృథక్కరించు, వింగడించు; వి. విశ్లేషం = ఎడబాటు, విశ్లేషణ = వింగడింపు.

**విశ్వసించు** సక. = నమ్ము; వి. విశ్వాసి = నమ్మకం గలవాడు, విశ్వాసం = నమ్మకం; విశే. విశ్వసనీయం = నమ్మదగినది, విశ్వసితం = నమ్మినది.

**విషమించు** అక. = ప్రమాదకరమగు, విరోధించు; విశే. విషమం = బేసి, ప్రమాదకరం.

**విషయించు** సక. = సంభోగించు; వి. విషయం = ఇంద్రియాలకు సంబంధించినది, విషయి = ఇంద్రియం, భోగలాలసుడు.

**విషయీకరించు** సక. = ఉద్దేశించు; వి. విషయం = అంశం, విషయి = ఆరోపించినది, విషయీ కరణ = విషయంగా మార్పు.

**విషాదించు** అక. = దుఃఖపడు, ఖేదపడు; వి. విషాదం = దుఃఖం, ఖేదం.

**విష్ఠించు** అక. = మలవిసర్జన చేయు; వి. విష్ఠ = మలం.

**విసరియాడు** సక. = విసరు, గాలివీచు. చూ. విసరు

**విసరు** అక. = గాలివీచు, బయటపడు, సక. (రెక్కలు) ఆడించు, విసరివేయు.

**విసర్జించు** సక. = వదిలిపెట్టు; వి. విసర్గం = విసర్జనం, త్యాగం, విసర్జన(ం) = వదిలిపెట్టడం, త్యాగం; విశే. విసర్జనీయం = విడిచిపెట్ట దగ్గది.

**విసిమాలు** అక. = విపరీతమైన విసుగు పుట్టు. చూ. విసుగు

**విసుగు** అక. = విసుక్కొను, నిర్వేదపడు; రూ. విసువు వి. విసువు/ విసుగు = విసుకు; నిర్వేదం.

**విస్తరించు** ప్రే. = పెంచు, విస్తరిల్లజేయు; వి. విస్తరం = విరివి, మాటల విస్తృతి, విస్తారం = విరివి; విశే. విస్తృతం = విశాలమైనది, విస్తీర్ణం = విశాలత్వం, విరివి.

**విస్తరిల్లు** అక. = విరివియగు. రూ. విస్తరిలు చూ. విస్తరించు

**విస్ఫోటించు** సక. = పేల్చు; వి. విస్ఫోటం = పేలుడు, బొబ్బ, పొక్కు.

**విహరించు** అక. = సరదాగా తిరుగు; వి. విహారం = సరదా తిరుగుడు, వాహ్యాళి, తిప్పట, విహారి/ విహర్త = విహరించేవాడు, విహరణం = విహరించటం.

విహ్వాలించు అక. = (భయం మొ॥ వాటితో) గాభరా పడు, వణుకు. దడదడలాడు, చచ్చుపడు; వి. విహ్వాలత = దడదడ, గాభరా.

వీక్షించు సక. = చూచు; వి. వీక్ష(ణం) = చూపు, దృష్టి; విశే. వీక్షితం = చూసినది, వీక్ష్యం = చూడ దగినది, ఆశ్చర్యకరమైనది.

వీగియాడు అక. = చలించు, కదలాడు, (యుద్ధంలో) ఓడిపోవు; వి. వీక = గర్వం, ఉత్సాహం, పరా క్రమం, దీనత్వం, పోలిక, ఉన్నతి, విధం, విజృంభణ, వీకు = ఉన్నది, ఉద్ధతి, పరాక్రమం.

వీగు అక. = ఉత్సహించు, చలించు (యుద్ధంలో) ఓడిపోవు.

వీచు అక.= (గాలి) విసరు, సక. విసరు; చూ. వీగియాడు వి. వీచోపులు = వింజామరలు.

వీటిబుచ్చు ప్రే. = వీటిబోయేట్లుచేయు, నష్ట పరచు, వ్యర్థపరచు, చెరుగు. చూ. వీటిబోవు

వీటిబోవు అక. = చెడిపోవు, నష్టమగు, వ్యర్థమగు; వి. వీటి = కొల్ల.

వీడు అక. = వదలు, స్పష్టమగు, కొనసాగు, పెరుగు, ప్రే. వీడజేయు; వి. వీడు = పట్టణం, కట్నం, సేన, శిబిరం. వీడుకోలు / వీడ్కోలు = అనుమతి, విడుపు, చావు, వీడుపట్టు = విడిది, సేనవిడిచే చోటు, నివాసస్థలం, వీడుపాటు / వీడ్పాటు = మారుపాటు, వ్యత్యాసం.

వీడుకొను సక. ప్రే. వీడుకొలుపు = వదిలి పోవు, సెలవు తీసుకొను; రూ. వీడ్కొను వి. వీడ్కోలు = సెలవు, అనుమతి. చూ. వీడు

వీడుకొలుపు ప్రే. = పోయిరమ్మని పంపు. రూ. వీడ్కొలుపు చూ. వీడుకొను

వీడుచు ప్రే. = వీడజేయు, వదిలించుకొను. రూ. విడుచు చూ. వీడు

వీడుజోడాడు అక. = మార్పు చెందు, సరిపోలు; విశే. వీడుజోడు / విజ్జోడు = సరికానిది, జతకుదరనిది. చూ. విజ్జోడు

వీడుపడు అక. = మారుపడు, తడబడు, భేదపడు; రూ. వీడ్వడు / వీడువడు చూ. వీడు; వి. వీడు పాటు / వీడ్పాటు = మారుపాటు, వ్యత్యాసం.

వీడ్కొను సక. రూ. వీడుకొను

వీడ్కొలుపు ప్రే. రూ. వీడ్కొల్పు / వీడుకొలుపు

వీడ్వడు అక. రూ. వీడువడు

వీతెంచు అక. = వీచు, విసరు. చూ. విసరు

వీనుమిగులు అక. = పేరుకు వచ్చు, ప్రసిద్ధికెక్కు; వి. వీను = ప్రసిద్ధి, ప్రఖ్యాతి.

వీలు అక. = ఉపయోగించు; వి. వీలు = అనుకూ లత, విశే. వీలు = అనుకూలం.

వీలుపడు అక. = సరిపడు, సరిపోవు, కుదురు, అనుకూలమగు. చూ. వీలు

వీసరపడు అక. = వెలితిపడు; వి. వీసర(ం) = వెలితి, కొరత.

వెక్కసపడు అక. = భరించలేకపోవు; వి. వెక్క సం = భరించలేకపోవటం, భరించరాని మాట / నింద, వెక్కసి = భరించరాని వ్యక్తి, వెక్కస పాటు = ఎక్కువ కావటం.

వెక్కసించు అక. = భరించ లేకపోవు, ఎక్కువగు. చూ. వెక్కసపడు

వెక్కిరించు అక. = కొక్కిరించు, వికారపు చేష్టలు చేయు, అపహాస్యం చేయు, సక. అపహసించు. చూ. అపహసించు

వెక్కు అక. = వెక్కివెక్కి ఏడ్చు, వెక్కిళ్లువిడుచు; వి. వెక్కు/వెక్కిలి/ఎక్కిలి = వెక్కిళ్లు; విశే. వెక్కురు = వికారం వచ్చిన.

వెగచు అక.= వెక్కివెక్కి ఏడ్చు, వెక్కు. చూ. వెక్కు

వెగడుపడు అక. = తల్లడపడు.

వెచ్చపెట్టు సక. ప్రే. వెచ్చపరుచు = ఖర్చు చేయు; వి. వెచ్చం = వ్యయం, ఖర్చు, చిల్లర సరుకుల అప్పు. వెచ్చాలు = చిల్లర సరకులు, వెచ్చకాడు = విటుడు, వ్యభిచారి, విపరీతంగా ఖర్చు పెట్టేవాడు.

వెచ్చపోవు అక. = ఖర్చగు, దండగపడు. చూ. వెచ్చపెట్టు

వెచ్చించు సక. = వెచ్చం చేయు, ఖర్చుపెట్టు, వ్యర్థం చేయు. చూ. వెచ్చపెట్టు

వెచ్చు అక. = కాగు, వేడెక్కు; వి. వెచ్చు = వేడిమి.

వెట్టిగొను సక. = వెట్టిచేయించు; వి. వెట్టి = కూలిలేని పని, వెట్టివాడు/వెట్టీడు = వెట్టిపని వాడు.

వెంటిగొను అక. = మెలికపడు, పిరిగొను; వి. వెంటి = పేనిన గడ్డి.

వెడగుపడు అక. = తెలివి లేకుండు, అవివేకి అగు; వికారం పొందు, మొద్దుబారు; వి. వెడగు = అవివేకి, వికారి, వెడగుపాటు = మొద్దు బారటం; విశే. వెడగు = అవివేకి.

వెడగురపడు అక. = బయట పడు, వెళ్ళు; చూ. వెడగుపడు వి. వెడలబాటు = బయట పడటం, వెళ్ళటం.

వెడలబడు అక. = బయట పడు, వెళ్ళు; వి. వెడలబాటు = బయట పడటం, వెళ్ళటం.

వెడలబారు అక. = బయట పడు, వెడలబడు. చూ. వెడలబడు

వెడలు అక. = బయటికిపోవు. రూ. వెళ్ళు చూ. వెడలబడు

వెడలుచు ప్రే. = వెళ్ళగొట్టు. రూ. వెడలించు/ వెడల్చు చూ. వెడలబడు

వెడ్డుపెట్టు సక. = మోసగించు; వి. వెడ్డు = మోసం, కపటం. వెడ్డరి = మోసగాడు, మోసగత్తె.

వెతకు సక. = అన్వేషించు; రూ. వెతుకు/ వెదకు/వెదుకు/వెనకు వి. వెదకుడు/ వెదకులాట = అన్వేషణ.

వెదచల్లు సక. = పారజల్లు, విరజిమ్ము, వ్యాపింప జేయు; రూ. వెదజల్లు వి. వెద = విత్తటం.

వెదచిందు అక. = వ్యాపించు, చూ. వెదచల్లు

వెదపెట్టు సక. = విత్తునాటు; వి.వెదం = విత్తటం.

వెనకు సక. చూ. = వెనకబడు; రూ. వెదకు వి. వెన్క/వెనుక/వెనుకల/వెనకాతల = వెన్నువైపున్న భాగం, ముందు, పడమర, వెనుకటి పని = అపరకర్మ, వెనుక చూపుల మెకం = ఎలుగ్గొడ్డు, వెనుకమేను = వీపు, వెనుకటి వాడు = తమ్ముడు, వెనక ఉన్నవాడు. వెంబడి/ వెన్నడి = వెంట; విశే. వెన్ను, వెను అవ్య. = వెనక. వెన్క/వెనుక/ వెనుకల/వెనకాతల = వెనకటిది, పూర్వపుది, వెంబడి, తరవాత, వెనువెంట/వెన్వెంట = వెంటనే.

వెనుకదీయు అక. = వెనక్కు మళ్లు, సంకోచించు. రూ. వెనుదీయు చూ. వెనుక చిక్కు

**వెనుకద్రొక్కు** = చూ. వెనుదీయు

**వెనుకపడు** అక. = వెనుకచిక్కు, (డబ్బు) మిగులు; చూ. వెనకపడు/వెనుకచిక్కు వి. వెనుకపాటు = వెనకబడటం.

**వెనుకవేయు** సక. = (డబ్బు) కూడబెట్టు. రూ. వెనకవేయు చూ. వెనుకచిక్కు

**వెనుకొను** సక. = వెంబడించు, వెంబడిపడు. రూ. వెక్కొను

**వెనుచరుచు** సక.= వెంబడించు. చూ. వెనుకొను

**వెనుదీయు** అక.= వెనక్కుమరలు. చూ. వెనుకచిక్కు

**వెనుబడు** అక. = దుఃఖపడు; వి. వెనుబాటు = వెనుబడటం.

**వెన్కొను** సక. రూ. వెనుకొను

**వెన్తవులు** సక. రూ. వెనుతవులు

**వెన్నడించు** సక. =వెంబడించు. చూ. వెంబడించు

**వెన్నడికొను** సక. చూ. వెన్నడించు

**వెన్నంటు** సక. చూ. వెంబడించు.

**వెన్నాడు** సక. = వెంటబడు, వెంబడించు; వి. వెన్ను = వీపు.

**వెన్నిచ్చు** అక. = వెనుదీయు; చూ. వెనుదీయు వి. వెన్ను = వీపు.

**వెన్నుదన్ను** అక. = వెనక నిల్చు, ఆసరగాఉండు, సక. వెంబడించు. చూ. వెంబడించు

**వెన్బడు** అక. = దుఃఖపడు. రూ. వెనుబడు చూ. వెన్బాటు/వెనుబాటు

**వెంపరలాడు** సక. = పీడించు, హింసించు, భేదించు; వి. వెంపర = పీడనం, భేదనం, హింస.

**వెంబడించు** సక. = వెంటబడు, వెంబడి పోవు; వి. వెన్నడి/వెంబడి = వెంట.

**వెమ్ము** అక. = వేడెక్కు, కాగు; వి. వెప్పు = వేడిమి.

**వెరజాడు** సక. = కుప్పచేయు, కుప్పలుపెట్టు.

**వెరజు** సక. = కుప్పలు పెట్టు, కుప్పచేయు.

**వెరగుపడు** అక. = ఆశ్చర్యపడు, మాన్పడు, నిశ్చేష్టపడు; వి. వెరపు/వెర = భయం, వెరగు = ఆశ్చర్యం, నిశ్చేష్టత. వెరగుపాటు = ఆశ్చర్యపడటం, నిశ్చేష్టపడటం, వెరపరి = భయస్థుడు.

**వెరగొందు** అక.= ఆశ్చర్యపడు. చూ. వెరగుపడు

**వెరచరచు** అక. = భయపడు; చూ. వెరగుపడు వి. వెరపు/వెర = భయం.

**వెరచు** అక. = భయపడు; వి. వెర/వెరపు = భయం, ఆశ్చర్యం, నిశ్చేష్టత, వెరవెరపాటు/వెరగుపాటు = ఆశ్చర్యం, నిశ్చేష్టత, వెరపరి = భయస్థుడు, భయస్థురాలు, వెరబొమ్మ = దిష్టి బొమ్మ.

**వెలచు** సక. = తోము, శుభ్రపరచు; వి. వెలరు = తెల్లన.

**వెలయు** అక. = ప్రకాశించు, పేరుమోయు, బయటపడు; వి. వెలరు = తెల్లన.

**వెలరారు** అక. = తెల్లబడు; వి. వెలరు = తెల్లన, వెలవెలన/వెలవెలపాటు = తెల్లదనం, వైవర్ణ్యం; విణ. వెలవెల అవ్య. = తెల్లగా.

**వెలరువారు** అక. = తెల్లబడు, వెలవెలపోవు.

**వెలలు** అక. రూ. వెడలు

**వెలలుచు** ప్రే. అక. = తెల్లబడు, వెలవెలబోవు; రూ. వెడలుచు/వెడల్చు చూ. వెలవెలబారు వి. వెలవెలన/వెలవెలపాటు = తెల్లదనం, వైవర్ణ్యం.

వెలవెలబోవు అక. = తెల్ల బడు, తెల్లబోవు. చూ. వెలరువారు

వెలారించు సక. = వెళ్ళగొట్టు, బయటపెట్టు. రూ. వెలారుచు/వెలార్చు చూ. వెలయు

వెలారుచు సక. రూ. వెలార్చు చూ. వెలారించు

వెలికిలు అక. = వెల్లికిలాపడు.

వెలిపుచ్చు సక. = బయట పెట్టు, బహిరంగ పరచు; రూ. వెలిబుచ్చు వి. వెలి = బయలు, బహిష్కారం; విణ. వెలి = తెల్లని.

వెలిపెట్టు సక. = వెలివేయు, బహిష్కరించు; వి. వెలి = బహిష్కారం.

వెలియు అక. = వానకురిసి ఆగిపోవు.

వెలివిరియు అక. = ఉబుకు. రూ. వెల్లివిరియు

వెలివిసరు అక. = బయటపడు.

వేలివేయు సక. = బహిష్కరించు; వి. వెలి = బహిష్కారం.

వెలుకబారు అక. = తెల్లబడు, వెల్లనగు; వి. వెలుక = తెల్లన.

వెలుగు అక. = ప్రకాశించు, మండు; వి. వెలుగు = ప్రకాశం, కిరణం, ఎండ, వెలుతురు.

వెలుగొందు అక. = ప్రకాశించు.

వెలుచు సక. ప్రే. వెలిపించు = వెళ్లగొట్టు, తోలు, తోడు. రూ. వెలలుచు

వెలుపలించు సక. = బయటపెట్టు, బయటికి నెట్టు; వి. వెలుపల = బహిఃప్రదేశం; విణ. వెలుపల = వెలియైన.

వెలుపించు సక. = వెడల్పుచేయు, సాగదీయు; వి. వెలుపు = వెడల్పు.

వెలువడు అక. = బయటపడు, బయటికి వచ్చు, బయలుదేరు.

వెలువరించు ప్రే. రూ. వెల్వారించు = వెలువడేట్లు చేయు.

వెల్లబారు అక. = తెల్లబడు, తెల్లమొహం వేయు; వి. వెల్లబాటు = వైవర్ణ్యం, తెల్లబోవటం.

వెల్లనగు అక. చూ. వెల్లబారు.

వెల్లిగొను అక. ప్రే. వెల్లిగొలుపు = వరదపారు, ప్రవహించు, పరంపరగా బయలుదేరు; వి. వెల్లి(క)/వెల్లువ = వరద, ప్రవాహం, మడుగు.

వెల్లివిరియు అక. = వరదపారు, వ్యాపించు, బయటపడు; రూ. వెలివిరియు చూ. విరియు, వెల్లిగొను విణ. వెల్లివిరి = స్పష్టమైన, ప్రకటిత మయిన, బయటపడ్డ.

వెల్లువగట్టు అక. = మడుగుకట్టు, ప్రవహించు; వి. వెల్లువ/వెల్లి(క) = ప్రవాహం, వరద.

వెల్వడు అక. రూ. వెలువడు చూ. వెల్వారుచు/వెల్వారించు.

వెల్వెలబారు అక. రూ. వెలవెలబారు చూ.

వెళ్ళు అక. రూ. వెడలు

వేగపడు అక. = త్వరపడు, తొందరపడు; వి. వేగం/వేగిరం/వే/వేగ = వడి, తొందర, వేగ పాటు = వేగిరపాటు, వేగిరకత్తియ/వేగిరకత్తె = తొందరపడే స్త్రీ, వేగిరకాడు = తొందర గలవాడు, వేగరి = త్వరగా సమాచారం అందించే వాడు, గూఢచారి.

వేగించు అక. = జాగారం చేయు, తెల్లవార్చు. చూ. వేగు

**వేగిరపడు** అక. = తొందరపడు. మా. వేగపడు

**వేగిరపెట్టు** సక. = త్వరపడు. మా. వేగపడు

**వేగు** అక.= తెల్లవారు, ఉదయించు; రూ. వేవు వి. వేకువ/వేగుబోక = తెల్లవారు జాము, ప్రభాతం, వేగు(రు) జుక్క = పొడుపు చుక్క, శుక్రుడు, వేగుజాము = తెల్లవారే సమయం.

**వేచు** సక. = వేచి ఉండు, ఎదురు చూచు, ప్రతీక్షించు.

**వేంచేయు** అక. = (సగౌరవంగా) వచ్చు, (అగౌరవంగా) పోవు, కూర్చుండు, ఉండు, నివసించు. రూ. విజయం చేయు

**వేటాడు** సక. = చంపు; రూ. వేటలాడు వి. వేట = మేకపోతు, పొట్టేలు, వేట/వేటలాట = వెతికి పట్టి చంపటం, వేటకాడు/వేటగాడు/ వేటగిరి/వేటరి = వేటాడేవాడు.

**వేడికొను** సక. = ప్రార్థించు, యాచించు; రూ. వేడుకొను వి. వేడికోలు/వేడుకోలు = యాచన, ప్రార్థన.

**వేడు** సక. =ప్రార్థించు, కోరు యాచించు, అడుక్కొను; వి. వేడుకోలు = యాచించటం, ప్రార్థన,

**వేడుకపడు** అక. = ఆసక్తిపడు, కుతూహలపడు, అపేక్షించు, ముచ్చటపడు; రూ. వేడ్కపడు వి. వేడ్క/వేడుక = ఇష్టం, ముచ్చట, కోరిక, సంతోషం, వినోదం, సరదాపని, వేడుకకాడు = జారుడు, విటుడు, కుతూహలపరుడు, వినోది, క్రీడాశీలి; విశి. వేడ్క/వేడుక = వినోదకరమైన.

**వేడుకసేయు** అక. రూ. వేడ్కసేయు/ వేడుకపడు.

**వేడుకొను** సక. రూ. వేడికొను

**వేడెవెట్టు** సక. = చుట్టువెట్టు; వి. వేడెం = గుండ్రంగా తిరగటం.

**వేధించు** సక. = బాధించు, పీడించు, రంధ్రం పెట్టు; వి. వేధం = బొక్కపెట్టడం, వేధ్యం = గురి; విశి. వేధ్యం = రంధ్రం పెట్టదగినది, వేధితం = బొక్క పెట్ట దగినది.

**వేయు** సక. ప్రే. వేపు = విసరు, దిగవిడుచు, ఉంచు, వేయించు, వేగించు. మా. వేయించు/ వేగించు

**వేరిడించు** సక. = అవివేకిని చేయు; వి. వేరిడి/ వేరిండి = అవివేకి, వేరిడితనం/వేరిండితనం = అవివేకం.

**వేరుపడు** అక. = భేదపడు, అన్యమగు, విడిపోవు; రూ. వేర్పడు వి. వేరడం/వేరిమి = భేదం, వేరుపాటు/వేర్పాటు/వేరుబందం = భేదం, విరోధం, విడిపోవటం.

**వేరుపోవు** అక. ప్రే. వేరు పరచు/వేరు పుచ్చు. మా. వేరుపడు

**వేలాడు** అక. మా. వ్రేలాడు

**వేలు** అక. రూ. వ్రేలు

**వేలుచు** సక. రూ. వేల్చు/ వ్రేలుచు/ వ్రేలు = యజ్ఞగుండంలో (నేయి మొ॥) కాల్చు పడవేయు; వి. వేలిమి = హోమం. వేల్పు/వేలుపు = దేవత, వేలిమిబొట్టు = తాయెత్తు, రక్షరేకు, వేల్పుడు = పూజ.

**వేవు** అక. = తెల్లవారు. రూ. వేగు

**వేష్టించు** సక. = చుట్టుకొని ఉండు, అన్ని వైపులా నిలుచు; వి. వేష్టనం = చుట్టుకోవడం, వేష్టం

= చుట్టుకుంచె, వేష్టువ = చోపతి; విణ. వేష్టితం = చట్టుకొన్నది.

**వేసరించు** ప్రే. = శ్రమపెట్టు; వి. వేసరం = శ్రమ, వేసరి = బాధించేవాడు.

**వేసరు** అక. = విసుక్కొను, విసిగి పోవు, బాధపడు, శ్రమపడు, విచారపడు; రూ. వేసారు వి. వేసరి = బాధించేవాడు., వేసరం = శ్రమ.

**వైచు** = విసరివేయు, పడవేయు, రూ. వయిచు

**వైరించు** అక. = పగబట్టు, విరోధించు; వి. వైరం = పగ, విరోధం.

**వ్యతిరేకించు** అక. = తిరగబడు, కాదను, మారు మాట్లాడు, వి. వ్యతిరేకత = ఎదురు, కాద నటం; విణ. వ్యతిరేకం = వేరు, మారు, ఎదు రయిన, వ్యతిరిక్తం = వేరు పడ్డది, మారయినది, ఎదురయినది.

**వ్యధపెట్టు** సక. = బాధపెట్టు, ఏడ్పించు; వి. వ్యధ = బాధ.

**వ్యభిచరించు** అక. = రంకాడు; వి. వ్యభిచారం = రంకు, వ్యభిచారి = జారుడు, తిరుగుబోతు, వ్యభిచారిణి = రంకులాలు, వేశ్య, వ్యభిచరణం = రంకాడటం.

**వ్యయించు** సక. = ఖర్చుపెట్టు, దుబారా చేయు; వి. వ్యయం = ఖర్చు; విణ. వ్యయితం = ఖర్చయినది.

**వ్యవహరించు** అక. సక. = వివాదం నడుపు, వాడుక చేయు; వి. వ్యవహర్త = న్యాయాధిపతి, వ్యవహారికుడు = మంత్రి, వ్యవహారజ్ఞుడు, వ్యవహారం = వాడుక, జూదం, న్యాయం, తగాదా; విణ. వ్యవహర్త = వ్యవహారం తెలిసిన వాడు.

**వ్యాకరించు** సక. = విడమర్చిచెప్పు, రాయు, పెంచి చెప్పు; వి. వ్యాకరణం = శబ్దశాస్త్రం, వ్యాకృతి = విశదపరచటం, వేరు పరచటం, వ్యాకరణం.

**వ్యాకోచించు** అక. = పెరుగు, విస్తరించు; రూ. వ్యాకోషించు, వ్యాకోశించు వి. వ్యాకోచం = పెరిగినది.

**వ్యాఖ్యానించు** సక. = అర్థవివరణ చేయు; వి. వ్యాఖ్య/ వ్యాఖ్యానం = అర్థవివరణ, వ్యాఖ్యాత = అర్థవివరణ కర్త; విణ. వ్యాఖ్యాతం = చెప్పి నది, వివరించినది.

**వ్యాజ్యెమాడు** అక. = దావా చేయు; రూ. వ్యాజ్య మాడు వి. వ్యాజం = వంక, సాకు, మోసం, చెడ్డ తనం. వ్యాజ్యం/ వ్యాజ్యెం = దావా, తగవు, వివాదం, వ్యాజ్యగాడు = వాది, ప్రతివాది.

**వ్యాపాదించు** సక. = ద్రోహం తలపెట్టు, చంపు; వి. వ్యాపాదనం = చంపటం, ద్రోహం తల పెట్టడం, వ్యాపాదం = ద్రోహపు ఆలోచన; విణ. వ్యాపాద్యం = చంపదగిన, ద్రోహం తల పెట్ట దగిన, వ్యాపాదితం = చావుకు గురయిన, ద్రోహా లోచన పొందిన.

**వ్యాపించు** అక. = అంతటా ప్రసరించు; వి. వ్యాపి/ వ్యాపకుడు = వ్యాపించేవాడు, వ్యాప్తి/ వ్యాపనం = వ్యాపించటం; విణ. వ్యాపనీయం/ వ్యాప్యం = వ్యాపించదగినది, వ్యాప్తం = వ్యాపించి నది.

**వ్రక్కలించు** సక. = వక్కలు చేయు, చీల్చు; రూ. వక్కలించు వి. వ్రక్క/ వక్క = ముక్క, భాగం. వ్రక్కలింత/ వక్కలింత = చీల్చటం.

వ్రక్కవాయు అక. = తెగు, తెగిపోవు, వి. వ్రక్క / వక్క = పీలిక, ముక్క.

వ్రక్కవారు అక. = పీలిపోవు, వక్కలగు. రూ. వక్కవారు చూ. వ్రక్కవాయు

వ్రచ్చు సక. = చీల్చు, చంపు; వి. వ్రప్పు = చీలిక. వ్రయ్య = ముక్క, భాగం.

వ్రయ్యబడు అక.= చీలిపోవు. చూ. వ్రయ్యు

వ్రయ్యు అక. ప్రే. వ్రచ్చు = బద్దలగు, చీలిపోవు, చచ్చు; వి. వ్రయ్య = వక్క, ముక్క, భాగం.

వ్రాయు సక. = అక్షర రూపంలో పెట్టు, లిఖించు; రూ. రాయు వి. వ్రాతకాడు/ వ్రాయస కాడు = రాసేవాడు. వ్రాయసం = రాత, జాబు రాయసం = కార్యదర్శిపని, కార్యదర్శి, వ్రాయు = అక్షరం, గీత, వ్రాలు = అక్షరాలు, సంతకం, చేవ్రాలు = చేతిరాత, దస్తూరి, సంతకం.

వ్రాలు అక. = కిందపడు, కిందికిదిగు, వాలిపోవు, తగ్గు, మీరు, మించు. రూ. రాలు

వ్రాలుచు ప్రే. రూ. వ్రాల్చు/ వాల్చు/ వాలుచు

వ్రీలు అక. = చీల్చు.

వ్రీలుపడు అక. = బలహీనపడు.

వ్రేగు అక. = తపించు, వేగిపోవు, వెచ్చబడు, కాలు, మాలు. రూ. వేగు

వ్రేగుపడు అక. = బరువెక్కు; వి. వ్రేకన, వ్రేకం/ వ్రేగు = బరువు.

వ్రేచు ప్రే. = వేయించు; రూ. వేచు చూ. వ్రేగు/ వేగు వి. వ్రేపు/వేపు/ వ్రేపుడు/వేపుడు = వేయించటం.

వ్రేయు అక. = కొట్టు; రూ. వేయు వి. వ్రేటు/ వేటు = దెబ్బ, కొట్టు.

వ్రేయు సకి. = కొట్టు, నరుకు; రూ. వ్రేయు వి. వ్రేత/వేత = దెబ్బ, నరుకు.

వ్రేలబడు అకి. రూ. వేలబడు

వ్రేలాడు అక. = వేలుకాడు. రూ. వ్రేలాడు/వేలియాడు

వ్రేలు అక. = వేలాడు. రూ. వేలు

వ్రేలుకాడు అక. = వేలాడు; రూ. వేలుకాడు వి. వ్రేలుడు/వేలుడు = వేలాడటం.

వ్రేలుచు ప్రే. = వేలాడదీయు, రూ. వేలుచు వేల్చు/ వ్రేల్చు

## శ

శంకించు అక. = అనుమానించు, సందేహించు, భయపడు; రూ. శంకిల్లు వి. శంక = సందేహం, అనుమానం, భయం, విచారం, శంకితుడు = సందేహించిన వాడు, భయపడ్డవాడు.

శఠించు అక. = మొండికిపడు, మూర్ఖపు పట్టు బట్టు; వి. శఠుడు = మూర్ఖుడు, మొండివాడు, కుత్సితుడు.

శపించు సక.= తిట్టు, శాపం పెట్టు; రూ. శాపించు వి. శాపం = తిట్టు, ఒట్టు, శపథం/ శపనం = ఒట్టు, తిట్టడం.

శబ్దించు అక. = మోగు, చప్పుడు చేయు; వి. శబ్దం = ధ్వని, మోత, శబ్దనుడు = చప్పుడు చేసేవాడు; విణ. శబ్దితం = మోగినది.

శమించు అక. = తగ్గు, తక్కువగు, శాంతించు, వి. శమం/ శమథం = శాంతి, విణ. శమితం = తగ్గినది, శాంతించినది, శమి = శమంగల వాడు.

**శంసించు** సక. = పొగడు, స్తుతించు; వి. శంస = మాట, పొగడ్త, శంసనం = పొగడటం, చెప్పటం.

**శయనించు** అక. = పడుకొను; వి. శయం/శయ్య/శయనం = పడక, పక్క, శయనీయం = పక్క. శయితుడు/శయాళువు = నిద్రపోతు, శాయి = పడుకొనేవాడు; విశే. శయనీయం = పడుకో దగ్గది.

**శయించు** అక. = పడుకొను, శయనించు. చూ. శయనించు

**శరణుచొచ్చు** సక. = రక్షణకోరు; వి. శరణం = రక్షణ, రక్షకం, శరణ్యుడు/శరణీయుడు = శరణు కోరదగినవాడు.

**శర్ధించు** అక. = అపాన వాయువు విడుచు, పిత్తు; వి. శర్ధనం = పిత్తటం.

**శాంతించు** అక. = చల్లబడు, వి. శాంతి = శమం. శాంతం = శాంతి పొందినది. చూ. శమించు

**శాపించు** సక. రూ. శపించు.

**శాసించు** సక. = ఆజ్ఞాపించు, శిక్షించు, పరిపాలించు; వి. శాసనం = చట్టం, ఆజ్ఞ, శాసకుడు/శాస్త = శాసించేవాడు, శాస్త్రం = శాసించేది, శాస్తి = శాసనం, శిక్ష, శాస్త్రి = శాస్త్రం తెలిసినవాడు, శాస్త్రీయం = క్రమబద్ధమయినది.

**శిక్షించు** సక. = (విద్య)నేర్పు, శిక్షచేయు; వి. శిక్ష = నేర్పటం, శిక్షితుడు = బాగా చదువు కొన్నవాడు, నేర్పరి.

**శిరసావహించు** సక. = నెత్తిన పెట్టుకొను, లోబడు; వి. శిరం/శిరస్సు = తల.

**శిల్పించు** సక. = చెక్కు, తయారు చేయు; వి. శిల = రాయి, శిల్పం = చెక్కటం, రంగులద్దటం, బొమ్మలు వేయటం, చేయటం, శిల్పి = శిల్పం చేసేవాడు.

**శుద్ధి చేయు** సక. = బాగు పరచు, పవిత్రీకరించు; వి. శుద్ధం = తెలుపు, శుద్ధి = కడగటం, తుడవటం, జల్లించటం, బాగు చేయటం.

**శుభ్రపరచు** సక. చూ. శుద్ధిచేయు = బాగుచేయు, శుద్ధిచేయు; విశే. శుభ్రం = తెల్లని, ప్రకాశించే.

**శుశ్రూషించు** సక. = చదువు, నేర్చుకొను, సేవ చేయు; వి. శుశ్రూష = వినాలనే కోరిక, సేవ, శుశ్రూషకుడు = వినే, సేవించేవాడు.

**శుష్కించు** అక.= ఎండిపోవు, ఇంకిపోవు; చూ. శోషించు వి. శుష్కం = వంటచెరుకు; విశే. శుష్కం = ఎండినది, వట్టిపోయినది, ఇంకినది.

**శుష్కీభవించు** అక. = ఎండి పోవు, ఇంకిపోవు, శుష్కించు. చూ. శుష్కించు

**శృంగారించు** సక. = అలంకరించు, చూ. సింగారించు; వి. శృంగారయోని = మన్మథుడు. శృంగారి = విటుడు,. శృంగారం = అలంకారం; విశే. శృంగారి = శృంగార పురుషుడైన.

**శేఖరించు** అక. = గొప్ప అగు; వి. శేఖరం = తల పూవు, శిఖరం = కొండకొన, చెట్టు పైభాగం, శిఖరి = కొండ, చెట్టు.

**శేషించు** అక. = మిగులు; వి. శేష(ం) = మిగులు, మిగిలినది.

**శోధించు** సక. = బాగుచేయు, శుద్ధిచేయు, పరిష్కరించు, వెదకు; వి. శోధనం = బాగుచేయటం, శుద్ధిచేయటం, వెతకటం, శోధని = చీపురుకట్ట; విశే. శోధితం = బాగు చేసినది, శోధ్యం = బాగు చేయదగినది.

శోభించు అక.= ప్రకాశించు, వెలుగు; రూ. శోభిల్లు వి. శోభ = వెలుగు, కాంతి; విశే. శోభనం = చక్కని, శోభితం = ప్రకాశం పొందినది.

శోషించు అక. = ఇంకు, ఎండు; రూ. శోషిల్లు వి. శోష = క్షయరోగం, శోఫరోగం, సొమ్మ, శోషణం = శోషించటం.

శ్రమించు అక. రూ. శ్రమియించు మా. శ్రమ పడు = కష్టపడు, కష్టం చేయు, శ్రమపడు; వి. శ్రమ = కష్టం, అలసట, బడలిక, సాము, శ్రామికుడు = కష్టజీవి.

శ్లాఘించు సక. = పొగడు; వి. శ్లాఘ = పొగడ్త; విశే. శ్లాఘ్యం/ శ్లాఘనీయం = పొగడదగినది.

శ్లేషించు అక. = శ్లేషచెప్పు; వి. శ్లేష = భిన్నార్థాల కలయిక.

శ్వాసించు అక. = ఊపిరి పీల్చు; వి. శ్వాస = ఊపిరి.

## ష

షికారుచేయు సక. = వేటాడు, సంచారం చేయు, వాహ్యాళికి పోవు; వి. షికారీ = వేటగాడు. షికారు = వేట, వాహ్యాళి.

## స

సకిలించు అక.= హేషపెట్టు, (గుర్రం) అరచు; రూ. సగిలించు వి. సకిలింత/ సగిలింత = గుర్రం కూత, హేష.

సగ్గు అక. = తగ్గు, అణిగిపోవు. రూ. స్రగ్గు

సంకటుపడు అక. = ఇబ్బందిపడు, ఇరుకునపడు; వి. సంకటం = ఇరుకు, ఇబ్బంది, సంకటుపాటు = ఇరుకు, ఇబ్బంది; విశే. సంకటం = ఇరుకయిన, ఇబ్బంది పెట్టే.

సంకలించు సక. = కూర్చు, అమర్చు; వి. సంకలనం = కూర్పు; విశే. సంకలితం = కూర్చినది.

సంకల్పించు సక. = అనుకొను, భావించు, అభిప్రాయడు; వి. సంకల్పం = భావన, అభిప్రాయం.

సంకుచించు అక. = సందేహించు, ముడుచుకొనిపోవు, ముకుళించు, తగ్గి పోవు; రూ. సంకోచించు వి. సంకోచం = సందేహం, ముకుళనం; విశే. సంకుచితం = సందేహించినది, తగ్గినది, ముడుచు కొన్నది.

సంకేతించు సక. = గుర్తుపెట్టు, పేరు పెట్టు, ఏర్పాటు చేయు; వి. సంకేతం = గుర్తు, ఏర్పాటు; విశే. సంకేతితం = గుర్తుపెట్టిన, ఏర్పాటు చేసిన.

సంకోచించు అక. రూ. సంకుచించు

సంక్రమించు అక. = లభ్యపడు, (వారసత్వంగా) వచ్చిపడు, ప్రవేశించు; వి. సంక్రమం/ సంక్రామం/ సంక్రాంతి/ సంక్రమణనం = (సూర్యుడు ఒకరాశిలో) ప్రవేశించటం, చక్కగా నడవటం.

సంక్షేపించు సక. = కుదించు, తగ్గించు; వి. సంక్షేపం/ సంక్షిప్తి = కుదింపు, తగ్గింపు, సంక్షేపణ = కుదించటం.

సంగమించు అక. = కలియు, కలిసిపోవు, సంభోగించు; వి. సంగం = కూడిక, చేరిక, కలయిక, సంగమం = కలయిక, సంయోగం, సంభోగం.

సంగ్రహించు సక. = బాగాగ్రహించు, కుదించు; వి. సంగ్రహం = కుదింపు, సంక్షేపించిన గ్రంథం, కుదింపు.

సంఘర్షించు అక. = ఘర్షణపడు, ఢీకొను; వి. సంఘర్షణ/సంఘర్షం = పోటీ, ఘర్షణ.

సంఘీభవించు అక. = గుంపు కట్టు, గుమికూడు, ఒక్కటిఅగు; వి. సంఘం = గుంపు, సమాజం, సంఘీభావం = గుంపు, కట్టడం.

సచ్చు అక. రూ. చచ్చు చూ.

సజ్జించు సక. = అలంకరించు, కవచం ధరించు; వి. సజ్జ = అలంకరణ, కవచం, సజ్జుడు = కవచ ధారి, అలంకృతుడు, వాసక సజ్జిక = ప్రియుడి కోసం అలంకరించు కొన్నస్త్రీ; విణ. సజ్జితం = అలంక రించినది; కవచం తొడిగినది.

సంచయించు సక. = పోగుచేయు, కూడబెట్టు; వి. సంచయం = పోగు, కూడబెట్టడం, సమూహం, సంచయనం = పోగు చేయటం; విణ. సంచితం = కూడ బెట్టినది, పోగు చేసినది.

సంచరించు అక. = తిరుగు; వి. సంచారం/సంచరణం = తిరగటం, సంచారి = తిరిగే వాడు, (దేశ) దిమ్మరి, సంచాలిక = తార్పుడు కత్తె.

సంజవడు అక. = సాయంత్రమగు; వి. సంజ = సంధ్యాకాలం, సాయంత్రం.

సడవు సక. = దొంగిలించు; వి. సడ = మోసం, కపటం.

సడలించు ప్రే. రూ. సడలుచు/సడల్చు, సడలు = సడిలేట్లు చేయు.

సడలు సక. = వదులగు, ఊడు, జారు; రూ. సడిలు వి. సడలు = వదులు, జారటం, ఊడటం.

సడలుచు ప్రే. రూ. సడల్చు/సడలించు

సడ్డసేయు సక. = లక్ష్యపెట్టు; వి. సడ్డ = లక్ష్యం.

సణుగు అక. = గొణుగు; వి. సణుగుడు = గొణగటం.

సతాయించు సక. = బాధించు, హింసించు, దబాయించు, ఊదరకొట్టు.

సత్కరించు సక. = గౌరవించు, మర్యాద చేయు, సమ్మానించు; వి. సత్క్రియ/సత్కారం/సత్కృతి = గౌరవం, సమ్మానం.

సదమదమగు అక. = నలిగిపోవు; రూ. సతమతమగు విణ. సతమతం/సదసద/సదమదం = నలిగిపోయినది.

సదమదముసేయు సక. = నలిగిపోవటం. రూ. సతమతం/సదసద/సదమదం

సదృశమగు అక. = సమానమగు, సరిపోలు; విణ. సదృశం/సదృక్షం = సమానమైన, సరిపోలే.

సను అక. రూ. చను చూ.

సంతకించు సక. = సంతకం పెట్టు, చేవ్రాలు చేయు; వి. సంతకం = చేవ్రాలు.

సంతనకట్టు అక. = చేరు, సంఘీభవించు, సిద్ధపడు; వి. సంత = అంగళ్ళవరుస. సంతన = చేరిక.

సంతనచేయు సక. = పోగుచేయు, సిద్ధపరచు; వి. సంతన = చేరిక.

సంతపడు అక. ప్రే. = సరిపడు, ఒద్దికగా ఉండు, చేరు, సంతపరుచు; వి. సంతన = చేరిక.

సంతపెట్టు సక. = సరిపెట్టు, చేర్చు; వి. సంతన = చేరిక.

సంతపించు అక. = చాలా బాధపడు, దుఃఖపడు. రూ. సంతాపించు

సంతరించు సక. = సేకరించు, కల్పించు, కలిగించు, రచించు, ధరించు, సరిచేయు.

సంతసపడు అక. రూ. సంతోషపడు = సంతోషించు; వి. సంతసం/ సంతొసం/సంతోసం/సంతోషం = హర్షం.

సంతసించు అక. రూ. సంతోషించు

సంతోషించు అక. = సంతోషపడు, హర్షించు; రూ. సంతోసిల్లు వి. సంతసం/సంతొసం/ సంతోషం/సంతోషం = హర్షం.

సంతోసిల్లు అక. రూ. సంతోషించు

సందడించు సక. = సందడి చేయు, అతిశయించు; రూ. సందడిలు/సందడిల్లు వి. సందడి = జనసమూహం, జన సమూహం చేసే ధ్వని, సందడికాడు = సామాన్యుడు; విణ. సందడి = సంకులమైన.

సందడిగొను అక. చూ. సందడించు

సందడిపడు అక. ప్రే. సందిగొలుపు = సందడించు. చూ. సందడించు

సందర్భించు అక. = సందర్భపడు; వి. సందర్భం = సంశయం, అనుమానం.

సందియపడు అక. = సందేహ పూర్వకమగు, అస్పష్టమగు; వి. సందియం = సంశయం, అనుమానం.

సందిగ్ధమగు అక. = సందేహపడు, సంశయించు; వి. సందియం = సంహదేం.

సందుకొను అక.= వ్యాపించు, సక. కూడు, తీసుకొను; వి. సందు = ఇరుకువీధి, సారంగం, మధ్యకాలం, సందుకట్టు = మధ్యకాలం.

సందుగొట్టు అక. రూ. సంధికొట్టు చూ. సందుదవులు .

సందుదవులు అక. = (పసిబిడ్డలకు) సంధివచ్చు; వి. సందు = సంధిరోగం.

సందేహించు అక. = సంశయించు, అనుమానించు; వి. సందేహం = సంశయం, అనుమానం; విణ. సందిగ్ధం = అనుమానాస్పదమైన, అస్పష్టమైన.

సంధించు అక. = కూడు, కలియు, సక. కూర్చు, కలుపు; రూ. సంధిల్లు/సంధిలు వి. సంధాయకుడు/సంధాత = కలిపేవాడు, సంధి = కలయిక, చేర్పు, కూడలి, సంధిత్స = కలుసుకోవాలనే కోరిక. సంధిత్సువు = కలియాలనే కోరిక కలవాడు, సంధ్య = రాత్రింబవళ్ల మధ్యకాలం.

సంధిల్లు అక. రూ. సంధిలు/సంధించు

సన్నగిల్లు అక. రూ. సన్నగిలు = సన్నబడు; వి. సన్నన = చిక్కటం, బక్కపడటం, పలచబడటం; విణ. సన్నం = చిక్కిన, బక్కపడిన, అల్పమయిన.

సన్నికర్షించు సక. = దగ్గరకులాగుకొను; వి. సన్నికర్ష = సమీపం, చేరువ, సన్నికర్షణ = సమీపించటం, దగ్గరకు రావటం, సన్నికృష్టం = దగ్గర, సమీపం; విణ. సన్నికృష్టం = సమీపించి నది, దగ్గరకు వచ్చినది.

సన్నుతించు సక. = బాగా పొగుడు; వి. సన్నుతం = మంచి పొగడ్త లందినది, సన్నుతి = మంచి పొగడ్త.

సన్మానించు సక. = గౌరవించు, మర్యాద చేయు, సమ్మానించు; వి. సన్మాననం = గౌరవించటం, సన్మానించటం. సన్మానం = గౌరవం, సమ్మానం; విశే. సన్మానితం = గౌరవం పొందిన, సమ్మానం పొందిన.

సన్యసించు సక. = సన్యాసంపుచ్చుకొను, కోరికలు వదిలిపెట్టు; వి. సన్యాసం = కోరికలు వదిలిపెట్టడం. సన్యాసి = యతి; విశే. సన్యస్తం = సమర్పించినది, వదిలిపెట్టినది.

సమకట్టు అక. = యత్నించు, సక. సిద్ధపరచు, సేకరించు, ఏర్పరచు, చేయు; వి. సమకట్టు = కవచం.

సమకురు రూ. సమకూరు/సమకూడు

సమకూడు అక. ప్రే. సమకూరుచు/ సమకూర్చు = దొరకు, ప్రాప్తించు, సిద్ధించు, లభించు. రూ. సమకూరు

సమకూరుచు సక. రూ. సమకూర్చు చూ. సమకూడు = ఏర్పాటు చేయు, దొరికించు, లభింప జేయు.

సమకొను అక. ప్రే. సమకొలుపు/సమకొల్పు = దొరుకు, సిద్ధించు, ప్రాప్తించు; వి. సమ కోలు = దొరకటం, లభించటం. చూ. సమకూడు

సమన్వయించు సక. = సరిపెట్టు, బాగా అన్వయించు; వి. సమన్వయం = సరిపెట్టడం; విశే. సమన్వితం = సరిపోయిన, కూడుకొన్న, సరిగా అన్వయించిన.

సమయపడు అక. = అవసరమగు, ఒట్టువేసుకొను; వి. సమయం = కాలం, ఒట్టు, శపథం, ప్రతిజ్ఞ.

సమయు అక. = చచ్చు, నశించు.

సమర్తాడు అక. = రజస్వల అగు; వి. సమర్త/సమరత = రుతువు.

సమర్థించు సక. = సరైనదని వాదించు, తగినట్లు నెరవేర్చు, ఒకరు చెప్పినది సరిఅను; వి. సమర్థన(ం) = సరైనదని వాదించటం. సమర్థత/సామర్థ్యం = శక్తి, నేర్పు, యోగ్యత, సమర్థుడు = గట్టివాడు, నేర్పరి, సమర్థనుడు = పరాలిచ్చేవాడు, ఒకరి మాట, చర్య సరి అనేవాడు.

సమసించు అక. = సమాసంలో భాగమగు, సంక్షేపించు; వి. సమాసం = కొన్ని కలిసి ఒకటి కావటం, సమసనం = ఒకటి కావటం, సమాసం చేయటం, సంక్షేపం.

సమాధానపడు అక. = సరిపెట్టుకొను, సమ్మతిపడు, వి. సమాధానం = జవాబు, సరిపెట్టుకోవటం.

సమాప్తించు సక. = పూర్తిచేయు, ముగించు, చంపు; వి. సమాప్తి/సమాపనం = ముగింపు, పూర్తి, చంపటం, సమాపకం = ముగించేది, చంపేది; విశే. సమాప్తం = ముగిసినది, చచ్చినది, సమాప్యం = ముగించదగినది.

సమీకరించు సక. = సమం చేయు, ఒకటి చేయు, కూడగట్టు; వి. సమీకృతి/సమీకరణ(ం) = ఒకటిచేయటం, కూడగట్టడం, పోగుచేయటం; విశే. సమీకృతం = ఒకటి చేసిన, అయిన.

సమీక్షించు సక. = సరిగా చూచు, బాగావెతుకు; వి. సమీక్ష = పరిశీలన. సమీక్షణం = బాగా చూడడం/పరిశీలించటం. సమీక్ష్యకారి = ఆలోచించి పని చేసేవాడు.

సమీపించు అక. = దగ్గరపడు, దగ్గరకు చేరువ అగు; వి. సమీపం = చేరువ; విణ. సమీపం = దగ్గరి.

సముతుపడు అక. గ్రే. = అలవడు, పట్టుబడు, సముతుపరుచు; వి. సముతు = కట్టుబాటు.

సముదాయించు సక. = ఓదార్చు.

సముద్ధూళించు సక. = విభూతి పూసుకొను.

సముద్ఘోషించు సక. = స్తుతించు, పొగడు.

సంపతిల్లు అక. = సమృద్ధమగు; రూ. సంపతిలు వి. సంపద / సంపత్తి = సమృద్ధి; విణ. సంపన్నం = సమృద్ధమైన.

సంపాతించు సక. = పడగొట్టు; వి. సంపతనం, సంపాతం = పెద్దపాటు.

సంపాదించు సక. = కూడబెట్టు, గడించు; వి. సంపాదన(ం) = గడన, గడింపు, సంపాదకుడు = సంపాదించేవాడు; విణ. సంపాదితం = గడించినది, సంపాద్యం = గడింపదగినది.

సంప్రతించు సక. = చర్చించు, కలిసి ఆలోచించు, (లెక్క) సరిచూచు; వి. సంప్రతి = గణకుడు, సంప్రదింపు = చర్చ.

సంప్రయోగించు సక. = ఉచ్చాటన చేయు; బాగా ప్రయోగించు; వి. సంప్రయోగం = ఉచ్చాటన, మంచి ప్రయోగం.

సంప్రోక్షించు సక. = చిలకరించు, శుద్ధిచేయు; వి. సంప్రోక్షణ = చిలకరించటం, శుద్ధి.

సంబడించు అక.= వీలుపడు, తేరుకొను. రూ. సంబళించు

సంబంధించు అక. = చుట్టరికం కలిగివుండు; వి. సంబంధి = చుట్టం, వియ్యంకుడు.

సంబాళించు సక. = దగ్గరకు తీయు, ఆదరించు, ఆడించు, భరించు, ఓదార్చు; వి. సంబాళింపు = ఓదార్పు, ఆడించటం, ఊరుకోబెట్టడం.

సంబోధించు సక. = పిలుచు, పలకరించు, ఆహ్వానించు; వి. సంబుద్ధి / సంబోధన(ం) = పిలుపు, ఆహ్వానం.

సంభవించు అక. = పుట్టు, జరుగు, కలుగు; వి. సంభవం = పుట్టుక, కూడిక, కారణం; విణ. సంభూతం = పుట్టినది.

సంభావించు అక. సక. = బాగా తలచుకొను, గౌరవించు, సన్మానించు; వి. సంభావన = తలపు, గౌరవం, ప్రసిద్ధి; విణ. సంభావనీయం / సంభావ్యం = గౌరవించదగినది, తలుచుకోదగ్గది, సంభావితం = తలుచుకున్నది, గౌరవం పొందినది.

సంభాషించు అక. = చక్కగా మాట్లాడు; వి. సంభాషణ / సంభాషణ(ం) = మాట్లాడటం.

సంభోగించు అక. = కలియు; వి. సంభోగం = కలయిక.

సంభ్రమించు అక. = తొందరపడు; వి. సంభ్రమం = తొందర, వేగిరపాటు.

సమ్మతించు అక. = ఒప్పుకొను; వి. సమ్మతి = ఒప్పుదల; విణ. సమ్మతం = నచ్చినది, ఇష్టపడినది, ఒప్పుకొన్నది.

సమ్మానించు సక. = గౌరవించు; వి. సమ్మాననం = గౌరవించటం, సమ్మానం = గౌరవం; విణ. సమ్మానితం = గౌరవం పొందినది.

సమ్మార్జించు సక. = శుభ్రంగా తుడుచు; వి. సమ్మార్జనం = బాగా తుడవటం, సమ్మార్జని = చీపురుకట్ట.

సంయోగించు సక. = కలుపు; వి. సంయోగం = కలయిక; విశే. సంయోజితం = కలిపినది.

సంరంభించు అక. = తొందరపడు, వేగిరపడు, హడావిడిపడు; వి. సంరంభం = తొందరపాటు, హడావిడి; విశే. సంరంభి = తొందరపడే, సంరబ్ధం = తొందరపడ్డ.

సంశయించు అక. = సంకోచించు, అనుమానించు, సందేహించు; వి. సంశయం = సందేహం, సంకోచం, అనుమానం, సంశయిత = సంశయించేవాడు, సంశయాళువు = సంశయించే స్వభావం కలవాడు, సంశయం = సంకోచం, సందేహం, అనుమానం.

సంశ్రయించు సక. = ఆశ్రయించు, అండగొను; వి. సంశ్రయం = ఆశ్రయం, అండ; విశే. సంశ్రితం = ఆశ్రయించినది.

సంశ్లేషించు సక. = కౌగలించు, కలుపు; వి. సంశ్లేష(ం) = కౌగిలింత; విశే. సంశ్లిష్టం = కౌగలించి నది, కలిసిపోయినది.

సంసరించు అక. = పుట్టు; వి. సంసరణం = పుట్టడం, సంసారం, సంసారం/సంసృతి = పుట్టుక, కాపరం, సంసారి = కాపురం చేసేవాడు.

సంస్కరించు సక. = బాగుపరుచు, పరిదిద్దు, (శవాన్ని) తగలబెట్టు; వి. సంస్కారం/సంస్కరణ = బాగు చేయటం, సంస్క్రియ = బాగు చేయటం, శవదహనం చేయటం; విశే. సంస్కృతం = బాగుపరిచినది.

సంహరించు సక. = చంపు; వి. సంహారం/సంహరణం = చంపటం, సంహారకుడు/సంహర్త = చంపేవాడు.

సయ్యాటించు సక. = వెక్కిరించు, వేళాకోళం చేయు, పరిహసించు, సరసమాడు; వి. సయ్యాట = కలిసి ఆడే ఆట; సరసం.

సరకుగొను సక. = లక్ష్యపెట్టు; వి. సరకు = లక్ష్యం.

సరకు సేయు సక. సరకుగొను.

సరదు అక. = సమభాగంగా పంచు; సర్దిపెట్టు. రూ. సరసు/సర్దు

సరమగొను అక. = శ్రమపడు; రూ. శ్రమ గొను వి. సరమ = శ్రమ.

సరికట్టు అక. చూ. సరిదాకు/సరిపడు.

సరికడచు అక. = ముందు నడచు, దాటిపోవు, మీరు; విశే. సరి = సమం, సమానం, తగిన, సరి అవ్య. = తిన్నగా, నేరుగా.

సరిగొను సక. = చంపు; వి. సరి = సమాప్తం, ముగిసిన.

సరిచూచు సక. = సమానంగా ఉందో లేదో చూచు, సంప్రతించు; వి. సరి = సమానం.

సరిచేయు సక. = సమానం చేయు; వి. సరి = సమానమైన.

సరించు సక. అనుసరించు చూ. = పోవు, వెళ్లు, వెంటబడు, వెన్నాడు.

సరితూగు అక.= సమానమగు; వి. సరి = సమానం.

సరిపడు అక. = సమానమగు, కుదురు, నచ్చు, అనుకూలమగు, యుక్తమగు; వి. సరి = యుక్తం, తగిన, సమానమైన.

సరిపెట్టు సక. = సరిచేయు, చంపు; వి. సరి = సమానం. విశే. సరి = సమాప్తమైన. చూ. సరిచేయు

సరిపోవు అక. (ప్రే. సరిపుచ్చు) = సమానమగు, సమాధానమగు, అయిపోవు, నశించు; వి. సరి = సమానం, విణ. సరి = సమాప్తం.

సరియగు అక. = నశించు; విణ. సరి = సమాప్తం.

సరియించు సక. = సిద్ధం చేయు; విణ. సరి అవ్య. = పూర్తిగా.

సర్దు సక. = ఒక క్రమంలో పెట్టు; రూ. సరదు/సరసు వి. సర్దుబాటు = సరిపెట్టడం, సరిపెట్టుకోవడం.

సరుగు అక. = పెరుగు, వర్ధిల్లు.

సలపరించు అక. = (పుండు మొ॥) పోటుపెట్టు. చూ. సళుపరించు

సలించు రూ. చలించు

సలుపు రూ. చలుపు

సల్లాపించు సక. = సరసంగా మాట్లాడు, సరస మాడు; వి. సల్లాపం = సరస సంభాషణ.

సవధరించు సక. = ధరించు, వహించు.

సవరణసేయు సక. = అలంకరించు; సవరణ(ం) = అలంకారం, సవరింత/సవరింపు = అలంకరించటం.

సవరణించు సక. చూ. సవరణ చేయు

సవరచేయు సక. = చక్కబరుచు, సవరించు, చదును చేయు; వి. సవరన = చక్కదనం, చదును.

సవరించు ప్రే.= అలంకరించు, చక్కబరచు, తాల్చు చేయు, కూర్చు; రూ. సవరుచు సవరణ/ సవరింత/సవరింపు = అలంకరణ.

సవరిల్లు అక. = అందమగు, బాగా ఉండు. రూ. సవరిలు చూ. సవరించు

సవరుచు అక. రూ. సవరించు

సహకరించు అక. = తోడ్పడు, సాయపడు; వి. సహకారం = సహాయం, సహకారి = సహాయకుడు.

సహగమించు సక. = వెంటపోవు, (మృత భర్తతో) చితినెక్కు; వి. సహగమనం = వెంటబోవటం, మృతభర్తతో చితి ఎక్కటం (సాగుమానం).

సహచరించు అక. = వెంటదిరుగు; వి. సహచారి = స్నేహితురాలు, భార్య, సహచరుడు = స్నేహితుడు, సహచరణం = వెంట తిరగటం, సాహచర్యం = స్నేహం; విణ. సహచారి = వెంట తిరిగేది, సహచరుడు = వెంట తిరిగేవాడు.

సహించు సక. = ఓర్చు, సైరించు; వి. సహనం = ఓర్పు, సహిష్ణువు/సహనుండు = ఓర్చుకొనే వాడు. విణ. సహనం = ఓర్చేది, సహితం/సైతం = కూడుకొన్న, కలిసిన, సహితం/సైతం అవ్య. = కూడా, సహ్యాం = సహించదగినది.

సళించు అక. = దుఃఖించు, సలుపుపెట్టు; రూ. సలించు వి. సళుపు/సలుపు = పోటు; విణ. సళువు = బరువైన.

సళుపరించు అక. = (పుండు మొ॥) పోటు పెట్టు; వి. సళుపరింత/సలపసరింత = పోటు; విణ. సళువు = బరువైన.

సళువు అక. = (పుండు మొ॥) పోటు పుట్టు; రూ. సలుపు వి. సళువు/సలుపు = పోటు.

సాకు సక. = కాపాడు, పెంచు; వి. సాకుడు = పెంపకం, సాకతం = ఊరడింపు, దయ.

సాగదీయు సక. = సాగేట్లు చేయు, పొడుగు చేయు. రూ. చాగదీయు మా. సాగు

సాగు సక. = పొడుగగు; రూ. చాగు వి. సాగుడు = పొడవు.

సాక్షాత్కరించు అక. = ప్రత్యక్షమగు, కంటికి కనిపించు; వి. సాక్షాత్కారం = ప్రత్యక్షం కావటం, కనిపించటం, సాక్షాత్కృతుడు = కనిపించిన వాడు.

సాగనంపు సక. = (వెంట కొంతదూరం పోయి) పంపు.

సాగవేయు సక. = పంపు, పంపించు.

సాగు అక. = పోవు, వెళ్లు, జరుగు, యత్నించు, ఉండు; రూ. చాగు సాగుపాటు = జరుగుబాటు.

సాధించు సక. = నెరవేర్చు, సమకూర్చు; వి. సాధనం = పనికి వచ్చేది, పరికరం, పనిముట్టు, ఉపాయం, సాధకుడు = సాధింపుకు గురియైన వాడు, జరి మానా కట్టినవాడు, సాధింపు = పణుగుడు, బాధపెట్టడం, సాధ్యుడు = సాధించదగినవాడు.

సాపడు సక. = భోజనంచేయు, తిను; వి. సాపాటు = తిండి, భోజనం.

సారించు సక. = సరిచేయు, సాగదీయు, తెరుచు, విసరివేయు.

సొల్వడు అక.=నిస్సారమగు, వాలిపోవు, చాలిపోవు.

సాహసించు అక. = తెగించు వి. సాహసం = తెగింపు, సాహసికుడు = తెంపరి.

సొళగించు అక. =కలిసిపోవు; వి. సొళగింపు = కలయిక, సొళగం = భిన్నరాగాల కలయిక.

సిగ్గరు అక. = సిగ్గుపడు; వి. సిగ్గు = లజ్జ, సిగ్గరికత్తె/సిగ్గరికత్తియ = సిగ్గుగల ఆడది;

సిగ్గుపడు అక. = లజ్జపడు; వి. సిగ్గుపాటు = సిగ్గుపడటం.

సిగ్గువోవు అక. సిగ్గరు చూ.= లజ్జపడు, లజ్జించు. రూ. సిగ్గులుపోవు

సింగారించు సక. = అలంకరించు; వి. సింగారం = అలంకారం, శృంగారం, సింగారి = శృంగారవతి.

సిద్ధాంతీకరించు సక. = సిద్ధాంతం చెప్పు / చేయు; వి. సిద్ధాంతం = స్థిరమైనవాదం, సిద్ధాంతి = తత్త్వవేత్త, జోస్యుడు, సైద్ధాంతికుడు = సిద్ధాంతం తెలిసినవాడు, సిద్ధాంతీకరణ(ం) = సిద్ధాంతం చేయటం.

సిద్ధించు అక. = సమకూడు, ప్రాప్తించు; వి. సిద్ధి = లబ్ధి, సిద్ధుడు = కోరికలు తీర్చుకోగలవాడు, మహర్షి, సిద్ధార్థుడు = కోరిక నెరవేరినవాడు, బుద్ధుడు.

సిఫారసుచేయు సక. = మంచిమాట చెప్పు, మాటసాయంచేయు; వి. సిఫారసు = యోగ్యతా పత్రం, యోగ్యతా వచనం.

సీత్కరించు సక. = ఛీకొట్టు.

సుఖించు అక. = సుఖపడు; వి. సుఖం = సౌఖ్యం, సుఖి = సుఖం కలవాడు, యతి, విశే. సుఖం =సౌఖ్యం గలది.

సుడిగొను సక. = చుట్టకొను; చూ. సుడియు వి. సుడి = గుండ్రంగాతిరిగే నీటి భాగం, ఆవర్తం, వెనుతిరిగిన వెంట్రుకలున్న భాగం, సుడిగొట్టు = గాలి, సుడిగాలి = గుండ్రంగా తిరిగే గాలి, సుడివాలు = చక్రం.

**సుడిబడు** అక. = చుట్టుకొను, చలించు, కలత బారు. రూ. సుడివడు

**సుడియు** అక. = చుట్టి చుట్టి (గాలి) వీచు, చుట్టు కొను, సుడితిరుగు.

**సుడివోవు** అక. = వ్యర్థమగు.

**సుద్ధరించు** సక. = శుద్ధం చేయు; వి. సుద్దం = శుద్ధం.

**సుద్ధిచేయు** అక. = బాగుపరుచు, శుభ్రపరచు; రూ. శుద్ధిచేయు వి. సుద్ధి = శుద్ధి

**సున్నగిల్లు** అక. = గుండ్రమగు, సున్నాపలెనగు; రూ. సున్నగిలు వి. సున్న/సున్నా = గుండ్రని గీత

**సుబ్బు** అక. = బయటపడు.

**సుమాళించు** అక. = పరవశించు, ఆవేశపడు; వి. సుమాళం = పారవశ్యం, ఆవేశం, సుమాళి = సుమాళం కలవాడు.

**సురభీకరించు** సక.= సువాసన పుట్టించు; వి. సురభి = సువాసన; విశే. సురభి = సువాసనగల, సురభిళం = సువాసన గలది.

**సురాళించు** సక.= దిగదుడుచు, దిష్టితీయు, వి. సురాళం దిష్టి; తలతిరుగుడు, కోపావేశం.

**సురుగు** అక. = అదృశ్యమగు, కనిపించకుండా పోవు, పారిపోవు, చలించు.

**సూచించు** సక. = (జాడగా) తెలియజేయు, సూచన చేయు; వి. సూచన = జాడ తెలపటం; విశే. సూచిక = తెలియజేసేది, సూచితం = తెలిసినది, తెలియజెప్పినది.

**సూటిపడు** అక. = సూటిగా తగులు; వి. సూటి = గురి, విధం, సూటికాడు = గురికాడు.

**సూడించు** అక. = పగబట్టు; వి. సూడు = పగ, పగవాడు, సూడుకాడు = పగవాడు, శత్రువు.

**సూడుకొను** అక. = పగబట్టు. చూ. సూడించు

**సూడుపట్టు** సక. = విరోధించు. చూ. సూడించు

**సూత్రపట్టు** సక. = తాడుపట్టు, కొలుచు; వి. సూత్రం = తాడు, దారం.

**సూత్రపడు** అక. = జతపడు; వి. సూత్రం = దారం, ఏర్పాటు.

**సూత్రించు** సక. = సూత్రాలురాయు, సూత్రం చెప్పు; విశే. సూత్రం = శాస్త్రగ్రంథం, ఏర్పాటు సూత్రధారుడు = ఆటాడించేవాడు, నడిపించే వాడు.

**సూరెగిల్లు** అక.= పక్కకువాలు; వి. సూరెలు = పార్శ్వం, పక్క. రూ. సూరెగిలు

**సృజించు** సక.= పుట్టించు, సృష్టిచేయు; వి. సృజన(ం)/సృష్టి = పుట్టించటం; విశే. సృజ్యం = పుట్టించదగినది, సృష్టం = పుట్టించి నవి, పుట్టినది.

**సెగ్గించు** సక.= అసహ్యపడు; వి. సెగ్గం/సెగ్గింపు/సెగ్గు = రోత.

**సెపియించు** సక. రూ. చూ. శపి(యి)ంచు

**సెలగు** సక.= ఖండించు, నరుకు; రూ. చెలగు వి. సెలకట్టె = బాణం.

***సెలయు*** *అక. రూ. చెలయు = విజృంభించు,* సక. విరజిమ్ము.

**సెలవడు** అక. = సెలవేయు; వి. సెల = వూండు నుంచి చీము నెత్తురులు కారే రంధ్రం, సెలవుండు = నారికురుపు.

సెలవారు అక. చూ. సెలవడు.

సెలవిచ్చు సక. = అనుమతించు, ఆజ్ఞాపించు; వి. సెలవు = ఆజ్ఞ, ఉపయోగం.

సెలవు సక. రూ. సెలగు

సేకరించు అక.సక. = తెప్పరిల్లు, పోగుచేయు, సంపాదించు; వి. సేకరం/సేకరణ = పోగు చేయ టం, సంపాదించటం.

సేదగొను అక. = బడలిక చెందు, అలసటపడు; వి. సేద = బడలిక, శ్రమ, సేద్యం = వ్యవసాయం, కష్టం, సేద్యకాడు/సేద్యగాడు = రైతు, కష్టజీవి.

సేవించు సక. = కొలుచు, సేవలుచేయు; వి. సేవ = కొలువు, శుశ్రూష, సేవకుడు = బంటు, సేవనం = కొలవటం, సేవి = సేవకుడు, కొలువు మనిషి, సేవితుడు = సేవలుపొందిన వాడు; విశ. సేవకుడు = కొలిచేవాడు, సేవ్యం = సేవించ దగ్గది.

సైచు అక. రూ. సయించు = ఓర్చుకొను, సహించు, సక. ఓర్చు, భరించు; వి. సయిపుడు/సైపుడు/సయిపు/సైపు = ఓర్పు

సైరించు అక. = సహించు; రూ. సయిరించు వి. సైరణ/సయిరణ = సహనం.

సొగయు అక.= చొక్కు, పరవశించు, మూర్ఛిల్లు; వి. సొగసు = అందం, సొగయిక = సొగపు, చొక్కు, పారవశ్యం, సొగసుకత్తె = చక్కని ఆడది, సొగసుకాడు = చక్కని మగవాడు.

సొగయించు అక. = సుఖించు, సుఖపడు. చూ. సొగయు

సొగియు అక. = ఇంపగు, బాగా ఉండు. చూ. సొగయు

సొటుసొటువోవు అక. రూ.= చిక్కిపోవు; వి. సొటుసొటు = చిక్కిపోవటం.

సొంపిల్లు అక. = సొంపుగా ఉండు, చక్కగా ఉండు, సంతోషంగా ఉండు; రూ. సొంపిలు; వి. సొంపు = సమృద్ధి, సంతోషం, సుఖం, ప్రసన్నత, సౌందర్యం.

సొమ్మగొను అక. = సొమ్మసిల్లు, మూర్ఛపోవు; వి. సొమ్మ = మూర్ఛ.

సొమ్మవోవు అక. చూ. సొమ్మసిల్లు

సొమ్మసిల్లు = మూర్ఛపోవు, మూర్ఛిల్లు; రూ. సొమ్మసిలు వి. సొమ్మ = మూర్ఛ.

సొరుగు అక. = వాలిపోవు, మూర్ఛిల్లు; వి. సొరుగు = మూర్ఛ.

సొలయు అక. = విముఖమగు, విరసమగు, మెను దీయు, మూర్ఛపోవు; వి. సొలిమిడి/సొలపు/సొల్పు = విముఖత, పారవశ్యం, మూర్ఛ, సొల యిక = విముఖత్వం.

సొసలాయించు సక. = మందలించు, హెచ్చ రించు; రూ. సొసాయించు వి. సొసలా యింపు = మందలింపు, హెచ్చరిక.

సోకు అక. = తగులు, (దయ్యం మొ॥) పట్టు; వి. సోకు = తాకు, తగులు, రాక్షసుడు, దయ్యం, సోకుడు = తాకుడు, స్పర్శ, దయ్యం, రాక్షసుడు. సోకుఱొజ్జ = శుక్రాచార్యుడు, సోకుదయ్యం = గాలి.

సోదించు సక.రూ. శోధించు

సోమించు సక.= పరాక్రమించు, విజృంభించు, వ్యాపించు, అక. సరిపోలు; వి. సోమ = శ్రమ, పరాక్రమం.

స్రోలు అక. = వాలిపడు, మూర్ఛిల్లు, సొమ్మసిలు; వి. స్రోలం = మత్తు, సొమ్మ, స్రోలింత = పడిపోవటం.

స్ఖలించు అక. = జారిపోవు, తొట్రుపడు; వి. స్ఖలనం = జారిపోవటం, తొట్రుపాటు, స్ఖాలిత్యం = పొరపాటు, తొట్రుపాటు; విణ. స్కన్నం/ స్ఖలితం = జారినది, తొట్రుపడినది.

స్తంభించు అక.=మాన్పడు, కట్టైబారు, బండబారు, సక.మాన్పడజేయు, బండబారించు; వి. స్తంభనం = మాన్పడ జేయటం, స్తంభం = కంబకం, మాను పాటు, స్తంభయిత = మాన్పడేవాడు; విణ. స్తంభితం = మాన్పడిన, బండబారిన.

స్తుతించు అక. = పొగడు; వి. స్తోత్రం/ స్తుతి = పొగడ్త; విణ. స్తుతం = పొగడతలందినది, స్తుత్యం = పొగడ దగినది.

స్థాపించు సక. =నిలుపు, నెలకొల్పు; వి. స్థాపనం = నిలపటం, స్థాపకుడు = నెలకొల్పేవాడు; విణ. స్థాపితం = నెలకొల్పినది.

స్థిరీకరించు సక. = గట్టిబరచు, స్థిరంచేయు విణ. స్థిరం = నిలకడగా ఉండేది, శాశ్వత మైనది.

స్నేహించు అక. = స్నేహం చేయు; వి. స్నేహం = చెలిమి, మైత్రి, స్నేహితుడు = మిత్రుడు; విణ. స్నేహితుడు = స్నేహమున్నవాడు

స్పృశించు సక. = తాకు; వి. స్పృష్టి/ స్పర్శ = తాకుడు, తాకటి; విణ. స్పృశ్యం = తాకదగినది, స్పృష్టం = తాకినది.

స్ఫురించు అక. = తోచు, తట్టు, అదురు; వి. స్ఫురణ(ం) = తోచటం, తట్టడం, అదురు; విణ. స్ఫురితం = అదిరినది, తోచినది, తట్టినది.

స్మరించు సక. = తలచుకొను, గుర్తుకుతెచ్చు కొను; వి. స్మృతి = తలపు, బుద్ధి, స్మరణ(ం) = గుర్తు, జ్ఞాపకం, జ్ఞప్తి, స్మరుడు = మన్మథుడు, స్మారితుడు = తలచుకొన్నవాడు; విణ. స్మృతం = తలచుకొన్నది, స్మర్తవ్యం = గుర్తు పెట్టుకో దగ్గది, గుర్తుకు తెచ్చుకో దగ్గది.

స్రగ్గు అక. = తగ్గు. రూ. సగ్గు

స్రవించు అక.= కారు, కారిపోవు; రూ. స్రవియించు వి. స్రవం/ స్రావం/ స్రావణం = కారటం, విణ. స్రావకం = కారేది.

స్రుక్కబడు అక. = దుఃఖించు. చూ. స్రుక్కు

స్రుక్కు అక. = వెనుదీయు, భయపడు, ముడుచుకొను, ముడతపడు, తగ్గిపోవు, దుఃఖించు, చింతించు, సంకోచించు, వాడిపోవు, చుట్టుకొను; వి. స్రుక్కు = చిక్కు, దుఃఖం, కడుపు మీది ముడత.

స్వతంత్రించు అక. = సొంతమార్గంలో వ్యవహరించు; వి. స్వాతంత్ర్యం/ స్వతంత్రత = స్వపరిపాలన, స్వతంత్రభావం; విణ. స్వతంత్రం = సొంతం.

స్వాగతించు సక. = స్వాగతం చెప్పు, ఆహ్వానించు; వి. స్వాగతం = కుశల ప్రశ్న, ఆహ్వానం.

స్వీకరించు సక. = అంగీకరించు, ఒప్పుకొను; వి. స్వీకరణ/ స్వీకారం = ఒప్పుదల, అంగీకారం, స్వీకర్త = స్వీకరించేవాడు; విణ. స్వీకృతం = స్వీకరించినది.

8.7.62

**హంకరించు** అక. రూ. అహంకరించు వి. హంకారం అహంకారం = అభిమానం. మూ. అహంకరించు

**హఠంచేయు** అక. = మొండిపట్టుపట్టు, మొండికి పడు; విణ. హఠం = మొండిపట్టు, హఠవాది = పట్టుపట్టి సాధించేవాడు.

**హత్తు** అక. = కలుగు, కూడు. రూ. అత్తు

**హత్తుకొను** అక. = ఒదుముకొను.

**హత్యచేయు** సక. = చంపు; హతి = దెబ్బ, **హతుడు** = దెబ్బలుతిన్నవాడు, చచ్చిన వాడు, **హంత (కుడు)** = చంపినవాడు, హననం = చంపటం.

**హరించు** అక. = అణగారి పోవు, సక. కాజేయు, దొంగిలించు; వి. హృతి/హరణం = దొంగిలించటం, హృతం = పొగొట్టు కొన్నది, కాజేసినది.

**హరుసించు** అక. రూ. హర్షించు = సంతోషపడు; వి. హృష్టి/హరుసం/అరుసం/హర్షం = ఆనందం, సంతోషం, హర్షణం = సంతోషించటం, హర్షకుడు = సంతోషపెట్టేడు, హర్షి/ హృష్టుడు/హర్షమాణుడు = సంతోషం కల వాడు, సంతుష్టుడు.

**హర్షించు** అక. = నవ్వు; రూ. హరుసించు

**హసించు** అక. రూ. హాసించు. వి. హసం/హాసం = నవ్వు, హాస్యం; హసితం = చిరునవ్వు, హాస్యం = నవ్వులాట.

**హాసించు** అక. రూ. హసించు

**హింసించు** సక. = బాధించు, చంపు; వి. హింస = చంపటం, బాధించటం, దొంగతనం, హింసకుడు = హింసించేవాడు, హింసనం = హింసించటం, హింస్ర = చంపేది.

**హుంకరించు** అక. = హుమ్మని ధ్వనిచేయు, గర్జించు; రూ. హుంకారించు వి. హుంకృతి/హుంకారం = హుమ్మనటం, గర్జించటం.

**హెచ్చరికించు** సక. రూ. ఎచ్చరికించు/హెచ్చరించు మూ.

**హెచ్చరించు** సక. రూ. ఎచ్చరించు/హెచ్చరించు = జాగ్రత చెప్పు, సొకు చెప్పు, బెదిరించు; వి. ఎచ్చరిక, హెచ్చరిక = పరాకు, జాగ్రత, బెదిరింపు

**హెచ్చరిల్లు** అక. = వర్థిల్లు, బాగుపడు; రూ. హెచ్చిరిలు/ఎచ్చిరిలు/ఎచ్చిరిల్లు/హెచ్చిల్లు/హెచ్చిలు వి. హెచ్చు/ఎచ్చు = ఎక్కువదనం.

**హెచ్చిల్లు** అక. = పెరుగు, వర్థిల్లు. రూ. హెచ్చిలు / హెచ్చిరిల్లు/హెచ్చిరిలు/ఎచ్చిరిల్లు

**హెచ్చు** అక. రూ. ఎచ్చు = పెరుగు, ఎక్కువగు; వి. హెచ్చు/పెచ్చు/ఎచ్చు = ఎక్కువ.

**హేమించు** సక. = బంగారం చేయు; వి. హేమం = బంగారం.

**హేషించు** అక. = సకిలించు; వి. హ్రేష/హేష = సకిలింపు.

# తెలుగు భాషా స్వరూపం

(పద సంబంధ కోశంతో సహా)

డా॥ బూదరాజు రాధాకృష్ణ

2001



పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం
హైదరాబాద్